# అనాది - అనంతం

రచన:

"శ్రీ రంగ"

(ఆద్య రంగాచార్య)

అనువాదం:

కె. సుబ్బరామప్ప



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

న్యూఢిల్లీ

# పీ ఠి క

'శ్రీ రంగ' అనే పేరుతో సాహిత్య పఠితలకూ నాటక అభిమానులకూ పరిచితులైన ఆద్య రంగాచార్యులు సుమారు యాభై సంవత్సరాలనుంచి సాహిత్య గ్రంథాలను రచిస్తున్నారు. ఇంతవరకు సుమారు 35 పెద్ద నాటకాలను, 50 ఏకాంకికల్ని రచించారు. అంతేకాక ప్రయోగధీరులై నాటకరచనలో క్రొత్త క్రొత్త పుంతలను త్రొక్కడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు. ఆయన రచనావిధానం కొంగ్రొత్తగా ఉండడమే కాకుండా, అనివార్యమైన నూతన విషయంగానూ వుంటుంది. 1963 లో ఆయనకు సంగీత నాటక అకాడమీ బహూమానం లభించింది.

నాటక క్షేత్రంలో 'శ్రీ రంగ' గారు కీర్తి గడించడం న్యాయమే అయినా ఒక విధంగా దీనివల్ల ఆయనకు అన్యాయమూ జరిగింది. ఇంతవరకు ఆయన పన్నెండు నవలలను వ్రాశారు. నాటకకర్తగా ఆయనకు పేరుతెచ్చిన మొదటినాటకం 'హరిజన్వార' 1930 లో రచింపబడితే, ఆయన మొదటినవల 'విశ్వామిత్రన సృష్టి' 1934 లో ప్రచురింపబడింది. కన్నడ నవలల్లో ఇది ఒక క్రొత్తరకం ప్రయోగం. అయితే ఈ నవలగాని, ఆయన వ్రాసిన ఇతర నవలలుగాని విమర్శకులదృష్టి తగినంతగా ఆకర్షించలేదు.

కన్నడభాషలో మొదటి నవల ఏది అన్నప్రశ్న ఇటీవల విమర్శకుల దృష్టినాకర్షించింది. సుమారు 1805 లో రచింపబడిన 'కలావతీపరిణయ' (కర్త: యాదవ), 1821 లో రచింపబడిన 'సౌగంధికా పరిణయ' (కర్త: ముమ్మడి కృష్ణరాజ ఒడెయరు) - ఈ రెండూ 'ముద్రా మంజూష'కు వెనుకటి కృతులు. డా. శ్రీనివాస హావనూరుగారు ఈ మధ్య ఒక వ్యాసంలో సూచించినట్లు, ఈ రెండూ 'రొమాన్స్' (కల్పిత) వర్గానికి చేరిన గ్రంథాలనవచ్చు. కెంపు నారాయణుని 'ముద్రా మంజూష' (1823) కన్నడంలో మొట్టమొదటి ఐతిహాసిక నవల. 1842 లో బనియన్ వ్రాసిన 'ది పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్' 'యాత్రికన సంచార' అనే పేరుతో కన్నడంలో వెలువడింది. 1857 లో ఎస్. బి. కృష్ణస్వామి అయ్యంగారు ద్వావి

యల్ డిఫో 'రాబిన్‌సన్ క్రూసో'ను కన్నడంలోకి అనువదించారు. వైవిధ్యం. వాస్తవికత కన్నడ నవలల క్షేత్రంలో అప్పటికే కాలు పెట్టినట్లయింది.

1895 లో బి. వెంకటాచార్యులు బంకించంద్రుల 'దుర్గేశ నందిని'ని కన్నడంలోకి అనువదించారు. దీని తరువాత ఆయన అనేక నవలల్ని వంగభాషనుండి కన్నడంలోకి తీసుకొచ్చారు. వెంకటాచార్యుల అనువాదాలు జనులకు ప్రీతిపాత్రములయ్యాయి. ఇలా వంగ నవల ప్రభావం కన్నడ నవలలమీద పడసాగింది. కుతూహలకరమైన మరొకవిషయమేమిటంటే, 'దుర్గేశనందిని'కి వెంకటాచార్యులు ఇంగ్లీషులో పీఠికవ్రాసి, 'నావెల్' అనే శబ్దాన్ని ఉపయోగించారు. దాన్ని ఈవిధంగా వివరించారు. 'సమాజం యొక్క మరియు సమాజంలో అంగభూతమైన మనుష్యుని యొక్క చరిత్రలో నడతలో కనిపించే దుర్నడత మొదలైనవాటిని ఉదాహరణలతో చిత్రించి ప్రతివ్యక్తీ సద్భావంతో మెలిగేట్లు చూపగలిగేది....'

గులవాడి వెంకటరాయల 'ఇందిరాబాయి' కన్నడంలోని మొట్టమొదటి స్వతంత్ర సామాజిక నవల. దీనికి మరొకపేరు 'సద్ధర్మ విజయవు'. (దీనిని అప్పటి జిల్లాధికారి కాచ్‌మన్ ఇంగ్లీషులోకి అనువదించాడు.) ఈ రెండవ శీర్షిక (సద్ధర్మవిజయం) దాని ఉద్దేశాన్ని స్పష్టంగా చూపిస్తున్నది. బి. వెంకటాచార్యులు 'నావెల్'ను వివరిస్తూ దాని ఉపదేశ శక్తికి పాఠకుల స్వభావాన్ని సంస్కరించే శక్తికి ప్రాధాన్యం ఇచ్చారు. ఈ నవలైతే అదే ఉద్దేశాన్ని కలిగి ఉంది. సమకాలీన సంఘంలోని మతాలు, సాంప్రదాయకమైన కట్టుబాట్లు దీనిలో చాలినంత తీవ్రవిమర్శకు గురి అవుతాయి. 'సత్యం, హృదయనైర్మల్యం అనే రెండు సాధనాలే మనకు ఇహపరములో సార్థకములై ఉన్నాయి. ఇవి లేక సర్వప్రయత్నాలు నిరర్థకాలే' అని తమ అభిప్రాయాన్ని రచయిత స్పష్టంగా తెలిపారు. 1905 లో ప్రచురితమైన 'వాగ్దేవి'లో (బోళారబాబు రాయలకృతి) ఈవిధమైన ఉపదేశదృష్టి లేకపోయినా కథలో, ఇది మానవస్వభావంలో ఆసక్తి చూపించిన గ్రంథమన్నది గమనార్హం.

కన్నడంలో నవల ఒక సాహిత్యప్రక్రియగా స్పష్టమైన రూపాన్ని తాల్చింది 1915 లో - ఎం. ఎస్. పుట్టణ్ణగారి 'మాడిదుణ్ణో - మహారాయ' (చేసింది శివబాబూ)లో రచయిత ఉద్దేశం ఇతరులకు మార్గదర్శకం కాగల పాత్రలను చిత్రించ

దమైనా, మనిషిలోని స్వాభావిక గుణాలని చిత్రించడంలో ఈ గ్రంథం ఒక కొత్త ఆసక్తిని రేకెత్తిస్తుంది. దీనిలోనూ అద్భుతాలకు అవకాశం ఉంది. చనిపోయిం దనుకున్న ఆవిడ బ్రతికి రావడముంది. మంత్ర తంత్రాలకు తావుంది. అయితే ఇందులోని పాత్రసృష్టిలోఉన్న వైవిధ్యం ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. పాత్రలు-పాత్రల పరస్పరప్రభావం, జీవితానుభవాలవల్ల పాత్రలస్వభావంలో మార్పు. వీటిని ఈ నవల చిత్రిస్తుంది. పుట్టణ్ణగారు చక్కని శైలిని వాడారు. గ్రంథమే కరు వయిన సాహిత్య జగత్తులో ఒక అర్థవంతమైన గ్రంథం రచించి, తద్వారా అనేక ఉత్తమ రచనలకు దారిచూపిన కన్నడంలో మొదటి కాల్పనిక నవల 'మాడిద్దుణ్ణో మహారాయ.'

నవలిక అనదగిన 'సుబ్బణ్ణ' 1926 లో ప్రచురితమైంది. 'శ్రీనివాస' గారు (డా. మాస్తి వెంకటేశ అయ్యంగారు) దీనిలో ఒక వ్యక్తి జీవితం జంఝూటా లలో చిక్కుకుని క్రమేణ పరిపూర్ణత చెందినవిషయాన్ని చిత్రించారు. సంగీత విద్వాంసుడు కావాలనుకొని, తల్లిదండ్రులతో సరిపడక వాళ్ళను వదలి మైసూరు నుంచి దూరంగా కలకత్తాకువెళ్ళి, భార్యా బిడ్డల్ని పోగొట్టుకొని. సంగీతంవల్లనే మనశ్శాంతిని, జీవితాన్ని ఎదిరించే స్థైర్యాన్ని పొందిన సుబ్బణ్ణ అనేవ్యక్తి కథ ఇది. వ్యక్తిత్వం క్రమంగా పరిపూర్ణతపొందడమే ఇందలి కథ. ఈ నవలలో నాటకీయ మైన డ్రమటిక్ - అనదగిన సంఘటనలే లేవు. 'సుబ్బణ్ణ' కన్నడ నవల దృష్టిని మనిషి అంతరంగ జగత్తువైపు త్రిప్పింది.

1932 లో 'వినాయక'గారు (వినాయక కృష్ణ గోకాక్), 'ఇజ్జోడు' అనే 172 పుటల నవలను ప్రచురించారు. కోమలి, నిండుమనసుది అయిన అమ్మాయి మొండి వాడు, మూర్ఖుడు అయిన భర్తచేతిలో చనిపోవడం దీనిలోని కథావస్తువు. మరు సటి సంవత్సరం 'అనందకంద'గారు (బెటగేరి కృష్ణశర్మ) 'సుదర్శన' అనే నవ లను వ్రాశారు. 'సుదర్శనా'న్ని 'సాంఘిక నవల'గా పరిగణించినా ఒక ఆదర్శం పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని చిత్రించడం దీని ఆశయం అనవచ్చు. గాంధీయుగంలోని మొదటి కన్నడ నవల ఇది. 'సరళమైన జీవితం, ఉదాత్తమైన ఆలోచన' కల సాహసి ఇందలి నాయకుడు. కుతూహలం పుట్టించే విషయం ఏమిటంటే, 'వినా యక'గారి 'ఇజ్జోడు' ఇరవైరెండుసంవత్సరాలు వృద్ధిచెంది (1953 లో ఆరవ

భాగం ప్రచురితమైంది) మరియొక ఆదర్శగ్రంథంగా వెలసింది. అయితే 'వినాయక' గారి నరహరి అనేక ప్రభావాలకు లోనయి, జీవితంలోని సాధక బాధకాలను అనుభవించి క్రమేణ రూపుదాల్చడం మన కళ్ళముందే జరుగుతుంది. 'కు వెం పు' (డా. కె. వి. పుట్టప్ప) గారి 'కానూరు సుబ్బమ్మ హెగ్గడిది', (1936) అ. న. కృ. (డా. అ. న. కృష్ణరావ్) గారి అనేక నవలలు ఆదర్శజీవితాన్ని సృష్టించి అనేక నవలాకారుల్ని ప్రభావితంచేసి వారికి మార్గదర్శికాలయ్యాయి. రానురాను పేలవమైన నాయక పాత్రలదృష్టికీ అవకాశం కలిగిందనడమూ, జీవితంలో జటిలత్వం-కఠోర సత్యాల భూమిలో వికసించిన గగనకుసుమాల తీరు అయిందన్నదీ నిజం.

1933 లో ఒక ఉత్కృష్టమైన నవల ప్రచురితమైంది. అది శివరామ కారంత గారి 'చోమనదుడి' (చోమునివాద్యం) (కారంతగారు అప్పటికే ఐదు నవలలు వ్రాశారు. వ్యంగ్యాన్ని నవలల్లో ఉపయోగించారు) హరిజనుల సమస్య కన్నడ నవలల్లో ఆ తర్వాతి కాలంలో పదేపదే తల ఎత్తింది. అయితే నలభై యేళ్ళముందే కారంతగారు ఒక విశిష్ట వాతావరణాన్ని సృష్టించేశారు : 'అంటరానివారి' జీవితపు దురంతం ఇక్కడ కళాత్మకమైన రూపు దాల్చింది. సంస్కారణలో తపనకంటె అంతఃకరణపు ఎఱుకే నవలను నడిపించింది; ఇలా బీద చోమడ్ని త్రొక్కడానికి కాలెత్తిన చుట్టూ ఉన్నవ్యక్తులు - ఇవన్నీ వీరి ప్రపంచం, నూరుదీపాలను పేర్చినట్లు మనముందు కనిపిస్తుంది. భావుకతకు - 'సెంటిమెంటాలిటీ'కి - అవకాశం యివ్వని కారంతగారి సృష్టి ఇప్పటికీ ఆశ్చర్యం కలిగిస్తుంది. ఇప్పటికీ కారంత గారు కన్నడ నవలా ప్రపంచంలోని అద్భుత సృష్టికర్తలలో ఒకరై ఉన్నారు.

1934 లో 'శ్రీరంగ' గారి 'విశ్వామిత్ర సృష్టి' ప్రచురితమైనప్పుడు కన్నడభాష బహు సమృద్ధమేమీ కాదన్నది స్పష్టమవుతున్నది. నవల ధర్మోపదేశంయొక్క సఖీ స్థానంనుంచి తప్పించుకొన్నది; జీవితపు ఒత్తిడిలోంచి రూపుదాల్చే పాత్రలను సృష్టించింది; ప్రాపంచికవిషయాల గొప్పదనాన్ని మనిషిలో గుర్తించింది; సాంఘిక విమర్శ ప్రారంభించింది; ఆశయాలకు అద్దం పట్టింది; వ్యావహారిక భాషను సార్థకంగా ఉపయోగించసాగింది; ఎం. ఎస్. పుట్టణ్ణ, శ్రీనివాసగార్లు నవల భాషకు కొత్తఅందాన్ని సరళతని తెచ్చిపెట్టారు. అయితే ప్రచురితమైన నవలల సంఖ్యే తక్కువ. (1945 కు సుమారు నూటఇరవై నవలలు వెలుగుచూశాయి. తర్వాతి

కాలంలో బహుజనప్రియ నవలాకారులైన అ. న. కృ. గారి మొదటినవలలు 'జీవనయాత్ర', 'ఉదయరాగ' 1934 లో ప్రచురితమయాయి. చాలామటుకు కన్నడిగులు విశేషంగా ఆదరిస్తున్న నవలలు బి. వెంకటాచార్యులు, గళనాథగార్ల సాహస నాయకుల రోమాంచక గ్రంథాలే. మిగిలిన నవలాకారులు కొద్దిగామాత్రమే నవలలు ప్రచురించారు.

ఇలాంటి తరుణంలో 1934 లో ప్రచురితమైంది శ్రీరంగగారి 'విశ్వామిత్ర సృష్టి.'

ఈ గ్రంథంలో ముఖ్యపాత్ర నారాయణ అన్న యువకుడు అతని కిష్టంలేని పెళ్ళికి దూరంగా వెళ్ళిపోయాడు. రైలు ఎక్కాడు. ఈ రైలుపెట్టెలో ప్రారంభ మవుతుంది విశాలప్రపంచంతో అతని సంపర్కం. అతను యువకుడు, కాలేజీలో విద్యాభ్యాసం పొందినవాడు, బుద్ధిజీవి. చుట్టూవున్న ప్రపంచం పరిపూర్ణంగా ఉండా లన్న తపన అతనిది. తన వివాహప్రశ్నతో అసంతృప్తి ప్రారంభమైంది. రైలు పెట్టెలో, వీథిలో, టీకొట్లో, పల్లెలో అనేకవర్గాల వివిధరకాల మనుష్యులతో కలిసి తిరిగినకొద్దీ ఈ అసంతృప్తి గాఢమవుతుంది. జనుల మౌఢ్యాన్ని చూసి కని కరం, దాన్ని నివారించి తీరాలనే కలవరం తీవ్రమవుతుంది. స్వతః కళాశాలలో శిక్షణపొందిన నారాయణకు సంస్కరణకు తోచే ఉపాయంకూడా విద్య. ఆ ఊరి లోని కులకర్ణి ప్రజలమౌఢ్యాన్ని తన స్వప్రయోజనార్థం ఉపయోగించుకొని బతికే వాడు. కులకర్ణి ఆసరాతోనే నారాయణ పాఠశాల ప్రారంభిస్తాడు. ఏ మౌఢ్యం ఎదురుగా నారాయణ పోరాటం నడపడానికి నడుం కట్టాడో అదే మౌఢ్యం నారాయ ణను మహాత్వపురుషుని పీఠాని కెక్కిస్తుంది; అతను వాన తెప్పించగల మహిమ గలవాడు అని ప్రజలు నమ్ముతారు. చివరకు పాఠశాలలో పాఠం చెబుతూ చని పోతాడు నారాయణ.

ఇది అనేక సంవత్సరాలవరకు విమర్శకుల గమనానికి రాలేదన్న విషయంవల్లనే శ్రీరంగగారి నవల ప్రచురితమైన కాలంకంటె ఎంతముందున్నది అన్నది స్పష్ట మవుతుంది. నవలలోని ముఖ్యపాత్రలో, భావాలలో నవలాకారుడు ప్రతిబింబిస్తు న్నట్లు పాఠకులు భావిస్తారు. కానీ అలా జరగని కారణంగా చదువరులకు 'విశ్వా మిత్రసృష్టి' రుచించలేదనిపిస్తుంది. నవలలోని అనేక భాగాలలో నవలాకారుడు

నవలలోని పాత్రలకు దూరంగా నిల్చుని, తన సానుభూతిని పొందిన పాత్రలను నిర్లిప్తంగా చూడగలరు. తుదిభాగంలోతప్ప నవలారచనలో ఆద్యంతమూ వ్యగ్యం వ్యక్తమవుతుంది. ఇది సులభమైన, లోతులేని వ్యంగ్యంకాదు. నారాయణ బుద్ధిమంతుడు, ఆశయాలకు కట్టుబడినవాడు. అయితే అతని ఆలోచనాశక్తికి వాస్తవికతా జ్ఞానం కాని, అనుభవంయొక్క ఆసరా కాని లేదు. ఫలాని ఊరికి పోవాలనే నిర్ధారణ లేకుండా అతను రైలులో పోవడం అతని జీవనవిధానానికి సంకేతంగా వుంది. పోవాలనే ఆశ ఉంది. ఎక్కడికి - ఎలా అన్నది స్పష్టంగా తెలియదు. మూడవ తరగతి పెట్టెనుంచి ప్రారంభమై చివరంటా అతనికీ - అతను దిద్దాలనుకున్న వ్యక్తులకూ నడుమ లోతైన అగాధం ఉంది, అయితే ఈ అంతరం స్వరూపం యొక్కజ్ఞానం నారాయణకు లేదన్నది స్పష్టమవుతుంది. గ్రంథంలో రెండురకాల వ్యంగ్యాలు చేరి ఒక విశిష్టమైన జటిలత ఏర్పడింది. చుట్టూవున్న ప్రపంచం నారాయణను అర్థం చేసుకోకూడదు, అతనికీ దానికీ మధ్య అంతరముంది అని అతనికి తెలియదన్న దొక వ్యంగ్యం, తనకు అనుభవం లేదనికూడా అతనికి తెలియదన్నది మరొకటి. తన చుట్టుపట్ల ప్రజలమౌఢ్యంమీద నారాయణకు తీవ్ర ఏహ్యాభావం; నారాయణకు అత్యంత తిరస్కారం కలిగింది. ఈ మనుష్యుల విషయంలో.... అయ్యో! ఏవిధంగా వీళ్లని సంస్కరించడం; నారాయణకు ఆలోచన వచ్చింది.... విద్య నేర్పించాలి వీరికి....విద్య అవసరమేమో ఉంది; అయితే తనకూ జీవిత పాఠశాలలో ఇంకా విద్యాభ్యాసం ఆవశ్యకత ఉందన్నది నారాయణకు తోచదు.

ఈ నవలలో శ్రీరంగగారు 'ప్రజ్ఞాప్రవాహ విధానా'న్ని ఉపయోగించారు. కన్నడంలో ఇటువంటి రచనా విధానం ఉపయోగింపబడ్డది మొట్టమొదట ఈ నవలలో. (ప్రాయశః రెండవసారి ఉపయోగింపబడడం త. రా. సుబ్బారావుగారి 'బిడుగడెయ జేడి'లో.) శ్రీరంగగారు కొంతకాలం ఇంగ్లండులో ఉండినందువల్ల ఆయన రచనలమీద ఆంగ్లసాహిత్యం ప్రభావాన్ని గుర్తించడం అవశ్యమైనా, 'ప్రజ్ఞాప్రవాహవిధానం' ఉపయోగంలో శ్రీరంగగారి వ్యక్తిత్వాన్నీ గుర్తించడం ఎంతో అవసరం. నారాయణ చుట్టూ జరిగే సంఘటనలను అతని దృష్టితోనే మనం చూస్తాము. అతని మనోవ్యాపారాలను అద్దం పట్టినట్లు చూస్తాము. అయితే జేమ్సు జాయ్సులో లేని వ్యంగ్యం ఇక్కడ వుండబట్టి ఇక్కడ నాయకుని మనస్సులో అంతరాలను విడదీసి చూసే ప్రయత్నం జరగలేదు.

ఈ నవలలో భాషాప్రయోగము విశిష్టంగా వుంది. వివిధపాత్రలకు సంఘంలో గల స్థానాన్నిబట్టే కాక మనోవ్యాపారములకు తగినట్లు భాషను ఉపయోగించడం జరిగింది. సులభంగా గుర్తించదగినవర్గాలు, భాషాభేదాలు - ఏ సామాన్య రచయిత అయినా ఉపయోగించదగిన గుర్తులు - చూడడంమాత్రమే కాదు, వాటి విలువల అంతరాలను తెలిపే సూచకాలు - 'ఇండికేటర్స్' - ఈ నవలలో కనిపిస్తాయి.

ఇలా విశిష్టమైన రచనతో నవలా క్షేత్రంలో కాలుపెట్టిన 'శ్రీరంగ'గారు నవల తర్వాత నవలకు తమ సాధనకు క్రొత్త విస్తరణ ఇస్తూవచ్చారు. పోయిన నలభై సంవత్సరాలలో కన్నడ నవల సమృద్ధమైన పంటనేకాదు సత్త్వపూర్ణమైన పంటనూ చూచింది. 1945 కు శివరామ కారంత, అ. న. కృష్ణరావ్, దేవుడు మొదలైనవారు విశిష్ట రచనల్ని చేశారు. ఆ తర్వాత శివరామకారంతగారు తన సొంతమార్గంలో అసమాన్య సాధన చేశారు. ప్రగాఢ అనుభవం, నిగూఢమైన జీవితాశయం - ఇవి 'మరళి మణ్ణిగె' నుంచి 'మూకజ్జియ కనసుగళు' వరకు కథావస్తువు రచనాదృష్టి మిళితమై వెలువడినవిధానంతో అనేక ప్రథమశ్రేణి నవలలు వెలువడ్డాయి. కన్నడ నవలాక్షేత్రంలో అనేక వాదవివాదాలు లేచి, అనేకరకాల 'థియరీ'లు వచ్చినా ఏ విమర్శకవర్గమూ అలక్ష్యం చేయలేని రచనల్ని సృష్టిస్తూ వచ్చారు కారంతగారు. ఆయనదృష్టిని ఈవిధంగా వివరించారు: 'ఈనాడు సాహిత్యక్షేత్రంలో వివిధ ప్రయోగాలు జరుగుతుండడం నిజం; అది సజీవ సాహిత్యం యొక్క లక్షణం. అయితే రచనావిధానం, శైలి, ప్రక్రియలసాఫల్యం వాటిపనిలో అవి సాహిత్యకారుని కల్పన, భావన, ఆదేశాలను పాఠకునిహృదయం, మనస్సులకు అందించటానికి కావలసిన శక్తిని సంపాదించడంలో....'

ఆనందకంద, వినాయకగార్ల నవలలతో ప్రారంభమైన సంప్రదాయం (కథానికా క్షేత్రంలో దానికి సమీపమైన 'శ్రీనివాస'గారి సంప్రదాయంతో సంప్రదిస్తూ) కన్నడభాషలో అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఇందులో ఆదర్శ ప్రేమ, బ్రతుకు ఆత్మయొక్క రూపాంతరం అన్నవిశ్వాసం, త్యాగం - చిత్తస్థైర్యంలో గౌరవం కనిపిస్తాయి. చాలామంది నవలాకారులు ఈ సంప్రదాయానికి చెందినవాళ్లు. కుతూహలం పుట్టించే విషయమేమిటంటే 1945 నుంచి సుమారు పదేళ్ళవరకు వృద్ధి చెందిన అభ్యుదయ పంథాకు ముఖ్య ఆచార్యులైన అ. న. కృ. గారి మొదటి

నవలలు ఈ పంథా అణగిపోయిన తరువాత వ్రాసిన నవలలు నిజానికి ఈ సంప్రదాయానికి చెందినవే. ఆయన మొదటి గణనీయకృతి 'సంధ్యారాగ' ఈ కోవకు చెందినదే. అభ్యుదయ ఉద్యమం అఖిలభారతస్వరూపం దాల్చింది. సాహిత్యం సమాజంలోని కుళ్ళు, అరిష్టాలనూ ప్రతిబింబించి, ఖండించి, జీవితాన్ని పరిశుద్ధం చేసే ప్రచండశక్తి కావాలనే దృష్టిని అభ్యుదయవాదులు ప్రతిపాదించారు. ఈ కాలంలో అ. న, కృ. కాక త. రా. సు. (త. రా. సుబ్బరావ్), బసవరాజ కట్టీమని మొదలైనవారు జనప్రియమైన నవలల్ని వ్రాశారు. ఈ వర్గంవాళ్ళ కృతుల్లో మొత్తంమీద కళాంశం తగ్గి, ఆవేశం - ప్రచారాలే ఎక్కువయ్యాయనే ఆక్షేపణలో కొంత సత్యముంది. అయితే 'బిడుగడెయ బేడి' 'జ్వాలాముఖియ మేలె' మొదలైన సత్వయుతమైన నవలలను ఈ పంథా వెలుగులోకి తెచ్చింది. అంతేకాదు; నవల యొక్క వస్తుక్షేత్రాన్ని పెంచింది, అనవసరపు సంకోచాన్ని దూరంచేసింది. అంతే కాక పాఠకవర్గాన్ని విస్తరింప జేసిందన్నది నిజం.

గత ఇరవై సంవత్సరాలలో నవ్యపంథా కన్నడసాహిత్యంలో తగినంత ప్రాధాన్యం సంపాదించింది. కుతూహలం రేకెత్తించేవిషయ మేమిటంటే, నవ్య పంథా (కవితారంగంలో తప్ప) సృష్టించిన సాహిత్యకృతుల సంఖ్య చాలా తక్కువ. అయితే సాహిత్యాన్నిగురించి చెప్పాలంటే తీవ్రమైన సూక్ష్మమైన - అనేకమార్లు మొరటైన - అపారమైన ఆలోచనలో ఈ పంథా ప్రభావితమైందన వచ్చు. ఇదీ ఒకవిధంగా అఖిల భారత స్వరూపం ఉన్న బుద్ధికౌశల్యంగల ఉద్యమం అన్నది నిజం. విదేశాలకు వెళ్ళివచ్చే యువతీయువకులసంఖ్య ఎక్కువ కావడం, విశ్వవిద్యాలయాలలో ఇంగ్లీషు సాహిత్యంయొక్క అభ్యాసం విస్తారమై ఇటీవల వెలువడిన సాహిత్యానికీ న్యాయమైన ప్రాధాన్యత దొరకడం, పుస్తకాలు, పత్రికలు అసంఖ్యాకంగా ప్రచురితమవటం - ఇవన్నీ ఈ ఉద్యమానికి ప్రేరణలయ్యాయి; ఇవి అఖిలభారతదేశానికి అన్వయించేవిషయాలు. ఇందువల్ల కాఫ్కా, కామూ, బెకట్, అయనెస్కో, బ్రెహ్ట్, సాత్రె మొదలైన పాశ్చాత్య రచయితల ప్రభావం భారతదేశంలోని అన్ని సాహిత్యక్షేత్రాలమీద పడినట్లు కనిపిస్తుంది. కన్నడంవరకు చెప్పాలంటే, నవలాకారుడు ఏ విలువలనైనా సరే సర్వసమ్మతాలు అని భావించకుండా, జీవితానుభవాలను వస్తునిష్ఠంగా విశ్లేషించేప్రయత్నం చెయ్యాలి; అను

భవం వ్యక్తిత్వాలయొక్క ప్రాభవాన్ని తగ్గించకుండా అర్థం చెప్పాలి. తాదాత్మ్యానికి ఆవకాశం యివ్వకుండా నిర్లిప్తంగా, వస్తునిష్ఠంగా అనుభవాన్ని నిరూపించ మొదలెడితే భాష ఉపయోగం విశిష్టమవుతుంది. సమిష్టి సృష్టియైనభాషను చాలా విశిష్టమైన, ప్రత్యేకమైన ఉద్దేశంకోసం ఉపయోగించేటప్పుడు భాషతో పోటీ పడ వలసివస్తుంది. గ్రంథం అవసరానికి తగ్గట్లు తీర్చిదిద్దవలసి ఉంటుంది, వృద్ధిపరచ వలసివుంటుంది. ఇది నవ్యపంథాయొక్క పట్టుగొమ్మ అనవచ్చు.

ఏ పంథాకూ కట్టుబడక స్వతంత్రమైనమార్గంలో సాగుతున్న నవలాకారులు కొందరు వున్నారు. కారంతగారి పేరు ఇదివరకే చెప్పాను. 'గ్రామాయణ' వ్రాసిన రావుబహద్దూరుగారు 'మలెగళల్లి మదుమగళు' వ్రాసిన కువెంపు ఈ కోవకు చెందిన నవలాకారులు. తమ 'గంగవ్వ - గంగామాయి' నవ్యపంథాకు చెందినది కాదు అని శంకర ముకాశి పుణేకరగారు చెప్పినా, దానిలో నవ్యనవలా ప్రారంభాన్ని కొందరు విమర్శకులు గమనించారు. ఇటీవల ప్రసిద్ధిపొందిన డా. ఎస్. ఎల్. భైరప్పగారు 'వంశవృక్ష', 'నాయినెరళు', 'గృహభంగ'లాంటి నవలల్లో కారంత గారిలా అపారమైన అనుభవజ్ఞానంతో గ్రంథాలను వ్రాశారు. ఇలాగే ఏ కోవకూ చేరని మరొక నవలాకారులు 'శ్రీరంగ'గారు.

'శ్రీరంగ'గారి ఒక్కొక్క నవలా ఒక ప్రయోగం అంటే దాని గొప్పతనం ఒక్క ప్రయోగం మాత్రమే అనే అర్థంవచ్చే అవకాశం ఉంది. 'విశ్వామిత్ర సృష్టి' లా శ్రీరంగగారి నవలలు ఒకేమారు ప్రయోగాలు, ఉత్తమ సాధనాలూ అయివుంటా యన్నది స్పష్టపరచాలి. బహు సంఖ్యాకులైన పాఠకుల విలువల్ని మధ్యతరగతి కుటుంబజీవనంలోని శ్రద్ధను, ఆదర్శంలో ప్రీతిని ప్రతిబింబించినందువల్లనే అ. న. కృ. బహుజన ప్రీతిపాత్రులైన నవలాకారులయ్యారు. 'శ్రీరంగ'గారి రచనలో జ్ఞాన సంపదకు చెందిన అంశాలకు ఎక్కువ ప్రాధాన్యత వుంది. పాత్రలగూర్చి త్వరితవిమర్శలు భావప్రధాన గ్రహణం కాని ఆయనకు రుచించవు. ఈ కారణంగా నవలాకారులుగా, నాటకకర్తలుగా ఆయన దయాహీనులు అన్న ఆక్షేపణకూ గురి అయ్యారు. చుట్టూఉన్న జగత్తులో తమ ఆసక్తిని రేకెత్తించిన ఒక విషయాన్ని పరిశోధించిన తరువాత ఆయన ఆసక్తి మరొకవిషయంవైపు మళ్లుతుంది. అందు వల్లనే ఆయన వ్రాసిన ఒక నవలలోఉన్న సన్నివేశం పాత్ర మరొకదానిలో

వుండదు. ఈవిధంగా ఆయన అనేక సమకాలీన 'జనప్రియ' నవలాకారులకంటె భిన్నంగా వున్నారు.

'శ్రీరంగ'గారి ఒక్కొక్క నవలలో ఒక్కొక్క విశిష్టత కనిపిస్తుంది. 'ప్రకృతి'లో ఆయన మూడు తరాలను చిత్రించారు. ఈ మూడుతరాలలో సమాజంలోని వేరువేరు వర్గాల సంబంధం ఎలా మార్పుచెందుతుందన్నది నిరూపిస్తుంది ఈ గ్రంథం. ఒక భావనయొక్క కనీసం అభిప్రాయంయొక్క వివరణ కాకుండా జీవితపు వైవిధ్యాల అనుభవమిది. కళాకౌశల్యమే రూపం (కౌశలం రూపానికి అనివార్యమైనప్పుడు, రూపంలో భాగమైనప్పుడు) అనే సత్యాన్ని ఇక్కడ చూడవచ్చు. వర్తమానంలో ప్రారంభమయ్యే వృత్తాంతం భూతకాలానికి మళ్ళిమళ్ళి వర్తమానానికి రావడం ఇక్కడ అర్థవంతంగా ఉంది. 1947 ఆగష్టు 15వ తేదీ 'శ్రీరంగ' గారి 'పురుషార్థ' నవల ప్రచురితమైంది. లోకమాన్య తిలక్‌గారి స్మశానయాత్రతో ప్రారంభమయ్యే (1 8-1920) కథావస్తువు స్వాతంత్ర్యం వచ్చిననాటితో ముగుస్తుంది. స్వాతంత్ర్యసాధనకు ఆత్మార్పణం చేసుకున్నామనుకున్న ఓ నలుగురు మిత్రులు స్వాతంత్ర్య దినంరోజు మళ్ళీ కలుసుకుంటారు. ముగ్గురు ఎంచుకున్న ఆదర్శాన్నివదలి వేరువేరు మార్గాలుపట్టి తమతమ 'పురుషార్థా'లను సాధించినవారు; చివరివరకు స్వాతంత్ర్యంకోసం తపించినవాడు మాధు. నలుగురిలో ఆదర్శాన్ని ప్రామాణికంగా పాలించిన మాధు సమస్తమూ త్యాగం చేస్తాడు. నలుగురూ తమతమ అనుభవాలను పునరుచ్చరించినప్పుడు నాలుగు పురుషార్థాలు రూపుదాలుస్తాయి.

గాంధీయుగం ఆయన ఇటీవల వ్రాసిన నవలైన 'విషచక్ర వ్యూహ'కు కథావస్తువైంది. ఇక్కడ రెండు తరాల అంతరం తండ్రి-పిల్లలలో మూర్తీభవిస్తుంది. భాషపట్ల శ్రీరంగగారికి నిత్యం విశేషమైన ఆసక్తి. ఇక్కడ రెండుతరాల అంతరం కథాగమనంతో, శబ్దాల అర్థవ్యాప్తిలో వెల్లడవుతూపోతుంది. 'కమాండర్' చెప్పినట్లు వినేది. 'లీడర్', 'సుఖం', 'సార్థకం' - ఒక్కొక్క శబ్దమూ రెండుతరాలకు వేరువేరు అర్థాలనిస్తుంది.

చివరకు కొడుకు తండ్రితో అంటాడు: 'ఏమిటో! గాంధీలో ఏం చూశారో! మా కేమీ తెలియనే తెలియదు.'

'అనాది - అనంత' శ్రీరంగ గారి ఎనిమిదవ నవల (1959). 'అనాది' అనే మొదటిభాగం కథకీ 'అనంత' అనే రెండవభాగం కథకీ మధ్య అంతరం పదేళ్లు. 'అనాది'లో మూడుపాత్రలు - వాటిలో ఒకటి చనిపోయిన సరళది. అయితే మిగిలిన రెండు పాత్రలు రామన్న కుముదల జ్ఞాపకాల సరణిలో సరళ ఆ పాత్రల మల్లె సజీవంగా వుంటుంది. అంతేకాక, ఆమెమాటలు - చేతలలో ఒక విధమైన విగూఢత్వం వుండి, రామన్న కుముదల మనసులోని ఆరాటాన్ని వాళ్ళ సంబంధంలో మార్చులని ఆమె ఎంతవరకు గుర్తించింది, ఎంతవరకు తనే వాటికి దోహదమిచ్చింది అన్నదీ సమస్యమై ఆమె వ్యక్తిత్వం కుతూహలజనకంగా ఉంటుంది. ఈ నవలలోని కథ స్త్రీ-పురుష సంబంధం (లైంగిక సంబంధం అంటే అనవసరంగా వస్తువుయొక్క వ్యాప్తిని అలక్ష్యం చేసినట్లవుతుంది. స్త్రీ-పురుష పరస్పరమనస్సు, సంబంధం జీవితాన్నంతటినీ నింపివేసేదే ఇందలి కథ.) ఈ కథావస్తువు వికాసం చెందుతుండగానే ఇంకా అనేక ఉపకథలు అల్లుకుని ప్రారంభంనుంచే గ్రంథం జటిలతను అలవరచుకొని సాగుతుంది. వ్యక్తి-వ్యక్తులనడుమ సంబంధసమస్య, భాషయొక్క గెలుపు, ఓటమి, భూతవర్తమానాలు అల్లుకున్నరీతి, శరీరం-మనస్సుల సంబంధం - ఇవన్నీ మొదటి ఆరుభాగాలలో (39 పుటలలో) వివరించబడటం ఆశ్చర్యం గొలిపే విషయం. మొదటిభాగంలో కుముద-రామన్న సమాంతర రేఖల మీద నడిచారు. అలా నడిచేటప్పుడూ భూతకాలంలో ఒక అడుగు, వర్తమానంలో ఒక అడుగు; స్త్రీ-పురుష ఆకర్షణ, కోరిక, ఈ కోరికయొక్క అనేకరూపాలు, ప్రీతిలో అణగిన ద్వేషం - ద్వేషంలో ప్రీతి ఇవి ఆ ఇద్దరినీ అనివార్యమైన వివాహంవైపుకు తీసుకెళ్ళే ప్రసంగం అభివృద్ధిచెందేకొద్దీ స్త్రీ-పురుషసంబంధం మరొకరూపం పొందిన సరళజీవన నైపథ్యంలో క్రొత్తమలుపు తిరుగుతుంది.

రెండవభాగంలో, మళ్ళీ మూడుపాత్రలు - కనిపించే రెండుపాత్రలు, కనిపించవిది ఒకటి. మొదటిభాగంలో కుముద - రామన్నలను సన్నిహితంచేసిన సరళ కళ్ళకు కనిపించని, మనసుకు కనిపించే పాత్ర అయినట్లు, వాళ్ళ బాంధవ్యానికి ఫలమైన మోహన ఇక్కడ కళ్ళకు కనిపించని, మనస్సుకు కనిపించేపాత్ర. సరళలా అతనూ చనిపోయినవానితో సమానమే. ఇక్కడ మళ్ళీ శ్రీరంగగారు కాలాన్ని విశిష్టమైన రీతిలో ఉపయోగిస్తారు. మొత్తం కథ ఒక గంటలో జరుగు

తుంది. అయితే పదేళ్ళ భౌతిక కార్యకలాపాలే కాక, కుముద-రామన్నల కష్ట సుఖాలు ఒకరూపం దాలుస్తాయి. దేహము-మనసుల సంబంధం, దానికున్న సంబంధం, అన్నివిషయాలు మళ్ళీ ఈ కథలో చోటు చేసుకుంటాయి. 'భార్యాభర్తల్ని ఒకటిగా చేసే బంధం బిడ్డ' అన్న భవభూతిమాట ఇక్కడ నేపథ్యంలో నిలిచి, రామన్న - కుముదల బాంధవ్యానికి క్రొత్తమలుపు, జటిలతలను చేకూర్చి, మోహనుడి ఉనికికి - చావుకు రెండిటికీ అర్థం సూచిస్తుంది. ఈ కథలో ప్రవేశించే ముసలి అత్తపాత్ర భూత-వర్తమానాలను మళ్ళీ మళ్ళీ ఒకటిగాచేసి, కుముద యొక్క పదేళ్ల అనుభవానికి కాలాతీత అనుభవాన్ని చేకూరుస్తుంది.

'అనాది - అనంత' యొక్క కొన్నిభాగాలలో (రామన్న సరళ చిత్రపటంముందు నిల్చుని మాట్లాడేటప్పుడు అతని స్నేహితుని ఇంట్లో భోజనం - అతను కలవరపడి నప్పుడు ఇలాంటి సందర్భాలలో కుముద మానసిక అనుభవాలు ఇత్యాది) మనకు అసంతృప్తి కలిగించవచ్చు. కథాచిత్రణ నాటకీయంగా ఉంది అనిపించవచ్చు. అక్కడక్కడ ఆలోచనారీతి ప్రయత్నపూర్వకంగా జరిగిన ఫలితం అనిపించనూ వచ్చు. అయితే మొత్తంమీద ఇది స్త్రీ పురుష సంబంధంయొక్క జటిలతను భాషలో పొదిగిన గ్రంథం అనడంలో సందేహం లేదు. జ్ఞాపకాలతోనే పదకొండు పన్నెండు సంవత్సరాల భౌతికజీవితాన్ని, అంతరంగ జగత్తును వ్యాఖ్యానించు కౌశలం విశిష్టమైనది. ఈ నవలలో భౌతికసంఘటనలు, మనోవ్యాపారం - ఈ రెంటినీ వేరు పరచలేనట్లు అల్లుకొనివుండడం ఒక విశిష్టసాధన.

డెబ్భైయేళ్ళ వయసులో 'శ్రీరంగ' గారు ఇంకా క్రొత్తక్రొత్త ప్రయోగాలను చేస్తూనే ఉన్నారు. ఆయన ప్రయోగం కొంతప్పుడు సఫలంకాకున్నా ఔత్సుకతని రేకెత్తిస్తుంది, విఫలానికి కారణాలను శోధించాలనిపిస్తుంది.

—ఎల్. ఎస్. శేషగిరిరావు.

# అనాది

## 1

'సినిమాకు పోదామా ?'

'ఊఁ ?'

'సినిమాకు - కాదు - అంటే ఎక్కడికైనా అలా బయటికి వెళ్దామా ?'

సమాధానం లేదు.

'అంటే - కొంచెం అలా బయట తిరిగివస్తే - అంటే. ఇంట్లోనే కూర్చుని నీకూ విసుగు పుట్టివుంటుంది - అని -'

సమాధానంగా ఆమెచేయి ముఖాని కెదురుగా పెట్టుకుని, ఆవులించింది.

'అంటే ఎక్కడికీ వద్దంటే అంటావా ? నీ కోసమే చెప్పాను. ఎందుకంటే, అలాచూస్తే నాకూ రాసేపని వుంది....వెళ్ళేట్లయితే చెప్పు. నేను రాత్రికి రాసుకుంటాను....ఆఁ....వద్దు అంటావా ? వుత్తినే కూర్చోనిమాత్రం చేసేదేవిఁటి ? అయితే నేను రాసుకుంటాను....ఏమైనా పనివుంటేమాత్రం వచ్చి చెప్పు.'

ఇలా అంటూ చేతిలోవున్న దినపత్రికను పారేసి, విసిగి, వొక్క నిట్టూర్పు విడిచి, రామన్న కుర్చీలోంచి లేచాడు. పన్నెండుగంట లుండే పగటిపూటల్లో ఇది నూరవదో, వెయ్యవదో - కుముదను మాట్లాడించాలని రామన్న ప్రయత్నించాడు. ఇదీ మొదటిరోజు కాదు. ఇప్పటికి నాలుగు నెలలయింది ఈ సహాయనిరాకరణో ద్యమం ప్రారంభమై. అలాచూస్తే రామన్నకు ఇలాంటి అసహ్యా వాతావరణాన్ని ఓర్చుకునే అగత్యం లేదు. కుముద ఎవరు ? తనకూ ఆమెకూ ఏమిటి సంబంధం ?

తాను ఆమెకోసం ఎందుకు ఈ శ్మశాన భయానక నిశ్శబ్దతని సహించాలి? కుముదతో ఎలాంటిదైనా సంబంధమంటూవుంటే అది తన భార్యయైన సరళ ద్వారానే. పాపం! సరళస్వభావం విశ్వాసంతో కూడినది, మనుషుల్ని దగ్గరకు చేర్చేస్వభావం. కుముద తన పిన్నమ్మ కూతురు అని సరళ చెపుతుంది; ఏ దేశంలో ఉందో ఆ పిన్నమ్మ? ఎందుకంటే ఆ రోజువరకూ తన కొక బంధువురాలు వుంది అనే మాటనే ఎత్తలేదు. ఒకసారి తన అన్న యింటినుంచి తిరిగివస్తూ కుముదను తీసు కొని వచ్చింది, పిన్నమ్మ కూతురు అని ఆమెను ఇంటిలోనే ఆట్టే పెట్టుకుంది. పిన్నమ్మ ఉన్నదా - అని అడగడానికికూడా అవకాశం కలగలేదు. ఎందుకంటే, పిన్నమ్మ చనిపోయింది అనే వార్తతోనే కుముద పాత్ర ప్రవేశించింది. ఇదంతా జరిగింది ఆరు సంవత్సరాలక్రితం. అయితే ఇప్పుడు కుముదకు ఆ సంబంధమూ మిగలలేదు.

ఇప్పుడు సరళే చనిపోయి నాలుగుమాసా లయింది. ఆరు సంవత్సరాల పరిచయం - సహవాసమేమో వున్నాయి. అయితే ఇలాంటిప్రవర్తనను ఓర్చుకోవడం యింకెన్నిరోజులు సాధ్యం? ఇంక తనకు అసాధ్యం అనేవిషయాన్ని నోటితో అనలేక చేతిలోఉన్న దినపత్రికను కుర్చీమీద పారేసి రామన్న లేచాడు. 'ఏమైనా కావల్సింటే వచ్చి చెప్పడం మరిచిపోవద్దు మళ్ళీ!' అని హెచ్చరించి తన గదివైపు నడిచాడు.

## 2

రామన్న గదితలుపులు మూసినశబ్దం విని కుముదకు దుఃఖం ఆగలేదు. అతని మనసుకు బాధ కలిగింది కదా? బాధించాలని తను అనుకోలేదు. ఉహుఁ, రామన్నకు బాధ కలిగించాలని తాను కోరుకోవడం ఈ జన్మలో సాధ్యంకాదు. అవసరమైతే అతనికోసం తాను చావునుకూడా కొనితెచ్చుకోవడానికి సిద్ధమే. కాని ఏమిటి చేయటం? హృదయం ఒకటి తలిస్తే, మనస్సు మరొకటి తలుస్తుంది. హృదయం రామన్న సాహచర్యాన్ని అపేక్షిస్తే, మనస్సుకు అతని నవ్వుకూడా జుగుప్స కలిగిస్తుంది. ఎందుకిలా అవుతుంది అని తనకే తెలియలేదు. అలా అవుతున్నది

మాత్రం నిజం అనడానికి రోజూ అంతరంగంలో రేగే కల్లోలమే సాక్షి. సరళక్క మరణంవల్ల ఒకవిధమైన దెబ్బ తగిలిందా? పన్నెండు సంవత్సరాల అనాథ అయిన తన్ను తీసుకువచ్చి, పెంచి పెద్దచేసిన, మాతృసమానమైన సరళక్క మరణంవల్ల ఇలా అయివుంటుంది అని ఎన్నోసార్లు అనిపించేది. అయితే రామన్నస్థితి తన లాగా కాలేదు కదా? ఇష్టురాలైన భార్యను పోగొట్టుకున్న భర్తకు తగలనిదెబ్బ తనకు తగిలిందా? ఇది సహజమేనా? అనీ కొన్నిసార్లు సంశయం కలిగేది. రామన్న ఎదురుగా కూర్చొని మాట్లాడుతూంటే ఏదో అసహ్యం కలిగితే, రామన్న దూరం కాగానే పిచ్చి పట్టినట్లయ్యేది. అందువల్లనే గదితలుపు శబ్దం విన్నక్షణమే దుఃఖం ఉప్పెనలా వచ్చినా, మరుక్షణం నవ్వు మెరుపులా చిందింది. అంత రంగపు నిగూఢత్వమది. అంతరంగపు మేఘంలో ముందు పిడుగుపాటు వినిపించి తరువాత మెరుపు కనిపిస్తుందేమో! మూసిన తలుపువైపు చిరునవ్వుతో చూడ సాగింది, చూడగా చూడగా ఆ సుఖంయొక్క అనుభవాన్ని ఆస్వాదించడానికి కళ్లు మూసుకుంది. ఎండలో వాన చినుకుల్లా చిరునవ్వు ముఖంలో, కళ్లల్లోంచి నీళ్ళు ధారగా కారుతున్నాయి. ఇది సుఖమా? దుఃఖమా? అని తెలియని, లేక ఆ విష యానికే అతీతమైన ఒక పరసుఖాన్ని అనుభవిస్తున్నట్లు ఆమెముఖం ఆకర్షణీ యంగా వుంది. కళ్ళు మూసినపుడు కుముద పరసుఖమే పొందిందని చెప్పవచ్చు. ఇవాళ అలా కళ్ళు మూసుకున్న కుముదకు పాతవిషయాలు ఒక్కొక్కటే జ్ఞప్తికి వచ్చాయి. ఆరోజూ ఇలాగే రామన్న గదితలుపులు మూసిఉన్నాయి. తాను పన్నెండు సంవత్సరాల బాలిక. సరళక్కతో వచ్చింది. రైలులో రావడంకూడా తనకు కొత్త. కిటికీలో కూర్చొనిచూస్తే వేగంగా వెనక పరుగెత్తిపోయే ప్రపంచం 'రాజా దేఖో రాణీ దేఖో' చిత్రపటం లాగుంది. ఆ పటాలను చూడాలని ఆశ తనకు. అయితే సరళక్క ఏకధాటిగా ఏమో చెపుతున్నది. మధ్య మధ్య 'తెలిసిందా, కుముదా' అంటూంది. అందువల్ల ఆమె మాటలను వినితీరాల్సి వచ్చింది. అదైనా ఎవర్ని గురించి? దారిపొడుగునా రామన్నగురించే మాటమాటకూ 'ఆయన ఇలా అంటారు' అని పల్లవి. 'ఆయన వొట్టి మొండిమనిషి, ఆయనస్వభావం విచిత్రమైంది. 'నిన్ను ఎగతాళిచేస్తే ఏడవ్వకదూ మళ్ళీ!' అని సరళక్క ఎంత గంభీరంగా, ఎంత మధు రంగా చెప్పింది! ఇప్పటికీ ఆమెముఖం జ్ఞప్తికివస్తే నవ్వు వస్తుంది. 'మళ్ళీ

ఆయన చేష్టలుచూసి నువ్వూ వెయ్యబొయ్యేవు. చటుక్కున తిట్టేస్తారు. ఏవేళకు ఆయన మనస్సు ఎలా వుంటుందో చెప్పలేం' అని హెచ్చరించింది. అదంతా విన్నతర్వాత రామన్నను చూడడానికి కుముద చాలా కుతూహలపడింది. తానూ సరళక్కా స్టేషన్‌నుంచి యింటికి వచ్చారు. తలుపు తెరిచేవుంది. లోపల ఎవరూ వున్నట్లు లేదు. అయినా సరళక్క రహస్యంగానే మాటాడసాగింది. 'ఏయ్ - చేతులు కాళ్ళు కడుక్కో. నేను టీ పెడతాను. గదితలుపులు మూసివున్నాయి అంటే ఆయన లోపల వ్రాసుకుంటూ వుండివుంటారు. చప్పుడు చెయ్యొద్దు. టీ చేసిన తర్వాత చూద్దామ'ని అన్నది. కుముద ఇంక భరించలేక గదితలుపునే చూస్తూ నిలుచుంది. ఎంతసేపు అలా నిలుచుందో? ఒక్కసారి గదినుంచి 'సరళా' అని పిలుపు, అదేవేళకు దభీమని తలుపు తెరచినశబ్దం, ఎదురుగా రామన్న మూర్తి! కుముదకు ఏం చెయ్యాలో తోచక శిలావిగ్రహంలా నిలబడిపోయింది. 'సారీ సరళా కొంచెం మిగిలిపోయింది, తప్పక పూర్తి చేయాల్సి వచ్చింది' అన్నవాడు తన దగ్గరకువచ్చి రెండుచేతుల్ని భుజాలమీదవేసి, 'సరళా, ఈ పుస్తకంవల్ల నా జీవితమే మారిపోతుంది చూడు; నువ్వు చదివిచూస్తే నీకూ తెలుస్తుంది. 'Shake Hands, సరళా. నీ భర్త ఈ రోజునుంచి పేరున్న రచయిత' అని తన భుజాలను బలంగా నొక్కాడు. అప్పుడు సరళక్క లోపల్నుంచి వచ్చి, 'అయిందా రాయడం' అన్నప్పుడు, పాపం! రామన్న ఆశ్చర్యపడి దూరంగా జరిగి తనను చూచి, 'ఒరే! ఈ పిల్ల ఎవరు? హహ! నాకూ అనిపించింది. సరళ ఇంత సన్నంగా ఎందుకైంది అని? ఎవరికి తెలుసు? అన్న యింట్లో భోజనం తక్కువై చిక్కి సన్నగా కనిపిస్తోందేమో అనుకున్నా....హహ....' అని తనలో తానే నవ్వుకున్నాడు రామన్న. అయితే జరిగినవిషయానికన్నా కలిగిన అనుభవం కుముదను కదిల్చివేసింది, అదేమిటంటే రామన్న చేతులు తన భుజాన్ని తాకిన అనుభవం. అదెందువల్లో - ఒళ్ళు వణికినా మనస్సుమాత్రం - కడుపునిండినవాని నిద్రలాగా - సుఖంలో తటస్థమైనట్లుండింది. ఈ ఆరు సంవత్సరాలలో ఎన్నిసార్లు ఆ వాకిలిని - మూసినవాకిలిని చూసిందో అన్నిసార్లు కుముద ఆనాటిసుఖాన్ని తలచుకుని కళ్ళు మూసుకునేది. ఇప్పుడూ కళ్ళు మూసుకోగానే మొదట ఒక నిముషం అదే సుఖోదయకిరణాల్లా ఆమె ముఖంలో బంగారపు కాంతి - మెరు

స్తుంది. కన్నీరు కురుస్తుంది. అయితే ఇప్పుడుమాత్రం కన్నీటికి కారణం సుఖమో దుఃఖమో అనేది ఆమెకు తెలీలేదు. ఇప్పుడు అంతరంగంలో తాటస్థ్యం లేదు. అందువల్ల చటుక్కున ముఖాన్ని తుడుచుకొని కళ్ళు తెరిచి, బెదరుచూపుల్తో అటూ ఇటూ చూసి దీర్ఘంగా నిట్టూర్చి, చేతిలోవున్న పుస్తకాన్ని చదవ ప్రయత్నించ సాగింది.

## 3

భోజనం త్వరగా ముగిసింది. సినిమా కార్యక్రమం ఆగిపోయింది. రాస్తానని చెప్పి తలుపు మూసుకున్నందుకు బయటికీ వెళ్ళటానికి లేదు. వేటకుక్కల్ని తప్పించుకోవడానికి దాక్కునే కుందేలులా కుర్చీ బెంచీలనడుమ చిక్కుకున్నాను కదా అని రామన్న తనగదిలో గొణుక్కుంటున్నాడు. చివరకు బెంచిపైన మోచే తుల్ని ఆనించి, తలను చేతుల్లో గట్టిగా పట్టుకుని, ఆకాశాన్ని చూడడానికి ప్రయత్నించేవానిలా ఎదురుగావున్న గోడను చూశాడు. అతనికి కనిపించింది గోడకు తగిలించిన సరళ చిత్రం. మళ్ళీగా మరోమారు భార్యచిత్రాన్ని సూటిగా చూశాడు. ఇదేమిటి? సరళ పెదవులు విడిపడివున్నాయి? తాను వ్రాయలేక పెనగులాడడం చూసి ఆమె చిరునవ్వు నవ్వుతున్నదా? 'నేను ఎలా వ్రాసేది! సరళా, నీకు తెలిసీ నవ్వుతున్నావు కదా?' అని మొండిపిల్లవాడిలా నిట్టూర్చాడు.

రామన్న తన భార్య చిత్రంచూసి అలా నిట్టూర్చడానికి కారణం లేకపోలేదు. తన రచనా తంత్రమంతా సరళకు తెలిసిందే. ఇంతెందుకు? సరళ స్వతహాగా ఆ తంత్రంలో ఒక భాగం అనవచ్చు.

'సరళా, నేను వ్రాయాల్సి వుంది' అంటున్నాడు రామన్న.

'ఏమి కథా, నాటకమా, నవలా' ఏం రాస్తారు అని ఎప్పుడూ సరళ ప్రశ్న.

'హహ! అంటే? రాస్తానంటే, నీకేం గుమాస్తా లాగా లెక్కలు లేకుంటే, రిపోర్టు రాస్తా ననిపించేదేమిటి?' అని రామన్న గొణిగేవాడు.

'లేదు - నిన్న ఏమిటేమిటో చెప్పారు - అదే కథ రాస్తారో, నాటకం రాస్తారో అని అడిగాను' సరళ సమాధానం.

అప్పుడు రామన్న తలపుకు వచ్చేది తాను వ్రాయదలచినవిషయం ఏమిటి అని. అయితే భార్యముందు దాన్ని ఒప్పుకునే దెలా? అందుకని కొంచెం కోపం గానే చెప్పేవాడు. 'పిచ్చిదానా! నాటకమే రాస్తానని చెప్పలేదా నీకు?'

'అయితే నాటకం రాస్తే చాలావరకు చూపించడానికి తెలియజేయటానికి వీలు లేదు అన్నారు. అందుకని నవల రాస్తారేమో అని అడిగాను' అనేది సరళ.

ఎంత తమాషా! తాను నాటకంగా రాస్తానని చెప్పలేదు, అది అబద్ధం; నాటకంలో వీలుకాదు అని తాను అన్నట్లుగా సరళ ఆరోపణ అబద్ధం. అయినా ఇలాంటి అబద్ధాల్ని లక్ష్యపెట్టకుండా, 'అందుకే నిన్న మొదలుపెట్టలేదు. నవల రాయాలని నిన్ననే చెప్పాను. దాన్నే ఈ రోజునుంచి రాస్తానన్నాను' అని సాధించేవాడు.

'అబ్బ! నవలనే రాస్తారా!' అని సరళ ముఖాన్ని, కళ్లనూ వికసింపజేస్తుంది. ఆమెకు కలిగిన ఆ ఆనందం - అభిమానాల్నిచూసి దానికోసమైనా తాను నవలనే వ్రాయాలని నిశ్చయించేవాడు.

'సరళా, నీవు నాకు ప్రేరణ నిస్తున్నావు' అని ఇప్పుడు రామన్న చిత్రంలో వున్న సరళముందు అంగీకరించాడు.

ఒకవిధంగానా - రెండువిధాలుగానా - ఎన్నివిధాలుగా సరళనుంచి సహాయం దొరికేది? వ్రాయనిభాగాన్ని వ్రాసినట్లుగా ఆమెతో చెప్పినప్పుడు ఒక్కొక్కమారు ఆమెకు ఉత్సాహం కలిగేదికాదు. క్రమేణ ఆమె భావాలకనుగుణంగా కథను మలుస్తూ వచ్చాడు. పుస్తకాన్ని ముగించేటప్పుడుమాత్రం ఆమెదే చివరి నిర్ణయం. ముగింపువరకూ తాను కథను చెప్పేవాడు. అప్పుడప్పుడు ఆమె 'చాలు, ఇంక చెప్పొద్దండి. ఇలా అవుతుందికదూ చివరికి!' అని చిన్నపిల్లలా చప్పట్లు తట్టేది. 'భలే! నా సహవాసంవల్ల నీవూ రచయిత్రివైనావు!' అని ఆమె వీపుతట్టి గదికి వెళ్ళి ఆమె సూచనప్రకారం - దాన్ని ఒప్పుకునేవాడుమాత్రం కాదు కాని - కథను ముగిస్తుండేవాడు. టీ వేళకో, రాత్రి అన్నం తిన్నతర్వాతో దాన్ని తెచ్చి, 'అప్పుడు నువ్వు చెప్పావుకదూ? చూడిక్కడ. నేనూ అలాగే ముగించాను కథను!' అని గర్వంగా చదివి వినిపించేవాడు.

'సరళా, అది మోసంకాదు, క్రూరతనం. ఇప్పుడా క్రూరతనానికి అవకాశం యివ్వటానికి యెవ్వరూ లేరు. నేను ఎలా రాసేది?' అని చిత్రం ఎదుట మళ్ళీ వాపోయాడు.

కూర్చొని కూర్చొని విసుగుపుట్టింది రామన్నకు. తానొక్కడే సినిమాకు పోతే యెలా వుంటుంది? అబ్బ! అదేమో ప్రమాద మనిపిస్తుంది. ఏం లేదు, ఈ పిల్లను తగిలించుకుంది తప్ప. అయితే ఏమి? బయటికి గెంటాలా? ఆ పిల్లమాత్రం యెక్కడికి పోతుంది? అంతేకాక నలుగురూ నాలుగుమాటలనకుండా వుంటారా? 'ఇల్లాలు దాటిపోగానే పాపం! అనాథబాలికను అడవికి పంపాడు రామన్న' అని. అన్నిటినీ మించిన అడ్డు యేమిటంటే, చనిపోయేవరకు ఈ కుముద సహవాసం తప్పదు. ఎందుకంటే, కుముదను పెళ్ళి చేసుకోవడం సాధ్యంకాదు అన్నవిషయం రామన్నకు బాగా తెలుసు. సరళ మంచం పట్టినప్పటినుంచి అమ్మలక్కలు గుసగుసలాడటం, చివరకు రామన్న చెవినీ పడింది. కుముదకూ తనకూగల సంబంధాన్నిగూర్చి అనుమానం పెరుగుతూంది. అందరికీ ఏదైతే అనుమానంగా వుందో అవి రామన్నకు అనుభవపూర్వకమయింది. 'సరళా, అదీ నీ తప్పే!' అని రామన్న చిత్రాన్ని నిందించాడు. ఉన్నట్లుండి అతనిశరీరం వణికింది. 'కుముదను మీరు ఎందుకు పెళ్ళి చేసుకోరు' అని ఆ చిత్రంలోని పెదవులు ప్రశ్నించినట్లుగా అనిపించింది. ఛీ! ఈ భావన ఎందుకు వచ్చిందీ రోజు? కుముదతో పెళ్ళా? అసాధ్యం. 'సరళా, నీకే తెలుసు. నీ నా సహవాసంవల్ల మనం ఒక్కరైనట్లయ్యాము, ఈ రోజు నీవు శారీరికంగా వేరు అయినా నాలో లీనమయే వున్నావు. నేను వున్నంతవరకు నీవు నాలోనే వుంటావు. అలాటప్పుడు మరొకరికి చోటు ఎక్కడ్నుంచి వస్తుంది? సాధ్యం లేదు. సరళా, కుముదతో పెళ్ళి ఏమాత్రం సాధ్యంకాదు. ఇంతెందుకు? మరోపెళ్ళే అసలు సాధ్యంకాదు.' భావోద్వేగంతో రామన్న కళ్ళలో నీళ్ళు నిలిచాయి. 'అయితే దీనికంతా కారణం నీవే' అని తన ఉద్వేగాన్ని నిగ్రహించుకోవడానికి ఆమెని నిందించాడు.

మామూలు పరిస్థితిలో తాను ఈమాటను అనేవాడు కాదని రామన్నకు తెలుసు. ఎందుకంటే, మరొకరిమీద తప్పు మోపడం దుర్బలత లక్షణం కాదూ? అలా చూస్తే ఈ విషయంలో ఎవరిది తప్పు? 'భ్రామయన్ సర్వభూతాని యంత్రా

రూఢాని మాయయా' అని గీతలో చెప్పలేదా? అక్కడ మనసులో దేవుడన్నాడు, ప్రాణుల్ని ఆడిస్తున్నాడు అని వున్నది; ఇక్కడ దేవుడిమాట లేదు, అయినా ఇదీ ఆత్మలోని ఒక శక్తే. 'ప్రవాలశోభా ఇవ పాదపానాం శృంగారచేష్టా వివిధా బభూవుః' అని కాళిదాసు చెప్పింది ఇంకా సమంజసంగా వుంది. చెట్టుకు చిగుర్లు పుట్టడం ఎంత ప్రకృతి సహజమో అల్లే ప్రాణికి శృంగారచేష్ట సహజం....ఛీ! ఇదంతా తన్ను తాను సమర్థించుకోవడానికి సమాధానంగావుంది. అదీ దుర్బలత లక్షణమే అనుకుని రామన్న ఆవిధంగా ఆలోచించడం మానివేశాడు. అయినా ఒకవిధంగాచూస్తే తప్పు సరళదేకదా అని మళ్ళీ గోడకుండే చిత్రాన్నిచూస్తూ ఆలోచించాడు. ఆ రోజు జరిగినసంగతి అంతగా చెప్పుకోవలసిందేమీ కాదు. అది జరిగి వుండాల్సిందీ కాదు. కానీ హఠాత్తుగా జరిగింది. సుమారు 2-2½ సంవత్సరాల క్రితం ముందుసంగతి. సరళ అప్పుడే మంచం పట్టింది. పాపం! మూడు సంవత్సరాలు మంచంపట్టి క్షీణించి చనిపోయిన భార్యని తప్పు పట్టవచ్చా? తప్పు వేయటం కాదు, సంఘటనల్ని అర్థం చేసుకోటం అని సమాధానపరచుకొన్నాడు. ఆ రోజు మంచంమీద సరళ పడుకొనివున్నది. దగ్గర కుముద కూర్చొనివున్నది. రామన్న బైటనుంచి వచ్చాడు. వచ్చినవాడు సరళవైపు చూసి, పక్కమీద కూర్చుంటూ, 'ఈ రోజు జ్వరం తగిలిందా?' అనడిగాడు. సరళ చిరునవ్వుతో తల ఆడించింది. అయినా రామన్నకు తృప్తి కలుగలేదు. 'ఇప్పుడు జ్వరం లేదుకదూ,' అంటూ దుప్పటికింద చేయిపెట్టి - సరళ ఒంటిమీద చెయ్యి వేసేందుకు ముందుకొంగాడు. అదేసమయానికి కుముదకూడా చేతులు చాపిందేమో ఒక్కసారిగా ఇద్దరి చేతులూ తలుసుకున్నాయి. ఒక్కక్షణం రామన్ననోట మాట రాలేదు. కుముదచేతికి వెంటనే చెమట పట్టడం కనిపించింది. ముఖమెత్తి కుముదను చూశాడు, ఆమెకూడా బెదరుతో తన్నే చూస్తున్నది. 'కాదు-చెమట-' అన్నవాడు సంబాళించుకొని 'అంటే చెమటపట్టి జ్వరం దిగిందా, లేక జ్వరం అసలే రాలేదా?' అని సరళను అడిగాడు. ఆమె ముఖం చిరునవ్వుతో వికసించింది. అశక్తతవల్ల మగతగా వుంది. నవ్వుతూనే 'లేదని మొదటే చెప్పలేదా?' అంది. ఆ మాటతీరు, ఆ చిరునవ్వు - వీటి వల్ల రామన్నకు సంశయం కలిగింది. సరళకు తెలిసిపోయిందా? ఒక రెప్పపాటు కాలంలో ఇద్దర్నీ బెదరగొట్టేశాడు, అనుకోకుండా జరిగిన ఆ సంఘటన - దాని

పరిణామం సరళకు తోచిందా? తోచింది. అందుకే ఆమె ముందయినా జాగ్రత్తగా వుండవలసింది. నన్నూ హెచ్చరించవలసింది. అలా చేయలేదు. అందువల్ల ఈనాటి పరిస్థితికి ఆమె చేసిన ఆ తప్పే కారణం - 'తెలిసిందా! నువ్వు ఒక్క మాటయినా చెప్పివుంటే బాగుండేది' అని చిత్రానికి బుద్ధి చెప్పాడు.

బైటికి వెళ్లటానికీ లేదు, రాయడమూ లేదు. కళ్లముందు ఫోటోవుంటే సరళ స్మరణ వదలదు. చేసేందుకైనా ఏముంది - అని కొంత ఉద్వేగంతో రామన్న కుర్చీలోంచి లేచాడు. గడియారం చూసుకున్నాడు. ఇంకా గంట ఎనిమిదిన్నరే! పడుకునేసమయమూ కాదు. పడుకునేభావన రాగానే మళ్ళీ 'అంతా నీ తప్పు అన్నాను' అని ఫోటోఎదుట తనలో తానే అనుకొని మళ్ళీ కుర్చీలో కూలబడ్డాడు.

# 4

కుముద నిట్టూర్పు విడిచింది. పుస్తకం ఎక్కడవుందో? మనస్సు ఎక్కడుందో? ఏమిటి చేయడం? ఎక్కడికి పోవడం? ఎవరిదగ్గరికి వెళ్లటానికీ బుద్ధి పుట్టడంలేదు. తాను వెళ్లగానే, అక్కడవున్న ఆడవాళ్ళు చటుక్కున మాటలు కట్టిపెట్టి ముసిముసినవ్వులతో తనను ఆహ్వానించేవాళ్లు. అంతవరకు వాళ్లు తన్ను గురించే మాట్లాడుతున్నారనేది కుముదకు తెలియకుండా వుండటానికి వీలులేదు. ఏమైనాకాని, బయటికి పోవడానికిమాత్రం మనస్సు అంగీకరించేదికాదు. అన్నం తినడమయింది. పడుకోవడమొక్కటే తనకు మిగిలివుంది. 'పడుకోవడ'మన్న ఆ క్షణం కుముద శరీరం వణికింది. ముఖం చెమటపట్టింది. ఇప్పటికి రెండు సంవత్సరాలయ్యింది - కుముద, రామన్న ఒక్కచోట పడుకోవటం ప్రారంభించి. ఎంత మోసం! పాపం! సరళక్క మంచంపట్టిన ప్రాణి. ఆమెకు తెలియడం సాధ్యం కాదు. అలా ఇలా - ఒక రోజు రామన్న చేయి తనచేతికి తగిలినప్పటి నుంచి - ఇద్దరికీ తెలియకుండానే ఈ సంఘటన జరిగిపోయింది. మొదట మొదట కుముదకు ఇదేమిటి, ఎలా జరిగింది - అనే జ్ఞానంకూడా వుండేదికాదు. ఏదో సుఖంతోకూడిన మధురస్వప్నాలలో తన్మయురాలై పోయింది. చేతికి చేయి తగిలినప్పుడు కలిగిన మధురానుభూతినుంచి ఇంతవరకు తేరుకోలేదు. మళ్ళీ శరీరం

కంపించింది. అప్పుడు రామన్న రాకను నిరీక్షిస్తూ నిద్రమత్తులో పడుకున్న సుఖం ఎక్కడ? ఇప్పుడు రామన్న దగ్గరికి వచ్చాడంటే ఎప్పుడు వెలుగవుతుందని, ముంచుకువస్తున్న నిద్రను అణచివేసిన దుఃఖం యెక్కడ? అయితే ఇప్పటి దుఃఖంలో ఆనాటి సుఖంయొక్క మధురస్మృతులు కుముద నింకా విడిచిపోలేదు. పగలైనా ఆ అనుభవాన్ని తలచుకొంటే ఆమెవొళ్ళు పులకించేది. చేయిచేయికి తగిలిన మొదటి అనుభవం మరీ! ఆ వొక్క అనుభవాన్నిపొందిన ఆ క్షణం చావు వచ్చిన జన్మ సార్థకమైనట్లు కుముదకు అనిపించేది. చావు - జీవం! ఆ ఒక్క క్షణం తాను జీవంతో వున్నానా లేదా అన్న జ్ఞానంకూడా లేకుండాపోయింది. ఒళ్ళు పులకించింది. శరీరం వణుకుతున్నది. హృదయం ఉవ్వెత్తుగా ఎగిరిపడుతున్నది, పెదవులు కంపిస్తూన్నాయి, నాలుక యెండిపోయింది. అన్నిటికీ మించిన కొత్త అనుభవమేమిటంటే తనహృదయంలో ఒక సుఖానుభూతినిచ్చే వేదన. ఆ రోజు నుంచి తాను రామన్న సొంతం అయింది. శారీరికంగా కాదు, మానసికంగా. చేతి వ్రేళ్ళు సోకినంతనే దేహానికి కొత్త ప్రాణాన్ని ఇచ్చిన వ్యక్తికి పూర్తి శరీరాన్ని అర్పించడం కఠినమేం కాదు.

ఒక్కొక్కసారి కుముదకు ఆశ్చర్యం కలిగేది. ఇదంతా ఎలా జరిగింది? సరళక్క మంచం పట్టివుండటం వల్లనా? లేక తను ఈ ఇంట్లో వుండటానికి రావటం వల్లనా? లేక కేవలం చేయిచేయి కలవటంవల్ల చిగిరించిందా? అయితే ఏదో యాదృచ్ఛికంగా తను సరళక్క ఇంట్లో వుండటానికి రావడం, అంటే యాదృచ్ఛికంగా సరళక్కకు మంచం దిగనిరోగం రావడం, ఆనాటి ఆకస్మిక సంఘటన ఈ అన్నీ 'ఆకస్మిక' విషయాలు ఒక నియమంగా జరగలేదూ? రామన్న చెప్పిన శకుంతలా దుష్యంతుల కథలా తనదీ ఒక కథ అని కుముద నమ్మింది. రాజధానిలోని రాజెక్కడ? అడవిలోని పిల్ల యెక్కడ? కణ్వమహర్షి ఆశ్రమంలో లేనిరోజునే ఆ రాజు అక్కడికి రావటమేమిటి? ఇదంతాచూస్తే శకుంతలా దుష్యంతుల కూడిక దైవసంకల్పమనే చెప్పవచ్చు. ఎవరూ దిక్కులేని అనాథ అయిన తనదీ దైవసంకల్ప మెందుకు కాగూడదు? తనలో, రామన్నలో పరస్పరం సహజప్రేమ ఎందుకు అంకురించకూడదు? 15-16 సంవత్సరాల కుముదకు ఇది పరిష్కరించలేని సమస్య అయి కూర్చుంది. ఆమెమనస్సును కలచే విషయమైంది.

క్రమేణ అలాంటి ప్రేమ తమ ఇద్దరిలో ఉదయించింది అనే ఆశ నమ్మకంగా మారింది. నమ్మికనుంచి ఆశ ప్రజ్వలించింది. కుముద శరీరం క్రమేణ కృశించ సాగింది. ఆమె ముఖంలో ఎప్పుడూ ఒక అలక్ష్యంతోకూడిన ఉద్విగ్నత చోటు చేసుకుంది. 'పాపం! పిల్లకు నాతోనే ఇంట్లో వుండివుండి విసుగనిపించి వుంటుంది. ముఖంలో కళే నశించిపోయింది. ఎప్పుడైనా ఒక్కసారైనా బయటికి తీసికెళ్ళరు కదా' అని సరళక్క రామన్నతో అన్నప్పుడు కుముద సిగ్గుతో నేలకు కుంచించుకు పోయింది; రామన్న జవాబు చెప్పడానికి ఎలాంటి ఆతురతనూ చూపలేదనేది చూసి కుంచించుకుపోయిన ఆమెకు అలాగే నేలలోకి దిగబడిపోయినట్లయింది; చివరకి 'చూద్దాం' అనిమాత్రం అన్నాడు రామన్న.

మొదటిసారి రామన్నలో తిరిగివచ్చిందీ మరుపలేనిదే. దానికోసం తను ఎంత ఉత్సుకత చూపింది! అయితే ఏమి? ఇంటినుంచి బయటపడి మళ్ళీ ఇంట్లో కాలు పెట్టేవరకూ ఒక్క పెదవి రెండుగా విడలేదు. 'సరళా. మీ అమ్మాయి మూగదా లేక చెవిటిదా? నీకు తెలిసివుండాలికదా?' అని రామన్న చెప్పినప్పుడుమాత్రం తను అక్కడ్నుంచి జారుకొనివెళ్ళి తనగదిలో కూర్చున్నదీ, కూర్చోగానే ఆపుకో లేక వెక్కి వెక్కి ఏడ్చిందీ, ఓ పెద్ద కథే అయింది. 'దానికి తోస్తుందని మీతో పిలుచుకుపొమ్మంటే పిల్లను ఏడిపించటమేనా? మీరు మంచివారండీ!' అని సరళక్క అన్నదానికి బాధపడి రామన్న తనగదికి వచ్చాడు, 'ఓస్! నిజంగానే ఏడుస్తున్నావేమిటి?' అన్నాడు తన ముఖంచూసి. వీపుమీద చేతితో నిమిరాడు ఓదార్పుగా, ఎంత దుఃఖభారాన్నయినా భరిస్తాను అని పులకించిపోయింది తన శరీరం. కన్నీరుమాత్రం మళ్ళీ పొంగివచ్చింది. అప్పుడు రామన్న 'కిందికి పో, కళ్ళు తుడుచుకో' అని కన్నీటిని తుడవడానికి తన పమిటను తీస్తుంటే సిగ్గుతో దూరంగా జరగబోయింది. అప్పుడు అతనిచెయ్యి మళ్ళీ తగిలింది – ఈసారి తన హృదయానికి. అప్పుడుమాత్రం కుముద కాళ్లల్లో సత్తువే పోయినట్లయ్యింది. చివరికి-ఏమయిందో, మూర్ఛవచ్చిందో, వచ్చేట్లనిపించిందో – అదీ తెలియలేదు. తెలివి వచ్చేసరికి రామన్న తనని మంచంమీద కూర్చోబెట్టి, తనూ దగ్గర కూర్చొని, చేతిలో నీటిపాత్ర పట్టుకుని వున్నాడు.

పాపం! సరళక్కదైనా ఏం తప్పు! కుముదకు మనసు బాగులేదు అన్న

దొక్క చే కారణంగా ఆమె కుముదను రామన్నతో బయటికి వెళ్లడానికి, సినిమా చూడడానికి, పుస్తకం చదవడానికి ప్రోత్సహించింది. 'నే నొక్కదాన్ని మంచం పట్టాను అని నువ్వు ఎందుకు ఇంట్లో మూల కూర్చుంటావు? ఒక గంట అలా తిరిగి వస్తే పోతుంది. ఇంతలోనే నేనేమీ చచ్చిపోన్లే' అని సరళక్క పదేపదే చెపుతూ వుండేది. ఎలాగో కుముదకు రామన్న సాహచర్యం దొరికింది. దాని ప్రయోజనం మాత్రం దొరకలేదు. చిన్నవయసులోవున్న కుముదకు ఏదో వ్యథ అనిపిస్తూ వుండేది మొదట్లో. రామన్న సామీప్యం లేకుంటే కలవరపడే కుముదకు క్రమంగా రామన్న సహవాసంవల్లనే ఎక్కువ కలవరం కలగసాగింది. ఒక్కొక్కసారి చటుక్కున లేచివెళ్ళి అతని రెండుపెదవుల్నీ స్పృశించాలనిపించేది. ఒక్కొక్క సారి అస్తవ్యస్తంగా వ్యాపించి పెరిగిన అతని జుత్తుని సవరించాలనిపించేది; ఎన్నోమార్లు రాస్తుండే అతని చేతిని పట్టుకుని ఆ చేతిని తన చెంపమీద రాచుకోవా లనిపించేది. అలా అనిపించినపుడల్లా చాలా నిగ్రహంతో తన్ను తాను సంబాళించు కొనేది. ఒక్కోసారి తన ఓర్మికి తానే ఆశ్చర్యపడేది.

ఒకరోజు తనూ, రామన్న సరళక్కదగ్గర కూర్చునివున్నారు. కాస్సేపటికి సరళక్క నిద్రపోయింది. అప్పుడు రామన్న దొంగచాటుగా 'సద్దుచెయ్యకుండా మన గదులకి వెళ్దాం పద' అన్నాడు. సరళక్క నిద్రకు భంగం రాకూడదని రామన్న అలా మాట్లాడినా ఆ రోజు అతని కంఠం విని తన శరీరం జలదరించింది. లేచింది, అలాగే నడిచింది రామన్న వెనకాలే. మైకంలో వున్నట్లు అతనిగదికి నడిచింది. రామన్నకూ ఆశ్చర్యం కలిగినట్లుంది.

'చదువుకోవడానికి పుస్తకమేదైన కావాలా?' అని అడిగాడు.

'ఊఁ' అని తల పంకించింది.

'ఏది కావాలి, చూసి తీసుకో' అన్నాడు.

'పుస్తకాల బీరువా తలుపు తెరిచి చూడసాగింది. చూడడం, పెట్టడం, తీయడం, పెట్టడం - తనకి నిర్ణయబుద్ధే నశించిందా?'

'ఏం? ఏదీ దొరకలేదా?' అన్నాడు రామన్న.

'ఏమిటి? ఏది' అని పిచ్చిదానిలా సమాధానం ఇచ్చింది. రామన్న నవ్వాడు.

'నేనే చూపియిస్తా నలాగైతే' అని రామన్న బీరువాదగ్గరికి వచ్చాడు. బీరువా రెండుతలుపులమధ్య నిలుచున్న తను రామన్నకు చోటు ఇచ్చేందుకు దూరంగా జరగాలి కదా? అయితే అంతలోనే అతను దగ్గరికి రావడంవల్ల ఆమె కాళ్ళు యిక కదలలేదు. పక్కకు జరగలేదు. వెనక్కి చూడలేదు. అయినా రామన్న వేడి ఊపిరి తనభుజాల్ని తాకుతున్నది. తనవెనకే నిలుచున్నాడు రామన్న. చాలాదగ్గరగా వున్నాడా? కొంచెం పక్కగా నిలుచునున్నాడా? కళ్లు మసకలు బారాయి. వెనక వేడిఊపిరి భుజాన్ని - కాదు హృదయాన్ని - తగులుతున్నది. ఓర్పు నశించింది. ఊపిరి బిగిసినట్లయింది. ఒక్కసారి మునిగినవాడు పైకిలేచి ఊపిరి పీల్చను నోరు తెరచినట్లు తన ముఖాన్ని పుస్తకాలనుంచి తిప్పింది.

'ఇది కావాలా?' అన్నాడు రామన్న.

తన నోటినుంచి మాటలే పెగిలిరాలేదు. కన్నార్పకుండా రామన్ననే చూస్తూ నిలుచుకుంది. రామన్న చకితుడైనాడో, ఆశ్చర్యపడ్డాడో! అతనిముఖంలోనూ మార్పు వచ్చింది. అది ఆశ్చర్యమూ కాదు, ఆనందమూ కాదు అని కుముదకు తెలియడానికి ఆలస్యం జరగలేదు, ఎందుకంటే క్షణంలో రామన్న చేతులు తనను బిగించాయి. అతనిముఖం తనముఖాన్ని చుంబించింది. ఇంతవరకు ఊపిరి బిగి చిన తనకు ఇప్పుడు ఊపిరి నిలపడానికి నిజానికి కారణం లభించినా కుముదకు ప్రాణం లేచివచ్చినట్లయింది.

## 5

వ్రాసినట్లు లేదు, పడుకున్నట్లు లేదు; ఇంతెందుకు? వాటి రెండిటిగురించీ ఆలోచించేందుకే లేదు. ఎప్పుడో - ఎప్పుడో—అదంతా పాత కథ అయిపోయినట్లుంది. నిజంగాచూస్తే, అది కేవలం మూడుసంవత్సరాల మునుపటి అనుభవం. అప్పుడు రాయడమంటే కేవలం లోపలిస్ఫూర్తికి సంబంధించిన విషయమొక్కటే కాదు. ఒక కొత్త అలవాటు అయినట్లు వుండేది. ఎన్నోసార్లు, పత్రికలకు రచనలు పంపేటప్పుడు (ఎందుకంటే దానికీ లోపలిస్ఫూర్తికీ సంబంధమేలేదు) అలాంటివాటిని రాయడానికికూడా అతనికి వుత్సాహం వుండేది. ఎందుకో మళ్ళీ చెప్పాలా? రాసి

-రాపి దేహం- మెదడు శూన్యమై విపరీతమైన బడలిక కలిగినప్పుడు సరళ పక్కన పడుకోవాలనే ఆశ పుట్టేది. మిఠాయికోసం పిల్లలు ఏపనైనా చేసేట్లు. ఈ ఆశ కోసం అతను కావలసినది వ్రాయవచ్చు అనుకునేవాడు. రాసేదాన్ని పూర్తిచేసి. కుర్చీనుంచిలేచి రాత్రి, అలసట రెండూ ఎక్కువైనందువల్ల కొంచెం తత్తర పాటుతో, ఒక్కసారిగా రచనకు సంబంధించినవిషయాలలో మునిగినందుకు శూన్య మనస్కునిలా మూగవాడై, ఒకచేతిని పరుపుమీద ఆనించాలనుకున్నప్పుడు (పాపం! సరళ యెప్పుడో నిద్రపోయి వుండాలికదా?)

'రాతలు పూర్తయ్యాయా?'—అని సగంనిద్రలో మధురస్వరంతో సరళ అడుగుతుంది. అప్పుడు అతని ఆయాసమంతా మాయమయినట్లవుతుంది. ముంచు కొస్తున్ననిద్ర జారిపోయినంత సుఖమనిపిస్తుంది.

'రాతలు పూర్తయాయా?' తనకు చోటు ఇవ్వడానికి పడుకున్నట్లే కొంచెం జరుగుతూ సరళ మరోమారు అడుగుతుంది.

'ఊఁ' అని తను రాగం తీస్తాడు.

'మత్తు బాగా ఎక్కిందేమిటి?'

'ఆఁ?'

'నామాట వినిపించడంలేదా? ఏమిటి ఇంకా ఈ ప్రపంచానికి దిగిరాలేదా?'

'వినిపించింది. పూర్తయింది అనేందుకు ఊఁ అన్నాను కదా?' అని తనూ కాలు జాపుతూ అంటాడు.

'కథ మంచి పట్టులో వుందా? ఏమిటి?'

'కథ కాదు, పత్రికకు వ్యాసం.'

'అబ్బ! అది రాయడానికీ అపరరాత్రిదాకా మత్తు ఎక్కిందా మీకు?'

'అంటే? అదే నిజమైన రచన. తక్షణం డబ్బు దొరికేది.'

'ఆఁ - డబ్బు లెవరికి కావాలి?'

'ఎవరికంటే? నాకు.'

'అబ్బ!-ఈ బుద్ధి ఎప్పట్నుంచి వచ్చింది?'

'నాకంటే - నా పెళ్ళాం బిడ్డలకు. తెలిసిందా?'

'వాళ్లకు కావాలని మీకు ఎవరు చెప్పారు?'

'ఎవరైనా చెప్పాలా? భార్యా బిడ్డలకు సుఖం లేకుంటే మొగుడు యెందుకు కాయాలి? అవునంటావా కాదా?'

'అయ్యో! అలా రాసేది మన చేతుల్లో వుందేదా? దాన్ని దేవుడే రాసి పంపిం చుంటాడు - పుట్టుకతోనే నుదుట!'

'అంటే, ఇప్పుడు నువ్వు సుఖంగా వున్నావను. అఁ?'

'ఎందు కుండకూడదు? రాయడమంటే మీకు సుఖం అనిపిస్తుంది. మీకు సుఖంగావుంటే మాకూ సుఖం.'

'భలే! కాదు - కృష్ణుడు అర్జునుడికి గీతోపదేశం చేసేటప్పుడు రథం కింద దాక్కున్నావా? అఁ? హహ!'

ఈ మాటతో సరళ ఆవులిస్తుంది.

'చాలు. నిద్రవస్తోంది. పడుకోండింక.' అంటూ ఆమె సమాధానం చెప్తున్నంత లోపలనే రామన్న గురక ప్రారంభమవుతుంది. 'అయ్యో! రాత్రంతా నేను మాట్లా డుతూనే వుంటాను - ఈయనకు నిద్ర పట్టేసింది. ఎప్పుడో ఏమిటో! పడుకున్న వాళ్ల నిద్ర చెడిపేది, తనేమో హాయిగా నిద్రపోయేది' అని మర్నాడు సరళ మంద లించి మాట్లాడినప్పుడే రామన్నకు తన సుఖం జ్ఞాపకం వస్తుంది. ఎన్నోసార్లు సరళ అలాగే మాట్లాడినప్పుడు తనూ ఆమెను మరికొంచెం రెట్టించేవాడు. 'నీకూ అలవాటు చేస్తాను' అనేవాడు. అప్పుడు సరళ 'ఎలాంటి అలవాటు' అని అడగ గానే, 'రేపు పిల్లలు పుడితే? ఇప్పటినుంచే నిద్ర పాడుచేసుకో—' ఇలాంటిమాట మామూలుగా పూర్తి అయేదికాదు. సరళ చటుక్కునవచ్చి రోషంతో తన నోటిని చేత్తో గట్టిగా మూసేది. నోటినిమూస్తే యేమవుతుంది? మాటకంటె చేత ముఖ్యం అన్నందుకు తగ్గట్లుగా రామన్న రెండుచేతుల్తో ఆమెను బిగువుగా కౌగలించుకొనే వాడు.

ఒకసారైతే సరళే తన సాహిత్యసమస్యను పరిష్కరించింది. అప్పుడు తనొక నాటకాన్ని రాస్తున్నాడు - ఉహుఁ - నాటకం కాదు - అప్పుడు - ఏమిటి? - అఁ -

'ఆదిమాయ' అనే నవల రాస్తున్నాడు; ముగ్గురు అన్నతమ్ముళ్ళు, పక్కింటి అమ్మాయి; ముగ్గురూ కలిసే పెరుగుతారు; ముందు తన కథ ఆధునిక ద్రౌపది కథ అవుతుంది. సమాజంలో అల్లకల్లోలం పుట్టిస్తుంది. అని కొంచెం అధైర్యం కొంత అభిమానంతో సరళకు కథ చెప్పాడు.

'అన్నట్లు, రాయడం మొదలుపెట్టండి, చూద్దాం' అన్నది.

'కాదు, చూసేదేమిటి? నా జీవితం భీమా చేసే నవల అచ్చు వెయ్యాల్సొంటుంది' అని తను హాస్యమాడాడు.

'అలాంటి దేముంది దానిలో?'

'అలాంటి దేముందంటావా? పుట్టిన బిడ్డలు ఎవరికి వారసులు?'

'ఆఁ?....అబ్బ! కట్టిపెట్టండి! మీరేం కథ రాస్తారా క్లబ్బులోలా ఖబుర్లు చెప్తారా?' అన్నది.

అక్కడికి ఆ ప్రసంగం నిలిచిపోయింది. నవలారచన ప్రారంభమయింది. రామన్న తన మనసులోవున్న మొదటివూహ ప్రకారంగానే కథను అల్లాడు. అయితే చివర కొచ్చేసరికి అతనికి సమాధానం దొరకలేదు. ముగ్గురిమీదా ప్రేమ వున్న అమ్మాయిగతి మన-సమాజంలో యేమవుతుంది? ఒకవేళ చివరికి ఆత్మ హత్య చేసుకుంటే, ద్రౌపది సంకేతం వ్యర్థమవుతుంది. ఆత్మహత్య చేయించ కుండా జీవింపజేస్తే ఆమెకు సమాజంలో గౌరవనీయస్థానం దొరకదు. ఇలా కథను ఎలా ముగించాలి అనేదే రామన్నకు తెలియలేదు. చివరిపుటల్ని రచించను ప్రయ త్నించాడు, ఎలాంటి ఆలోచనా తట్టలేదు. మూడు నాలుగు గంటలవరకూ తల పగలగొట్టుకొని రాత్రి సుమారు రెండుగంటలకు ఉపాయం తట్టక, నిర్విణ్ణుడై పడు కోవడానికి వుపక్రమించాడు.

'రాయడం పూర్తయిందా?'

ఎప్పుడూ ఓదార్పు కలిగించే సరళ మాటలవల్ల ఆనాడు రామన్నకు కోపం వచ్చింది.

'ఆఁ - ముగుస్తుంది! అదేమిటి వంట అనుకున్నావా, ఇంతసేపూ కుదించిన తర్వాత అయింది అనడానికి?'

'అబ్బో! నాకేం తెలుసు? చివరమాత్రం అలాగే మిగిలిపోయింది, ముగిస్తాను అన్నారు, అందుకని అడిగాను' అన్నది సరళ.

'చివరమాత్రం అంటే యేవిటి? అస లుండేదంతా అక్కడే వుంది. అందుకే చాలా ఆలోచించి రాయాలి....ఉఁ....చాలా పొద్దుపోయింది, పడుకుందా మింక.'

సరళ ఆవులించి మాట్లాడింది. 'నాకు నిద్ర ముంచుకొస్తోంది కళ్ళమీదికి, అయినా చివరికి మీ కథలో అమ్మాయి ఏం చేస్తుంది అని కుతూహలం కలిగింది. ముగించివచ్చారని అనుకున్నాను, అడిగాను.'

రామన్న వోర్చుకోలేకపోయాడు. 'అంతగా అడిగితేనే తప్ప నీకు నిద్రపట్టదూ? విను అలాగయితే. చివరికి విషం తీసుకొని చస్తుందామె' అన్నాడు.

'ఆఁ? అయ్యో! ఊరికే వొక మంచిబతుకు పాడై పోయిందే!'

రామన్నకు ఆశ్చర్యం వేసింది. సరళ కంఠం, ఆమెకళ్ళు నీళ్లపర్యంతం అయాయని స్పష్టం చేసింది.

'కథలో అమ్మాయి వుంటేనేం? పోతేనేం?' అని మాట ముగించే నవ్వుతో అన్నాడు.

'కథలోని అమ్మాయి అయితే ఏమి? వూరికే యెందుకు చావాలి? ఒక రోగం లేదు, రొప్పు లేదు.'

రామన్న ఆవులించాడు, కొంత విసుగుధ్వనితోనే చెప్పాడు, 'పాపం చేసింది, అందుకే చనిపోయింది.'

'పాపం చేసిందా? నాకేం తెలుసు? మీరు నాకు కథ చెప్పేటప్పుడు ఆమె పాపం చేయడంగూర్చి చెప్పలేదు.'

రామన్నకు నిద్ర మాయమయింది. లేచి కూర్చున్నాడు, కొంత కోపంతోనే అన్నాడు. 'ముగ్గుర్ని ప్రేమిస్తే పాపం కాదూ?'

'ఏమన్నారు? ప్రేమకోసమే పుట్టిన పిల్ల ప్రేమిస్తే పాపమా?'

'అంటే ఏమిటి? ఒక్కడితో అయితే వివాహం, ఒకటికంటె యెక్కువయితే వ్యభిచారం కాదూ? వ్యభిచారం పాపం కాదూ?' భార్య మూర్ఖత్వానికి రామన్న తిరస్కారపూర్వకంగా నిట్టూర్చాడు.

'అంటే యేమిటి? వ్యభిచారం చెయ్యకుంటే ప్రేమించడం చేతకాదు అంటారా?'

'నీకేం తెలుస్తుంది వదిలెయ్ అదంతా!,

'మగవాడికి ప్రేమా వొకటే, వ్యభిచారమూ ఒకటే అనిపిస్తుంటే నాలాంటి ఆడదానికి అది యెలా తెలుస్తుంది?' అన్నది.

రామన్నకు కోపమూ వచ్చింది, నిద్రా వచ్చింది. పెద్ద ఆవులింతలూ తన సహాయనిరాకరణను స్పష్టంచేసి మాట్లాడకుండా పడుకున్నాడు.

అయితే ఆ రాత్రి నిద్ర రాలేదు; ప్రేమ వేరు, వ్యభిచారం వేరు అనే మాటలో గొప్పతత్త్వం ఇమిడివున్నదని అనిపించసాగింది. తన కథకు ఆ తత్త్వాన్ని అన్వయించి చూడాలనే ఆలోచన మెరిసింది. పొద్దుటివరకూ ఆలోచనామగ్నుడయ్యాడు. లేవగానే టీ తాగి, సరళతో మాట్లాడకుండా గదిలో కూర్చుని, రాయడం ప్రారంభించాడు; క్రమేణ పూర్తిగా కథనే మార్చేశాడు. అయితే ఎనిమిదిరోజులవరకు సరళతో యెక్కువగా మాట్లాడనూ లేదు. ఆమె మనసు కొంచెం నొచ్చుకొన్నట్లనిపించింది. చివరకు మారిన నవల ముగిసింది. పూర్తికాగానే సరళదగ్గరికి వచ్చాడు.

'ఆ నవల ముగిసింది చూడు, సరళా' అన్నాడు.

ఆమె మాట్లాడలేదు.

'ఎలా ముగుస్తుందో చూడాలని ఆత్రంగా వుంది అన్నావు అని అది పూర్తికాగానే చెప్పనువస్తే—' తప్పులేకుండానే దండించబడిన పిల్లవాడికంఠంలా అతని కంఠం వణికింది.

'నేనేం చేసేది? కాలేజిమెట్లు యెక్కలేని ఆడదాన్ని నేను. అలాంటి పెద్ద పుస్తకాల్ని నేనేం పరీక్ష చెయ్యగలను?'

'అంటే! నేనేం నవల పూర్తిగా నీకు చదివి వినిపించడానికి వచ్చాననుకుంటున్నావా యేం?'

'లేకుంటే నాకెందుకు చెప్పడానికి వచ్చారు?'

'నవల పూర్తి అయింది. అది నీకు తెలీనే తెలీదు—' వక్రమైన నవ్వుతో, 'నేనూ దాన్ని నీకు చదివి వినిపించనే వినిపించను. తొలిపలుకు రాశాను, అది విను అన్నా.'

'తొలిపలుకు? నాకేమి సంబంధం?'

'దాన్నే విను అన్నా' అని చదవడానికి ప్రారంభించాడు. ప్రాస్తావికంగా చెప్పే మాటలన్నీ అయ్యాక తొలిపలుకు చివర ఇలా వ్రాశాడు. 'ఈ కథ ఇప్పుడు ప్రచురితమైన రూపానికి చెందిన కీర్తి అంతా మరొకరిది. మొదట నేను మరో విధంగా వ్రాయాలని అనుకొని అసమర్థుడనైనపుడు ఆ వ్యక్తి నాకు ఈవిధంగా మార్చి రాయమని ప్రేరేపించారు. అలా వ్రాశాను. నాకేమో తృప్తిగా వుంది. అందువల్ల చివరిమాటగా వారికి - అంటే నా సుఖదుఃఖాలలో పాలు పంచుకునేదైన, నా కుందు కొరతలను సహనంతో సరిచేసి నన్ను సన్మార్గగామిగా చేయడానికి చేపట్టిందేమో అనగలిగిన నా సహధర్మచారిణి అయిన___'

కృతజ్ఞతను తెలిపే చదవడానికే సరళ అవకాశమే యివ్వలేదు. 'ఏదీ ఇలా తేండి దాన్ని. ఇదేం పిచ్చి మీకు!' అని కాయితాల్ని లాక్కోవడానికి ప్రయత్నించేసరికి అదే చేతిని పట్టుకున్న రామన్న ఆమెను లాగి కౌగిట చేర్చుకొన్నాడు.

వెనకటి యీ జ్ఞాపకాలన్నీ ఒకదాన్నొకటి తోసుకుంటూ వస్తున్నాయి. ఎందుకో? రామన్న సరళ చిత్రాన్ని చూస్తున్నాడు. ఆమెనుంచి జవాబు వస్తుందేమో అన్నట్లుగా. ఉన్నట్లుండి ఏదో మెరిసినట్లయి చిరునవ్వుతో అతనిముఖం విప్పారింది. చిత్రాన్ని చూడగానే దానికి మూలమైన ఛాయాచిత్రం జ్ఞాపకం వస్తూంది. ఫోటో తీయించాలంటే సరళకు ప్రాణసంకటం. ఎప్పుడూ నవ్వుముఖంతో వున్నా కెమేరా యెదుట నిలిచిందంటే బెదరినట్లుగా అయిపోయేది. ఆ బెదరు కనిపించకూడదని మొండిగా ముఖంలో గంభీరతను తెచ్చుకోవాలని ప్రయత్నించేది. సహజంగా అలముకున్న బెదరు - ప్రయత్నంవల్లకూడా సాధ్యంకాని కృత్రిమధైర్యం - ఈ రెంటి కలయికవల్ల ముఖంలో కళ రూపొందేది. దాన్నే చిత్రంలో చూసినప్పుడు ఇప్పుడూ రామన్నకు నవ్వు ఆగేదికాదు, నవ్వు వచ్చింది.

ఈ భావమేలనంవల్ల సరళ ముగ్ధంగా అమాయకంగా కనిపించసాగింది. అయినా సరళ ముఖంలోని నిజమైనకాంతి రామన్నస్మృతిలో లేకపోలేదు. ఆ కాంతివల్ల ఆమె - సర్వాంగసుందరి కాకపోయినా - చూడ ముచ్చటగా కనిపించేది. మాట్లాడేటప్పుడు ఆమెకి పెదవుల్ని కొంచెం ముందుకుచాచే అలవాటు

వుండేది. 'ఎప్పుడూ పొయ్యిముందు కూర్చొని వూదివూది నీ పెదవులకు అదే ఆకారం శాశ్వతంగా వచ్చేసిందేమో!' అని చాలాసార్లు రామన్న హేళన చేశాడు. నవ్వులాటకి అలా అన్నా, ఆమె ఆ తీరుమాత్రం - మాట్లాడేటప్పుడు మరీను - ఎక్కువ మధురంగా వుండేది. రాత్రి పడుకుని మాట్లాడేటప్పుడు - వెలుగు లేకున్నా - అదేదృశ్యం రామన్న ఎదుట నిలిచేది.

రామన్న నిట్టూర్పు విడిచాడు. ఎన్నిటినని జ్ఞాపకం తెచ్చుకోవడం? కాదు - తను తెచ్చుకోలేదు. వాటంతట అవే వస్తున్నాయి. ఏమాటకైనా ఆమె తలపు తప్పడంలేదు. ఆమె మాట, కోపం, ముఖకవళికలు, నవ్వు - అన్నీ ఒక్కొక్కటీ తలపుకు వస్తున్నాయి. ఆరు సంవత్సరాల సరస దాంపత్యజీవితాన్ని ఆమెతో గడిపినా ఒక్కసారికూడా ఆవిధంగా సరళ జ్ఞప్తికి రాలేదే? అయినా, ఆమె జ్ఞాపకాల వల్ల తనకు నెమ్మదే కలుగుతోంది. అదే తనకు కుముదను గురించిన ఆలోచన వస్తే వేరే సందర్భపు ఆలోచనే లేదు. సరళ తనకు ప్రేరణను కలిగించే స్త్రీ అయితే, కుముద తనకు శారీరిక సుఖమిచ్చే స్త్రీ అవుతుందా? ఛీ: ఇదెలాంటి ఆలోచన? ఇదంతా నిజం కాకుంటే—'నిజంకాకుంటే' అవి వొట్టిమాటలు అనేది రామన్నకు చటుక్కున తట్టింది. మూడు సంవత్సరాలనుంచి అస్తిత్వం కలిగివున్నమాట నిజంకాదు అనడం పిచ్చిమాత్రమే. ఆ మాట నిజం. అలా అయితే సరళవిషయంలో తను చేస్తున్నది ద్రోహమా? సరళను తను ప్రేమించలేదా? ఆమె చిత్రాన్ని చూచాడు. 'ప్రేమ వేరు, శారీరికసౌఖ్యం వేరు' అన్నట్లనిపించింది సరళ. అవును, ఆమె పెదిమలుకూడా ముందుకే కదలి నట్లు అనిపించింది. 'సరళా, నా కథలసమస్యను తొలగించాలని ఈ ఓదార్పు మాటను చెపుతున్నావా?' అని గోడమీదున్న చిత్రాన్ని అడిగి సమాధానాన్ని ఆపే క్షిస్తున్నట్లుగా చూస్తూ కూర్చున్నాడు.

# 6

నిజం చెప్పాలంటే ఈ రాత్రి సినిమాకు పోవాలని కుముద మనసులో వుంది. రెండురోజులనుంచి ఇలాంటిసందర్భం వస్తుందని యెదురుచూస్తూ కూర్చున్నది.

రెండురోజులముందే ఆ ఆశ వుంది, నోరువిడిచి రామన్నను అడగనూ అడిగింది. అయితే అతను 'పో' అనేందుకు బదులుగా 'చూద్దాం' అన్నాడు. మనస్సు కొంచెం బాధ పడింది. అయినా సరళక్క పోయి ఇంకా మూడునెలలూ కానిదే, రామన్నకు కూడా మొగమాటంగా వుండవచ్చు అనుకొని బలవంతపెట్టలేదు. ఈ సాయంత్రం త్వరగా వంట, భోజనం పూర్తిచేయడంకూడా అందుకే. అయితే రామన్న నోటి నుంచిమాత్రం అలాంటి సూచనే రాలేదు. మళ్ళీ తనే అడగాల్నా? రోజూ ఇలా నోరువిడిచి అడగడం బాగుంటుందా? అయితే మనస్సు సమాధానం చెందదు, తిప్పి తిప్పి డొంకతిరుగుడుగా ఏమేమో అన్నది. రామన్న లక్ష్యపెట్టనట్లు నటించాడు. చివరకు విసుగుతో నిట్టూర్చింది. అప్పుడుమాత్రం రామన్న 'సినిమాకు పోదామా?' అన్నాడు. అయితే అతను అడిగిన విధం; అతని మాటలతీరు, ముఖ కవళికలు, విసుగుతోకూడిన నిట్టూర్పు - ఇవన్నీచూసి తనకు అసహ్యం వేసింది. తనూ ఉత్సాహం చూపించకుండా, నిరాశకు అవకాశమూ ఇవ్వకుండా 'ఉః' అని నిట్టూర్చింది.

అప్పుడు 'అలాగయితే బయలుదేరు' అనిమాత్రం రామన్న చెప్పివుంటే తను అంతటినీ సహించి యెగిరి గంతేసేది. అయితే యేమయింది?'

'సినిమాకు - కాదు - అంటే యెక్కడికైనా అలా బయటికి వెళ్దామా?' అన్నాడు! వూరికే తనబాధ పడలేక రామన్న ఇల్లువదిలి బయలుదేరడానికి సిద్ధమైనాడు అనేది అప్పుడు తనకు స్పష్టమయింది. ఆతర్వాత తనకూ కోపం - నిరాశ - అవమానం అన్నీ కలిగాయి. కొంత తిరస్కారమూ అనిపించింది. ఇదంతా పైకి అనేస్తుందేమోనని బెదరి ఈసారి సమాధానమే యివ్వలేదు. తర్వాత యేమేమో మాట్లాడాడు రామన్న. అయితే ఆ మాటలపట్ల తనకు శ్రద్ధ లేదు. చివరికి వోర్చుకోలేక తన ముఖావాన్ని సూచించనే సూచించింది! అతనికైనా తెలియనీ, ఏ ఆటయినా యిద్దరూ ఆడవచ్చుని - అనుకున్నది. చివరికి రామన్న కూడా రానేనెపంతో జారుకున్నాడు. కుముద ఒకనిమిషం, మనస్సు గటి చేసుకోవడానికి అన్నట్లుగా, కళ్ళు మూసుకొంది. ఇంతవరకు రామన్న సాన్నిధ్యం - సహవాసాలతోనే జాగృతయైన కుముదకు - మనస్సులో ఎలాంటి ఆలోచనవున్నా - యెదురుగా రామన్న చుట్టుపక్కల కనిపించకపోతే, ఎండముఖం చూడని లత

లాగా వాడిపోయేది ఆమె హృదయం. ఆ అనుభవంకోసమే కుముద తహతహ లాడింది. రామన్న గదికి వెళ్ళినక్షణం, అతని సాక్షాత్ సాన్నిధ్యం కనుమరు గవు తుం దనిపించిన ఆ క్షణం, కలవరపడిన ఆమెహృదయం అతని వెనుకనే పరు గెత్తింది; పరుగెత్తి అతనికాళ్లను పట్టుకొని అతను అక్కడ్నుంచి వెళ్లకుండా చెయ్యాలి. అవసరమైతే తన తప్పును (తను యేం తప్పు చేసింది గనుక ?-అయినా) ఒప్పుకోవాలి. అతన్ని యెలాగైనా వొప్పించి, లాలించి సినిమాకు పోవాలి. అక్కడ చీకట్లోనూ కళ్ళు మూసుకొని అతనిస్పర్శసుఖం అనుభవిస్తూ నిద్రించాలి అనిపించింది. అయితే వొక్కక్షణంమాత్రం. మరో నిముషంలో ఆ హృదయాన్ని వెనక్కు మళ్ళించింది, బుద్ధి తిరగబడింది. ఇలాచేస్తే ఆత్మద్రోహ మవుతుందని మనసు వాదించింది. పాపం! సుఖదుఃఖాల పోరాటంలో చిక్కి వడలిపోయిన హృదయం బుద్ధి యెదుట నిర్వీణమయింది. 'ఇలాంటి సినిమా యెవరికి కావాలి?' అనుకున్నది కుముద.

ఇదంతా గంట-అరగంట ముందటి పెనగులాట. ఇప్పుడుమాత్రం కుముద హృదయం-బుద్ధి మళ్ళీ సామరస్యం పొందాయి. అందువల్లనే శాంతచిత్తంతో యిప్పుడు ఆమె ఆలోచించగలుగుతోంది. మనిషి అంతర్జగత్తు ఎలాంటిది అనే జ్ఞానం ఆమెకు వుండేదికాదు. అయితే ఆ ప్రపంచంలోని ఒక్కొక్క అనుభవాన్ని మాత్రం అంతవరకు ఆమె తెలుసుకోగలిగింది. ఒక్కొక్కమారు పరస్పరం విరుద్ధ అనుభవాలనుచూసి ఆశ్చర్యపడేది. ఈ రోజు తన ఆలోచనలు, తను నడత తలచుకొంటే కుముదకు ఆశ్చర్యకరమనిపించింది. 'సినిమాకు పోదామా' అనే రామన్నమాటకు ఒకానొకకాలంలో యెలాంటి అర్థముండేది? అర్థమే వుండేది కాదు అనవచ్చు. ఏ శబ్దమైనాసరే, రామన్న నోటినుంచి వచ్చిందంటే చాలు, తను మైమరచేది. మాటలేమిటి, వాటివెనక వుద్దేశమేమిటి, వాటిని పలికించిన ధ్వని ఎలాంటిది, ఆ ధ్వనితోకూడిన ముఖభంగిమ యెలాంటిది - ఇలాంటి ఆలోచనలు దూరంగా వుండేవి. తను పూర్తిగా వినేదికాదు. ఆ కాలంలో సినిమాకు పద అంటే యెంత ఉత్సాహంతో నడిచేదో అదే వుత్సాహంతో 'ప్రాణాన్ని యివ్వు' అన్నప్పుడూ చావను సిద్ధమయ్యేది. కాలం దృష్టిలోచూస్తే రెండో మూడో సంవత్సరాలయ్యాయి; అయితే మనఃస్థితి దృష్టితోచూస్తే అదేమిటో వేల ఏళ్ళ ముందు మాట అనిపిస్తుంది.

వేల ఏళ్ళముందు కాదు గాని, వేల దినాలముందుమాట కాదు. ఇంకా మూడేళ్ళు కూడా పూర్తికాలేదు, అంటే ఇంకా వెయ్యిరోజులుకూడా కాలేదు - తనకు బాగా జ్ఞాపకం వుంది. ఒకరాత్రి పడుకునేముందు తను రామన్నగదికి వెళ్ళడం, బీరువా ఎదుట నిలచి పుస్తకాలను వెతుకుతుండడం, అప్పుడు - ఎలాగో ఏమిటో - రామన్న తనను బలంగా కౌగలించి ముద్దిడినతర్వాత మెలకువ వచ్చినట్లయి, ఒళ్ళంతా చెమటలుపోసి, సిగ్గుతో ముడుచుకుపోయి ఆ గదినుంచి పరుగెత్తిపోయింది. అవును - ఆదేరాత్రి గదికిరాగానే భయమూ సుఖమూ - రెండుభావాల పోటీలో చిక్కుకున్నది. ఆమెకు ఆ మాట తెలిసిందో లేదో-అయితే పట్టుకొని ముద్దుపెట్టుకున్న క్షణం తలచుకొన్నప్పుడు ఒకవిధమైన భయంతో ఆమెశరీరం కంపించేది, తలపుల్ని నెమరువేసుకునేటప్పుడు ముఖం సుఖోల్లాసంతో వికసించేది. పరుగునవచ్చి పడక మీద కూర్చున్నది అలాగే వుండిపోయింది. దీపాన్నీ ఆర్పలేదు; భయం, రామన్న వస్తే ఎలాగ-అని. దానికితోడు మరోభయం. దీపం లేకుండడంచూసి తను పడుకొని వుంటవచ్చునని రామన్న రాకపోతే - అని, వస్తే ఎలా - అని భయం; కొంత సేపటితర్వాత అతను వచ్చేసూచనే లేదని నిరాశ. మెల్లిగా అడుగులో అడుగేసు కుంటూ తలుపువరకు నడిచింది. దాన్ని తెరిచి లోపల ప్రవేశించేధైర్యంమాత్రం చాలలేదు. మళ్లీ పడకవరకు నడిచింది. నడుస్తున్నప్పుడు ఒక్కసారి వెనుతిరిగి చూసింది. తలుపు తెరిచినశబ్దమయిందికదా? అనిపించింది. మనస్సు శరీరం రెండూ వూయెలలా వూగుతూ అలసటై పడుకున్నదే తెలియలేదు. పొద్దున్నే మెలకువ వచ్చినప్పుడుమాత్రం ఒక్కసారి భయపడి చుట్టూ చూసింది. అన్నీ వున్నట్లే వున్నాయి. రామన్నను కలిసేచిహ్నాలు కనిపించలేదు.

రామన్నతో కలయిక, ఆ విషయమై ఆలోచన, దానికితగిన అనుభవం-వీటిలో ఒక్కదాన్నిగురించీ నిశ్చితకల్పన లేనందువల్ల కుముదకు మరుసటిరోజురాత్రి అను భవపుస్మృతి ఎంతోసేపు పీడించలేదు. అయితే ఒక్కసంగతిమాత్రం ఇప్పుడూ ఆమెకళ్ళకు కట్టినట్లుంది. ఆ రోజు పొద్దున్నుంచి సాయంత్రంవరకూ ఇంటి పనుల్లో తను చూపించిన వుత్సాహాన్నిగాని, పడినశ్రమనుగాని యింతకుముం దెప్పుడూ కనిపించలేదు, దానికితోడు కష్టించేకొద్దీ ఉల్లాసమే యెక్కువవుతున్నదే గాని ఆయాసం కలుగలేదు. సరళక్క మంచం పట్టినప్పటినుంచి వంటయింటి

బాధ్యత పూర్తి కుముదదే అయింది. మిగిలిన పనులకు పని ఆమె, వూడ్చే ఆమె ఇద్దరూ వుండేవారు. అయితే ఆ రోజు వంట - భోజనాలపని చేయడమేకాక కుముద ఇంకా ఎన్నో చేయవలసినపనుల్ని అడిగి కనుక్కున్నది.

'ఎందుక్కుముదా? వూరికే ఇక్కడ నాదగ్గర కూర్చొని విశ్రాంతి తీసుకో కూడదూ?' అన్నది సరళక్క.

'ఎవరైనాచూస్తే యేమంటారు?' అన్నది తను.

'చూసేవాళ్ళు ఎవరు? ఎందుకంటారు?' అని సరళక్క కుముద యెందుకంటు న్నదో అర్థంకాక అడిగింది.

'చూసేవాళ్లు ఎవరంటావా? పెళ్ళాం మంచం పట్టినప్పట్నుంచి, ఒక్క గదీ బాగులేదు, వొక్కగుడ్డా శుభ్రంగా లేదు - అనంటే యెట్లా తల్లీ?' అని పరిహాస మాడుతున్నట్లు అన్నది.

'చాలు వూరుకో. నిన్ను పనిచెయ్యమని తెచ్చేరేమిటి ఈ యింటికి?'

'అయ్యో, ఇదేం మాటక్కా. పనిచెయ్యడానికి పిలుచుకొచ్చారని అనరు. నువ్వు తిరిగేటప్పుడు ఇల్లు ఎలా వుంటుండేది నేను చూడలేదూ? నన్ను ఇక్కడికి పిలుచుకొచ్చి, పెంచి పెద్దచేసి, చెల్లెలికి ఏ పనీ నేర్పించలేదని అందరూ నిన్నే అనవచ్చు. ఇల్లు ఇలా పాడుగావుంటే అనకుండా వుంటారా?' - ఇంతవరకు ఏమీ ఆలోచించకపోయినా - కుముద అన్నది.

సరళక్కకు ఎంత సంతోషం కలిగిందప్పుడు! ఆపుకొనేశక్తి లేనందువల్ల కళ్ళనిండా నీళ్లు నిలిచి మాటరాక ఆమెగొంతు బొంగురుపోయింది. చేసంజ్ఞతోనే పరుపుదగ్గరికి రమ్మని పిలిచింది. అప్పుడు తను అక్కడికివెళ్ళి కూర్చొనివుంటే తనకూ ఏడుపు ఆగేదికాదు. అందువల్ల 'వస్తా, ఇంకొంచెం పని మిగిలివుంది. తర్వాత సాయంత్రంవరకు నీదగ్గరే కూర్చుంటా మాట్లాడుతూ' అని మళ్లీ పనిలో మునిగిపోయింది.

ఆ రోజు గదులన్నిట్లో సామానులన్నీతీసి, దుమ్ముదులిపి, వరుసగా పెట్టింది. ముఖ్యంగా రామన్నగదిలోవుండే పుస్తకాలనూ గుడ్డలనూ బాగా సవరించింది. వంటింట్లోవుండే పాత్రలనూ సమంగా వుంచింది. దీపాలమూతల్ని బాగా

తోమింది. మంచాలమీదుండే పరుపుల్నితీసి, మంచాలను తుడిచి, పైన పరుపు మడతలులేకుండా బాగా పరిచింది. ఒకపని పూర్తికాగానే, మరోపనిలో దిగడం, పనిలేకుండా కూర్చుంటే యేమవుతుందో అని బెదరినట్లుగా ఒక్కొక్కసారి చేసింది. బాగులేక, బాగులేదు అని అనుమానంవస్తే మళ్ళీ మొదటినుంచీ చేయడం - ఇలా అలా సాయంత్రంవరకు పనిచేసి చేసి అలసిపోకుండా, శక్తి రెట్టింపయినట్లు అనుభవం పొందింది. చివరికి అంతా ముగించుకొని సరళక్కదగ్గరికి వచ్చేసరికి, ఆమె తన పొంటిని- చేతుల్ని పట్టుకుని చూసింది.

'ఎందుకక్కా? నా బతుక్కి వొక్కరోజు పని చేసినందుకు చేతులు విరిగిపోయాయని భయపడ్డావా యేం?' అని నవ్వుతూ అడిగింది.

సరళ తక్షణమే సమాధానం యివ్వలేదు. చేతితో తన్ను ముట్టుకున్నా మనస్సు మరెక్కడో వున్నట్టుండింది. చివరి కొక్కమారు నిట్టూర్చింది. కుముదకు భయం వేసింది. అక్కమనస్సులో యెలాంటి ఆలోచన వుండివుండాలి? తన మనస్సులోని ఆలోచనకే సమాధానాన్ని యిస్తున్నట్లుగా సరళక్క, 'నాకంటే బాగా చూసుకుంటావు కుముదా యింటిని' అన్నది.

'పో అక్కా! ఏదో వొకటి మాట్లాడొద్దు!'

'ఏదో వొకటి యెందుకు? వొక్కరోజైనా ఇంతగా తిరిగినట్లు నాకుమాత్రం జ్ఞాపకం లేదమ్మా!'

'రోజూ ఇంటిని బాగా వుంచుకునేవాళ్ళకి ఇలాంటి తిరుగులాట అవసరమే లేదు. మాలాంటివాళ్లు చూడు, అమావాస్యకో పున్నమికో ఇల్లు అంతా బాగు చేయాలని తిరగడం' అన్నది కుముద.

'సరే, నీకైనా యీ యింటిపని అలవాటు అవుతుంది. కానీ.'

'ఒక్కరోజు నాలుగుసామాన్లు అక్కడ్నుంచి యిక్కడపెట్టిన సంబడానికి యెంత పెద్దచేసి చెపుతావక్కా?'

'అందుకే చెప్పానుకదా, మంచిదే అయిందని? ఇంకేం నేను బాగా లేచి తిరగడం అంతంతమాత్రంగానే వుంది, ఇల్లు చూసుకునేది—'

కుముద ఒక్కసారిగా సరళక్క నోటినిమూసి 'అది అలా వుండనీ! ఏదో వొక చెడ్డమాట చెప్పొద్దు, అక్కా.'

'నోట్లోనుంచి రాకపోతేమాత్రం కాకుండా వుంటుందా, కుముదా? నాది వృత్తి రోగం కాదు.'

'నువ్వు యిలా మాట్లాడితే నేను లేచి వెళ్ళిపోతాను అంతే, అక్కా' అని తను కోపంగా అన్నది.

'కోప్పడవద్దు, తల్లీ, కోప్పడవద్దు. నువ్వు విడిచి వెళ్ళిపోతే యీ యింటిని చూసుకునే వాళ్లెవరు - నేను పోయినతర్వాత' అంటూ సరళక్క ఒక్కసారిగా ఆయాసంతో ముఖాన్ని కప్పుకొంది.

ఈ మాటల్తో కుముదకు కొంచెం కలవరమయ్యింది. ఆయాసంతో ముఖం కప్పుకున్న సరళక్క ఎంతోసేపు తనతో మాట్లాడలేదు. అందువల్ల కుముదకు కొంచెం భయమూ వేసింది. ఇంతవరకు యింటిని వరుసగా సర్దుతున్నందుకు కలిగిన వుత్సాహం తగ్గినట్లయ్యింది. సరళక్క యెందు కిలా మాట్లాడివుండాలి? తను చేసింది ఆమెకు నచ్చిపోలేదా? లేక——? కుముద భయపడింది. ఇంతవరకు తనూ ఆలోచించలేదు. ఇప్పుడు, రాత్రి సమీపిస్తున్నకొద్దీ, రామన్న బయటినుంచి వచ్చేవేళ సమీపించేకొద్దీ, వద్దని పట్టిలాగినా కంఠం చాచి, చాచి అందుకోవడానికి ప్రయత్నిస్తుందో అన్నట్లు తన ఎద ఎగురుతుంటే, ఏదో వొక ఆకాంక్ష ఆకలిలా లోన పీడిస్తుంటే - అప్పుడు కుముదకు అనుమానం కలిగింది, భయం వేసింది, వెనకటిరాత్రి తలపు ఒత్తిపట్టిన రబ్బరుబంతి పట్టుసడలి యెగిరిపడేట్లుగా లేచి నిల్చుంది. ఇదేమిటి? రోజంతా తను పనిచేసింది. నిన్నరాత్రి అనుభవంవల్ల ప్రేరితురాలైనందువల్లా? తను పనిచేయాలి. దాన్నిచూసి రామన్న మెచ్చుకోవాలి. అనేదానికా? లేకుంటే అతని రాకకోసం నిరీక్షణ ఎందుకు? క్రమేణ సమీపిస్తున్న వ్యక్తి అడుగుల్లా తనగుండె గుబగుబలాడే సద్దు ఎక్కువెక్కువగా స్పష్టంగా వినిపిస్తున్నది. తనమాట అలావుండనీ, సరళక్కకు అనుమానం వచ్చివుంటుందా? లేకుంటే చావుమాటను, తన తరువాత ఇల్లు నడిపేవిషయాన్ని ఆమె ఎత్తడమెందుకు? అవును, తన నడతకు ఎటువంటి కారణమైనా వుండనీ, సరళక్కకు మాత్రం అలా సంశయమే కలిగివుండాలి. ముఖం కప్పుకొని పడుకున్నది.

ముసుకునే తొలగించలేదు. తనపంక చూడలేదు. కుముద నిజంగానే భయ పడ్డది. తన ఆలోచన, రామన్నకోసం తన హృదయంలో జరిగిన పోరాటం - ఇదంతా సరి అయినదా తప్పా అనే ప్రశ్న ఆమెకు కలగలేదు. ఆ దృష్టితో గాని, లేక సమాజంలో నైతికజీవనం దృష్టితో ఆలోచించేయోగ్యత ఆమెకు లేదు. ఇంతేకాక; కిందినుంచి ఇల్లు నిప్పులో మండుతుంటే, దూకితే చస్తానా బతుకుతానా అనే తర్కాన్ని పై అంతస్తులో వున్నవాడు ఆలోచించడు. కింద ఇల్లు కాలుతున్నది, దగ్గర కిటికీ వుంది, ఈ రెండిట్నీ చూసినక్షణం ప్రాణి సహజమైన గుణంవల్ల అతను కిందికి దూకనే దూకుతాడు. అన్నిటినీ మించిన ప్రాణతత్త్వశక్తి అది. కుముద తెలుసుకోవడానికి సాధ్యం కాకపోయింది; తెలిసి వున్నా ఆమె ఏమీ చేయను సాధ్యం లేదు. కుముదను పీడిస్తున్నది ఈ తత్త్వ విచారం కాదు; అనాథ అయిన తనను పిలుచుకొచ్చి ప్రతికించి పెంచే సరళక్క తనమీద కోపం తెచ్చుకుంటే ఎలా - అనేవొకటే భయం. ఆ భయంవల్ల ఆమె రామన్న రాకకోసం ఇప్పుడు ఎదురుచూసింది. రామన్న వచ్చినతర్వాత సరళక్క ఒక్కసారిగా అన్నీ చెప్పేస్తే? తనమీద కోపాన్ని వెళ్లబోసుకుంటే? చివరికి - ఆ ప్రసంగాన్ని తప్పించడం తనచేతిలో లేకున్నా దాని - ఎదిరించడమైనా తనకి సాధ్యంకాదు అని మెల్లిగా అక్కడ్నుంచిలేచి తనగదికి వెళ్ళిపోయింది. అయినా రామన్న వచ్చిన చప్పుడు వినగానే ఓర్చుకోలేకపోయింది. ఒకటి రెండు నిముషాలు ఎలాగో ఓపిక పట్టింది; ఏదైనా అలజడి వినిపిస్తుందేమో నని. అయితే దానికి బదులు రామన్న గట్టిగా నవ్వడం వినిపించింది. కుముదకు ఆశ్చర్యం కలిగింది. మాటల్ని విందామనే ఆత్రుత, బయటికి రావాలంటే భయం; ఆపై రామన్న ఎందు కలా నవ్వుతున్నాడన్నదీ తెలియలేదు. చివరకు సరళక్క పేరుతో రామన్న తనను పిలిచినప్పుడు ఆమె గదిలోకి పోవలసి వచ్చింది. వెళ్ళి సరళక్క ఎదురుగా నిలిచే సరికి కాళ్ళు నేలలో చిక్కుకుపోయినట్లుగా మొద్దుబారినట్లయి, కదలకలేక, చివరికి అతి ప్రయత్నంమీద నడవగా భూమిలోకి క్రుంగిపోతున్నట్లే అనిపించింది....

కుముద 'ఉఁ' అని గొంతెత్తి, కళ్ళువిప్పి చూసింది. చేతిలో పుస్తకం, కుర్చీలో కూర్చున్నది. గాఢంగా నిట్టూర్చింది. వెనకటి తలపులు, దాని తాలూకు అనుభవాలు కళ్లకు మసకలు కమ్మాయి! గడియారం చూసుకొన్నది, రాత్రి

తొమ్మిదిన్నర అయింది. అలా ఇలా పడుకునేవేళ సమీపించిందికదా అని నిట్టూర్పు విడిచింది. సినిమాకు వెళ్ళాలనుకున్నది కదూ తను ? సరిపోయింది. వెనకటి జ్ఞాపకాల సినిమాచిత్రాలను చూసినట్లయింది కదా అని విషాదంతో పెదిమలు విరిచి, తన గదివైపు నడిచింది.

# 7

ఊబిలో కాలుపెట్టినట్లయింది రామన్న పరిస్థితి. భార్య చిత్రం ఎదురుగా కూర్చొని వెనకటి జ్ఞాపకాలను అరికట్టడంలో విఫలుడయ్యాడు. ఒక జ్ఞాపకం మరొక జ్ఞాపకంవైపు లాగుతూన్నది. సరళ పోయినప్పటినుంచి తన జీవితంలో యేదో యిక్కట్టు ప్రారంభమైంది అనే వూహామాత్రం అతనికి వుంది. అయితే ఆ యిక్కట్టు ఇదే అని ఇంతవరకు స్పష్టంగా తెలియలేదు. ఇంతవరకు అతను తననోటితో దాన్ని చెప్పనూ లేదు. అయితే విచారభారంతో 'నా జీవితంలో ఇక్కట్టును తొలగించాలని ఈ బుజ్జగింపుమాట చెపుతున్నావా ?' అని సరళ చిత్రాన్ని ఉద్దేశించి చెప్పినతర్వాత ఆ మాటలు సావకాశంగా అతనికి స్ఫురించినతర్వాత క్లోరోఫారంమత్తు వదిలినట్లయింది. కుముద తనకు సమస్య అయిందని యింత వరకు అతనికి కనిపించలేదు; అనేకసంవత్సరాలుగా ఇంట్లోనేవున్న ఆ పిల్ల అతనికి బాగా అలవాటైపోయింది. మొదట ఆమె యింటికివచ్చినప్పుడు చిన్నపిల్లలా కనిపించింది కదూ ? ఆ దృశ్యమే అతని మనస్సులో నాటుకుపోయింది. కొద్దికాలంలోనే స్త్రీ సహజమైనరీతిలో పెరిగినా, సరళ సహవాసం అభ్యాసమైన తను ఆ పెరుగుదలను గమనించలేదు. అప్పుడప్పుడు, ఆమె యింకా చిన్నపిల్ల అన్నట్లే పరిహాస మాడుతుండేవాడు. అంతేకాదు; ఆమెను తను ఎక్కువగా చూసేదీ సరళ సామీప్యంలోనే. ఈ కారణాలవల్ల కుముదనుగూర్చి అతనికి ఎటువంటి కుతూహలమూ కలగలేదు. ఈ పరిస్థితుల్లో, అలాంటి సంఘటన ఆకస్మికంగా జరిగినందుకు అతను చకితుడైనాడు. మనసు అంగీకరించకపోయినా కొంత భయం కలిగింది. ఆ రోజునీ ఆ సంఘటననూ అతను ఎన్నటికీ మరవను సాధ్యం కాలేదు. నిజంగాచూస్తే, ఆ రోజుకీ మిగిలిన రోజులకూ అంత భేదమూ లేదు. కుముద

ఎన్నోసార్లు తనగదికి వచ్చేది, ఎన్నోసార్లు తను రాసుకునేటప్పుడు తనదగ్గరికివచ్చి నిలిచి మాట్లాడేది, పుస్తకం అడిగి తీసుకునేది, పుస్తకం కొంచెం కష్టమైనదయితే ముందే కథ అడిగి విని వెళ్తుందేది. ఎన్నోసార్లు తనే ఆమెకు రామాయణ-మహాభారతాల్లో కథ చెప్పివున్నాడు. ఇదంతా నిజం. అయితే - 'నిజం' అని చెప్పదమైనా యెలాగు? ఒక్కసారిమాత్రం చేతికి చెయ్యితగిలి, తక్షణం చూపు చూపు కలవగానే అదంతా కలలో కథలా మరుగుపడింది. ఆ క్షణంనుంచి కుముద తనకు వేరుగానే కనిపించింది. వయస్సులో, జ్ఞానంలో, అనుభవంలో పెద్దవాడైన తన ముందు కుముద యెలా కనిపించినా చిన్నపిల్లలే - అని సమాధానపరుచుకున్నాడు. అయితే యేమి? ఆరాత్రి ఎప్పటిలాగానే పుస్తకం తీసుకోవడానికి వచ్చినప్పుడు, వీరువాయెదుట తను పశువులా ప్రవర్తించలేదూ? రెండు - మూడు ఏళ్ళతర్వాత, ఇప్పుడు మనస్థితి-వేరై, ఆ అనుభవాన్నిగూర్చి ఆలోచించినా రామన్నకు అది స్పష్టం కాలేదు. ఆ రోజు తను ఆమెను ఒక్కసారిగా లాక్కుని ముద్దు పెట్టుకొన్న దెందుకు? బుద్ధి పరిపక్వమయింది, మనస్సు సుసంస్కృతమై వుంది, అయితే శరీరంమీదమాత్రం మనుష్యుడి ఆధీనం యేనాటికీ సాధ్యం కాదు అనిపించింది రామన్నకు. మనస్సనే మర్కటాన్ని అదుపులో పెట్టలేనుదేవ అన్న హరిదాసులకు ఈ రహస్యమే తెలియదేమో?—మనస్సును అదుపులో పెట్టవచ్చు, బుద్ధివున్న వానికి తెలియచెప్పడం సాధ్యమయ్యేట్లు; అయితే శరీరాన్ని అదుపులో పెట్టడం యెలా? 'జ్ఞానలవ దుర్విదగ్ధం బ్రహ్మాపి నరం నరంజయతి' - అన్నమాట అబద్ధం కాదు. దేహం మూర్ఖునివలె, చెప్పితే తెలుసుకోదు; దేహం పశువువలె, నిసర్గాన్నే అనుసరించి నడుస్తుంది; దేహానికి చెట్లూ-లతలలాగా, పుట్టినప్పటినుంచి పెరగడమనే మొండితన మొక్కటే. ఇలాంటి దేహశక్తి ఆనాడు తనబుద్ధి-మనస్సుల్ని జయించి వుండాలి. పుట్టినప్రాణం మరొకప్రాణాన్ని పుట్టించి తీరాలి. అందుకోసమే తన బీజాలను రాల్చి మొక్క చస్తుంది; పుట్టినదేహం మరొక దేహాన్ని పుట్టించి తీరాలి. దేహం పుట్టుగుణ మది. తనదేహమూ అలాగే నడుచుకొన్నది ఆ రోజు. సరళ మంచం పట్టినప్పటినుంచి తన శారీరకవాంఛ యెక్కువయిందేమో! సరళ దగ్గరికి వెళ్లేది; ఆమె చేతిని తాకేది. ఆమెతో మాట్లాడేది ఇలాంటి సాన్నిహిత్యం - సహవాసాలతో ఆ వాంఛ మరుగై వుండాలేకాని యిలా కావడానికి వీలులేదు. లేకుంటే మొదటిసారిగా ఆహారం కళ్లబడినప్పుడు పాసి గ్రద్దలా

యెగిరి దాన్ని కొట్టేసేవాడు కాదు. ఆ రోజు కుముదను మొదటిసారిగా బిగి కౌగ లిలో తీసుకున్నప్పుడు తన ప్రవర్తన తనకే ఆశ్చర్యం కలిగించింది. గట్టిగా ఆమెను పట్టుకొని, ఆమె నుదురు-పెదవి-కనురెప్పలు-బుగ్గ-గడ్డం-భుజం-ఎద అన్నీ - ఒక్కసారిగా చుంబిస్తూవుంటే తను ఆమెకు రాక్షసునిలా కనిపించి వుండ వచ్చుకదా? అందుకే ఆ పిల్ల భయపడి పరుగెత్తిందేమో అనిపించింది.

కుముద తన బాహువుల చెరనుంచి పరుగెత్తి పోయినతర్వాత రామన్నకు మెలకువ వచ్చినట్లయింది. మొదటిక్షణం తను యేం చేశాడనేజ్ఞానమే లేకపోయింది. శరీరం చెమటపట్టగానే జ్వరం తగ్గినట్లయి మెలకువ వచ్చింది. తను చేసింది తప్పు అనిపించింది. ఒకవైపు మంచంపట్టి తిరగడానికే వీలులేని సరళకు ద్రోహం, మరోవైపు ఆశ్రయం యిచ్చినందుకు బదులు అడిగినట్లుగా కుముదకు అన్యాయం! ఈ ఆలోచనరాగానే తిరస్కారంతోకూడిన నవ్వు వెలిసింది రామన్న ముఖంమీద. మనుష్యుడి సంస్కృతి అంటే యెంత ఆత్మవంచన! సత్యాన్ని గోప్యపరిచేదే బుద్ధి పరితనం అనడానికి యెంత చక్కని వుదాహరణ! 'ద్రోహం-అన్యాయం' మొదలైన శబ్దాలనుమాత్రం తను వుపయోగించాడు. అవి కేవలం నామమాత్రాలు! వూహల్ని పుట్టించే సాధనమాత్రాలు. ఆ మాటలవల్ల తన సుసంస్కృతబుద్ధికి ఓదార్పు కలిగించేదేమో నిజమే. అయితే వాస్తవికసత్యం ఆ కల్పనలో లేదు. వాస్తవిక సత్యం తన శరీరంమీద పుట్టిన రోమాంచాలలో వుంది. తన ఓదార్పు సంకేతాలైన చెమటబిందువుల్లో వుంది. జ్ఞాపకాలతో కొరికే తన పెదవుల్లో వుంది. ఆ నిండు యవ్వనిస్పర్శతో పులకితమైన తన హృదయంలో వుంది. ఆ మెత్తనిభుజాలను బిగికౌగిలిలోచేర్చి తృప్తిచెంది కృతార్థమయ్యాయని తిమ్మి రెక్కిన తన చేతుల్లోవుంది వాస్తవిక సత్యం! ఇప్పుడుమాత్రం రామన్న నిజంగానే భయపడ్డాడు. చేసినపని చెడ్డది అయినా మనస్సుకు వోదార్పుకలిగితే - అది యెలాంటి లక్షణం? తామస సమాధానమది-ఛీ! మళ్లీ వొట్టి పనికిరాని మాటలు....పోనీ....అనుకున్నాడు. ఎందుకు? ఒక్కసారి యేదో జరిగిపోయింది, మరోమారు అలా జరగకుండా చూసుకోవాలి, ఇదేమీ నిత్యానుభవం కాదు, బుద్ధి పూర్వకంగా చేసిందికాదు, ఎందుకు ఈ పాడు వూహలు అని అన్నిటినీ మరువ డానికి నిశ్చయించి తనపనిలో మునిగాడు.

అయితే మరిచిపోవడం సాధ్యం కాలేదు. మనస్సు మరోపనిలో లీనమవడానికి సిద్ధంగా లేదు. ఎంత ప్రయత్నించినా కుముదను ఆలింగనం చేసుకున్న అనుభవమే మెదులుతుండడంవల్ల మనస్సును కట్టుదిట్టం వీలుకాలేదు. చివరికి విసుగుతో లేచాడు. తప్పు తాను తిట్టుకున్నాడు, కానీ ఏ ప్రయోజనమూ సాధ్యం కాలేదు. తన తప్పును బహిరంగంగా వొప్పుకుంటే మనస్సు దారికి రావచ్చునే ఆలోచనతో కుముదను క్షమించమని అడుగుదామనుకున్నాడు; ఆమెగదికి బయలుదేరాడు. మళ్ళీ ఆగాడు. క్షమాపణ అడగడానికా? శరీరవాంఛ తీర్చుకోవడానికా? ఏ వూహతో తను ఆమెవైపు బయలుదేరాడో అనేది అతనికే సంశయం కలిగింది, నిగ్రహించుకొన్నాడు. పాపం! ఎంతయినా ఆశ్రితురాలు. వయస్సులో చిన్నది. తనలో ఆదరం - విశ్వాసం వుంచినది; ఎంత బెదిరిపోయిందో! ఏమనుకుందో ఏమో! ఆమెను వోదార్చడం తన కర్తవ్యం అని మళ్ళీ అడుగు ముందుకువేశాడు. అయితే 'ఓదార్చడం' అనే వూహకు మారుగా తనచేయి ఆమె శరీరాన్ని తాకడానికి ఇప్పుడే సిద్ధమైవుంది అనేది తట్టేసరికి మళ్ళీ అడుగు వెనక్కువేశాడు; హతాశుడయ్యాడు, కోపం తెచ్చుకున్నాడు, ఇది తనకు అవమానం అని లోపల్లోపలే బొబ్బలు పెట్టాడు. తను, తన చదువు, తన సంస్కారం, తన కృషి - ఇవంతా ఎక్కడ? మనస్సులో తాండవమాడుతున్న వూహ ఎక్కడ? ఒకసారి, మంచంపట్టిన సరళది ఈ నైతిక బాధ్యత (ఏమి అనైతికమో?) అనుకున్నాడు; అయితే ఇంతవరకూ ఇలాంటి ఆలోచనకు చోటే కలగలేదు. కానీ ఇదంతా ఈ కుముద సాన్నిధ్యంవల్లనే జరిగింది. అందువల్ల దీనిబాధ్యత కుముదది, అని వాదించుకొన్నాడు; ఇలాటిజీవితం తన్ను అపహాస్యానికి గురిచేసింది కదా అని కలవరపడ్డాడు. చివరికి ఎలాగో ఆవిధంగా ఆ కథ అక్కడికే ముగిసినట్లయింది. అయితే ముగియలేదు అనేదాన్ని రెండు-మూడు ఏళ్ళు గడిచినతర్వాత, ఈరోజుకూడ అతను వొప్పుకోవలసి వచ్చింది. ఎలాగో సమాధానపరచుకుంటూ పరుపుమీద ఒరిగేసరికి మరో వూహ వచ్చింది. తటాలున లేచి కూర్చొని, ఇదేం కష్టం? ఇంతవరకు తట్టనే లేదు! కుముద యిక్కడ్నుంచి పరుగెత్తిం దెక్కడికి? తన గదికా? సరళ దగ్గరికా? కుముద బెదిరిపోయింది అనేవిషయంలో అతనికి అనుమానం లేదు. భయపడిన పిల్ల సరళదగ్గరికి పరుగెడితే? జరిగిందంతా ఆమెకు చెపితే?....రామన్న కూర్చ

న్నట్లుగానే చలిజ్వరం వచ్చినట్లు గడగడ వణికాడు. వెళ్ళి చూసివద్దామా ?-అను కున్నాడు....లేచి మెల్లిగా బయట గదిలోంచి పడ్డాడు. ఒక్కనిముషం వేచాడు. కుముద గదిలో వున్నదా లేదా అని చూస్తే సరిపోతుంది అనిపించింది. వెంటనే దయ్యాన్నిచూసి భయపడినవానిలాగా సరళ గదివైపు నడిచాడు. కుముద గదికి వెళితే ఎలా మెలగాలి అనే విశ్వాసం తనకే లేనందువల్ల అంత భయపడి సరళ గదివైపు వెళ్ళడానికి సాహసించాడు. ఇంటిలో దయ్యాన్ని చూసినట్లుకాగా భయ స్తుడుకూడా బయట చీకట్లో పరుగెత్తేసాహసం చేయడూ! చివరికి సరళగదిలో ఏ శబ్దమూ లేదు. ఎవరికి తెలుసు? తనకు భయపడి కుముద ఈరోజు యిక్కడనే పడుకునుంటే! చూద్దాం - అని మెల్లిగా తలుపు తెరిచాడు.

'ఎవరు?'

సరళ గొంతువిని బెదిరిపోయాడు. ఇప్పుడు ఎవరు మాట్లాడినా తనను ఛీ అవే వాళ్ళే అనేవూహ అంతరంగంలో మెదులుతున్నదో ఏమో? అందుకే దొంగిలించే టప్పుడే పట్టుబడ్డ దొంగలా భయపడ్డాడు.

'ఎవరు? ఆఁ? కాదు-ఎవరూ లేరు. నేనే' అన్నాడు.

'ఏమండీ? ఈరోజు రావాలనే బుద్ధి పుట్టలేదా యేం?'

గాయంమీద కారం చల్లినట్లయింది రామన్నకు.

'లేదు, రాస్తూనే కూర్చున్నాను. నీగొంతు వినిపించినట్లయింది. ఏమైనా కావా లేమో అని అడగడానికి వచ్చాను.'

'అయ్యో! నాకూ ఏదో శబ్దం వినిపించినట్లయ్యింది....కుముద ఇంకా పడుకో లేదో యేమో?'

'నేను చూడలేదు. రాస్తూ కూర్చున్నా. పిలిచేదా ఆమెను?'

ఆ చివరివాక్యం బయటపడగానే నాలికను కత్తిరించి వేసుకోవాలనిపించింది.

'అయ్యో! దాన్నెందుకు పిలుస్తారు. పాపం! చిన్నపిల్ల-పడుకోనివ్వండి.

'కాదు. నీకేమైనా కావాలేమో. అని.'

సరళ ఆ మాటకు చిరునవ్వు నవ్వింది.

'నాకేం కావాలి? మీరున్నారు, కుముద వుంది. మీ రిద్దరూకలిసి యిల్లు నడిపిస్తారు. ఇంక నాకేం చింతలేదు. ఇంక నేను కళ్ళు మూసుకుంటే చాలు' అన్నది.

ఉరుము, కాదు, అది తన గుండె కొట్టుకునే శబ్దం! సరళ మాట్లాడిన మాట వల్ల రామన్న హృదయం పగిలి ముక్కలు ముక్కలయినట్లయింది. ఎందు కీ మాట? దీని అర్థం ఏమిటి! సరళకు తెలిసుంటుందా? తనమీద అనుమానం వచ్చి వుంటుందా? రామన్నభార్య నిర్విణ్ణ. ముగ్ధముఖాన్ని చూశాడు. ఏదో కలవరం కమ్ముకున్నట్లుంది. సరళ దగ్గరికివచ్చి ఆమె నుదుటిమీద చెయ్యివేశాడు.

'నీవు వొట్టి పిచ్చిదానివే. ఎండవుంటే మొక్కలు - లతలు బతుకుతాయి - అలాగే నీ తెరచిన కన్నుల ఎండ వున్నంతవరకేకదా మేము వూపిరి పీల్చేది, తిరిగేది' అన్నాడు.

సరళకూడా అప్పుడు తనచేతితో భర్తచేతిని నిమురుతూ, 'ఇంత పేరున్న రచయితకు ఇంత తియ్యగా, చక్కగా మాట్లాడడం కష్టమా ఏమిటి?' అని నవ్వుతో అడిగింది.

'తియ్యటి మాటలా? తియ్యదనం నా మాటల్లో లేదు' అన్నాడు.

'అయితే యెక్కడుంటుంది?' అని అడిగింది.

చటుక్కున వంగి ఆమె నుదురు ముద్దుపెట్టుకొని, 'తియ్యదనం యెక్కడుంటుంది అనేది అక్కడ కూర్చొని అనుభవించే తుమ్మెదకు తెలుసు, కమలానికి ఎలా తెలుస్తుంది?' అని ఆమె దుప్పటి సరిచేసి వెనక్కి తిరిగాడు.

'ఇప్పుడు రాకూడదా చావు. ఎలాంటి మరిచిపోలేని తలరాత?'

'ఏమన్నావు? తలరాతా?'

నవ్వుతూ తను ముద్దిడిన పాలభాగాన్ని సరళ చూపించింది. అప్పుడు రామన్న గదికి వెళ్ళిపోయాడు. వెంటనే గాఢమైన నిద్ర కమ్ముకుంది.

ఈ జ్ఞాపకాలను నెమరువేసుకుంటూ రామన్న మళ్ళీ చిత్రాన్ని చూశాడు. 'సరళా, నీ తలరాత అంత మంచిదని అప్పుడు చెప్పావు. మళ్ళీ కనుమరుగయ్యావు! అయితే ఈనాటికీ జీవించి, దాన్ని తలచుకుంటున్న నా తలరాతగురించి

వూహించగలిగావా ?' అని మనస్సులోనే చనిపోయిన భార్యచిత్రాన్ని సవాలు చేశాడు. శుద్ధాంతఃకరణం కల సరళ మాటలవల్ల తన క్షుబ్ధహృదయం శాంతమై, భారం తొలగి తను ఆ రాత్రి గాఢంగా నిద్రపోయినా మర్నాడు లేచేసరికి మళ్ళీ రామన్న హృదయం వికలమైంది. ఇప్పుడు ఆ మాటలన్నీ ఒప్పుకోవడానికి ఏమి టాటంకం ! ఒప్పుకొనేవి తన హృదయసాక్షిగానే. సరళవిషయంలో అతను నిశ్శంకతో, నిర్భీతుడై వున్నా మర్నాడు అతన్ని మహాభయం పట్టుకొంది. కుము దకు ఎదురుపడడం యెలా ? రాత్రి ఆవిధంగా రాక్షసునిలా ప్రవర్తించి ఇప్పుడు ముఖం చూపించడమెలా ! ఆమెకు ముఖం తప్పించడమైనా యెలా ? పొద్దున టీ దగ్గర్నుంచి రాత్రి భోజనంవరకు అన్నీ ఆమే చూసుకొంటుంది. చివరికి రామన్న సరళనే వేడుకోవలసి వచ్చింది. లేచి గదినుంచి బయటపడగానే సరళ దగ్గరి కొచ్చి కూర్చున్నాడు. అక్కడే టీ తాగాడు. అయితే క్రమేణ రామన్న ఆశ్చర్య పడవలసి వచ్చింది. తను కుముదకు భయపడ్డాడు కదా ? అయితే ఆమె నడవడి, మాటల్ని చూస్తే తన భయానికి కారణమే లేదనిపించింది. కుముద ముఖంమీద విశ్రమించిన సంతోషపుకాంతి ! రామన్నకు అనుమానం కలిగింది. తనకే కుముద ప్రత్యేకంగా కనిపిస్తోందా ? లేక నిజంగానే అలాంటికాంతి వున్నదా ? కొంచెం ధైర్యం తెచ్చుకొని నిదానించి చూశాడామెను. అప్పుడామె సిగ్గుపడినా చిరు నవ్వులు చిందించి ముఖాన్ని తిప్పుకొంది.

రామన్న తల విదిలించాడు. తలపుల ఒత్తిడి వుండబట్టలేక పోయిందేమో ! కుర్చీనుంచిలేచి అటు ఇటు తిరగనారంభించాడు. 'చిరునవ్వు నవ్వి ముఖాన్ని తిప్పుకుంది అన్నా' అన్నాడు గట్టిగా. అన్నిరోజులతర్వాతకూడా అతనికి ఆ దృశ్యం మరపుకు రాలేదు. అదే కుముదను తను సినిమాకు తీసుకొని పోవడానికి సిద్ధం కాలేదు ! కాలచక్రం ఎలా తిరిగింది ? ఆ రోజు సరళ సాక్షాత్తుగా హృద యాన్ని నిలిపేలా కళ్ళఎదుట వుంది. అయినా కుముదను వేటాడాడు తను. ఇప్పుడు 'ఇదేమిటి ?' అని అడగగల్గిన సరళ ప్రాణంతో లేదు; అయితే వెంట పడిన వాళ్ళనుంచి తప్పించుకుని పరుగెత్తే వేటమృగమైనాడు తను ! కాలచక్రమా ? ఆ రోజుమాత్రం కుముద సిగ్గుతోకూడిన, చిరునవ్వు ముద్రను చూసినప్పుడు 'ప్రకృతి మాయాజాలం' అనుకున్నాడు. ఇదొక ప్రకృతి మాయాజాలం అను

కున్నాడు. ఎంత వేడిమి తీగకు ప్రాణదాయకం, మగవాని ఆక్రమణ ఆపడానికి ప్రాణదాయకం; ఇదొక ప్రకృతిజాలం అనుకున్నాడు. ఏమైనా వుండనీ, కుముద వల్ల యే భయమూ లేదు అని మనస్సు నెమ్మదిపడి రోజంతా వుల్లాసంగా గడిపాడు. సాయంత్రం ఇంటికి తిరిగిరాగానే మరొక వినోదం కాచుకుని వుంది. 'వినోదం' అని అప్పుడు అనిపించింది. ఇప్పుడు అదీ ఒక ఇక్కట్టే అని తోచింది అతనికి. ఆ సాయంత్రం ఇంటికివస్తే యింటి స్వరూపమే మారిపోయివుంది! చూసిన చోటల్లా స్వచ్ఛత, నీటు, రీతి: 'అరే ఇదేమిటి? ఈ రోజు ఇంటినంతట్నీ చాకలి వాడికి ఇచ్చారా ఏమిటి' అని సరళను అడిగాడు,

'ఎందుకు? చాకలివాడు జ్ఞాపకం వచ్చాడు? మీరూ రాముడిలా చాకలివాని కోసం పెళ్ళాన్ని వదిలేస్తారా యేం?' అని సరళ హాస్యమాడింది.

ఒక్కనిముషం రామన్న ఆశ్చర్యపడ్డాడు. అయితే అంతలోనే సరళ మాటను పొడిగించింది.

'ఇంతగా ఎందుకు చూస్తారు? ఇంటిని బాగుచేసినవాళ్ళు వేరే వున్నారు, ఆ శక్తి మీరు కట్టుకొన్న పెళ్ళానికి ఇప్పుడు లేదు. అందుకనే అనే-పనికిరాని పెళ్ళాన్ని వదలిపెట్టి___'

సరళమాట పూర్తికాలేదు. ఎందుకంటే, అంతలోపల్నే అంతా అర్థమై పకపక నవ్వాడు. ఇదంతా చేసింది కుముద అని తెలిసింది అతనికి. అయితే తను నవ్వింది సరళ మోజుపడి చెప్పిన మాటలవల్లా? లేక కుముదమీద కలిగిన నమ్మకంవల్లనా? ఇప్పటికీకూడా రామన్నకు ఈ విషయం తెలుసుకోవడానికి సాధ్యం కాలేదు. గదిలో పచార్లు చేయడం ఆపాడు. గడియారం చూశాడు. గంట తొమ్మిదిన్నర అయింది. నిట్టూర్చాడు. ఇంక సినిమాభయమే లేదు, వెనకటి యీ పాడుకథలు చాలు, యేమైనా చదువుదాం అని పుస్తకంతీసుకుని మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు; ప్రశాంతత దొరకలేదేమో; రెండుకాళ్ళూ బెంచీమీదపెట్టి, వెనక్కు వాలి, చదవ నారంభించాడు.

# 8

మనసులో చెలరేగుతున్న పాతజ్ఞాపకాలే ఈ రోజు తనపాలిటికి సినిమా అని అనుకున్న కుముదకు ఆ మాటను అనుకోవడమూ తప్పయిపోయిందేమో అనిపించింది. ఎందుకంటే, ఆ జ్ఞాపకాలను మరచిపోవాలని ఇప్పుడు తనగదికివచ్చి పరుపు మీద కూర్చోగానే సినిమా మాట జ్ఞాపకానికి వచ్చింది. సరళక్కముందు తనొక మారు అన్నది. 'సినిమాలో వేషంవేస్తే బాగుంటుంది' అని. ఆ రోజు-ఎప్పుడది?- ఆఁ-తను వొకరోజు, వెనుకటిరాత్రి 'ఏమిటో' అయినందుకు వుబ్బిపోయి నడుం విరిగేట్లు పనిచేసిందికదూ? అప్పుడు సరళక్క ఏమేమో అనటంతో గదికి పరుగెత్తింది. తర్వాత రామన్న వచ్చాడు. ఎవరు ఏమంటారోనని భయపడి కూర్చుంది తను? అప్పుడు రామన్న నవ్వాడు? ఆఁ-అదేరోజు. రాత్రి భోజనసమయానికి ఏమేమో మాటలు జరిగాయి? భోజనంవేళకు కాదు, యిప్పుడు జ్ఞాపకం వచ్చింది. రామన్న భోజనం ముగించుకొని సరళక్కదగ్గర కూర్చొన్నాడు. వంటింట్లో తనొక్కతే అన్నం తింటున్నది. అప్పుడు బయట భార్యాభర్తలు మాట్లాడుతుండడం తనకు వినిపించింది. అలాంటిమాటలు జరిగినప్పుడు తను యెప్పుడూ బుద్ధిపూర్వకంగా పనిలో మునిగి అలక్ష్యంగా వుండేది. మొగుడు పెళ్ళాల మాటల్ని వినకూడదనే సౌజన్యంతో. ఆ రోజుమాత్రం యెందుకో కొంచెం కుతూహలం కలిగింది. అంతేకాక అన్నానికి కూర్చున్నందువల్ల వేరేపనుల్లో దిగడమూ కుదరలేదు. లేక తనవిషయమే మాట్లాడుతుంటే? చివరికి ఆ రోజు తినేముద్ద శబ్దం కూడా కట్టిపెట్టి వాళ్ళిద్దరిమాటల్నీ శ్రద్ధగా విన్నది.

'ఇల్లు ఎంతబాగా చక్కబెట్టింది యీ రోజు కుముద, చూశారా?' సరళక్క గొంతు.

'ఎందుకని? నువ్వు చెప్పావా యేమిటి?' రామన్న ప్రశ్న.

'చాలు పొండి! లేనిపోని చాకిరి చెయ్యమనడానికి నాకేమన్నా పిచ్చి పట్టిందా?'

'అంటే! యీరోజే యెందుకొచ్చిందీ వుత్సాహం?'

'వుత్సాహం యెలాంటిది? మనింట్లో పొద్దెపోదు దానికి. కర్మ! నేనేమో

మంచమెక్కాను. నా చుట్టూ తిరగడం! బయటికి వెళ్ల డానికికూడా దానికి వేళ చిక్కదు....అయిందా! ఇంక మీ సంగతి చెప్పాలా, మీ వాలకమే మీది!'

'అంటే నేనేం చేయాలంటావు? ఆమెతోకూడా ఎగరాల్నా ఏం?' రామన్న నవ్వుతూ చెప్పింది విని కూర్చున్నచోటనే కుముద వొళ్ళు ఝల్లుమంది.

'ఏదో వొకటి మాట్లాడకండి. మీకు ఎవ్వరూ అక్కర్లేదు. మీ తమ్ముడో-చెల్లెలో వచ్చివుంటే యిలాగే వాళ్లను వాళ్ళిష్టానికి వదిలి పుసపుస తిరిగేవారా?'

'కాదు-అంటే-నేనేం చెయ్యాలో చెప్పవే?'

'ఏమంటే యేం? ఇన్ని ఏళ్లయింది పిల్ల యింటికొచ్చి. ఏం పరాయిపిల్లా? ఇంకెవ్వరైనా వున్నారా దానికి? మనమే పట్టించుకోలేదంటే___'

రామన్న మధ్యలోనే అడ్డుతగిలి అన్నాడు. 'పట్టించుకోవడం పట్టించుకోవడం అంటే యేమిటి? వెళ్ళేచోటికి వచ్చేచోటికి వెనక అంటిపెట్టుకుని తిరగడమా?'

'నేనేం పుస్తకాలురాసే దాన్నికాదు. నాకు మీకు తెలిసినన్నిమాటలూ తెలీవు. పట్టించుకోవడం అని నలుగురూ చెప్పినట్లే నేనూ చెప్తాను....జేబికి ఎందుకు అంటించుకుంటారు?....నాకు తెలుసు! ఎప్పుడూ మీ చూపంతా మీ జేబుమీద!'

'కాదు - ఎక్కడ్నుంచి ఎక్కడికి వెళ్ళావు? మీ చెల్లెలినిగురించి మొదలెట్టి ఇప్పుడు నా జేబుకు అడ్డు తగిలావుకదా! ఆఁ? హహ!'

ఆ మాటకు తనకూ నవ్వు వచ్చిందనేవిషయం జ్ఞాపకం వచ్చిన కుముద ముఖం మీద ఇప్పుడూ - దాని జ్ఞాపకంవల్ల - చిరునవ్వు వెలిసింది. సరళక్కకూడా మాటల్లో ఎంత చాతుర్యం వున్నది!

'అవును. మీరు యెవరికోసమూ కానీకూడా ఖర్చు చెయ్యొద్దు' అన్నది.

'ఇప్పుడు ఎందుక్కావాలి?'

'నాకెందుకు కావాలి? మంచమెక్కి విసుగు పుట్టిపుట్టి చివరి కొకరోజు విషం పుచ్చుకోవడానికి కావల్సి రావచ్చు.'

కుముదకు ముద్ద గొంతులో దిగనట్లయి, వూపిరి ఆడనట్లయింది, ఆ మాట విని.

'ఇలా చూడు సరళా, డొంకతిరుగుడుగా మాట్లాడితే నీకూ ఆయాసం- స్పష్టంగా చెప్పరాదూ? నీకోసం ఖర్చు చెయ్యడానికి నే నెప్పుడైనా వెనుక ముందు చూశానా?'

'నాకేముంది చెయ్యడానికి - అంటున్నా మళ్ళీ నాకోసం అంటారే? కుముద మాట చెప్పాను. రోజంతా కష్టపడాలి! పొద్దు పోకపోతే యింకెంతపని చెయ్యాలి! ఏముంది బయట పడడమంటూ వుందా? ఒక సినిమా వుందా? ఇంట్లో పిల్లలైనా వుంటే దానికి పొద్దుపోయేది.'

'ఛీ! పిచ్చిదానా! మాట్లాడితే ఆయాసం కలుగుతుందంటే యేడుస్తావేమిటి? ఆమె సినిమాకు పోతామంటుందేమిటి? కావాలంటే పోనీ, అయితే యేమిటి? ఛీ! నేను ఏమిటో పెద్దవిషయమని అదిరిపోయాను, ఇలాంటిదానికి ఏడుస్తావా?'

తర్వాత సరళ 'ఇశ్! అదేమిటి, వదలండి.' అనడంమాత్రం వినిపించింది. ఆతర్వాత కొంతసేపు వాళ్ళిద్దరూ ఏదో గుసగుసలాడినట్లు వినిపించింది. చివరికి తను భోజనం ముగించి వచ్చేసరికి రామన్న తనగదికి వెళ్ళాడు. మరుసటిరోజూ తను రామన్నతో సినిమాకు వెళ్ళేట్లుగా నిశ్చయమయిందని సరళక్క చెప్పింది.

'ఆయనకూ వొక్కరే చూడాలంటే విసుగుపుడుతుంది. నన్ను అడిగారు. నేను చెప్పేను నిన్ను పిలుచుకొనిపోవడానికి అభ్యంతరంలేదు అని' అని సరళక్క చెప్పినప్పుడు కుముదకు అక్క సౌజన్యపు నడతచూసి చిరునవ్వు ఆగలేదు. మర్నాటిరాత్రి సినిమా చూసివచ్చినతర్వాత కుముద సరళక్కదగ్గరికి వెళ్ళింది.

'చూసి వచ్చావన్నే?'

'చూసి వచ్చానక్కా. ఇంగ్లీషు సినిమా అది. భలేబాగుంది' అని వుత్సాహం-తొణికిస లాడుతుండగా సమాధానం చెప్పింది.

'ఇంగ్లీషు సినిమాఅంటే - కథంతా తెలిసిందా?'

'అంతా చెప్పారు నాకు.'

'ఊ....ఏమిటి కథ?'

ఆ చిత్రం కథ దాంపత్యజీవిత చిత్రణ. భర్త, భార్య పరస్పరం గాఢమైన

ప్రేమ, ఒకమారు భర్త ఒక మాయలాడి మోహానికి లోనవుతాడు. ఆ రోజునుంచి భార్యనుచూస్తే అసహ్యపడతాడు; ఎనిమిదేళ్ల కొడుకొకడు; భార్యనూ కొడుకునూ ఇంటినుంచి తరిమేస్తాడు; చాలామంది ఆ భార్యకు ఇలాంటిమొగుడ్ని విడిచిపెట్టమని వుపదేశం చేస్తారు; అయితే భార్య వొప్పుకోదు; భర్త నిజమైనప్రేమ ఇంకా తనమీదేవుందని ఆమె దృఢంగా నమ్మివుంటుంది; ఈ రోజు కాకపోయినా రేపైనా ఆ మాయలాడి తనభర్తను కష్టంలో ముంచివెళుతుందనే వూహతో ఎప్పుడూ భర్తను రక్షించేప్రయత్నంలోనే వుంటుంది; అయితే భర్తకేమో పెళ్ళాంమీద ఆవగింజంతయినా కనికరం లేదు; కొడుక్కూ భార్యకూ తగినంతగా తినడానికి అన్నం, కట్టుకోవడానికి గుడ్డలేకున్నా అతనికి బుద్ధిరాదు; చివరికి ఒకరోజు ఆ మాయలాడి ఇతని డబ్బంతా నాశనంచేసి, మిగులూ బొగులూ ఎత్తుకొని పారిపోతుంది; ఇతను హతాశుడవుతాడు; ఇంక ఎక్కడికి వెళ్ళడం? బతుకు జరిగేదెలాగ? భార్య ముఖాన్ని చూడడానికికూడా అతనికి సిగ్గు; చివరికి నిర్విణ్ణుడై ఆత్మహత్య చేసుకోవాలనుకున్నప్పుడు భార్య కనిపిస్తుంది; చివరికి అందరూ సుఖంగా వుంటారు.

'ఆఖరున కన్నీళ్లు నిలపలేదు చూడక్కా! పెళ్ళాంగా వేసినామె యెంత బాగా వేసిందంటావు! నా కనిపిస్తుంది ఆమెకూడా అలాంటి ఆడదై వుండాలి!'

'పోవే పిచ్చిదానా!' అని సరళక్క నవ్వింది.

'లేకుంటే అంతబాగా నటించటం ఎట్లా వస్తుంది?' అని వెర్రిగా అడిగింది.

'అలాగా? ఆ ఆడవాళ్లు అలాంటివాళ్ళే వుంటారు. వాళ్లకు సినిమాలో వేషం తప్పిస్తే మరెక్కడా బాగుండడమే తెలీదు.'

'అంటే యేమిటక్కా? ఇలా పెళ్ళాం వేషంవేసే ఆమెకి——'

'ఎన్ని పెళ్ళిళ్ళు అవుతాయో ఏమో!' అని సరళక్కమాట అన్నప్పుడు తను పిచ్చిదై పోయివుండాలి. ఎందుకంటే, అప్పుడు తన ముఖాన్నిచూసి సరళక్క నవ్వసాగింది.

'ఇంతగా యెందుకిదవుతావు? అబద్ధం కాదు. ఆయన్నడుగు కావాలంటే. వాళ్ళు ఎన్నిసార్లు పెళ్ళి చేసుకుంటారు, చేసుకున్న పెళ్ళిని యెన్నిసార్లు చెడుపుకుంటారు, అని.'

'అయ్యో! అలాగా?' తను చాలా నిరాశతోనే పలికివుండాలి. ఎందుకంటే, ఆ మాటకు 'నీ కెందుకంత చెడ్డదనిపిస్తున్నది?' అని సరళక్క అడిగింది.

అప్పుడు కుముద తన ముగ్ధత్వాన్నంతా ప్రదర్శించి చూపింది. సినిమాలో కథ పరిణమించిన రీతిచూసి సినిమాలో వేషం వెయ్యడం చాలా మంచిపని అనిపించింది కుముదకు.

'అలావుంటే అలాంటికథే తీసేవాళ్ళు, పెళ్ళిచేసుకొని ప్రేమగా వున్నవాళ్లు బాగున్నారు అనేకథను ఎందుకు తియ్యాలి?' అని సరళక్క చెప్పినప్పుడు తన భ్రమ తొలగినట్లయింది.

సరళక్క అంతటితో వదలలేదు. తను చూసివచ్చిన సినిమానుంచే మంచి పాఠం వెతికి చూసినదానిలాగా ఎన్నోమాటలు చెప్పింది.

'చూడు, కుముదా, నువ్వు చూసివచ్చినకథలో చెప్పినట్లు పెళ్ళానికి మొగుడు. బిడ్డలుతప్ప మరోసుఖం లేదు. చూడు. ఆడదానిహృదయం అంటే యెప్పుడూ తల్లి హృదయమే అది చూచావుకదా, ఆవిధంగా తనని పీడించినా చివరికి ఆ పెళ్ళాం తనమొగుడ్ని కాపాడుతూనే వచ్చింది? మొగుడ్నని యెంత అధికారం చలాయించినా, కష్టం వచ్చినప్పుడు చెయ్యివదలకుండా ఓదార్చేది పెళ్ళామే. ఈయన యిన్నికథలు రాస్తాడు కదా! ఈన కథల్లో ఒక్క ఆడదానికైనా సుఖం కలగడం చూశావా యెప్పుడైనా? నేనొకమారు అన్నాను ఆయనముందు ఇంతగా యెందుకు ఆడవాళ్లను ఏడిపిస్తారు అని. 'ఎందుకంటే యేమిటి? వాళ్లు చేసుకున్నందుకు వాళ్ళే అనుభవిస్తారు' అన్నారు. చేసేదేమిటి? చెందేదేమిటి? అన్నీ కట్టుకథలు! ఆడదానికి ఏది కావాలి అనేదే తెలీకుండారాస్తే అడ్డదారులు తొక్కినట్లే. రాసేవాళ్లే అడ్డదారి పట్టినతర్వాత వాళ్లకథల్లో పాత్రలూ అడ్డదారినే పడ్తాయి; 'నీకేం తెలుస్తుంది? నువ్వు పాతకాలం మనిషివి!' అని నవ్వారు. నేను అన్నాను, 'పాతదేమిటి? కొత్తదేమిటి? ఆడదంటే ఆడదే. కొత్తకాలమని ఆడవాళ్లకు మీసాలొస్తాయేం?' అని.'

సరళక్క మాటలకు కుముద విరగబడి నవ్వింది. అయితే ఆ రోజు నవ్వు పుట్టించేదనిపించిన మాటే యిప్పుడు కుముదకు తత్త్వపూర్ణ మనిపిస్తున్నది. అయితే

యెవరికి చెప్పడం? సరళక్క సుఖదుఃఖాలతోనిండిన యీ లోకాన్నేవదలి వెళ్ళింది. కుముద బలవంతంగా చిరునవ్వు నవ్వింది. 'లోకాన్నేవదలి వెళ్ళిందట' సరళక్క బతికివున్నా ఆమెకు యేమని చెప్పడం? ఎలా చెప్పడం? 'నీ భర్తమీద నాకు మన సయింది' అని చెప్పడమా? 'నన్ను నీ మొగుడు ఇష్టపడుతున్నాడు. నేను అంగీక రిస్తే నాకు మొగుడు - పిల్లలసుఖం దొరుకుతుంది. నీ వుపదేశాన్ని పాటిస్తాను, అక్కా' అని చెప్పివుండవచ్చా? భర్త, పిల్లలు. రెండింటినీ చెప్పిందికదూ సర ళక్క? పెళ్ళి చేసుకున్నతరువాత భర్తలేకుండా పిల్లలున్నా సుఖంలేదు. పిల్లలు లేకుండా భర్తవున్నా సుఖంలేదు! ఎంత పరతంత్రమైంది ఆడదానిజీవితం! అన్ని యిక్కట్లతో కూడిందేను. సరళక్కమాటలన్నీ తలచుకున్నప్పుడు పిల్లలు లేనందు వల్ల ఆమెకూ సుఖం కలగలేదు అని కుముదకు తోచింది. అందుకోసమే ఇప్పుడు సినిమాలో చేరాలనుకున్న వెనకటిమాట స్మరణకు వచ్చిందేమో! దేనినుంచీ స్త్రీకి సుఖం కలుగుతుందనే నమ్మకం లేకుంటే సినిమారంగంలో దిగడం మంచిది కాదూ? కనిష్ఠపక్షం యోగ్యతవుంటే, యత్నించేస్తే డబ్బు సంపాదించవచ్చు, పేరూ గడించవచ్చు.

ఆలోచనాధారంతో తను పడకవదిలి బెంచీమీదఉన్న అద్దంముందు నిలుచోవడం కుముద గమనించింది. ఒక్కనిమిషం ఎదుట తన ప్రతిబింబం వుంది అనేది తోచక యెవరో వచ్చారని అదిరిపడింది. మరునిమిషానికి తెలిసివచ్చింది. ఎవరొస్తారు తనదగ్గరికి? పొరుగువాళ్ళు ఎప్పట్నుంచో చెప్పుకుంటున్నారు. పక్కింటి ఆడవాళ్ళు తననిచూస్తేనే మైలపడ్డట్లు లేచివెళ్తున్నారు. తనకు ఎవరూ లేరు! రామన్నకూడా తనవాడు కాదు. ఎలాంటి పిచ్చిది తను! ఒకానొక కాలంలో రామన్న తనవాడే అనుకున్నది. రామన్నమీద తనకున్నట్లే అతనికీ తనమీద వ్యామోహం వున్నదని దృఢంగా నమ్మింది. ఇంతెందుకు? ఏదేదో వూహాప్రపంచాన్ని నిర్మించుకుంది.

మళ్లీ అద్దంలో చూసుకొంది. ఎవరిముఖ మిది? ఈ వాడినముఖం, ఈ నిద్ర మొహం, తనదికాదు. 'కుముదా, ఎక్కడ నా దిష్టి తగులుతుందో నీకు, వెధవది!' అని ఎన్నిసార్లు సరళక్క అనలేదు! చనిపోవడానికి ఒక నెలముందు అదేమాటను సరళక్క అంది. ఇప్పటికి నాలుగునెలలు మాత్రం, ఇంతలోనే ఎంత మార్పు! చనిపోయిన సరళక్క దిష్టి తగిలిందా? లేక సరళక్కకు తలపెట్టిన ద్రోహంవల్ల శాపం తగిలిందా?

తన నడతలో ఏదో లోపముంది అనేభావం ఇప్పుడిప్పుడు, ఎక్కువగా సరళక్క పోయినతర్వాత కుముదను ఎక్కువ పీడిస్తున్నది. మంచమెక్కిన భార్యయొక్క భర్తను, అదీ తనని పెంచి పెద్దచేసిన సరళక్క భర్తను, ఈవిధంగా ఆకర్షించడం - ద్రోహం అనేవూహ ఆమెకు రాకున్నా, అపోక-పాపం అనిపించింది. తను చేసింది పాపం, 'నీవు చేసింది పాపం, నీ ముఖాన్ని చూడనేకూడదు' అని ప్రతిబింబాన్నిచూసి కోపించి, మళ్ళీ పడకమీదవచ్చి కూర్చుంది. తను చేసింది - కాదు. తను చేసిందిమాత్రం ఏమిటి? అది ఎలా పాపమవుతుంది? తనదేమిటి తప్పు? అలాచూస్తే తనది తప్పేమీకాదు. ఇప్పటికీ తనకు గుర్తువుంది. ఏది తను పాపమంటుందో అది ఎలా ప్రారంభం అయింది, ఎవరివల్ల అయింది. అనేది యిప్పటికీ కుముదకు కళ్లకు కట్టినట్లుంది. ఆ వూహే వద్దనిపించింది, అయినా ఆ జ్ఞాపకంకోసం హృదయం అలమటిస్తున్నది....

సినిమాచూసి వచ్చిన మరుసటిరోజు జరిగినసంగతి. సినిమా చూసినందుకు, రామన్నతో ఒక్కచోటకూర్చుని వచ్చినందుకూ - ఎట్లయితేనేం మరుసటిరోజు కుముద అత్యంతవుత్సాహంతో వున్నది. ఆ వుత్సాహం ఎక్కువెక్కువై పెరగడానికి మరో కిరణముంది. ప్రయత్నంమీరి యెప్పుడైనా ఒకసారి రామన్న చూపుతో తనచూపు కలిసినప్పుడు అతను నవ్వుముఖంతో తనని చూడడం కనిపించింది. అందువల్ల సిగ్గుకలిగి ముఖం తిప్పుకొని అతని దృష్టినుంచి తప్పించుకోవడానికి ప్రయత్నించినా మళ్లీ యెవరో బలవంతంగా లాగినట్లయి, తటాలున సిగ్గును పోగొట్టుకోవా లనుకున్నప్పుడు కిందిచూపుతో అతన్నిచూస్తే ఇంకా అదే నవ్వు ముఖం! రోజంతా భూమిమీద నడిచినట్లే అనిపించేది కాదు! రోజు గడవడమూ తనకుమాత్రం తన అడుగులు వడివడిగా పడుతున్నట్లు అనిపించేది. ఇలా రోజంతా నవ్వులఎండ కాచినతర్వాత మబ్బులు కమ్ముకుంటే ఆశ్చర్యమేముంది? అలాంటి మబ్బుకూడా వొకటి కమ్ముకుంది. వెనకటి రోజుదైన తన మాటను తలచుకుంటూ సరళక్క రామన్నతో మాట్లాడటం జరిగింది. రామన్న రాత్రి భోజనం ముగించుకొని బయటికి బయలుదేరాడు. అప్పుడు, 'మన కుముదా సినిమాలో వేషం వేస్తుందట' అన్నది. అందుకు రామన్న ఎలాంటి సమాధానమివ్వాడు!....ఆఁ?....కాదు....ఏదో సమాధానం ఇచ్చాడు. అది నవ్వులాటకు

చెప్పినా మనస్సుకు బాధ కలిగించింది. ఏది ఆ మాట!....చావనీ, కావాలన్నది ప్రయత్నించినా జ్ఞాపకం రాదు, వద్దనుకున్నది రంపంలా కోస్తుంది....పోనీ. మాట ముఖ్యంకాదు. ఆ మాటకు సరళక్క నవ్వడం, తన మనస్సుకు ఇంకా బాధ కలిగించింది. రామన్న వెళ్ళిపోయాడు. తన భోజనంకోసం అన్నీ సిద్ధం చేసుకున్న కుసుమకు అన్నం వద్దనిపించింది....మిగిలినపని ముగించసాగింది. బయటి నుంచి సరళక్క నవ్వుతూ, 'విన్నావచ్చే, కుసుమా?' అన్నది. ఆ మాటకు తను సమాధానం ఇవ్వలేదు. పని ముగించుకొని బయటికి వచ్చి,

'నీకు ఏంకావాలి, సరళక్కా!' అన్నది.

'అయ్యో! ఇదేమిటి! ఇంతలోపల్నే భోజనం అయిందా?' అని సరళక్క ఆశ్చర్యంతో అన్నది.

'లేదు - నాకు ఆకలి కాలేదు.'

'ఆక లెందుకు లేదు?'

'ఏమో! నాకు తల నొప్పిగా వుంది.'

'తలనొప్పి! తలనొప్పి రావడానికి ఏమయింది? ఏదో వొకటి చెప్పొద్దు, ఇంత వరకు బాగా నవ్వుతున్నావు, మాట్లాడుతున్నావు-'

'లేదు - నిజంగానే నాకు తలనొప్పి వచ్చింది' అని మొండిగా చెప్పింది. సరళక్క ఒక్కనిముషం తనని ఎగాదిగాచూసి, 'ఏమిటి, ఆయన మాటకు కోపం వచ్చిందా!' అన్నది.

'ఎవరిమాట?'

తన గొంతులోని వంచన సరళక్కకు తెలిసిందేమో!

'చాల్లేవే! తెలిసింది!' అన్నది.

'లేదు. నాకు నిజంగానే___'

'పిచ్చిదానా! ఇన్నిరోజులు యీ యింట్లోవుండి ఆయనస్వభావం అర్థం కాలేదూ? వొట్టి తమాషామాటలు అవి. మనస్సులో యేమీ వుండదు.'

'లేదక్కా, నువ్వు యేమంటున్నావో నాకు తెలీనే తెలీదు.'

'అయ్యో! నా ముందు బుకాయిస్తావే? నాకంతా తెలిసింది. ఆయన మాటకే నువ్వు కోపం తెచ్చుకుంది! అయ్యో! పిచ్చిదానా! ఆయన అలా మాట్లాడితే ఆయనకే తెలీదు ఏం మాట్లాడేది. ఏమైనా మనస్సులో వుత్సాహంగావుంటే, ఏదైనా కొత్తగా రాసేది తోస్తే, దాన్ని మొదలుపెట్టేవరకు చిక్కినవాళ్లకు, చిక్కినందుకు ఏదోవొకటి పటపట అని అనేస్తారు. అలాగే మాట్లాడారు. నువ్వనేవిషయమూ ఆయనకు తెలిసివుండదు. నాకు తెలీదూ? ఈ రోజు కాకపోయినా రేపటికైనా తెలుస్తుంది ఆయన స్వభావం' అని నవ్వుతూ, 'పో, నీ కంచం యిక్కడికే తెచ్చుకో. నాతో మాట్లాడుతూ అన్నం తిను. ఎలా ఆకలికాదో చూస్తాను' అన్నది.

అయితే తనకుమాత్రం మనస్సు పోలేదు. లోపలిబాధ వొత్తిడివల్ల అక్కడ ఎక్కువసేపు వుండడమూ సాధ్యం కాలేదు. 'లేదు, నాకు చాలా తలనొప్పిగా వుంది. ఏమైనా కావాలంటే పిలువు, వస్తాను' అని తనగదికి వెళ్ళింది.

గదిలో మనస్సు స్థిరంగా లేదు. చీకటిపడినా గదిలో దీపం వెలిగించకుండా అలాగే పరుపుమీద పడుకుంది. ధ్యానమంతా బయటి తలుపుమీదనే. చివరికి బయటి తలుపు శబ్దమైంది. మెల్లిగా లేచింది. శబ్దంచెయ్యకుండా సరళక్క గదిబయట ఒదిగి నిలుచునుంది. లోపల ఏదేదో మాటలు జరుగుతున్నాయి. స్పష్టంగా వినపడడం లేదు. చివరికి 'ఛీ! ఛీ! ఇదేమిటి? మనస్సు బాధపడివుంటే తప్పయిందని చెపుతాను ....ఉఁ....పిలుచుకొనివస్తాను' అని రామన్నమాట వినపడింది. ఆ శబ్దం ఇంకా ఇంకా దగ్గర అయి, రామన్న తనదగ్గరకే బయలుదేరాడు అని గాభరాపడి, గదికి పరుగెత్తింది. అలాగే పరుపుమీద పడింది.

కాలం అనంతమయినది అనేదాని అర్థం కుముదకు అప్పుడు తెలిసివుండాలి. ఒకటి రెండు నిమిషాలలోనే రామన్న తనగదికి వచ్చినా కుముదకు అనాదికాలం నుంచి దారి కాచినట్లు అనిపించింది. త్వరగా, గాభరాతో పరుగెత్తి వచ్చినందువల్ల గుండె కొట్టుకుంటున్నది. ఆ శబ్దం రామన్నకు వినిపించకూడదనే భయంతో చేతుల్ని గుండెలమీద వుంచుకొంది. అంతలో రామన్న వచ్చాడు; గదిలో దీపం లేనందువల్ల భయపడ్డాడేమో! ఎందుకంటే నెమ్మదిగానే 'కుముదా....కు-ము-దా!' అన్నాడు. తను సమాధాన మివ్వలేదు. ఏమని సమాధానం చెప్పేది? భయమనిపించింది. సమాధానం చెప్తే అతను తలుపుదగ్గర్నే నిలుచుని మాట్లాడవచ్చు. లోపలికి

రావడానికి లేదు అనీ భయమేసింది. తనగుండె దడదడనే వింటూ వూరికే పడుకుంది రామన్న లోపలికి వచ్చాడు, మళ్ళీ తన పేరుపెట్టి పిలిచాడు. 'ఎక్కడున్నావు, కుముదా? ఇదేమిటి, పడుకున్నావా యేం?' అంటూ తనని కుదిపాడు. (మోక్షమంటే సుఖం-దుఃఖం-కాలం-దేశం మొదలైనవాటి పరిధుల్ని మీరి నిలిచిన ఒక నిత్య సాత్విక—సుఖావస్థ అని కుముదకు తెలిసేట్లుంటే ఆ క్షణమే తనకు మోక్షం లభించింది అని ఆమె తలపోసింది. అయితే అటువంటి వూహ లేనందువల్ల) కుముద ప్రాణముండీ అమరజీవి యైనట్లు మైమరచిపోయింది.

'తలనొప్పా నీకు? ఛీ! పిచ్చిదానా! తలనొప్పి రావాలంటే ముందు తల వుండాలి. తల వుండుంటే నా మాటకు ఏమిటర్థం అని తెలిసేది. అవునా-కాదా? ఆc! లే. భోజనం చెయ్యి. పాపం! సరళ, ఎంత బాధపడుతుంది మనసులో.

మొదటిమాటకు నవ్వు వచ్చింది. సరళస్థితిని విని పశ్చాత్తాపం కలిగింది. అయినా తను లేవలేదు. రామన్న రంజింపజేసే గొంతుతో మాట్లాడుతూ చివరికి తనను చేయిపట్టి లేపదీయబోయాడు; వంటినిండా మెరుపుతీగలు పాకినట్లయింది. చేతులు తగలగానే ఎద మరింత ప్రజ్వలించసాగింది, తనచేతులను లాగాలనుకున్న రామన్నచేతులు మరింత అనుకూలం కలిగినట్లయి వున్నచోటే మత్తుగా బిగుసుకున్నాయి....ఒక్క-క్షణం-ఒక్క-యుగం-కాదు. అంతలో 'సరళకోసమైనా అన్నం తిందువు రా. కావాలంటే నా తప్పు ఆ తర్వాత క్షమించమని అడుగుతాను' అంటూ రామన్న తనని గదినుంచి వెలుపలికి తీసుకుపోయాడు.

ఆ రాత్రి భోజనంచేసిన స్పృహే లేదు. 'మంచిదయింది, తల్లీ! కడుపునిండా అన్నం తిన్నావు' అని సరళక్క చెప్పినప్పుడు తను భోజనం చేసినట్లుగా అనిపించింది. 'ఇంక తలనొప్పి లేదుకదూ? ఆకలే యెక్కువై తెలీక తలనొప్పి అందో ఏమో పిల్ల!' అని సరళక్క హాస్యమాడినది విని తను పరధ్యాన్నంగా ఎలా అన్నానో అనిపించింది. 'కడుపునిండా అన్నం తినకపోతే యెవరిమాటా వంటబట్టదు చూడు' అనీ సరళక్క తనను ఎత్తిపొడిచింది. చివరి కెలాగయితేనేం భోజనం బాధ్యతనుంచి తప్పించుకొని, సరళక్క మనసులోని బాధను పోగొట్టి, తనగదికి వచ్చింది. వచ్చిందే చాలా శ్రమపడ్డట్లు, ఏదో దెబ్బనుంచి తప్పించుకొన్నట్లు వూపిరి తీసుకుని, పరుపుమీద వున్నదున్నట్లే పడింది. దీపం వెలిగిస్తే

లోపలివ్యూహాలు ఎక్కడికైనా పరుగెత్తుతాయేమో అనే అనుమానంతో దీపం వెలిగించలేదు. లోపల ఒకటే వొక వ్యూహ. 'ఆ తర్వాత క్షమాపణ వేడుకుంటాను' అన్నాడు రామన్న. అలాగయితే మళ్ళీ గదికి రావచ్చు కదా? దీపం వెలిగించడమే మంచిది అనిపించింది; అయితే వెలుగులో తన సిగ్గుముఖం రామన్నకు కనిపించవచ్చు, అందువల్ల దీపం వద్దు అనుకున్నది. చీకట్లోనే తలుపువైపే చూస్తూ పడుకుంది. రామన్న నిజంగానే వస్తే? నిజంగానే క్షమాపణ అడిగితే? తను ఏమనాలి? ఛీ! ఎలాంటి పిచ్చివ్యూహ! రామన్న అంతటివాడు తనని క్షమాపణ అడగడమంటే యేమిటి? ముందుగా తప్పు తనదే అని తను చెప్పాలి. ఎలాంటి వినోదస్వభావం రామన్నది! తనకు తలలేదు అని చెప్పేటప్పుడు తలమీదనే చేతుల నాడించాడు. 'కుముదా!' అదిరి పడింది. రామన్నగొంతు! అయ్యయ్యో-రానే వచ్చారు!—అని లేవబోయేసరికి కాళ్ళు ఆమె యిష్టాన్ని వ్యతిరేకించాయి. లేవాలి. లేచి తనే క్షమాపణ అడగాలి అని వుబలాటపడుతున్న కుముద నోటినుంచి మాటే రాలేదు. గదినిండా అలముకున్న చీకటే ఆమెకు ధైర్యాన్ని ఇచ్చింది. తన దురవస్థ ఎవరికీ కనిపించదని. రామన్నకుమాత్రం తను లేవలేక పోవడం కనిపించిందేమో! తిన్నగావచ్చి పరుపుమీద కూర్చున్నాడు.

'తలనొప్పి యెలావుంది? ఆఁ?'

ఏమని సమాధానం చెప్పాలి? నుదురుమీది వెంట్రుకల్ని చేతితో సవరిస్తున్నాడు రామన్న. అందువల్ల ఏమీ తెలియనట్లయింది. ఏమని సమాధానం చెప్పాలి?

'నిన్ను క్షమాపణ అడుగుదామని వచ్చాను కుముదా. నువ్వు నోటినిండా 'ఊ' అంటేగాని వెళ్ళేది లేదు' అన్నాడు రామన్న.

అలా అయితే తను 'ఊ' అని అయినా చెప్పవలసింది? ఆ వొక్కమాటమీదనే తన భవిష్యత్తంతా నిలిచివుండాల్సిందా? నోరుకూడా పెగలలేదు.

'నేను వెళ్ళను అంటే వెళ్ళను' అని రామన్న పరుపుమీదనే కాళ్ళుచాచి కూలబడ్డాడు.

కుముద చెయ్యి గడగడ వణకసాగింది. అది రామన్నకు తెలియకపోలేదు. 'ఒరే! నిజంగా జ్వరం గిరం రాదు కదా?' అంటూ పొట్టమీద అరచెయ్యి వేశాడు. తనవొళ్ళు వణకడం ఆగింది.

'నీవు ఉఁ అనికూడా అనవూ ? ఎంత మొండిదానివి నువ్వు !' అని చెవిలోనే అన్నాడు. రామన్న ముఖం తనముఖానికి యిప్పుడు దగ్గరయింది. 'చెప్పు, వణికే నాటకం ఆపొద్దు' అంటూ ఎడమప్రక్కకు జరిగి, కుడిచేతితో తనను బలంగా పట్టుకోగా, కుముద నోటికి ఏమైందో ! సగం తెరచివుంది. ఒక్కమాటా బయటికి రాలేదు !

'నువ్వు నోరు మూసుకుంటే నేనూ నోరు మూసుకుంటాను' అన్నవాడు నోటికి నోరు దగ్గరగాపెట్టి కుడిచేతితో ఇంకొంచెం దగ్గరికి తనను లాక్కున్నాడు.

ఆ రాత్రి కుముదకు ఏదో చెప్పలేని భయమేసింది. సృష్టి ఆడదానికిచ్చిన ధర్మ కల్పన ఆమెకు లేదు. తెలివీ పూర్తిగా లేదు. అయితే ఆ ధర్మమార్గంమాత్రం సులభమైంది కాదు అని ఒకసారి అనిపించింది. ఏది నిజం ? దేహానికి కలిగిన వుపద్రవమా ? మనస్సుకు కల్గిన ఆనందమా ? ఒక్కొక్కమారు వుపద్రవమే ఆనందమనిపించి ఏమీ తెలీనట్లవుతుంది. రామన్న చేతులు తన 'గుండె'ల్ని తాకినప్పుడు, ఆ చేతుల్లో ఎలాంటిశక్తి వున్నదనేది చూసినప్పుడు - అదేమి సుఖమా ? దుఃఖమా ? ఆమెకు తెలియలేదు. తన నోటికి తగిలిన రామన్న పెదిమలు తన కింది పెదవిని కొరికినప్పుడు, రక్తంతో సుఖమూ వెదజల్లబడిందేమో అనిపించింది. ఒకోమారు అదేమిటో ఒక నిలవని వేదనలా వుంది; అయితే అది వేదన కాదు అనేట్లు తన నోటినుంచి చాలా ఓర్పుగా వూపిరి బయటపడింది. వద్దు, వద్దు అనేటప్పుడే కావాలి అనే భావన నవ్వుతుంది.

'కుముదా, కుముదా' అని రామన్న పిలిచిన తన పేరు తిన్నగా తన హృదయాన్ని తాకి దాన్ని తట్టి లేపిందేమో ! ఆ పేరును రామన్న పిలిచినంతమాత్రాన కుముద తన రెండుచేతుల్తో రామన్నను బలంగా దగ్గిరకి లాక్కుంది. అప్పుడు, రామన్న దేహాన్ని తనచేతుల్తో బిగించి, తనలో చేర్చుకోవాలి అన్నంతగా, విచిత్రమైన వ్యామోహం తనలో కలిగింది.

'ప్రేమ'—కుముద కలలోంచి లేచినట్లుగా వెనకటి ఈ జ్ఞాపకాన్ని తెచ్చుకోవడానికి తల విదిలించింది. నిట్టూర్పు విడిచింది. ప్రేమ ! రెండేళ్లు ఆ మాటకు తను ఆహుతి అయింది. ఆరోజు 'కుముదా, కుముదా' అని చీకట్లో హృదయాన్నే తెరచి

పిలిచిన రామన్న ఇప్పుడు - పోసీలే, అనుకొనింది. ఇంక ఆ సంగతి ఎందుకు? ఆ మొదటిరాత్రి తప్పు తనదికాదు, రామన్న ఆవిధంగా - ప్రవర్తించివుండకపోతే తనకు ధైర్యమే కలిగేది కాదు; తప్పు తనదికాదు, తను మనస్సు కోరగా పాపం వల్ల ప్రేరేపింపబడినది కాదు - అనుకున్నది. అయినదంతా అబద్ధం. జరిగిందే నిజం అనుకొని నిట్టూర్చి పరుపుమీదనుంచి లేచింది. ఇంకా మేలుకుంటే ఈ జ్ఞాప కాలబాధ తప్పదని పడుకుందామని ప్రయత్నించింది. ఏ ఆలోచన వచ్చిందో ఏమో! పరుపుమీదవున్న దుప్పటిని తీయాలనుకున్నది. దాన్ని సగంమాత్రం తీసి బొమ్మలా అలాగే నిలుచుంది.

# 9

సులభంగా దొరికే వస్తువుకోసం మొదట అత్యాశ, సులభంగా దొరికినందుకు ఆతర్వాత తిరస్కారం. రామన్న ఆశ్చర్యపోయాడు. ఏమాటకోసం ఈ వూహ తన మనసులో వచ్చింది? తన చేతిలోవున్నది పుస్తకం, దాన్ని చదవడానికి వుపక్ర మించాడు. ఆ పుస్తకాన్నిగూర్చి తనకా వూహ రావటానికి వీల్లేదు. అలాగైతే తను రాసే పుస్తకాలగురించా? ఎందుకంటే, చాలాసార్లు అతనికి అలాంటి అను భవం కలిగింది. ఒక భావం అత్యంత మహత్త్వమై మెరిసేది, ఎప్పుడు దాన్ని గూర్చి పుస్తకం రాద్దామా అని ఆత్రుత; ఆతర్వాత ఒక్కసారిగా ప్రారంభించి కొన్నిరోజులలోనే దాన్ని పూర్తిచేయగానే దానిపట్ల జుగుప్స. ఎందుకు? కొన్ని రోజులలోనే ముగించగల్గిన పుస్తకం మహత్వపూర్ణమైందా - అని. అయితే ఆ ఆలోచనైనా యిప్పుడు యెందుకు రావాలి? తనచేతిలో పుస్తకముందనా? ఆc - తెలిసింది. 'చేతిలో పుస్తకం'. పుస్తకం కంటే 'చేతిలో' అనేదాన్నే తన అంత రంగం యెత్తి చూపిస్తున్నది. ఇంతవరకు వెనకటిజ్ఞాపకాలను నెమరువేసుకుం టున్న ఆ ప్రవాహంలో రెండు రెండున్నర సంవత్సరాలముందు కుముద తన 'చేతిలో' చిక్కింది అని అంతరంగం తనంత తానే జ్ఞాపకం తెచ్చుకున్నది. ఇప్పుడు తనకు కుముదమీద ఒకవిధమైన జుగుప్స నిజమవటంచేత, ఓదార్పు చెందుతోంది మనసు. అది బయటి మనస్సుకి వినిపించిందేమో! అదే తనకు

తోచిన వూహ అయివుండవచ్చునేమో: 'సులభంగా దొరికే వస్తువుకోసం మొదట ఆత్యాశ'. నిజం. తను-కుముద, ఇద్దరివిషయంలో ఈ మాట అక్షరాలా నిజమైంది. ఎలాగో యేమిటో - ఆ రోజు బీరువా ఎదుట ఆమెను బిగి కౌగిలిలో చేర్చినప్పుడు ఆమె ముఖకవళికల్నిచూసి రామన్నకు లోలోపల ఒక ఆశ అంకురించింది. ఈమె అంతకుముందే తనని ప్రేమించింది, అనీ అనిపించింది. అయినా అంతరంగ మిచ్చిన యీ సాక్ష్యాన్నే రామన్న పూర్తి విశ్వసించలేదు. ఎవరికి తెలుసు? ఒకవేళ సరళకు చెబితే?- అని భయపడ్డాడు. అందువల్ల - ఇప్పుడూ రామన్న ముఖంలో ఆ జ్ఞాపకం వచ్చినప్పుడు చిరునవ్వు చిందులాడుతుంది - మరుసటిరోజు తను సరళకు దగ్గరే ఎక్కువగా మెసిలాడు. రోజంతా బయట తిరిగాడు. అయితే హఠాత్తుగా ఒక్కసారి కుముదవైపు చూసినప్పుడు ఆమె కళ్లలో భయములేదు, కోపం లేదు, ఆ కనుబొమలు స్వాగతం పలుకుతున్నట్లు అనిపించాయి. ఆ చూపులు లోపలి ఆశను రేపినట్లయింది రామన్నకు. అప్పుడుమాత్రం మొదటిసారిగా, చివరిసారిగాకూడా రామన్న ప్రయత్నం చేశాడనవచ్చు, తన మనస్సును అదుపులో పెట్టుకోవడానికి. వద్దు, ఈ గొడవే వద్దు అనుకున్నాడు. సరళదగ్గరే మాట్లాడుతూ కూర్చున్నప్పుడూ వెనకటిరాత్రి స్పర్శసుఖం జ్ఞాపకం వచ్చింది. అప్పుడు సరళ చేతిని తన చేతిలోకి తీసుకుని ఆ జ్ఞాపకం తాలూకు సుఖాన్ని మరచిపోవడానికి ప్రయత్నించాడు. సరళకూడా నవ్వుముఖంతో తననుచూస్తూ 'దేవుడు త్వరగా నాకు ఆ శక్తి యివ్వనీ' అన్నది. మొదట అసలువిషయం ఏమిటని తెలియక రామన్న అదరిపడి 'ఏమన్నావ్?' అన్నాడు. సరళ అదే నవ్వుముఖంతో 'ఏమీలేదు; అంటూ ఇప్పుడు తనచేతిని - పాపం! అశక్తురాలైనా - వాత్సల్యపూర్వకంగా నొక్కింది. ఆ రోజు మరేదో ఒక విశేషం జరిగింది, ఇంటిని సరిదిద్దడంగురించి, ఏ మాట? పోనీ, జ్ఞాపకం వుండేది ఏమిటంటే, మర్నాడు కుముదను సినిమాకు తీసుకొని పోవాలన్నది. అదీ సరళ బలవంతమే!

ఆ మాట జ్ఞాపకం రాగానే రామన్న మళ్ళీ ముఖం తిప్పుకొని గోడపైని చిత్రాన్ని చూశాడు, నిట్టూర్చాడు. 'పిచ్చిదానా! నేను యెంత ప్రయత్నం చేశాను! దాన్నంతా తల్లకిందలు చేశావు నువ్వు! నీ చేతితోనే నీ ప్రాణాన్ని మరొకరికి తీసియిచ్చావు! అందుకే చెప్తున్నాను. సరళా, ఇదంతా నీ తప్పు' అని అన్నాడు.

రామన్న ఆలోచించాడు. నిజంగా జరిగిందంతా సరళ తప్పే అని చెప్పేటప్పుడూ సరళ శుద్ధ అంతఃకరణం జ్ఞాపకంవచ్చి అతన్ని పీడించసాగింది. శుద్ధమైన అంతరంగంతో చేసినది తప్పనవచ్చా? ఎందుకనగూడదు? వ్యవహారంరీతే విపరీతంగా వుంటే జీవనవిధానమూ ఎందుకు విపరీతంగా వుండకూడదు? అన్యాయంగా సంపాదించినడబ్బుతో దేవాలయాన్ని కట్టించినవాణ్ణి ప్రజలు 'పుణ్యవంతుడు' అనుకోవడం లేదూ? పాపంవల్ల ప్రేరితుడై పుణ్యాన్ని చేయగలిగినప్పుడు పుణ్యంవల్ల ప్రేరితుడై పాపాన్ని చేయగలిగివుండడా? వెనకటి శుద్ధ అంతఃకరణ ముఖ్యమా? ముందుదానివల్ల కలిగిన అనర్థం ముఖ్యమా? దేశ-కాలాల పరిధిలోనే జ్ఞానం లభించే ఈ ప్రపంచంలో క్రియ ముఖ్యం. అందువల్ల జరిగిన అనర్థం ముఖ్యం. అందువల్ల-రామన్న ఆగాడు. తనకు పిచ్చిమాత్రం పట్టడానికి వీలులేదు. అంతేనా? ఎలాంటిమాట, ఏ సందర్భం, వాటిని సమాధానపరచడానికి తను దొర్లిస్తున్న తత్వజ్ఞానబండలు ఎలాంటివి! ఈ స్వభావంవల్లనే మనుష్యుడు చివరికి జ్ఞానాన్ని గుప్తం చేసేబదులు ఆ బండరాళ్లకింద చిక్కి పొడిపొడి అవుతాడు. రామన్న తిరస్కారభావం ప్రస్ఫుటమయే నవ్వుతో మళ్ళీ చిత్రంవైపు చూశాడు. 'సరళా, చూశావా నీ మొగుడి అవస్థ! ఎంతో యోగ్యత వున్నవాడని నువ్వు అనుకున్నావు. అయితే అనవసరపు ఇక్కట్టులో చిక్కుకుని ఆ జ్ఞాపకాలు వదలకపోగా బాధ పడుతున్నాడు.' రామన్న లేచి అటూ ఇటూ పచార్లుచేయ ప్రారంభించాడు. చేతులు వెనక్కు పెట్టుకున్నాడు. అడుగుల్నే చూసుకుంటూ, ముఖాన్ని క్రిందకు దించుకొని అక్కడ్నుంచి యిక్కడికి తిరిగేటప్పుడు, ఒక్కసారి 'ఆ పాడుసినిమాకు వెళ్లడమే దీనికంతా కారణం. మమ్మల్ని సినిమాకు పంపించింది సరళే' అనుకున్నాడు. కోపం వచ్చింది. ఎవరిమీద అనేది స్పష్టం కాలేదు కాబట్టి, కుర్చీని బలంగా లాగి, దానిలో కూలబడి ఎదటిగోడను చూస్తూ కూర్చున్నాడు.

లోపల సినిమా ఆలోచన, బయట ఎదురుగా గోడ. చూడగా చూడగా రామన్నకు ఆ రోజు కుముదను సినిమాకు తీసుకొనివెళ్ళిన అనుభవమే బాధ పెట్టింది. ఇప్పటికీ కుముద తన ఎడమప్రక్క కుర్చీలో కూర్చున్నదో అన్నట్లు, కొంచెం ఎడమవైపుకు ఒంగి కూర్చున్నాడు. ఆ రోజు సినిమాలో కూర్చున్నప్పుడు ఆమెని స్పృశించాలనే ఆశ, చేతిని చేతులోకి తీసుకోవాలనే కోరిక. ఒక్కొక్కమారు

ఆమెను తనబాహువుల్లో బంధించాలనే వాంఛ - వీటన్నిటిని మనసులోంచి తొల గించటానికై అతను కుముదకు సినిమా కథను వివరించడానికి పూనుకున్నాడు. ఎంత మాట్లాడాడు ఆ రోజు! కుముదమాత్రం ఉఁ అనికూడా అనలేదు. అయితే ఒకటి రెండుసార్లు చీకట్లో మాట్లాడే తనను చూసేటప్పుడు, తెరమీద బొమ్మ పడే వెలుగులో ఆమె రెండుకళ్ళూ మిలమిల లాడినప్పుడు. ఆ ముఖాన్నొత్తి ముద్దాడా లనిపించింది. చటుక్కున ఆగిపోయి మాటలు ఆపాడు. ఇది యెవరితప్పు! తనదా? సరళదా? ఇంతకాలం జరిగిన తర్వాతకూడా రామన్నకు ఈ ప్రశ్నకు సమా ధానం దొరకలేదు.

తప్పెవరిదైనా కానీ, అనుకున్నట్లుగా జరిగిందికదా ఆ సంఘటన? కుముదకు సినిమానుచూసే అపరిచిత అనుభవంవల్ల వుల్లాసం, తనకు కుముదను చూసి వుల్లాసం, ఆ మర్నాడు తను అదే వుల్లాసంతో వున్నప్పుడు ఎలాంటిమాట తన నోటినుంచి వచ్చిందో! ఆ మాటవల్ల - ఎంతటి తమాషా! - ఆ జ్ఞాపకానికి రాని, పనికిరానిమాటవల్ల ఎప్పటికీ మరిచిపోలేని కథ ప్రారంభమయ్యింది! కుముద - కోపమో? నిజంగానే తలనొప్పో? - అసహనాన్ని తొలగించటానికి తను ఆమె గదికి వెళ్ళినప్పుడు రామన్నకు పూర్తిగా అర్థమైంది - కుముద తనకు అధీన అని....ఇప్పటికీ ఆ మొదటి అనుభవం జ్ఞాపకం వుంది........ఇష్టంగా ఆమె చెయ్యిపట్టుకొని లేపాలని తను చెయ్యిచాచి - ఆమెచేతిని పట్టుకో బోయినప్పటి ఆ సంఘటన ఇప్పటికీ జ్ఞాపకం వుంది. జ్ఞాపకంవస్తే - తనేమి నాగరక మనుష్యుడా? పశువా? (అయితే పశువుకు ఇంత స్మృతి వుంటుందా?) ఇప్పటికీ ఆనందంతో వొళ్ళు ఝుల్లుమంటుంది. ఆమెకూడా తనచేతుల్ని వక్షం మీద పెట్టుకుని పడుకుంది. చెయ్యి పట్టుకోవడానికి తను చెయ్యి చాచినప్పుడు ఆమె చేతివేళ్ళుమాత్రం తనచేతికి తగిలినా వాటికితోడుగా తతిమ్మా శరీరానికీ తనచెయ్యి తగిలింది. ఒక్కనిముషం మాట పెగల్లేదు. ఎక్కడామె భయపడుతుందో లేక అరుస్తుందో అని. అయితే అంతలోనే ఆమె తన చేతివేళ్లను తొలగించి తనకి పూర్తి అవకాశాన్ని ఇచ్చింది. అప్పుడు రామన్నకు పూర్తిగా నమ్మకం కుదిరింది. మైమరచినట్లయింది; అయినా చాలాశ్రమతో, బుద్ధిపూర్వకంగా ఓర్చుకున్నాడు. 'కుముదను తీసుకొస్తాను' అని సరళకు చెప్పివచ్చాడు. ఇప్పుడు కాలయాపన

చేయటానికి వీల్లేదు. అయితే దొరుకుతున్న అవకాశాన్ని వదిలెయ్యటానికీ లేదు- అనుకొని ఒకమాటచెప్పి ఆమెను లేపాడు. ఎంత చమత్కారమైనమాట అది! నిజమైనప్రేరణ తనకెప్పుడైనా వచ్చివుంటే ఆమాటను చెప్పినప్పుడు వచ్చి వుండాలి. 'సరళకోసం అన్నం తిను, నేను ఆతర్వాత క్షమాపణ అడుగుతాను' ప్రేరణ కలగడానికి కారణం రహస్యం బోధపడినట్లయింది - లేక ప్రేరణ అనేది మరేమీ కాదు. సహజమైన కామతృప్తికోసం మైమరచే ప్రకృతిగుణంవల్లనే ప్రేరణ కలుగుతుందా!

అప్పుడుకూడా ప్రేరణనిగురించిన ఆలోచన రావడానికి వొక విశేష కారణ ముంది. ఆ రాత్రి తను కుముదను కలవడం భావుకుడైన అతనికీ ఒక కొత్త శక్తి నిచ్చింది. ఆ రోజే ఒక కొత్త పుస్తకం రాయటానికి ప్రారంభించాడు. ఆ పుస్త కాన్ని తను యెప్పటికంటే యెక్కువగా మైమరచి రాస్తున్నాడు. రామన్నకు ఆశ్చర్యం కలిగింది. ఒకదృష్టితో, సమాజాన్ని సుగమంగా సాగించడానికి చేసు కున్న నియమాల-లౌకికదృష్టితో చూస్తే తను చేసింది అపరాధం, పాపం; అయినా తన మనస్సు ఉల్లాసభరితంగా వుంది, తనబుద్ధి చురుకుగా వుంది, తనశరీరానికి బలం వచ్చినట్లయింది, ఎందువల్ల? కుముదమీద తనకు ప్రేమ వుందా?

ఈ ప్రశ్నకు మర్నాడు సమాధానం దొరికింది. గట్టి సమాధానం, కుముదమీద తనకు ప్రేమ లేదని. ఎందుకంటే లేవగానే రామన్న సరళదగ్గరకే వెళ్ళాడు. తను ప్రారంభించిన పుస్తకంగురించి ఉత్సాహంతో ఆమెకు చెప్పనారంభించాడు. ఆమె అభిమానపూరితమైనదృష్టితో చూడగానే ప్రపంచంలో సరళ, తను తప్పితే ఎవ్వరూ లేరన్నంతగా మైమరచాడు. ఇంత యెందుకు? రోజంతా సరళదగ్గరనే కూర్చు న్నాడు. 'రాయటం లేదూ?' అని అడిగినప్పుడు, 'రాత్రికి రాసుకుంటాను' అని జవాబు చెప్పాడు. 'అయితే ఏ లక్ష్యమూ లేకుండా నన్నుచూస్తూ ఇక్కడ ఎందుకు కూర్చున్నారు?' అని ఆమె అన్నప్పుడు 'బయట నాకేమీ పనిలేదు, లోపల వున్నది. ఎందుకంటే నువ్వు లోపల వున్నావు' అన్నాడు. అందు కామె 'మొదలయినాయి తియ్యటి మాటలు' అని సిగ్గుతో అన్నప్పుడు, 'తియ్యటి మాటలు కాదు, నిజమైన మాటలు. పిచ్చిదానా, లోపల నువ్వులేకుండా బయట పుస్తకమే రాయను' అంటూ

చటుక్కున ఆమె నుదుటిని చుంబించాడు. వీటి అన్నిటివల్ల సరళమీదనే తనకి దృఢమైన అనురాగం అని తెలిసేలోపల సంశయపిశాచి ప్రవేశించింది. సరళమీద ప్రేమ అనేందుకు నేను ఇలా ప్రవర్తిస్తున్నానా, లేక సరళకు చేసిన అన్యాయానికి నష్టపరిహారం ఇస్తున్నానా? వెలుతురు మాసిపోగానే ఈ సంశయానికి జవాబు దొరికింది. పొద్దుట్నించి అంతవరకు అతను కుముద కళ్ళను తప్పించుకొని తిరిగినా పొద్దుపోయేకొద్దీ ఆమెను చూడాలి అనిపించింది. అప్పుడప్పుడు కావాలి-వద్దు అనే రెండు పగ్గాలవల్ల ఇరుప్రక్కలకు లాగబడినందువల్ల మూడోదారిని మనసు ఎంచుకున్నదేమో అన్నట్లుగా ఓరచూపుతో కుముదను చూస్తున్నాడు. చివరకు రాత్రి అన్నం తిన్నతర్వాత కొంతసేపు సరళతో మాట్లాడి ఆతర్వాత 'ఇంక రాయడం మొదలెడుతాను' అని గబగబా లేచి, బయటపడుతుండగా తలుపువైపు తిరిగి నిలుచుకొని 'రేపు చెప్తాను నీకు ఎలా జరిగింది నారాత అనేది' అని సరళతో చెప్తూవున్నప్పుడు కళ్ళు ఎదుటి తలుపువైపే చూశాయి; ఆ తలుపుకు కొంచెం వెనక నిలిచిన కుముదను చూసి నవ్వుతో 'నా గదికి వెళ్తున్నాను' అన్నాడు, కుముదకు అది సందేశం అన్నట్లుగా.

దేహము, బుద్ధి ఈ రెండింటిమధ్య పోరాటంవల్ల రామన్న కొన్నిరోజులవరకు బాధ పడ్డాడు. శరీరానికి కావాలనుకున్నది, బుద్ధికి వద్దనిపించుతుంది; అయితే యెప్పుడూ శరీరం కోరిక సంతృప్తి చెందినతర్వాతనే, ఎన్నోసార్లు బుద్ధికూడ వద్దని వాదించినకొద్దీ శరీరంలో మొండితనం ఎక్కువవుతుండేది. అయినా దేహం-బుద్ధి పరస్పరం వైరుధ్యభావంతో పోరాడుతున్నాయి అని చెప్పేందుకూ లేదు. ఎందుకంటే, ప్రతిసారి దేహం తృప్తిపొందినంతమేరకు బుద్ధి చురుకవుతుంది. రాసే అలవాటువుండే రామన్నకు దీనివల్ల ఆశ్చర్యం కలగడం కాకుండా భయమూ వేసింది. మానవుని సంస్కారంతోకూడిన బుద్ధి నడవడికమీద ఈవిధంగా దేహం ప్రభావం వుంటుందా? ఈమాట నిజమైతే నైతిక సంస్కారమనేది సారం లేని ఆత్మవంచనే అవుతుంది. ఛీ! ఇది సరైన ఆలోచనకాదు. ఆకలి సహజమైన సంస్కారం అనుకుంటే మనుష్యుడు ఏదిపడితే అది చిక్కినచోట చిక్కినట్లు తినడు కదా? తరువాతికాలంలోమాత్రం అలాంటి నడవడి అక్కడక్కడ జరగడం తెలుస్తుంది. అంటే? కామవాసనకూ అలాగే వుందా? భార్య మంచమెక్కడం

తనపాలిటికి మంచిదే అయిందా? అందుకోసమే తను ఇలా ప్రవర్తించాడా? ఎందుకు కాగూడదు? ప్రతి సహజమైన సంస్కారానికి సకాలంలో తృప్తి లేకుంటే అది మానవుణ్ణి ఇలా పిచ్చిపట్టించి ఆడిస్తుందా?

తన జీవితంలో రామన్న యీవిధంగా ఆలోచించడం అదే మొదటిసారి, అదే చివరిసారి అనీ చెప్పవచ్చు. ఇప్పటికీ కుముద యింట్లోనే వుంది. సరళ ప్రతిబంధకంకూడా లేదు. అయితే తన మనసు కుముదను కోరడానికి సిద్ధంగా లేదు. ఈరోజు సినిమాకు వెళ్ళాలని ఆమె మనసులో తీవ్రమైనకోరిక కలిగిందేమో! పోలేదు. మంచిదే అయింది. పోయివుంటే, వెనుకటిలాగానే జ్ఞాపకాలు వచ్చివుంటే తను అక్కణ్ణుంచిలేచి పరుగెత్తి వెళ్ళేవా డనిపించింది. కుర్చీనుంచి ఇప్పుడూ లేచాడు, మళ్ళీ అటూ యిటూ పచార్లుచేయ నారంభించాడు. భార్య చిత్రం ఎదురుగా నిలుచున్నాడు, ఏదో ఆలోచనవచ్చి తల ఆడించాడు. మళ్ళీ వచ్చి కుర్చీలో కూర్చొని ఏదో గొణిగాడు.

ఏమిటి తను గొణగడం?- రామన్న తననే ప్రశ్నించుకొన్నాడు. ఆ వాక్యం తన జ్ఞాపకానికి యెందుకు వచ్చిందో? ఓహో! 'కామం' అనేశబ్దం మనస్సులో చుట్టు తిరుగుతున్నందువల్ల ఇలా అయివుండవచ్చు....అదేవాక్యాన్ని యిప్పుడు గట్టిగా వుచ్చరించాడు: సోఽకామయత బహూస్యాం ప్రజాయేయ ఇతి....రాసినవాడు పేరుకు ఋషి అయినా బుద్ధి యెంత వక్రమైంది, అయినా ఉపనిషత్కాలపు యీ మహర్షి చెప్పిన యీ మాటలో ఎంత సత్యార్థం గర్భితమైవుంది! ప్రపంచం యెలా పుట్టింది అనే విషయమంతా తెలిసినవాడిలా అందరికీ తెలిసినదానినే చెప్పిన ఇతని గాంభీర్యం తుంటరితనంకాక మరేమవుతుంది? మొదట 'అది' వున్నదట-కాదు-'సః' అంటే 'అతను' వున్నాడట; అతను 'కామించాడ'ట, నేను అనేకం అవుతాను, పుట్టిస్తాను, అని; సృష్టి అయిందట! ఎంత సుగమంగా వుంది ప్రపంచ మూలం! అయినా యిందులో కొత్తమాట యేముంది? జగత్తులో సృష్టించే శక్తి, కామం వున్నదట; 'కామవాసన' అనేశబ్దాన్ని వాడితే అదేమాట అసహ్యమనిపిస్తుంది. అయినా వుపనిషత్తులో చెప్పిన కామం, కామవాసన ఈ రెండూ సృష్టించే ఒకేశక్తి గదా? ఇది మూలశక్తి అని చెప్పి మహర్షి ముత్తాత వుపకారమే

చేశాడు. అయింది - ఇప్పటివరకున్న తన నడవడికి ఉపనిషత్తు యోగ్యతాపత్రం దొరికినట్లయింది.

రామన్న కుర్చీలోంచి లేచాడు. మళ్ళీ గడియారాన్ని చూసుకొన్నాడు. పదకొండుగంట లయింది! ఎంత పిచ్చివాడు తను! ఇంతసేపటివరకు వ్యర్థంగా మతి పోగొట్టుకున్నాడు. తను సరళను ప్రేమిస్తాడా? కుముదనా? ఎవరికి కావాలి జవాబు? దాని అవసరంమాత్రం యేమున్నది? సరళపోయి మూడునెల లయింది. కుముదమీద తనకు శ్రద్ధే లేదు. ఇవి తెలిసీ ఆలోచించడం దేనికి? నిద్రవచ్చేవరకు ఒక సంస్కృత పుస్తకమైనా చదువుదాం, వుపనిషద్వాక్యం జ్ఞాపకంవచ్చి వుపకారమే కలిగింది. అని బల్లదగ్గరవున్న షెల్ఫ్‌నుంచి ఒక పుస్తకం తీసికోడంలో నిమగ్నమయ్యాడు.

## 10

పడుకునే ప్రయత్నంలో పరుపుమీది దుప్పటిని తియ్యాలని చెయ్యి ఎత్తగానే చేతిగడియారం ముళ్ళు కుముద కళ్ళముందు మెరిశాయి; పదకొండు అయింది! రాత్రి యింతసేపయిందని తెలిసేసరికి కుముద అన్నిట్నీమరిచి చిత్రంలోని బొమ్మలా నిలుచుండిపోయింది. ఇదే సమయం; తను ఎప్పటికీ మరువలేని సమయం. కుముద నిట్టూర్చి పరుపుమీద కూర్చున్నది. తను సరళక్క విషయంలో పాపంవల్ల ప్రేరేపింపబడలేదు అని ఒక్క నిముషం ముందు అనుకుంది. ఆ నిర్ణయం యిప్పుడు పటాపంచలయింది. రాత్రి పదకొండు గంటలయింది అనేది గుర్తుకు వచ్చేసరికి వెనుకటి దృశ్యమొకటి హఠాత్తుగా కళ్ళముందు నిలిచింది. తన మనసులో తన శుద్ధ అంతఃకరణాన్నిగూర్చి వున్న ఆత్మవిశ్వాసాన్ని పక్కకు నెట్టింది. రాత్రి పదకొండుగంటలు. ఆ రోజు ఇదేసమయం; రెండు మూడు రోజులైంది. తను రామన్నకు బందీఅయి - మొదట తను భయపడింది, మొదటి జ్ఞాపకం ఆ భయాన్ని రేకెత్తిచ్చింది; మర్నాడు పొద్దున్న లేవగానే కాళ్ళు గడగడ వణికాయి. సరళక్కకు మొహం చూపించేది యెలా - అని అధైర్యం కలిగింది. రామన్న యిప్పుడు తన్ను మాట్లాడిస్తాడా? చీకట్లో కరుణాపూరితంగా కనిపించిన అతనిముఖం,

నవ్వుతో మెరుస్తున్న అతని కళ్ళు వెలుతురులో వేరుగా కనిపిస్తాయా? అతనికి తనముఖం చూపడం సాధ్యమా? అని ఏదో ఆలోచిస్తూ దినచర్యలో మునిగింది. అయితే సరళక్క, రామన్న ఎప్పటిలాగానే కనిపించడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది. రెండవరాత్రి రామన్న మళ్ళీ వచ్చాడు. అప్పుడూ అతనితో మాట్లాడే ధైర్యం కలగలేదు; మూడోరాత్రిమాత్రం - యెక్కడ్నుంచి ధైర్యం వచ్చిందో తనకు! - రామన్న ఆగమనాన్నే నిరీక్షిస్తూ కూర్చున్నది. 'ప్రేరణ నొసగే దేవి వూరక కూర్చున్నదే?' అన్నాడు.

మాట్లాడా లనిపించినా ధైర్యంచాలక తను తల ఆడించింది.

'ఇదేమిటి? ఓహో! తెరచిన నీ కన్నులు నీకే కనిపించవు, కదూ?' అన్నాడు.

ఈసారి వచ్చిన నవ్వును ఆపుకుంటూ తల ఆడించింది.

రామన్న రాగానే తన తలను గట్టిగా పట్టుకొని, 'తల ఆడించడానికి సాధ్యం కాకపోయిన తర్వాతఅయినా నోరు తెరుస్తావా లేదా? ఊఁ?' అని ముఖానికి ముఖం దగ్గరపెట్టి అడిగాడు.

'మీ ముందు మాట్లాడే యోగ్యత నాకు___' ఇదే ఆమె మొదటిమాట. అదీ వాక్యం పూర్తి కాలేదు.

'నోటితో మాట్లాడితేనే మాట్లాడినట్లని అనుకుంటున్నావా నువ్వు?'

'అంటే?'

'అంటే యేమిటి? ఈ నాలుగురోజులుగా నాకంటె నువ్వే ఎక్కువగా మాట్లాడావు?' అన్నాడు రామన్న.

'నాకు తెలియనే తెలియదు!'

'అబ్బ. తెలీదు అన్నప్పుడు ఇంత మాట్లాడితే తెలిసినతర్వాత ఎంత మాట్లాడాలి!'

కుముదకు భయమేసింది. తనేమైనా కలలో కలవరించిందా - అని.

'కలలో నేనేమైనా___' అని తను చెప్పేంతలో రామన్న నవ్వేశాడు.

'పిచ్చిదానా! కలలో - అట! ఒకవిధంగా అది నాకు కల కావాలి. నువ్వు

మాత్రం మెలకువగానే వున్నావు. ఇంతగా ఎందుకు భయంగా చూస్తావు నన్ను? అందుకే చెప్పలేదా, నోటితో మాట్లాడితేనే మాట్లాడినట్లు కాదు అని. నువ్వు పెట్టిన వాక్కొక్క అడుగు మాట్లాడుతుంది. నీ సగం తెరిచినపెదవులే మాట్లాడుతున్నాయి. ఇంతెందుకు? నీ మౌనంకూడా మాటకారిగా వుంది. వాటిమాటల్ని విని కదా నేను యిలా పిచ్చివాడినైంది? ఆఁ! చెప్పవే! ఇప్పుడు మాట్లాడు— నోటితోకాదు మళ్ళీ' అంటూ తన నోటితో కుముద నోటిని మూశాడు. ఆ రాత్రి చీకట్లో తామిద్దరే పడుకున్నప్పుడు మృదువుగా రామన్న ఎలాంటిమాటల్ని చెప్పాడు! 'నీవు నా ప్రేరణ దేవివి. అబద్ధం కాదు. కావాలంటే నా గదికివచ్చి చూడు. నీ సహవాసంవల్ల ప్రేరితుడినై నేను కొత్తపుస్తకాన్ని ప్రారంభించాను....ఆఁ?.... పిచ్చిదానివి నువ్వు! ఒక్కరాత్రి నిన్ను చూడకపోతే నా కలం నిలిచిపోతుంది.... నీవల్ల కొత్తచైతన్యం వచ్చింది నాలో....నా సాహిత్యజీవితప్రాణం నువ్వు....' అని యేమేమో చెప్పాడు. ఆ మాటలవల్ల తనూ మైమరచింది. ఆనాడు తనంత తానే రామన్నను బిగిగా కౌగలించింది. తనను వదలి వెళ్ళిపోతాడేమో అని భయం కలిగినట్లు, ఇదంతా యిలా జరగడంవల్లనే మర్నాడు ఆమెకు ఆశ్చర్యం కలిగింది. రామన్న యింకా రాలేదు. చేతిగడియారాన్ని చూసింది, సరిగ్గా రాత్రి పన్నెండుగంట లైంది; ఇంత ఆలస్యం! రోజూ ఇంతకంటె ముందే రావలసిన రామన్న ఇంకా రాలేదే! నిరీక్షణ సహించరానిదైంది. ఒకనిముషం వూపిరి బిగపట్టినట్లుగా శ్రద్ధతో చెవిఒగ్గి విన్నది. ఎక్కడినుంచో గుసగుసలు మాట్లాడినట్లు శబ్దం వినిపించింది! ఇంత పొద్దుపోతే ఎవరు మాట్లాడుతున్నది? సరళక్కేమో, తొమ్మిదిగంటలకు నిద్రపోతుంది. ఆఁ-రామన్నే ఏదో చదువుతూ కూర్చుని వుండాలి! ఆ వొత్తిడివల్ల తనదగ్గరకు రావడం మరచిపోయివుంటాలి. అప్పుడు కుముద అల్లరిగా చిరునవ్వు నవ్వింది. ఇంతగా అంతటినీ తననీ మరచి రామన్న చదువుతున్నాడు కదా! మెల్లిగా నడిచివెళ్ళాలి. 'నాకు ప్రేరణదేవి అని ఇచ్చిన సర్టిఫికేటు చూదాలని వచ్చాను. మీరేకదూ చెప్పింది గదికివచ్చి చూడమని - అని చెపితే పోతుంది. తనను చూసి రామన్న అదిరిపడేదృశ్యాన్ని వూహించుకొని కుముద తనలో తనే నవ్వుకున్నది. మెల్లిగా పక్కమీంచిలేచి, సద్దు చేయకుండా రామన్న గదితలుపుదగ్గరికి వచ్చింది. కానీ పిడుగుపడినట్లుగా నోట మాటరాక నిలు

చుంది. గదితలుపు మూసివుంది. లోపల దీపమూ లేదు. ఇందువల్ల ఎంత నిరాశ కలిగిందో దానికితోడుగా అసహనంతో కోపమూ వచ్చింది. ఎందుచేతనంటే, గుస గుసలు మాట్లాడేశబ్దం సరళక్క గదినుంచి వినిపిస్తున్నది. ఆ తలుపూ సగం తీసి వుంది. లోపల దీపం వెలుగుతోంది; అదంతాచూసి ఆ రోజు తనకు కోపం రావడ మేమో నిజం. చకచక గదికివెళ్ళి, తలుపు లోపల గడియపెట్టుకొని దీపాన్ని ఆర్పి మాట్లాడక పడుకోవాలనిపించింది. మరుక్షణం ఏదో ఆపుకోలేని కుతూహలం ఆమెను సరళక్క గదితలుపుదగ్గిరకి నెట్టింది. 'రామన్న సరళక్కతో మాట్లాడుతూ తనని మరిచిపోయాడు' అని ఒకమారు, 'రామన్న తనభార్యతో మాట్లాడుతున్నాడు' అని మరోమారు తనకుతానే నచ్చచెప్పుకుంటూ, తలుపుదగ్గర నిలుచోగానే, 'అంతమాత్రమయితే నేను సుఖంగా కళ్ళు మూసుకుంటాను' అనే సరళక్కమాట వినిపించింది. కుముద మొదలు వులిక్కిపడింది; ఇదేమిటి అక్క చివరి ఘడియలా అనే భయంతో గదిలోకి అడుగుపెట్టబోయింది. అంతలో రామన్నమాట వినిపిం చింది. 'ఇప్పుడు వున్నదానికంటే మున్ముందు నాకు ఎలాంటి సుఖమూ లేదు' అని. ఇప్పుడుమాత్రం కుముద ఆపుకోలేకపోయింది. మెల్లిగా మోకాళ్లమీద ఒంగి చూసింది, ఒక్కనిమిషం. ఆ నిమిషంలో ఆమెకు కనిపించినదృశ్యం ఆమెను అక్కడ్నుంచి బలమైన ప్రభంజనంలా ఎత్తి, తనగదిలో పడేసింది....

కుముద మళ్ళీ చేతిగడియారాన్ని చూసుకొని నిట్టూర్చి లేచింది. ఇలా పడు కుంటే ఆ వెనకటిజ్ఞాపకం తనను పీడించకుండా వదలదు అనేది ఆమెకు తెలుసు. ఆ జ్ఞాపకం అంటే నిజంగానే ఒక పీడగావుంది. అందులోనూ సరళక్క పోయి నప్పటినుంచి అదొక భయానక అనుభవ మనిపించింది. ఆ రోజు తను ఎంత అన్యాయం చేసింది? తనకు ఆ నిమిషంలో కనిపించినదృశ్యం ఏమిటి? అదీ పోనీ, అలాంటి కుత్సిత కుతూహలం తనకి యెందుకు కలిగింది? పాపం! నెలుబగా మంచమెక్కిన సరళక్క మనస్తాపం ఎలా వుండాలి? అలాంటివేళ భర్త ఆమెను ఓదార్చితే తప్పేమిటి? అది తప్పనడానికి మరొకరికి అధికారం వుందా? ఇంతైనా తను చూసిందేమిటి? భర్త తొడమీద తలపెట్టుకొని, ప్రేమరసంతో మెరుస్తున్న కళ్లతో ముఖాన్ని పైకెత్తి, భర్తముఖాన్నిచూస్తూ, సరళక్క పడుకునివుంది. భర్త ఒకచేతిని ఆమె తలకురులని నిమురుతూ మరొకచేతితో భార్య చేతినెత్తి తన గడ్డా

వికి ఆనించాడు. నవ్వుముఖంతో భార్యముఖాన్ని చూస్తున్నాడు. ఇంతే; తను చూసిన దృశ్యం.

అయితే ఆరోజుమాత్రం ఆ దృశ్యం ఆమెకు నిప్పులా కనిపించింది. ఆలోచనలతో వేడెక్కి మెదడు వేడెక్కిపోతోంది. ఒకదానొకటి తోసుకుంటున్న ఆలోచనలు హృదయంలోంచి ఎగసిపడుతున్నాయి. వున్నదానికంటే మరో సుఖమే లేదంటూ! అతన్ని మరొకసారి గదిలో కాలు పెట్టనివ్వకూడదు. అతనిచెయ్యి తన శరీరాన్ని మరెప్పుడూ తాకకూడదు. ఎలా చూస్తున్నాయి ఆ కళ్ళు! గుండెలో శూలం గ్రుచ్చినట్లయింది. మోసగాడు! కపటి! తనిక్కడ దారికాస్తూ, కళ్ళు కాయలుకాచి కూర్చుంది! ఏం యేకాంతమో మరి మంచమెక్కిన భార్యతో! మరొక్కసారి-యెప్పటికీ-చనిపోయేవరకు-కళ్ళెత్తి చూడకూడదు. అతనితో పెదవి విప్పి మాట్లాడకూడదు. వచ్చినా రానీ!....కోపంపు ఆలోచనలభారంతో కుముదకు జ్ఞాపకం వచ్చింది. తను గదితలుపు లోపల గడియపెట్టుకున్నట్లు. అలాగయితే అతను ఎలా వస్తాడు? అతను రావడానికి అవకాశం లేకుంటే తన మనసులోని మాటల్ని చెప్పేది ఎలాగు? ఒకవేళ తలుపు వేసివుండడంచూసి 'మంచిదైంది' అనుకొని బయటనుంచి అలాగే వెళ్ళిపోవచ్చు కదా! అతనికి అలాంటి అవకాశాన్నే యివ్వకూడదు. ఇక్కడివరకు అతను నడిచిరానీ, నేను పడుకునుండడం కళ్ళారా చూడనీ, అప్పుడు నా దగ్గరకు రానీ. చూద్దాం అనుకొని కుముద లేపడమే కాదు, తలుపూ తెరచివుంచి, దీపం వెలిగించి, పరుపుమీద పడుకుంది. 'పడక మీంచి లేపలేనిభార్య! ఎవరి భయముంది?' అని దుఃఖంతో కుమిలిపోయింది.

కుముద చిరచిరలాడుతూ అలాగే ఎంతసేపు పడుకున్నదో! ఇప్పుడు వస్తాడు, మరోక్షణంలో వస్తాడు, వస్తే నేను ముఖాన్నికూడ ఆవైపు తిప్పను అని మొండిగా అనుకుంటూ ముఖం తిప్పుకొని పడుకొనింది. ఇంకా రామన్న రాలేదు అని తెలియగానే మళ్ళీ తలుపువైపు ముఖంతిప్పి నిరీక్షించేచూపుల్తో కళ్ళు తెరిచి పడుకొనింది.

ఆ రాత్రి తన ప్రవర్తనకు కుముదకు మొదట ఆశ్చర్యమనిపించింది. తనకు ఎంత రభసగా కోపం వచ్చింది? తను ఎంత గట్టిగా నిశ్చయించుకొంది! అయితే

యేమైంది? చివరికి రామన్న రాగానే మనసులో అనుకొన్నట్లు యేమీ జరగలేదు. అందువల్ల రామన్నమీదా ఆమెకు కోపం కలిగింది. రామన్న వస్తాడు. రాగానే తన్ను మాట్లాడిస్తాడు. ఆలస్యమైనందువల్ల తను కోపపడినందుకు ఏదో సాకు చెప్తాడు. అప్పుడు తను మౌనంతో, తిప్పుకున్నముఖంతో, చివరికి గ్రుచ్చేమాటలతో అతని మనస్సును నొప్పించాలి అని అంచనావేసి సిద్ధంగా పడుకుంది. అయితే రామన్న రాగానే మొదట తలుపుమూసి దీపాన్ని ఆర్పేశాడు. కుముద శస్త్రం వొకటి జారిపోయినట్లయింది. ఎందుకంటే చీకట్లో మాట్లాడకుండా తన కోపాన్ని తెలియజేయడమెలా? అందుకోసం ముఖం తిప్పుకొని పడుకొని అతను మాట్లాడుతాడని ఎదురుచూసింది. అతనెందుకో నిట్టూర్పు విడిచాడు. ఆహా! ఏదో టక్కరితనపు ఆట అయి వుండవచ్చు. నేను మెత్తపడకూడదు అని గట్టిగా - చీకటిగావున్నా - కళ్ళు మూసుకుంది. రామన్న వొకటి రెండు నిముషాలలో దగ్గరికివచ్చి పడుకున్నాడు; కొంచెం దూరంగా జరిగింది. చేతిని ఆమె వొంటిమీదవేసి బలంగా ఆమెను దగ్గరికి లాక్కున్నాడు. మనస్సుకు సుఖమనిపించినా చీకట్లో అతనికి కనిపించదు. మంచిదే అయింది అని ఇంకా రామన్నవైపు ముఖం తిప్ప లేదు. ఒక్కసారి మాట్లాడనీ, ఆతర్వాత చూద్దాం అనుకునింది. అయితే రామన్న నోరు విప్పలేదు. పాములవాడు పామును తనకు యిష్టమొచ్చినవైపు తిప్పుకొనేట్లుగా, కుముదని తనవశం చేసుకున్నాడు. అరచేతిలో వుంచుకున్న మంచుగడ్డలా రామన్నచేతికి చిక్కిన ఆమెశరీరం కరిగి నీరయ్యింది; శరీరం ఆశ్రయం తప్పిపోయినందుకేమో అన్నట్లుగా ఆమెహృదయం రామన్న హృదయానికి దాసురాలయింది; యౌవనంలోని సహజవాంఛముందు కృత్రిమకోపం నామరూపాలు లేకుండా పోయింది. ఒక్కనిముషం వెనకటి జన్మజన్మాంతరాల అనుభవాలన్నీ మరచిపోయినట్లుగా సద్యస్సుఖంలో తన్మయురాలైంది; మరొక్కనిముషం, చిరం తనసుఖం దొరికిందన్నట్లుగా వర్తమానాన్ని మరిచి సుఖాన్ని సూచించింది; మరొక్కనిముషంలో, సంసారాన్నంతా క్షమించను అర్హమైన వాత్సల్యంతో ఆమె హృదయం విశ్వాకారమై నిలచినట్లయింది. ఇలాంటి అనుభవాన్ని ఒసగిన రామన్నమీద కోపం తెచ్చుకోవడమా? పూర్వజన్మలో ఏ పుణ్యం చేసిందని నేడు తనకు ఈ దుఃఖవిమోచన దొరికిందో? అప్పుడు కుముద నిండినహృదయంతో

రామన్నను బలంగా కౌగలించుకోవాలని దగ్గరకువచ్చి చేతులు చాచింది—అక్కడ యెవ్వరూ లేరు! ఇదేమిటి కలో భూతచేష్టో అని భయపడేలోపల మెల్లిగా తలుపు మూసుకొని ఎవరో బయటపడ్డట్లు శబ్దమైంది. రామన్న వెళ్ళిపోయాడు.

ఇదేమిటి? ఇలా ఎందుకైంది? అంటూ కుముద చటుక్కున పరుపుమీద లేచి కూర్చుంది. ఎందుకు వచ్చాడు? అలా యెందుకు వెళ్ళాడు? ఆ ప్రశ్నలకు సమాధానం కుముదకు తెలియదని కాదు. అయితే ఆ సమాధానం ఆమెకు అక్కరలేక పోయింది, మనస్సుకు అసహ్యమనిపించింది. అస్తవ్యస్తంగావున్న తన ఒంటి మీది వస్త్రాలు, నుదుటిమీద చెమటబిందువులు, దడదడ కొట్టుకుంటున్న గుండె, వణుకు - ఇదంతా రామన్న వచ్చివెళ్ళినందుకు సాక్ష్యంగా వుంది. అయితే అతను వచ్చి వెళ్ళినందుకు ఇంతే కారణమా? శరీరసంబంధమే కాని మరే సంబంధమూ లేదా?

తను కోపగించి వుండవచ్చునని అనుమానించి రామన్న అలా ప్రవర్తించివుండవచ్చు అని ఒకమారు అనిపించింది. అతను దీర్ఘంగా నిట్టూర్చాడుకూడా? పాపం! అతనికి యేదో మనస్తాపం వుండివుండాలి - అనే ఆలోచన వచ్చింది. ఏమై వుండాలి? కొంతసేపటిక్రితం అతను సరళక్కతో మాట్లాడుతూ కూర్చున్నది చూడలేదా? అక్కడ ఏమైనా మనస్తాపం కలిగిందా? సరళక్క యేమైనా మనస్సు నొప్పించేలా మాట్లాడిందా - లేక-లేక? కుముద ఆలోచనతోబాటు ఆమె గుండె కూడా ఆగిపోయినట్లయింది. సరళక్కకు తెలిసిపోయిందా? ఆ ఆలోచనవల్ల ఒకే ఒక్కక్షణం కుముద భయపడింది. మరుక్షణం మొదట్లో కలిగినకోపం, అసహనం రెండూ మాయమయాయి. మంచమెక్కి, వూపిరి వుండీ లేనట్లయిన, రామన్న లాంటివానికి కాళ్లకు బంధంలాంటిదైన సరళక్క భర్తమనస్సును నొప్పించి వుండాలి అని కుముదకు అనిపించింది. ఏదో అన్నదికదా ఆమె! ఏమిటి? ఆఁ- అంత అయితే నేను సుఖంగా కళ్ళు మూసుకుంటాను, అని. అంత అంటే ఎంత? దేన్నిగురించి? సర్వదా రోగగ్రస్తురాలైన ఆమెభర్త తనదగ్గరే పడివుండాలని అనుకుంటుందా? ఈమె సుఖం-దుఃఖం ఎవరికి కావాలి? ఈమె కళ్లు మూసుకుంటే మరొకరికి సుఖం—

పరుపుమీద కూర్చున్న కుముద ఉలిక్కిపడి లేచింది. ఆమె అంగాంగమూ వణుకుతోంది. వెనకటి ఈ జ్ఞాపకం ఇప్పటికీ ఆమెను పిండి పిప్పిచేస్తున్నది. ఆనాటి తన ఆలోచనలు తలచుకుని కుముద కళ్ళు నీటితో నిండాయి. ఆనాడు సరళక్కనుగూర్చి చేసిన ఆలోచన పాపం! ఆ పాపానికి నేడు ప్రాయశ్చిత్తాన్ని అనుభవిస్తున్నాను - అనుకున్నది. పాపం! సరళక్క తన సుఖానికి అడ్డం వచ్చిందని అప్పుడు తను అనుకున్నది కదా! ఇప్పుడు సరళక్క ఎవరిదారిలోనూ లేదు. అయినా తనకు సుఖం లేదు. ఒకరి సుఖం, ఒకరి దుఃఖం మరొకరిచేతలో వుండదు అవి కుముదకు ఇప్పుడు తెలిసివచ్చింది. కొన్ని సంవత్సరాలముందు సరళక్క ప్రాణంతోవున్నప్పుడు ఈ విషయం తెలిసివుంటే? అయితే అప్పుడు తెలుసుకోవడమే సాధ్యంకాలేదు. ఎందుకంటే సుఖమనేదానివూహే అప్పుడు లేదు. రామన్న సాన్నిధ్యంలోనే తనసుఖ ముందని అనుకొని రామన్నను సరళక్కనుంచి తనదగ్గరికి లాక్కోవడమే అప్పుడు కుముద జీవితధ్యేయం అయింది. ఇంతేకాక రామన్న సాన్నిధ్యం దొరకడం రామన్ననుబట్టి వుంటుంది అన్నదీ తన కప్పుడు తెలియలేదు. ఎలాంటిపిచ్చి తనది! సాన్నిధ్యమంటే శారీరిక సాన్నిధ్యం అనుకొని ఆ సుఖాన్ని అనుభవించి ఇప్పుడు శారీరిక సాన్నిధ్యం మనస్సుకు అసహ్యమనిపిస్తున్నది. తన సౌఖ్యమార్గం తనకు తెలియలేదు. మరొకరిమీద తప్పు వేసింది. తను చేసింది తప్పు-అనుకున్నది. అందులోనూ సరళక్కనుగూర్చి అలా అనుకున్నదీ ప్రవర్తించింది పాపం అనిపించింది.

ఇంతవరకు వెనకటి జ్ఞాపకాలను మరచిపోవాలి, గట్టిగా కళ్ళు మూసుకొని పడుకోవాలి అనుకున్న కుముదకు ఇదొక్క జ్ఞాపకాన్నిమాత్రం మళ్ళీ మళ్ళీ పునరుచ్చరణ చేసుకోసాగింది. అయిందేదో అయింది. చివరకు ఈ జ్ఞాపకం కారణంగా నా పాపానికి తగిన ప్రాయశ్చిత్తమైనా కలుగుతుంది అని ఆమె సమాధానం. ఆనాటి రాత్రి, రామన్న అలా యాంత్రికంగా వచ్చి వెళ్ళినతర్వాత కోపం, అసూయ, ద్వేషం, అసహనం ఇవి ఒక్కొక్కటిగా కుముదను పిశాచాల్లా పట్టుకున్నాయి. రామన్నమీద తనకు అపారమైన ప్రేమ వుంది అని ఆమెకు విశ్వాసం కలిగింది; తన ప్రేమమార్గంలో సరళక్క ముళ్ళకంచెలా అడ్డుపడి వున్నది అనీ ఆమెకు సంశయం వచ్చింది. అయితే రామన్న తనకు జీవితపు నాడిలా, అతను లేకుంటే

తనజీవితం వెలుగులేని సూర్యునిలాటిది - అని ఎంతగా దృఢంగా నమ్మిందో అంతగా సరళక్కనుగూర్చిన భయం దూరమవుతూ వచ్చింది. ఇలాంటి ప్రేమ కఠిముఖంగా పాపం! సరళక్క అంతటి నిత్రాణ, నిర్జీవప్రాయమైన రోగిష్టి నిలవ గలదా? చివర చివర సరళక్కమీద కుముదహృదయంలో కనికరం వుదయించింది. ఆమెమీద లేని పోని ఆలోచనలు రావడమెందుకు? మంచం దిగని ఆమెనుచూస్తే ఏమి భయం? రామన్నకు ఏమి సుఖం? ప్రాణంతోవున్నా అంతే, లేకున్నా అంతే; ఎప్పటిలా ఆమెతో మెలిగితే ఆమెకూ యే అనుమానమూ రాదు అని తన యుక్తి తనే మెచ్చుకుంది. తన హృదయం రామన్నతోనే నిండిపోయింది; అక్కడ మరొకరికి ఏ నెపంతోనైనా స్థలం వద్దు - అని సమాధానపరచుకొన్నది.

అయితే రామన్న నిట్టూర్పు వదలడం తలచుకొని ఆమె మళ్లీ ఆలోచనల్లో మునిగింది. ఏదో వొక మనస్తాపం వుంది అతనికి? ఏమిటి? దాన్ని ఎలాగైనా తెలుసుకోవాలి. భార్య ఏమైనా చెప్పడం విని అతను తనమీద నిరాశచెంది వుండ వచ్చా? ఒకవేళ సరళక్కకు తెలిస్తే, లేక ఆమెకు తెలిసింది అని నాకు తెలిస్తే నేను వెనకాడవచ్చని రామన్నకు సంశయం కలిగివుండవచ్చా? అందుకోసం అతను నిట్టూర్చి వుండవచ్చా? ఛీ - అలాగయితే ఎంతసేపా మనస్తాపం? ఒకవేళ శేషుని బిగించి ఎనిమిది దిగ్గజాలచేత లాగించినా నా హృదయం రామన్నను వద లదు - ఆ మాట అతనికి తెలియదేమో! అలాంటి గాఢానురాగం రామన్నపట్ల తన కున్నది అని పూర్తిగా ఆ రాత్రి కుముద తెలుసుకున్నది. చివరికి ఆ రోజు పడు కొనేటప్పుడు కుముద దేవుణ్ణి ఒక్కటిమాత్రం వేడుకున్నది. 'దేవా, నేను ఆయన్ని ప్రేమించేంతగా ఆయన నన్ను ప్రేమించేట్లు చెయ్యి, అంతే చాలు. ఆ తర్వాత నాకు ఎవరి భయమూ లేదు, ఎవరి సహాయమూ అక్కరలేదు' అని.

ఇప్పుడుమాత్రం కుముదకు ఈ వెనకటిజ్ఞాపకం సహించరానిదైంది. అదేమి దుర్బుద్ధో? సద్బుద్ధో? 'ఆయన నన్ను ప్రేమించేట్లు చెయ్యి?' అని ఆ రాత్రి తన నోటినుంచి మాటలు వచ్చినవికదూ, ఆ మాటలు ఎంత భవిష్యం సూచించేవి అనేది యిప్పుడు రెండు, రెండున్నర సంవత్సరాలతరువాత - కుముదకు తెలిసింది. రామన్న తనని ప్రేమించడం లేదు అని. అప్పుడూ తనకు సందేహం కలిగిం దేమో! అందుకోసమే అతన్ని ఆకర్షించడానికి దేవుడిసహాయాన్ని అర్థించవలసి

వచ్చింది: అప్పుడు తనకు తెలియలేదు. అనుమానం వుంది. ఇప్పుడు, తనకు తెలిసింది — వాక్యాన్ని పూర్తిచేయకుండా కుముద పడకమీదనుంచి లేచింది. నిద్రమత్తో, ఆలోచనాభారమో - యంత్రంలా పడక సరిచేసి, ఆయాసం వచ్చినట్లు వొరిగింది.

# 11

'ద్వీపాదన్యస్మాదపి మధ్యాదపి జలనిధేర్దిశోఽప్యంతాత్ ।
ఆనీయ ఝటితి ఘటయతి విధిరభిమత మభిముఖీ భూతః ॥'

రామన్న కళ్ళు నులుముకొని సారించి చూశాడు. ఏమిటిది? ఎంతసేపట్నుంచి తను ఆ శ్లోకాన్ని ఎదుటపెట్టుకొని కూర్చున్నాడు? మనస్సును కలచివేసే ఆలోచనలను మరవడానికి సంస్కృతగ్రంథం ఒకదాన్ని చదవను తను నిశ్చయించుకున్నాడనేది తెలుసు; అక్కడా యిక్కడా చూసేటప్పుడు శ్రీహర్షుని రత్నావళీ నాటకం అతని చేతికి తగిలింది. చిన్నతనంలో చదివినప్పుడు మనస్సుకు నచ్చిన ఆ నాటకం చేతికి తగిలినందుకు అతనికి ఆనందమే కలిగింది. హాయిగా కుర్చీలో కూర్చుని, బల్లమీద కాళ్ళుచాపి మొదటినుంచీ చదవను ప్రారంభించాడు. సూత్రధారుడు ప్రస్తావన చివర 'ద్వీపాదన్యస్మాదపి' అనేశ్లోకాన్ని చెప్తాడు. ఆ శ్లోకం అర్థం ఎప్పటినుంచో అతని మనస్సులో హత్తుకొంది. బుద్ధి, తర్కాలలోనే పూర్తిగా విశ్వాసం వున్న రామన్నకు వాటి రెండిట్నీ మీరి ఒక సంఘటనను నడిపించే సహజయుక్తి (ఏమి శక్తో?) ఎప్పుడూ వినోదానికి సంబంధించిన దనిపించింది. అదేమాట ఈ శ్లోకంలో వుండబట్టి ఇది అతని మెప్పుపొందిన శ్లోకమైంది. విధి అనే సహజమైన ఆ యుక్తి (లేక శక్తి). అది మనస్సుచేస్తే రెండు వేరు వేరు ద్వీపాలనుంచి, లేక సముద్రం మధ్యనుంచి, లేక దశదిశల్నుంచి ఒకవిషయాన్ని లేక వ్యక్తిని పట్టి లాక్కొనివచ్చి తనకు తోచిన సంఘటనను జరిపిస్తుంది. మనిషికి యేది ఆకస్మిక సంఘటన అనిపిస్తుందో అది ప్రకృతిలో నియమబద్ధమైన సంఘటనలా వుంటుంది. ఎలాంటి వినోదపూరితమైనా సత్యానుభవపు అర్థం: అత్యుత్తమ శ్లోకాలలో యిది వొకటి. 'ద్వీపాదన్యస్-' రామన్న ఆగాడు. అదంతా సరే. అయితే, సుమారు

అరగంట అయివుండవచ్చు ఇప్పటికి. అంతసేపూ అదే శ్లోకం చుట్టూతా తను తిరుగుతున్నాడు కదా! ఇలా యెందుకైంది?....రామన్న నిట్టూర్చాడు....దేన్ని మరవడానికి తను బుద్ధిపూర్వకంగా ఈ పుస్తకం సహాయంతో ప్రయత్నిస్తున్నాడో చివరికి అదేవిషయం ఈ శ్లోకంతో తిరిగి జ్ఞప్తికి వచ్చింది. పళ్లసందుల్లో చిక్కిన వక్కపలుకులా అది తనను పీడిస్తూంది. ప్రతిబంధక మవుతున్నది, దాన్ని ఎలాగైనా బైటికి తీయాలి. లేకుంటే నెమ్మది లేదు. అయితే నిర్దిష్టమైన ఆ జ్ఞాపకమైనా ఏమిటి? ఆఁ—ఇదే కొన్ని నిముషాలముందు తన మనసు పాడుచేస్తోంది కదూ? అదే జ్ఞాపకం.

'తను సరళను ప్రేమిస్తున్నాడా? కుముదనా?' అని ప్రశ్నించుకొని 'ఎవరికి కావాలి సమాధానం?' అని చేయి విదిలించాడు కదా కొన్ని నిముషాలముందు! అవే ప్రశ్నలు ఈ శ్లోకంతో తన హృదయంలో ప్రవేశించి వేధిస్తున్నాయి. ఎవరికి కావాలి జవాబు అని ఇప్పుడు రామన్న ఉదాసీనభావాన్ని వహిస్తున్నాడు. అయితే రెండేళ్ల క్రితం రామన్న మనస్థితి వేరుగా వుంది. ఈ రెండు ప్రశ్నల్లో ఒకదానికి సరియైన సమాధానం అతనికి లభించింది. ఒకరోజుమాత్రం - కాదు, ఒకరాత్రి అనవచ్చు - ఈ ప్రశ్నలు తనను నిర్విణ్ణున్ని చేశాయి. ఒకమారు ఒకటి, మరొక మారు మరొకటి జవాబు సరైనది అనిపించేది. ఆ రాత్రి హృదయపు పోరాటంవల్ల బుద్ధి నిర్విణ్ణమైనపుడు తను పశువైనాడు. పశువుకూ మానవుడికీ భేదం యేమిటంటే బుద్ధి వొక్కటే, బుద్ధి పనిచేయకపోతే మానవుడు పశువుస్థితికి దిగుతాడు అని ఆ రాత్రి రామన్న తెలుసుకున్నాడు. అవును అదే రాత్రి, తనకు ఈ శ్లోకమూ జ్ఞాపకం వచ్చింది.

ఆ రాత్రి తను కుముదతో పశువులా ప్రవర్తించాడని ఈ రోజు అనిపించినట్లు ఆ రోజూ అనిపించింది. తను యెందుకు అలా ప్రవర్తించవలసి వచ్చిందో? ఆఁ- అవును. ఆనాడు తన మనస్సు వికలంగా వుంది. ఇప్పుడు మూడు నాలుగు రోజుల నుంచి ప్రతిరాత్రి కొంతకాలం కుముదతో గడుపుతూ వున్నాడు. ఇంద్రియసుఖం మీద మోజా? కుర్రతనంలోవుండే పిల్లసహవాసంవల్ల కలుగుతున్న కొత్త ఉత్సాహమా? అనుకున్నపని యేదో సాధించామని సంతోషమా?- ఇంతకు ఏదో ఒక కారణంవల్ల ఆ కొత్త అనుభవపు రుచి అభ్యాసం కాజొచ్చింది అతనికి.

మూడు నాలుగు రోజుల్నుంచి ఆ కార్యక్రమం తప్పలేదు. ఆ రోజు సుమారు రాత్రి పదిన్నర అయినతర్వాత కుముద గదికి వెళ్ళాలని లేచాడు. మెల్లిగా తలుపు తెరిచి తన గదినుంచి బయటపడి తలుపు అలాగే మూసుకొనేలోపల సరళ గదినుంచి ఆమె దగ్గినచప్పుడు వినిపించింది. అనపేక్షితంగా అయిన ఆ శబ్దంవల్ల రామన్న అదిరిపడ్డాడు. అందువల్ల తలుపు మూస్తున్నచెయ్యి వణికింది, తలుపు సద్దులేకుండా మూయడం చేతకాలేదు. అప్పుడు చటుక్కున ఒక నిశ్చయంతో సరళగదికి వెళ్ళాడు; ఒకసారి తన గదినుంచి బయటికి వచ్చినట్లుగా తలుపు శబ్దంవల్ల తెలుస్తుందికదా! అయితే సరళ గదిలో కాలుపెట్టగానే అతని ఆలోచనలన్నీ దూరమై సహజధోరణిలో సరళదగ్గరకి వెళ్ళాడు. ఆమె ముఖంలో ఆయాసం తొంగి చూస్తున్నది. ముఖం కొంత నల్లబడినట్లుంది. అశక్తతవల్ల ఊపిరి పీల్చడం కూడా శ్రమ అన్నట్లుగా ముక్కుపుటాలు అదురుతున్నాయి. అయినా తనని చూడగానే సరళ చిరునవ్వు నవ్వడానికి ప్రయత్నించింది. ఎలాంటి జీవితం! తనకు కష్టంగావున్నా దాన్ని చూపించకుండా పరులకు సంతోషాన్ని కలిగించాలనే ఆశ - అనిపించి రామన్నకు గొంతులో ఏవో అడ్డుపడినట్లయింది. వెళ్ళినవాడు ఆమె దగ్గరే కూర్చొని ఆమె నుదురు, వొళ్ళు ముట్టుకు చూడసాగాడు.

'నా కేమయిందని యింత ఆందోళనచెంది పరుగెత్తి వచ్చారు?' అన్నది.

రామన్న నోటినుంచి జవాబు రాలేదు.

'రాయడం మానుకొని వచ్చారేమిటి మళ్లీ?'

'అంత బ్రహ్మాండంగా యేం రాస్తున్నాను!' అని మాట మార్చేట్లు రామన్న జవాబు చెప్పాడు.

'ఛీ! పాడైన నా బతుకు! తనకూ సుఖం లేదు, యెదుటివాళ్లకూ సుఖం లేదు!' అని కన్నీళ్ళు ఆపుకొనేప్రయత్నంలో ముఖం తిప్పుకుంది.

రామన్న వొకనిముషం ధ్యానంలో వున్నట్లు కూర్చున్నాడు. జన్మజన్మాంతరాల అభ్యాసంవల్లనో ఏమో అన్నట్లు అతనిచెయ్యి వాత్సల్యపు చల్లగాలిలా ఆమె వెన్ను నిమురుతోంది. కొన్నినిముషాలు సరళకూడా నిశ్శబ్దంగా పడుకుంది. రామన్న స్పర్శ ఆమె దుఃఖతాపాన్ని ఉపశమింపజేసింది. ఆ మౌనంలో ఆ రెండు హృద

యాలు పరస్పరం సమ్మిళిత మైనట్లయ్యాయి. కొన్ని నిముషాలతరువాత రామన్నే మొదట మాట్లాడాడు.

'ఎందుకు సరళా, ఏమైనా ఎక్కువ ఆయాసం కలిగిందా?'

పడుకొనే తల ఆడించి, ఏమీలేదు అని సరళ సూచించింది.

'అయితే? ఇంతసేపైనా నీకు నిద్ర రాలేదే?' అంతలోనే ఏదో ముల్లు గ్రుచ్చుకున్నట్లయి, 'నన్ను పిలవాల్సింది' అన్నాడు.

సరళ వూరకుంది.

రామన్న మెల్లగా ఆమెను వెల్లకిలా పడుకోపెడుతూ ఆమె గడ్డాన్ని ఎడమ చేతితో ఎత్తి పట్టుకుంటూ మొండిగా అడిగాడు.

'ఏమైంది చెప్పు' అని.

'ఏమీ లేదు.'

'ఉహుఁ. అబద్ధం చెపుతున్నావు. ముఖంమీద కనిపిస్తూంది ఏదో అయింది అని?'

'ఏ-మీ-ఏ-మీ- లేదు' నవ్వింది.

'అయితే నిద్ర యెందుకు రాలేదు?'

'అదైనా యెంతని వస్తుంది? ఏళ్ళు పూళ్ళూ వస్తూనే వుంది. ఎప్పటికి ముగింపుకు వస్తుందో యేమో!'

'ఛీ! వెర్రిదానా? అలాంటి వూహలు చెయ్యవద్దు అంటే మళ్ళీ మనసు పాడు చేసుకుంటున్నావు.'

'నేనైనా యేం చేసేది? నాకే యింత విసుగుపుట్టింది, ఇంక యెదుటివాళ్లకు ఎంత విసుగు పుట్టివుండాలి?'

'నీవు పడుకున్నచోటే పడుకోవాలి కాబట్టి విసుగు పుట్టివుండవచ్చు. మాకేం మహా విసుగుపుట్టడానికి? ఆపైన, నీకు నయమవుతుంది అనే ఆశతో రోజులు క్షణాల్లా గడిచిపోతాయి.'

నేను బాగవుతాను అనేది పిచ్చివూహ. చూశారుకదా, మీరేమైనా తక్కువ చేస్తున్నారా? అన్నిరకాల సీసాలు అయ్యాయి. ఏవేవో ఇంజెక్షన్లు అయ్యాయి, ఏ మంచి డాక్టరూ మిగలలేదు—'

'అంటే యేమిటి? నీకు బాగుకాదని తెలిసీ నేను ఇదంతా చేశాననా?'

'పాపం! మీరు మీ బాధ్యత నెరవేర్చారు. అయితే యిది సరిపడేయోగం లేదంటే మీరుమాత్రం ఏం చేస్తారు?'

రామన్న నవ్వుతూ ఆ ఆలోచనను కొట్టేయాలని ప్రయత్నించాడు. 'బాధ్యత అంటే? ఇంతకాలం ఈమె నా భార్య అని, వంటచేసిపెడ్తూ వుంది, సంసారసుఖం యిస్తూ వుంది. నా చిరిగినబట్టలన్నీ కుడుతూవుంది, ఇన్ని చొక్కాలు గుండీలు కుట్టి బాగుచేసింది అని లెక్కవేసి - ఈమెకు యీ లెక్కప్రకారం ఇన్నిరోజులు ఇంత బిల్ అయ్యేంతవరకు మందు ఇప్పించాలి, తర్వాత—'

'చాల్లే పొండి! నేను అలా చెప్పలేదు అనేవిషయం తెలీదూ మీకు? అయితే చచ్చేచెట్టుకు చెమటనీళ్ళు పోయడం జాణతనం కాదు అని—'

'ఇలా చూడు, సరళా! నీవు చనిపోయే ఆలోచన వదులు. బతకడం ఎలాగా అనేది చూసుకోడం నా వంతు. అయిందా? మరోమాట, పాము కంటపడగానే 'అ_స్తీక, అ_స్తీక' అనెయ్.'

'అంటే?' అని నవ్వుముఖంతో అడిగింది.

'ఇలాంటి చెడ్డ ఆలోచనలు వస్తాయి అని అనుమానం రాగానే నన్ను పిలు. నేను వచ్చికూర్చుంటాను, నీకు నిద్ర వచ్చేవరకు.'

ఒకటి అర నిముషం వూరుకుండి, వూపిరిపీల్చి సరళ 'అదే నేనూ అనేది' అన్నది.

'దాన్ని చెప్పడమంటే?' రామన్నకు విషయం బోధపడలేదు.

'మళ్ళీ యెదుటివాళ్లకి బాధ కలిగించడం, అని.'

'ఇక్కడికి రావడం బాధ అన్నానా నేను?'

'మీరు అనలేదు, మీకు అలా అనిపించనూ అనిపించదు, అయినా మీరు రాస్తూ కూర్చుంటే మిమ్మల్ని నేను పిలవలేను.'

'నాకంటే నీకే నేను రాయడం ముఖ్యవిషమైందా?'

'ఎందుకు కాకూడదు? మీరు రాయడంవల్ల మీకూ సుఖం వుంది. చదివేవాళ్లకూ సుఖం వుంది. అది విడిచిపెట్టి నేడో రేపో అనే నాదగ్గర కూర్చుంటే ఏమి చేసినట్లు?'

'నువ్వే రచయిత్రి అయివుంటే మీ యింట్లోవాళ్ళకు పెద్ద సమస్యఅయి వుండేది' అని రామన్న నవ్వి ఆమెనూ నవ్వించి ఆ ఆలోచననే మరిపించాడు.

'అయినా - యెందుకో యేమిటో? - నాలుగైదురోజులనుంచి మనస్సులో యేవేవో ఆలోచనలు వస్తున్నాయి; నేనూ యెంతో ప్రయత్నం చేస్తున్నాను-'

'ఇలా చూడు, సరళా, వచ్చిన ఆలోచన బాధ పెట్టకుండా నీకొక వుపాయం చెబుతాను. వచ్చీరాగానే దాన్ని బయటికి నెట్టాలి; ఆలోచన రావడమంటే గొంతులో గసగసవున్నట్లు, లోపల బిగపెట్టుకొని కూర్చుంటే....?

'బయటికి నెట్టడమంటే యేమిటి? దగ్గడమా? గసగసని నెట్టడమా?'

'మరొకరికి - అంటే నాకు - చెప్పడం. కానీ, చెప్పు చూద్దాం. నిన్న మొన్నటి ఆలోచనలు అలా వుండనీ. ఈ రోజు వచ్చిన ఆలోచనలేమిటో చెప్పు.'

'ఉహుం.'

'చూశావా? మంనూవద్దని జబ్బా నయం కాలేదన్నట్లు.'

'మీరు నవ్వుతారు.'

'లేదు.'

'మీకు కోపం వస్తుంది.'

'లేదు....అరే! నవ్వించేది, లేకుంటే కోపం తెప్పించేది అంటే నీ విషయం. అయినా, ఎలాంటిదబ్బా!'

'ఇంతగా చెప్పినా ఏమిటి ఉపయోగం?'

'మొదట చెప్పు, దానివుపయోగం ఏమిటి అనేది చెప్పానుకదా నేను?'

'ఉహుం. వూరక నోటితో చెబితే వెళ్ళే ఆలోచన కాదు.'

'ఏమిచేస్తే వెళుతుంది చెప్పు.'

'మీరు దాన్ని కార్యాచరణలో పెడతాను అంటే - ' అని ఆగి, 'చాలు వూరక మీరైనా యెందుకు పొద్దుపుచ్చుతారు? పదకొండుగంటలు కావస్తూంది. నాకూ ఇంక నిద్ర వచ్చేట్లుంది' అన్నది.

ఒకటి రెండు నిముషాలు రామన్న మౌనంగా ఆమెను సూటిగా చూశాడు. క్రమేణ అతనిముఖంలో చిరునవ్వు వెలిసింది. హృదయమే బయట పడిందేమో అన్నట్లు మెల్లిగా అతనిచెయ్యి ఆమె నుదుటిని నిమిరింది. మెల్లిగా ఆమె తల నెత్తి, తన తొడమీద పెట్టుకున్నాడు, అలాగే ఆమె ముఖాన్ని చూస్తున్నాడు. ఆమె కళ్ళను పైకెత్తి అతనిముఖాన్ని చూసింది. చూపులు కలిశాయి, హృదయం హృదయాన్ని పలకరించింది. ఆమె హృదయాంతరాళంలోని ఆలోచన రామన్నకు తెలిసిందేమో! 'అదొక్కటితప్ప ఏదైనా సరే, చేస్తాను' అన్నాడు నవ్వుముఖంతో.

'ఏదొక్కటి వదలి?' ఆమెకూడా రెట్టించే ధ్వనితో అడిగింది.

'ఇప్పుడు నీ మనస్సులో ఏముందో, దాన్ని!'

'నాకు తెలిసేవుంది!' అని సరళ నిట్టూర్పు విడిచింది.

'అది సాధ్యంకాదని నీ కెప్పుడో తెలిసేవుంది.'

'ఏది సాధ్యంకాదు అనేది చెప్పరు కదా!' అలిసిపోయినా ధ్వనిలో మొండితనముంది.

'ఏదైతేనేం? ఇలా చూడు. సరళా, నీకు ఏమీ కాదు. నీవు ఆ వూహనే వదలిపెట్టు.'

'ఏమీ కాదు!' సరళ తనలోనే మాట్లాడుకున్నట్లు తను మళ్ళీ అన్నది. 'ఏమి సుఖం అని అలా అంటారు, ఏమీ కాదు, అని? ఒకసంవత్సరంపైన అయింది ఇలా పడివుండి. ఇల్లంటే భగభగమంటుంది. నావల్ల దానికి ఏ సహాయమూ జరగ లేదు. ఏమీ కాదు అన్నా దొరికేట్లు లేదు. మీరేమైనా ముసలివాళ్లా, ముతకవాళ్లా? బిడ్డలు లేని ఇల్లు ఏమిల్లు?'

'పిచ్చిదానా? మొదట భార్య వుంటేనేకదూ బిడ్డలమాట?'

'నాలాంటి పెళ్ళాంవుంటే ఆ మాటే లేదు.'

రామన్న ఇప్పుడు ఏమీ సమాధానం చెప్పలేకపోయాడు. అప్పుడప్పుడూ సరళ ఈ మాట చెపుతున్నా, ఈ సమయంలో ఆ మాటకు అతనికి సమాధానం ఏమీ తోచ లేదు. లోపల ఏదో భయంవల్ల తను ఈ జబ్బునుంచి బయటపడేది లేదు అని సరళ అనుకొంది. ఆమె ఆ ఆలోచనను తొలగించడం రామన్నకు సాధ్యం కాలేదు. ఆ ఆలోచన అతనికీ అవసరం లేకపోయింది. ఎన్నోసార్లు ఆ ఆలోచనతో అతనూ లోలోపలే భయపడ్డాడు. ఇప్పుడుకూడా అతని శరీరం వణికింది. 'ఎందుకు?' శరీరం వణకడం సరళకు తెలిసిపోయిందేమో?

రామన్న అప్పుడు కొంచెం కోపం ధ్వనించేట్లు అన్నాడు: 'నీగురించి ఏదైనా చెడు ఆలోచనవస్తేనే నా శరీరం వణుకుతుంది, ఆ ఆలోచనను చెప్పడ మలా వుండనీ, నేనైనా ఏం చేసేది చెప్పు, సరళా?' అని హతాశుని గొంతుతో అతని నోటినుంచి మాటలు తడబడి వచ్చాయి.

పడుకునే, తన చేతినెత్తి అతని గడ్డాన్ని నిమురుతూ, నవ్వుతూ సరళ అన్నది: 'అయ్యో! ఇప్పుడు ఎవరికి పిచ్చి అనాలి! చెడ్డవూహ అట! నేను ఎలా చెడ్డ ఆలోచనల్ని చెప్పేది? నేను చచ్చినతర్వాత మీరు యేం చేస్తారో యెవరు చూడొచ్చారు? నేను చావకూడదు. నా కళ్ళముందే నా ఆలోచనని నిజం చెయ్యాలి-'

సరళ మాటను పూర్తిగా వినకుండానే, మొదటిమాటలవల్లనే ఉత్సాహభరితుడై 'అలాగైతే విను, కావలసింది జరుపుతాను' అన్నాడు. ఎంతటి అపాయకారి అది! తన నోటినుంచి మాటలు బయటపడడమే తడవు, సరళ, 'ఆ భాగ్యం చూడడానికి దేవుడు నాకు ఆయుస్సు ఇవ్వనీ, తప్పకుండా జరుపుతారా? తప్పకుండా?-' తను తలాడిస్తూ వుండివుండాలప్పుడు- 'అలాగయితే మరో భార్యను___'

'ఆఁ!' అని పిడుగుపడ్డట్టు అదిరిపడ్డాడు.

'లేదు. మీకు నమస్కరించి వేడుకొంటాను. నా ఆలోచన అది. నా కోసం ఆమాత్రం చేస్తారా? ఈ ఇంట్లో పిల్లా జెల్లా తిరుగుతూంటే చూసి చావాలి అని-'

యంత్రంలా తను తలను ఆడిస్తున్నాడు, 'కాదు, కాదు' అని లోపల గుండె కొట్టుకొంటున్నది.

'అంత - అంతమాత్రం చేస్తే నేను సుఖంగా కళ్ళు మూసుకుంటాను' హృదయమనే చెరగుపరచి వేడుకొంటున్నట్లుగా సరళ చెప్పింది.

'ఇప్పుడు వున్నదానిముందు నాకు యే సుఖమూ లేదు' అనేమాటలు అతని నోటినుంచి బయటపడ్డాయి.

ఇద్దరూ మాట్లాడేట్లు లేరు. సరళ కళ్లలో నీటిబిందువులు మెరుస్తున్నవి. రామన్నకు చాలా బాధకలిగింది. 'సరళా. సరళా. నాకూ ఎంత బాధ కలుగుతున్నది అనేది గమనించకూడదూ?' అన్నాడు. ఆ మాటకు సరళ ఒక్కమారు ఎగసిపడుతున్న దుఃఖాన్ని ఆపుకొని సమాధానపరచే గొంతుతో 'మీకు నొప్పి కలుగుతూ వుంటే ఇప్పుడు ఆ మాటే వద్దు' అన్నది; నవ్వుముఖంతో తననే ఓదార్చుకుంది.

ఇంతసేపు మాట్లాడినందుకు ఆయాసం కలిగిందో, ఆలోచనలు బయట పడినందుకు నెమ్మది అనిపించిందో; ఇంతకూ సరళ చిన్నపిల్లలా తర్వాత రెండే నిముషాలలో నిద్రపోయింది. కొంతసేపు ఆగి రామన్న మెల్లిగా ఆమెతలను దిండు మీదవుంచి శబ్దం చేయకుండా బైటికి నడిచాడు.

చాలాదూరం ప్రయాణంచేసి ఒక అపరిచిత స్టేషన్‌లో దిగినట్లు రామన్న దిగ్భ్రాంతుడయ్యాడు - సరళ గదినుంచి బయట పడగానే. ఇదేమిటి? ఎక్కడికి వచ్చాను? లేక ఎక్కడికైనా బయలుదేరానా? అన్నట్లు కాంతివిహీనమైన చూపులతో అక్కడా యిక్కడా చూస్తుండగా కుముద గదితలుపు కనిపించింది. ఆఁ - ఎన్నిరోజులముందో - కాదు, కొన్ని నిముషాలముందు నేను బయలుదేరింది ఆ గదికి అని అక్కడికి బయలుదేరేంతలో, 'ఛీ! ఇదెలాంటి ఆలోచన!' అనుకొని బిరబిరనడిచి తనగదికి వెళ్ళి తలుపు మూసుకొని కూర్చున్నాడు. అయితే మనస్సు కలచినట్లయింది. ఏదో వొక సమాధానం అతన్ని కూర్చున్నచోట కూర్చోబెట్టదు. ఏదో వెతుకుతున్నట్లు శూన్యదృక్కులతో అటూ ఇటూ పచార్లు చేయసాగాడు. 'ఈ రోజొక్కసారి వెళ్ళివస్తే పోతుంది' అనుకున్నాడు. అయినా కాళ్ళు కదలవు. సరళ ప్రార్థించిన దీనవాక్కు ఇంకా అతని మనసులో మారుమ్రోగుతోంది. ఈ

రోజు ఇంత కక్కుర్తిగా అడుక్కున్న దెందుకు? 'నా కోసం' అన్నది, 'అంత మాత్రం జరిగితే సుఖంగా కళ్ళు మూసుకుంటాను' అన్నది. ఎందుకు? ఆమెకు తెలిసిపోయిందా? జబ్బు బడలికవల్ల అలిసిపోయిన ఆ స్త్రీ హృదయానికి తన వంచనవల్ల ఎలాంటిదెబ్బ తగిలివుండాలి? అథవా, తెలిసివుండడానికి లేదు. ముందు కూడ ఆమె ఇదేమాట చెపుతూవుంది. అయితే ఈ రోజు ఆమెవాక్కు అంత దీనంగా వుందికదా: తను ప్రాణంతోవున్నప్పుడే ఇది జరగాలి అంది కదా! ఓహో - తన బంధువైన కుముదనే పెళ్ళి చేసుకోవాలని ఆమెమనస్సులో వుండి వుండవచ్చు? తర్వాత ఇంకెవరినైనా పెళ్ళి చేసుకుంటానని భయపడి తను బ్రతికి వున్నప్పుడే జరగాలని ఆశ పడుతున్నదా? పాపం! ఎంత శుద్ధమైన అంతః కరణం! ఎంత సరళ స్వభావం? ఇలాంటిభార్య కలిగిన నేను మరొకపెళ్ళి చేసు కుంటానని అయినా యెలా అనుకున్నది? హృదయంలో సంభ్రమం తగ్గి ఇప్పుడు రామన్న తన వూహకు తనే నవ్వుకున్నాడు. మరొక పెళ్లట! ఎంత అమాయకు రాలు ఈ సరళ! తనకు మరో పెళ్ళేలేదు. మరెవరితోనైనా పెళ్ళి అలా వుండనీ, కుముదకూడా - అప్పుడు రామన్నకు మళ్ళీ దిగ్భ్రమ కలిగింది. ఇదేమిటి ఇలా ఆలోచనా పరంపరలో చిక్కుకున్నాను నేను - అనుకున్నాడు. కుముదనుకూడా పెళ్ళి చేసుకోను అనేవూహ వచ్చిందికదా తనకు? అయితే ఇప్పుడు కుముద గదికి బయలుదేరేడుకదా? ఎందుకు తను అక్కడికి వెళ్లడం? అలాంటి వుద్దేశంలో వెళ్ళా లనుకునే తన మనస్సు ఆమెను పెళ్ళి చేసుకోవడానికి వొప్పుకోనంటుంది! ఛీ! ఈ సమస్యనుంచి తను యిప్పుడే జారుకోవడం మంచిది. అయిందేదో అయింది, ఈ రోజునుంచి కుముదగదిలో కాలు పెట్టకూడదు - అనుకున్నాడు.

అయితేనేమి? తన కిష్టంవచ్చినట్లు వూహించడాన్ని రామన్న మనస్సు వొప్పుకో లేదు. 'నీపాటికి నువ్వు పోను అని ఇక్కడ కూర్చుంటే ఆమెకు తెలిసేదెలా? ఇద్దరి ఒప్పుదలతో తీసుకున్న నిర్ణయాన్ని ఒక్కడే పాడుచేయడం యేమి న్యాయం? ఇంతేకాక నిన్ను పెళ్ళిచేసుకోవాలని కుముద మనస్సులోవుంటే నీ నిశ్చయానికి కొంతవరకైనా అర్థముంది. అయితే ఆమెకు పెళ్లి ఆలోచన లేకుంటే? అప్పుడు సమస్య ఎక్కడుంది? ఇలా పిచ్చివానిలా ప్రవర్తించవద్దు. పో, ఆమె నీకోసం యెంతసేపటినుంచి కాచుకునుందో!' అని బుద్ధి ముందుకు అతన్ని తోసింది.

అడుగు ముందుకువేయగానే 'బిడ్డలులేని యిల్లు అదేం యిల్లు! నాకోసమైనా పెళ్ళి చేసుకోండి. యింట్లో పిల్లలు తిరుగుతుంటే చూసి చస్తాను' అని అతని హృదయంలో యింకా మారు(మోగుతున్న సరళ మాటలు పగ్గాల్లా అతన్ని వెనక్కు లాగాయి. 'పిచ్చివాడివి నువ్వు! సరళను వోదార్చడానికి నీకు బుద్ధి పుట్టినప్పుడు పెళ్ళి చేసుకుంటావట. అయితే ఎప్పటిమాటకో భయపడి ఈనాటి సుఖాన్ని తప్పించుకోవడంలో ఏమి జాణతనముంది? నడువు' అని మళ్ళీ బుద్ధి ప్రోత్సహించింది. 'తప్పకుండా - తప్పకుండా జరుపుతారా? అంత-అంతమాత్రం అయితే నేను సుఖంగా కళ్లు మూసుకుంటాను' అని సరళమాటలూ ఇప్పుడు మూర్తిమంతంగా చేయిపట్టి, ముందుకు పోకుండా తిమ్మిరిపట్టినట్లయింది. 'హహ! ఇంతెందుకు సరళనుగూర్చిన ఆలోచన? 'మీరేమైనా ముసలివాళ్ళా, ముతకవాళ్ళా?' అని ఆమె నీ అవసరాన్ని అర్థం చేసుకోలేదా? ఆమె చెప్పింది నీ సుఖంకోసమే కదా? ఇప్పుడు నీకోసం సుఖం అక్కడ పడకమీద నిరీక్షిస్తూ పడివున్నది. ఇంకైనా తటపటాయించవద్దు' అని ఒక్కసారి బుద్ధిబలంగా నాలుగైదు అడుగులు ముందుకు లాగినట్లయింది. సరళమాట వెనక నిలుచున్నచోటే వుండిపోయిందేమో! ఇప్పుడు అస్పష్టంగా వినిపిస్తున్నది, 'పిచ్చివాడా? పిచ్చివాడా! 'ఇప్పుడు వున్నదానిముందు నాకు వేరుగా ఏ సుఖమూ లేదు' అని సరళముందు వొప్పుకున్నాను. ఇప్పుడు వున్న దాన్నివదలి వేరే ఎక్కడ సుఖం చూస్తాను?' అంటూ బుద్ధి అతనిని గదినుంచి బయటికి లాగివేసింది.

రామన్న మొదట నిర్విణ్ణుడైనాడు. ఆ తర్వాత కోపగించాడు. ఇన్ని ఆలోచనలతో తల చెడుపుకోడం ఎందుకు? ప్రకృతే యీ నీతిని ప్రసాదించింది - అనే ఆలోచనతో కొంత బింకంగానే కుముద గదిలో కాలు పెట్టాడు. దీపం వెలుగుతున్నది. దగ్గర గోడకున్న అద్దంలో తన ప్రతిబింబం కనిపించింది. తన్ను తానే చూడను భయమేసిందేమో! ఆ వెలుగులో కుముద ఎదుట పడడానికి సిగ్గేసిందేమో! కుముదముఖం తలుపువైపు లేదు. ఇదే సమయమని గదినుంచి జారుకోవాలనిపించింది. అయితే వెంటనే మగవాడైన రామన్నకు అవమానం కలిగినట్లయింది. ఎందుకు పరుగెత్తిపోవడం? ఈ పిల్లకు భయపడుతానా? నా ఉద్దేశం యేమిటి అనేది

స్పష్టంగా ఈమెకు తెలుపుతాను - అన్నవాడు దీపాన్నార్పి పరుపుమీద పడు కున్నాడు. భర్త అధికారాన్ని చలాయించి గదినుంచి బయటపడ్డాడు.

కాదు-ఇంక బయటపడదాం అనుకున్నాడు-అంతే. అయితే నిజంగా ఆనాడు తను ఆ గదినుంచి, తప్పించుకొనే దొంగలా జారుకున్నాడు. అంతవరకువున్న ఉన్మాదం దిగిపోగానే రామన్న మరోవ్యక్తి అయిపోయాడు. ఇదేమిటి - ఇలా చేశాను? అనుకున్నా అక్కడ నిలుచుని సమాధానం కాని క్షమనుకాని ఇవ్వడానికి అభిమానం అడ్డువచ్చి జారుకునేట్లుగా గదినుంచి బయటపడ్డాడు. తనగదికి పోగానే అక్కడకూడా అతనికి దీపంవెలుతురు సహించరానిదిగా అనిపించింది. చీకటిలోనే కూర్చున్నాడు. పశువు! నేను వొట్టి పశువు! అనుకున్నాడు. మరుక్షణంలో ఆ మాట పశువుకే అవమానం. ఏ పశువూ మనుష్యునిలా అతి కామజీవి కాదు. ప్రకృతిలోని ఒక నియమితమైన బాధ్యతమాత్రమే - అని తననే ప్రత్యేకంగా నిందించుకున్నాడు. అప్పు డతనికి ఒక ఆలోచన వచ్చింది - కుముద సహవాసం లేకుండా వుండివుంటే తన బ్రతుకులో ఏదో ఒక కొరత అనిపించేది అని ఎంతగా ఆలోచించినా చివరికి తను కుముదదగ్గరికే వెళ్ళాడుకదా? నిముషంముందు అక్కడ అసహజంగా ప్రవర్తించినా కుముదమీద తనకు కోపం లేదు. వెళ్ళి క్షమాపణ అడగాలి అనిపించింది. ఆనాటి అనుభవం మరిచి మనస్సు పూర్వపురోజుల అనుభ వాన్ని తలచి మురిసిపోయింది. కుముదకు మనసు ఇచ్చాడా? అప్పుడు జ్ఞాపకం వచ్చింది రత్నావళి నాటకంలో శ్లోకం. మనస్సు ఎలాంటిదో! అది ఎలా ఎందుకు ఓడిపోతుందో! మనిషికి అతీతమైన పదం 'విధి' అనేందుకు బదులు 'మన్మథుడు' అనేపదాన్నిచేర్చి రామన్న ఆ రోజు ఆ శ్లోకం అర్థాన్ని వివరించి సమాధానపరచు కొన్నాడు. మన్మథుడు తలచుకుంటే చాలు, ద్వీపాంతరంనుంచి లేక సముద్రం ఆవలివైపునుంచి లేక భూగోళపు అంతంనుంచి ఒక అమ్మాయి అకస్మాత్తుగా వచ్చి హృదయాన్ని అపహరిస్తుంది.

కుముద అలా చేసివుంటుందా? అనే ఆలోచనలో మునిగి రాత్రి అంతా అలా కుర్చీలోనే కూర్చుని నిద్రపోయాడు.

అదంతా ఇప్పుడు జ్ఞాపకంవచ్చి రామన్న కుర్చీలోంచి లేచాడు. ఆ రోజులాగా ఈ రోజూ కుర్చీలోనే నిద్రపోకూడదు. అప్పుడు మధురమైన కలలు వుండేవి.

ఇప్పుడు కలలోనూ సుఖంలేదు అని లేచి, విసుగుతో చేతిలోని పుస్తకాన్ని బల్ల మీద విసిరివేశాడు. దూరంగా ఏదో గడియారంలో పన్నెండుగంటలు కొట్టిన శబ్దం వినిపించింది.

# 12

ఆవులింత నిద్ర లక్షణం అని చెప్పడం అబద్ధమనిపించింది కుముదకు. ఇప్పుడు తనకు ఒకదానివెంబడి మరొకటిగా ఆవులింతలు వస్తూన్నా నిద్ర వచ్చేసూచనే లేదు! నిద్ర రానందుకు కారణమైన విసుగు లోపల అణగి, ఆవులింతరూపంలో బయట పడుతున్నదో ఏమో! దూరంనుంచి ఏవో గడియారం గంటలు వినిపిస్తు న్నాయి. ఒకటి రెండు మూడు....పన్నెండు! అర్ధరాత్రి కావస్తోంది. ఇంక తనకు నిద్ర రాదు. జగత్తు శాంతిలో మునిగివున్నా లోపల ఆలోచనల అల్లరి - పోరాటం వల్ల నిద్ర వచ్చేట్లు లేదు. ఎన్నిసార్లు తను నిద్ర రాకూడదని ప్రయత్నించింది! ఇప్పుడు నిద్ర రావాలని ప్రయత్నిస్తున్నది! ఒకానొక కాలం అది. అప్పుడు రాత్రి ప్రశాంతతలోకూడా గడియారం గంటలు వినిపించేవి కావు, నిద్రనూ తను కోరు కునేది కాదు. అదంతా వెనకటి జన్మలోని జ్ఞాపకంలా వుంది. అయితే కేవలం ఒకటి రెండు ఏళ్ళక్రిందటిమాట. అప్పుడు ఏన్నోరాత్రులు మధురమైన కలలను కన్నులార కనాలని ప్రయత్నపూర్వకంగా తను నిద్రను తప్పించుకునేది. ఒక అనుభవం యింకా ఆమెకళ్ళకు కట్టినట్లుంది. ఆ రోజు తనజీవితంలో సూర్యుడు ఉదయించాడు. ఇంకెక్కడిరాత్రి అనేట్లుగా పొద్దుటివరకు మెలకువగానే వుంది. మెలకువగావుండి కలలు కనాలి అనే ఆశ, ఆ రోజు హృదయంలో నిండిపోయింది. అయితే ఆ కలా ఈనాటి మిగిలిన కలలలాగానే కరిగిపోయింది కదా! పోనీ, జ్ఞాపకంలోనైనా సుఖాన్నియిచ్చే కలగా వుందికదా - అనే సంతోషంతో ఆమె ముఖం వికసించింది. జరిగిపోయినవాటిని చూసే ఆతురతతో అన్నట్లు ఆమె కన్నులు ఆ పరిసరాలను అలక్ష్యంచేసి మరి దేనికోసమో వికసించాయి. ఎంత కాలంనాటి మాట? పోనీ, కాలం ముఖ్యం కాదు, మాట ముఖ్యం. ఆ రాత్రి....

నిజంగా రాత్రి కుముద ఉత్సాహంగా లేదు. కొన్నిరోజులుగా ఆమె అనుభ

విస్తున్న సుఖప్రవాహానికి అడ్డుకట్టపడినట్లయింది. భార్యాభర్తల ఏకాంతంగా వున్న దృశ్యం కనిపించి, ఆ తరువాత రామన్న అలా ఒక తుచ్ఛభావంతో తన శరీరాన్ని వశం చేసుకున్న సమయంలో కుముద మనఃస్థితి వుద్విగ్నమైపోయింది. ఒకవైపు రామన్నమీద ఒకవిధమైన ద్వేషభావం కలిగింది. మరొకవైపు అతను తనదగ్గరికి వచ్చినప్పుడంతా అంతటినీ దిగమింగి, లజ్జాపూర్వకంగా తన మనస్సు తృప్తిపడేది. 'రామన్న వచ్చినప్పుడంతా' అనడమైనా యెందుకు? మొదట మూడు-నాలుగురోజులు రామన్న రానేలేదు. దాన్ని ఆమె ఎలాగైనా ఓర్చుకుంది; తన నడతకు సిగ్గుపడి అతను ఇలా చేస్తున్నాడు అని సమాధానపరచుకుంది. అయితే రామన్న నడత తన హృదయాన్ని మరింత బాధపెట్టసాగింది. ఆ మూడు-నాలుగురోజులవరకు తనను కన్నెత్తి చూడలేదు. తనవైపే రాలేదు; వ్రాయడంలో ఒకవేళ మునిగివుంటే కుముద ఎలాగైనా సమాధానపడేది. అయితే అలాంటిదేమీ లేక, రోజంతా రామన్న సరళసన్నిధిలోనే వుండేవాడు; అత్యంత మనఃపూర్వకంగా వుపచారాలు చేస్తున్నాడు. రాత్రి నిద్ర వచ్చేవరకు ఆమెతో ముచ్చటలాడుతున్నాడు; రాత్రికూడా వుపచారాలు చెయ్యాలని అక్కడే, వేరే పరుపు తెచ్చుకొని పడుకుంటున్నాడని కుముదకు సందేహం వచ్చింది. ఎందుకు? కావలసిన వుపచారాలు చేయడానికి తను ఎప్పుడూ సిద్ధంగా వుండగా రామన్న తన పనులన్నీ వదలిపెట్టి ఆ శ్రమను ఎందుకు నెత్తిన వేసుకున్నట్టు? ఎక్కడి వుపచారం? అదంతా నెపంమాత్రం, తనను తప్పించుకోవడానికి ఆడే ఆట అని తెలుసుకొని కుముద చాలా బాధ పడింది. ఇంక ఈ యింట్లో తనకు స్థానంలేదు, అక్క వుపచారానికీ తను యోగ్యురాలు కాకుంటే ఎవరికి కావలసివుంది తను? కుముద తనలో తాను కన్నీరు కార్చుకుంటూ, నిందించుకుంటూ, రేపు లేవగానే ఇలా చేయాలి - అలా చేయాలి అని రోజూ పడుకునేటప్పుడు ఏవేవో నిర్ణయాలను చేసుకునేది. అయితే ఏ నిర్ణయాన్నీ తీసుకోవడానికి తగినసందర్భం దొరకలేదు - ఇంతెందుకు? ఆ నిర్ణయాలను పూర్తిగా మార్చేసందర్భమే కలిగింది. ఒకరోజు ప్రొద్దున్నే రామన్న వెతుకుతూ తన గదికి వచ్చాడు. 'కుముదా, కుముదా?' రామన్న గొంతు! తనను పిలుస్తున్నాడు. ఛీ! కల! అనుకున్నది నిద్రకళ్లతో. అయితే అది కలకాదు, రామన్నే సాక్షాత్తుగావచ్చి తనను కదిలిస్తూ, 'కుముదా, కుముదా' అని లేపుతున్నాడు;

దబాలునలేచి వెఱ్ఱిపట్టినట్లు చూసింది. 'త్వరగా. సరళగదికి రా' అని రామన్న కలలో వచ్చినట్లుగానే వెళ్ళిపోయాడు. తను సరళక్కగదిలో కాలు పెట్టేసరికి అతను కోటు వేసుకుంటున్నాడు. అదేగదిలో ఒకమూల అతని పడక వుండడం ఆమె గమనించింది. 'నేను డాక్టర్ని పిలుచుకొని వస్తాను. నీవు ఇక్కడే కూర్చో' అని రామన్న బయటికి నడిచాడు.

ఆ రోజు తనకి బావిలోదూకి ప్రాణం వదిలివేయాలనిపించింది. ఎంత సిగ్గుమాలినది, ఎంత స్వార్థి, ఎంత కఠినురాలు, ఎంత కృతఘ్నురాలు తను అని తనని తాను మనసార తిట్టుకున్నది. మూడు-నాలుగు రోజులుగా సరళక్క హృదయం దుర్బలం కాజొచ్చిందట. తనకు తెలియకుండావుంటే బాగుండేదా? ఎప్పుడూ రామన్న ఆమెదగ్గరే వుంటున్నాడని తను అక్కడ కూర్చుంటూవుండేది కాదు; నిజం; తనను చూడగానే సరళక్క ఎప్పటిలా చిరునవ్వు నవ్వుతుంది. అనేదీ నిజమే. అయితే యేమైంది? కేవలం తనవే అయినపాడు. క్షుద్రమైన ఆలోచనలతో సరళక్క అవస్థను గుర్తించనేలేదు. ఎలాంటి పనికిమాలింది తను! పాపం! మూడు-నాలుగు రోజులు రామన్న ఒక్కడే ఎలా సర్దుకున్నాడు? అనివార్యమై తనను లేపడానికి రావడానికి కారణముంది. ఆ రోజు వేకువసమయంలో సరళక్క కొంతసేపు మూర్ఛపోయిందట. ఆమెను లేపి, వుపచారాలుచేసి, ఓదార్చి, ఆ తర్వాత తనను అక్కడికి తీసుకొచ్చి రామన్న డాక్టరుదగ్గరికి వెళ్ళాడు.

ఆ రోజు సాయంత్రంవేళకు సరళక్కకు నెమ్మదైంది. అది తమందరి పుణ్యమనిపించింది కుముదకు. 'అందరి' అని తనను చేర్చుకోవడ మెందుకు? రోజంతా బయటతిరిగి, లోపల కలవరపడి అలసిపోయినవాడు రామన్న; అతనిపుణ్యం అది. ఆ రోజు అతను నిమిత్తమాత్రంగా రాత్రి 9 గంటలకు భోజనం చేశాడు. అంతలో సరళక్క బాగా కోలుకొనింది. ఆ రాత్రి డాక్టరు ఆమెకు నిద్రమందు ఇచ్చి, ఇక ఏ భయమూ లేదు అనిచెప్పి వెళ్ళారు. రాత్రి భోజనం - వుపచారాలు అయిన తర్వాత కుముద సరళక్క కోలుకున్నది కన్నులారచూపి తనగదికి వెళ్ళింది. బుద్ధిపూర్వకంగానే కొంత జాగ్రత్తగా వెళ్ళింది. రోజంతా రామన్న ముఖం చూపింది. ఆ ముఖంలోని భావం అర్థం అయిందామెకు. భార్యతో మాట్లాడడానికి అతనికి అవకాశం దొరకాలనే ఆమె తనగదికి తిరిగి వెళ్ళింది. తన శ్రమఫలితం

అనుభవించే ఆత్రుత అతని కున్నది అనీ ఆమె గ్రహించింది. ఆ రోజు తనగదికి వెళ్ళినప్పుడు కుముద మనసు ప్రసన్నంగా వుంది. రామన్న - సరళక్క- ఇద్దరూ యిప్పుడు ఒకరితో వొకరు ఎంత ఆనందంగా మాట్లాడుకుంటున్నారో అనే వూహతో ఆమెకూ ఆనందం కలిగింది. ఒంట్లో ఆయాసం, మనసులో ఆనందం - ఇందు వల్ల కళ్ళు మూసుకొని విచిత్రమైన విశ్రాంతిని ఆమె అనుభవిస్తున్నది. అలా ఎంతసేపు వొరగి పడుకుందో? ఒకమారు రామన్న తన పడకదగ్గరవచ్చి నిలుచో గానే ఆమె కళ్ళు తెరిచింది. ఆయాసంవల్ల కలిగిన సున్నితమైన కళ, ఆనందాన్ని విరజిమ్ముతున్న చిరునవ్వు - ఇలాంటి ముఖముద్రలోవున్న రామన్నను చూడ గానే ఆమె హృదయంలో ఏదో కలవరం కలిగింది. ఆ కలవరంవల్ల మనస్సు భారం తగ్గినట్లయింది.

ఆ రోజు రామన్న జన్మ-జన్మాంతరాల పుణ్యఫలం అనిపించాడు కుముదకు. ఎంత శాంతరూపంగా వున్నాడు! ఎలాంటి నిర్మలమైన మనస్సుతో మాట్లాడాడు! ఆ రోజు రామన్నను మృదువుగా దగ్గిరకి లాక్కున్నది తను. తెలియని దుఃఖంతో అలసిన బిడ్డ ఓదార్పునుకోరి వచ్చినట్లు, రామన్న తనదగ్గరికి వచ్చాడనేది ఆమె గ్రహించడానికి ఎంతోసేపు పట్టలేదు. మాట్లాడుతూ మాట్లాడుతూ పడుకున్నవాడు పొద్దుటివరకు అలాగే తన భుజాన్నే ఆశ్రయించి పడుకున్నాడు. తనకు ఆలస్యంగా నిద్ర వచ్చిందో ఏమో! పొద్దున్నే తనకంటే ముందే లేచిన రామన్న తన నుదురు ముద్దు పెట్టుకున్నప్పుడే ఆమెకు మెలకువ కలిగింది. కొంత తత్తరపాటుతో కళ్లు తెరవగానే, భయపడిన పిల్లలు వారిస్తున్నట్లుగా పెదవులమీద చేయి వుంచుకొని వూరుకోమని సంజ్ఞ చేశాడు; ముఖంమాత్రం చిరునవ్వుతో వికసించివుంది. ఆ వెలుతురులో తను స్త్రీగా పుట్టింది సార్థకమైందనిపించింది కుముదకు.

ఒక్క నిముషం మెరిసిన రామన్న ఆ ముఖముద్రనుచూసి తనవల్ల ఒక వ్యక్తికి శాంతి దొరికిందికదా అని కుముదకు అనిపించింది. ఆ రోజు ఆమె హృదయ వైభవం అంతటితో ముగిసిపోలేదు. అంతటితో ముగిసినా ఆమె తనజన్మ కృతార్థ మైందని అనుకోవడానికి సిద్ధమై వున్నది. అయితే సుఖమైనా దుఃఖమైనా ఆ అను భవం కొన్ని క్షణాలవరకు వున్నా అనుభవపుజ్ఞాపకం చాలాకాలంవరకు నిలిచి పోతుంది. అంతేకాక అనుభవించేకాలంలో సుఖం అనుకూలమైనది, దుఃఖం

బాధను కలిగించేది అనే భేదంవున్నా జ్ఞాపకంలోమాత్రం సుఖము, దుఃఖము రెండూ వొకటే. దుఃఖపు తలపువల్ల కన్నీరువచ్చినా అప్పుడు హృదయం తేలికై సుఖమే కలుగుతుంది. వీటి అర్థం అంత స్పష్టంగా కుముదకు తెలియలేదు. (తెలిసి వుంటే ఆమె సుఖ-దుఃఖాతీతయై వుండేదేమో!) అయితే ఆ భావాల అనుభవం మాత్రం ఆమెకు ఆ రోజు రాత్రిలోపుగా కలిగింది. రామన్న పసిపాపవంటి అమాయకపు ముఖాన్ని అప్పుడప్పుడు తలుచుకుంటూ వుండేది. అతనినిగురించి నేను ఏమేమో అనుకున్నాను కదా? రోజంతా శరీరం, హృదయం బడలికవల్ల అలసిపోయి నా దగ్గరికి వచ్చాడు, నాతో సుఖదుఃఖాలమాటలు పలికాడు, నా ఒడిలో బిడ్డలా గాఢంగా నిద్రించాడు. ఎందువల్ల? అతనిజీవితంలో నాకు స్థానం వుండే తీరాలి. లేకుంటే దుఃఖంసమయంలో ఆత్మీయతను చూపించేవాడా? అతని హృదయం, నా హృదయం ఒకదాని నొకటి పెనవేసుకొని వుండాలి. కొన్నిరోజుల కిందటి శరీరసంబంధంకన్నా హృదయాల ఈ గాఢసంబంధం కుముదకు ఎక్కువ సుఖాన్ని కలిగించింది. మూడు-నాలుగు రోజులనుంచి రామన్నవల్ల తనలో కలిగిన దుఃఖ సంతాపాలన్నీ ఇప్పటి జ్ఞాపకంలో ఆనందపుచిగురుల్లా కనిపించాయి. పన్నెండుగంటల ఆ రోజులో కుముదకు ముఖకాంతి ఇంకా మనోహరంగా కనిపించింది. ఆమె అంగాంగాలన్నీ ప్రేమరసం ఒలికిస్తున్నట్లుగా మెరుస్తున్నవి. ఆమె నడకలో సూర్యోదయపు నవచైతన్యం నాట్యమాడుతోంది. ఆమె మాటలు వానాకాలం ప్రారంభంలోని మంచుబొట్లలా ఆనందంతోకూడిన చల్లదనాన్ని ఇస్తున్నాయా అన్నట్లున్నవి; ఆమెహృదయం చుట్టుపక్కల మిట్టపల్లాలనన్నిటిని చేర్చుకొని సరళ మార్గాన్ని వెతుకుతూ సముద్రాన్ని చేరటానికి బయలుదేరిన నదిలా క్షణక్షణానికి విశాలమయ్యేట్లుగా భావిస్తున్నది.

ఆ రోజులలో సరళక్క తనను నిండినకన్నులతో చూసేది. ఇంకా ఇంకా దగ్గరికి పిలుస్తుండేది; చేతిలో చెయ్యివేసి ఎంతోసేపు అలా వొరిగి కూర్చునేది. ఒక్కరోజుమాత్రం - ఆ రోజుని తనెప్పటికీ మరచిపోలేదు - అలా కొంతసేపు వూరుకున్నతర్వాత సరళక్క 'కుముదా' అన్నది. ఎక్కడికో వెళ్ళిన తన హృదయాన్ని శిశువును వెదకి - పట్టిఎత్తి ముద్దు పెట్టుకుంటూన్న తల్లి పిలుపులా ఆ పిలుపు ధ్వనించింది.

'ఎందుకక్కా ?' అని ఆతురతతో అడిగింది.

'అందరికీ నా భారం మరీ యెక్కువైంది.'

'ఎవరు చెప్పారు నీకు ?'

'ఎవరు ఎందుకు చెప్పాలి. నాకే తెలీదా యేం ?'

'నీకు బాధ లేకుంటే చాలు. మిగిలినవాళ్ల సంగతి నీకెందుకు ?'

'నాకూ బాధ అనేది వుందా, కుముదా ? నా దింకేమీ వాసనకూడా మిగలలేదులే ఈ కాలినప్రాణం ఇలా పట్టుకొని పడుపుమీద పొర్లాడడానికి.'

'నువ్వు ఎంతమందికి కావాలి అనేది మరచిపోవద్దు, అక్కా.'

'పిచ్చి కుముద ! ఎవరు ఎవరికి కావాలి ? వున్నంతవరకు కావాలి అనిపిస్తుంది, చచ్చినతర్వాత మరచిపోతారు. లేకుంటే సంసారం ఎలా నడుస్తుంది, కుముదా !'

'వద్దన్నా నీవు అవే ఆలోచనలు చేస్తావు, అక్కా.'

'ఏం చేసేది చెప్పు, కుముదా ! మొన్న మూర్ఛవచ్చినట్లు అయ్యేసరికి ఎక్కడ వెళ్ళిపోతానో అని భయపడ్డాను.'

'ఆఁ, ఇలా మాట్లాడు, అక్కా ! పోవాలంటే భయం వేసింది అన్నావు చూడు-అది సంతోషం కలిగించేమాట.'

'భయపడింది నాకోసం కాదు, కుముదా. నావల్ల ఏదీ మంచి కాలేదు ఎవరికీ, చెడ్డదైనా కాగూడదు అని వేడుకొంటాను.'

'ఎవరికీ ఏదీ చెడ్డ జరగటంలేదు.'

'అయినా నేను చనిపోయేలోపల అంతమాత్రం అయితే మంచిది అని___'

'ఏమిటది ?'

'నీ పెళ్ళి.'

'పో, అక్కా ! మొదట నువ్వు కోలుకో, ఆ తర్వాత___' అంతటితో కుముద ఆపివేసింది. తన పెళ్ళిమాట ఎత్తేసరికి మొదటిక్షణం సహజంగానే ఆమెకు సిగ్గు అనిపించింది. అయితే చటుక్కున మరొకవూహ వచ్చింది. తనపెళ్ళి ? అక్కకు ఈ ఆలోచన ఎందుకు వచ్చింది ? తనమీద సహజంగావున్న వాత్సల్యంవలనా ?

లేక-లేక-మరో సంశయంవల్లనా? తను చనిపోయేముందు నా పెళ్ళి కావాలి అని సరళక్క కోరుకుంటున్నది; అంటే వేరొకరితో తనపెళ్ళి? 'అక్కా, నువ్వు బాగయ్యేవరకు లేనిపోని వూహాలు పెట్టుకోవద్దు. నేనేమో ఎప్పటికీ వొప్పుకోను' అన్నది కుముద.

'ఆయన ముందూ చెపుతాను, నీ ముందూ చెపుతాను, నా నుదుట రాసివుంచే కళ్యాణం చూసి చస్తాను' అని సరళక్క నిట్టూర్పు విడిచింది.

ఆయన ముందూ చెపుతాను! కుముద గుండె ఆగిపోయినట్లయింది. ఏమని చెప్పివుండవచ్చు సరళక్క, అధవా వేరొకరితో నా పెళ్ళి అని సరళక్క వాంఛిస్తున్నదని తెలిసి రామన్న తనతో - మొన్న రాత్రిలాగా - కేవలం స్నేహపూర్వకంగా ప్రవర్తించాడా? నేను ఏమేమో అనుకున్నానుకదా! ఎలాంటి కొత్తమలుపు తిరిగింది?

'అక్కా, నిన్ను నమస్కరించి వేడుకుంటున్నాను, నీకు ఆరోగ్యం చేకూరే వరకు—'

'పిచ్చి కుముద! ఇంక నేను బాగుకావడం అనేది మరిచిపో. అందుకే చనిపోయే అక్కను ఓదార్చేందుకు. నా వైపు సంబంధం కాబట్టి—'

'అక్కా, నామీద వొట్టు అన్నాను. ఈ మాట నువ్వు అలాగే పొడిగించావో' అని కుముద హృదయాంతరాళంనుంచి పలికింది.

తన ఆ పలుకు, అందులోని మొండితనం, దానికితోడు తనలోని దృఢనిశ్చయం- ఇవన్నీచూసి సరళక్క ఆశ్చర్యపడింది.

'ఎందుకు కుముదా? పోనీ, ఆయనకే చెపుతాను, ఆయనే నిన్ను అడగనీ' అన్నది. సరళక్క ఆ మాటతో కుముద ప్రాణమే పోయినట్లయింది. ఇదేమిటీ విపరీతం - అనుకున్నది. ఎలాగైనా ఆ ప్రస్తావన మార్చడానికి ప్రయత్నించింది. మూడు నాలుగు రోజులుగా రామన్న సరళక్కను ఎలా చూసుకొంటున్నాడు, ఆమె మూర్ఛపోయినరోజు ఎంత తత్తరపాటుతో తిరిగాడు. రాత్రివరకు అతనికి అన్నం మీద దృష్టే లేకపోయింది. ఇలాంటివిషయాలన్నీ చక్కగా చెప్పనారంభించింది. క్రమేణ సరళక్క ఆనందం - అభిమానాలతో వికసించినముఖంతో తన మాటలను

వినడంలో లీనమైంది. కొంతసేపయాక ఇహ పెళ్ళివిషయం రాదు అని ఆమెకు విశ్వాసం కలిగింది. అంతటితో మాటలు నిలిపేసింది. చివరకు సరళక్క 'అలాగా! నువ్వా అన్నీ ఎంత పరిశీలనగా చూస్తావు!' అని నవ్వుతూ తన వెన్ను చరచి, 'నా దైవం అంత పనికిమాలినవాడు ఏమీకాదు పో తల్లీ' అన్నది.

కుముద చివరి ఆ మాట విని ఆశ్చర్యపోయింది. ఏ సందర్భంలో సరళక్క ఆ మాట అన్నది? తను రామన్నను గురించి ఉబుసుపోక మాట్లాడింది - ఆఁ - తెలి సింది. అలాంటి భర్త తనవాడుండగా తనదైవం పనికిమాలినది కాదు అని వుండ వచ్చునేమో - అని ఒకసారి అనిపించింది. దైవం పనికిమాలినది కాదు అనడంలో తను కోరినట్లుగా కుముద పెళ్ళి అయితీరుతుంది అనే విశ్వాసం వున్నదేమో అని మరొకసారి తోచింది. అయితే కుముద ఆ విషయం ఎక్కువగా ఆలోచించేస్థితిలో లేదు. సరళక్క నోటినుంచి తన వివాహం ప్రస్తావనరాగానే ఇంతవరకు ఎక్కడో అణగివున్న వూహలు ఒక్కమారుగా చెలరేగాయి. పెళ్ళి! ఎంత ఆశ్చర్యం! ఇంత వరకు తనకా వూహే రాలేదు! రామన్నతో కలిగిన అనుభవంతరువాతకూడ పెళ్ళి అనేవిషయం ఆమెకు తట్టలేదు! కుముద సరళక్క మాట్లాడిన అనేకమాటలను తలచుకోసాగింది. తను చనిపోయేముందే ఈ పెళ్ళి కావాలనేపట్టుదల ఒక్కటి మాత్రం ఆమెను, సరళక్కను సంశయించేట్లు చేసింది. ఒకవేళ రామన్నతో తన పెళ్ళి జరగాలని సరళక్క ఆలోచించివుండకూడదా? అంటే? తామిద్దరినిగూర్చి సరళక్కకు సందేహం కలిగిందా! ఛీ! అక్కస్వభావం చాలా నిష్కపటం. ఆడ దానికి భర్త, బిడ్డలు ఇవే వైభవం అని ఆమె ఎన్నిసార్లు చెప్పలేదు? తనకు బిడ్డలు లేరు అనేది దుఃఖం కలిగించినట్లే. ఇంటిలో బిడ్డలుంటే ఆమెకు ఆనందం. ఇలా వుండవచ్చా? కుముద ఆలోచనాలహరి ఇష్టం వచ్చినట్లు పోసాగింది. ఎంత సేపు ఆలోచించినా తృప్తి కలగలేదు. కళ్లు మూయగానే ఒక చిత్రం ముందు వచ్చి నిలుచుంటూవుంది; తను, రామన్న సినిమాకు బయలుదేరారు. తమబిడ్డలు ఇంటిలో తిరుగుతున్నారు, పడకమీద సరళక్క నవ్వుముఖంతో బిడ్డల్నిచూస్తూ 'ఇప్పుడు నా జన్మ సార్థకమైంది, ఇంక మీరిద్దరూ సినిమాకు పోండి, విదేశాలకు పోండి; నాపాలిటికి ఇదే యిల్లు' అంటున్నది. కళ్ళు తెరవగానే ఈ చిత్రం మాయమవు తున్నది.

అలా తలపోస్తూ, అనుభవిస్తూ ఇప్పుడు కుముద పక్కమీంచి లేచింది. ఆ రోజులలో నిద్ర రాకపోవడమే ఎంత సుఖంగా వుండేది అనుకున్నది. ఇప్పుడు? అప్పుడు నాతో సరసమాడిన నిద్ర ఇప్పుడు దుష్యంతుడు శకుంతలను మరచినట్లు మరచిందేమో అనుకున్నది. దుష్యంతుడు, శకుంతల. ఈమాట తన నోటినుంచి ఎలా వచ్చిందో! అవును - ఈ కథను ఒకరాత్రి - ఛీ! మళ్ళీ మళ్ళీ అదే! పరుగెత్తిపోవాలనిపిస్తుంది - అని కుముద అక్కసుతో ముఖాన్ని కప్పుకొని ముసుకు బిగించి పడుకున్నది.

# 13

రామన్న పారవేసిన పుస్తకం బల్లమీదపడి, తల్లక్రిందులై, పుటలన్నీ తెరుచుకొని మడతలుపడి నిలకడతప్పి పైనుంచి పడి మూర్ఛపోయినవానిలా నేలమీద పడిపోయింది. 'ప్రపంచంలో మనుష్యప్రాణి పుట్టినప్పటినుంచి ఎంతమంది మనుష్యులు వచ్చారో వాళ్లందరికీ ఒక్కొక్కనికి ఒక్కొక్క పుస్తకమని పుస్తకాలు వున్నా నా సమస్యకు సమాధానం చూపించే పుస్తకం దొరికేది కాదు' అని కోపంతో చూస్తూ ఆ పుస్తకంతో అన్నాడు. 'జీవితంలో సమస్యలను విడదీసేది సాహిత్యమట! పిచ్చి! జీవితమంటే యేమిటి? అందులో సమస్యలు ఎంత అసంఖ్యాకంగా వున్నాయి. వాటిని పరిష్కరించడమంటే ఏమిటి?' అనే ఆలోచనతో క్షణంపాటు సాహిత్యవేత్తఅయిన తనమీద తనకే కనికరం కలిగింది.

తన సమస్య ఏమిటి? అలాచూస్తే సమస్య లేనేలేదు అని కొందరు చెప్పవచ్చు; ఇదేమి కఠినమైన సమస్య అని ఇంకా కొందరు నవ్వుతో దానిని కొట్టిపారవేయవచ్చు. హుఁ! మూర్ఖులు! పాపం! అజ్ఞానంతోకూడిన చిన్నపిల్లలు! తమది అజ్ఞానమని తెలియని దురదృష్టవంతులు!

ఎక్కడుంది సమస్య? అదే కుముద ఆలోచనకదూ! దానిలో సమస్య ఏమిటి? ప్రియతమ అయిన భార్యపోయింది, ఇంక దాంపత్యజీవితం వైపుగాని, ప్రేమవైపుగాని మనస్సు మళ్లదు. ఎలాంటి బంధనమూ లేదు; ఆమెను వదలివేస్తే పోతుంది.

వదలడమంటే బయటికి గెంటడమే కాదు. ఏదైనా స్త్రీ సంక్షేమసంస్థకు ఆమెను పంపించి ఆమె స్వతంత్రజీవి అయ్యేట్లుచేస్తే పోతుంది. ఇదేమి పెద్ద సమస్యా?

మూర్ఖులు! ఇలా చెప్పేవారికి తన సమస్యే తెలియదు. ప్రేమమయి భార్య పోయింది, నిజం. అయితే కుముదమీద ప్రేమ వున్నదా లేదా - ఎవరికి తెలుసు? ఎవరా మాట అడిగారు?

కుముదమీద ప్రేమ - వుంటే ఆమెను పెళ్ళి చేసుకోవాలి, దానికి ఎందుకిన్ని ఆలోచనలు?

ఛీ! వీళ్ళూ మూర్ఖులే! ప్రేమరహస్యమే తెలియదు. ప్రేమ వున్నదా లేదా అనేది చెప్పడం ఎలా? పొట్ట నిండినతర్వాత అన్నం కావలెనా అని అడిగితే? కావాలి అంటే, మరొక్కసారి తిను అంటారు, అది అశక్యం; తినడానికి వీలు కాకుంటే కావాలనడం అబద్ధం అంటారు; అయితే పొట్టనిండుగా తినడమే కావాలనేందుకు సాక్ష్యం. కుముదమీద అనురాగం వుందా?

ఈ ప్రశ్నను రామన్న వీలయినంతవరకు ప్రశ్నించుకోవడం లేదు. ఎందుకంటే, ఆ ప్రశ్నకు సరియైన జవాబు ఇవ్వడానికిముందే వందలకొద్దీ విషయాలు అతని కన్నులముందు నిలుచున్నాయి.

ఏ రోజు అది? - ఆనాడు? - ఆ-? హాఁ....సరళ ఒక వేకువనే గాభరాపెట్టిన రోజు. ఆ రోజంతా తను ఒక యంత్రంలా తిరిగాడు. రాత్రికి సరళ మొదటిలాగా కులాసా అయ్యేంతవరకు. డాక్టరు మూడు నాల్గుసార్లు భయంలేదు అని హామీ ఇచ్చేంతవరకు తనకాళ్ళు నడుస్తూనే వున్నాయి, చేతులు పనుల్లోనే మునిగాయి, కళ్ళు చూస్తున్నవి, చెవులు వింటున్నవి - అయితే వీటిలో ఒక్కపనినిగూర్చిన జ్ఞానమూ తనకు లేదు. అంతా సర్దుకున్నాక, ఏదో కొంత తిన్నతర్వాత, ఒక్కమారుగా ఎంతో నెమ్మది కలిగింది. మరోవైపు అనివార్యమైన నిద్ర; సరళతో తానూ పునర్జన్మ ఎత్తినట్లయింది. మనస్సుకు కలిగిన ఆనందంవల్ల ఎక్కడైనా హాయిగా కూర్చొని 'తనివితీరేట్లు' ఏడవాలి అనిపించింది. చివరికి ఎవరితోనైనా తనకు కలిగిన ఆనందాన్ని పంచుకోవాలి అనిపించింది. అప్పుడు తను కుముదగదికి వెళ్ళాడు. తనకు బాగా జ్ఞాపకం వుంది, కుముదను తను స్నేహంతో చూశాదేకాని

భోగంకోసం స్త్రీ అనేదృష్టితో కాదు. ఆ రాత్రి జ్ఞాపకం వచ్చినపు డొకసారి రామన్నకు ఆశ్చర్యం కలుగుతూవుంటుంది. మర్నాడు వేకువఝామున - తనకు ఏమనిపించిందో ఏమో! కుముద నుదుట ముద్దు పెట్టుకున్నా. ఆమె ఒక స్త్రీ అనే ఆలోచన తనకి కలగలేదు.

ఆ రోజు రాత్రి తన మనోగత భావననుగూర్చి రామన్నకు పూర్తి విశ్వాసం కలిగింది. అయితేనేం? అంతరంగప్రపంచమే విచిత్రమై వుంది. తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తుందంటారు కదా? ఇంతే. కుముద మరొకటి తలచింది. ఆ మాటనుగూర్చి రామన్నకు అనుమానమే లేదు. తనకు కుముదకు వుండేసంబంధం విషయంలో ఇంతవరకు ఏ ఆలోచన అయితే తనకి రాలేదో ఆ ఆలోచన ఇప్పుడు రామన్న మనసులో ప్రవేశించింది. కుముద తనని ప్రేమిస్తున్నది! ఆ మాట తలచుకున్నప్పుడు, రామన్నగుండె ఝల్లుమంది. ఇదేమిటి కొత్తసమస్య-అనుకున్నాడు. ఆపైన తన చేయిమీరిన సమస్య; కుముద తనని ప్రేమిస్తూంటే తను ఏం చేయగలడు? తను పరతంత్రుడు అనగానే అతనికి కోపంవచ్చింది. లోలోన మండిపడ్డాడు. ఇంతవరకు తన ప్రవర్తన కుముదకు ప్రోత్సాహం యిచ్చివుంటే తన మూర్ఖత్వానికి అది తగిన ప్రాయశ్చిత్తం అని తన్నుతానే తిట్టుకున్నాడు. మూర్ఖుడు! తను శతవిధాల మూర్ఖుడు! కేవలం కామతృప్తిని వాంఛించి, ముగ్ధత్వంవల్ల లాభంపొంది ఆమెను తనదానిగా చేసుకునేటప్పుడు వేరే యే ఆలోచనా లేదు కదా! సులభసాధ్యయై ఆమె వలలోపడింది అనేదానివల్లనైనా తను గ్రహించవలసింది. ఆమె నన్ను మోహిస్తున్నది అని నుదుటిమీద కొట్టుకున్నాడు. మరొకమారు స్త్రీ జాతిమీదనే విరుచుకుపడ్డాడు. కామజీవనం అంటే స్త్రీకి మొదట పెళ్లి ఆలోచనే! ఒక బంధం అనే వూహలేదు. దానికొక నైతికబంధనపు నేపథ్యం కావాలి! వేరు ఏ నైసర్గికబంధమూ మనిషిమీద ఇంత పరిణామాన్ని, ఇలాంటి పాపపుణ్యాల భారాన్ని వేయదు. కుముద తనను ప్రేమిస్తుంటే ఇకముందు ఏమిటి మార్గం?

ఆపద ఒకదానిమీద వొకటి రానే రావాలి! ఎంత క్రూరనియమముందో ప్రకృతిలో. అసలే తనచుట్టు కావాలిసినన్ని సమస్యల్ని పేరుకునివున్న రామన్నను ఇప్పుడు కొత్తసమస్య ఒకటి ఎదురయింది. గండం తప్పినతర్వాత సరళను గురించి చాలా జాగ్రత్తగా వుండాలన్నాడు డాక్టరు. 'ఆమెకు ఏదైనా దెబ్బ తట్టి

కునేశ_క్తి లేదు. కావలసింది యిచ్చి బిడ్డలా చూసుకోవాలి ఆమెను' అని చెప్పాడు. రామన్నకు అప్పటి పరిస్థితులలో అది అనుకూలంగానే వున్నది. కుముద తనను ప్రేమిస్తుందని సందేహం వచ్చినతర్వాత సాధ్యమైనంతవరకు ఆమె సాన్నిధ్యాన్ని తప్పించుకోవటానికి రామన్నకు ఇప్పుడు సరళదగ్గరే కావలసినంత సమయం గడపాలనే ఒక నెపం దొరికినట్లయింది.

'బిడ్డలా ఆమెని కనిపెట్టివుండాలి అని చెప్పాడు డాక్టరు. అందుకని యిక్కడే కూర్చుంటాను. చాక్లెట్ కావాలి అని చెబితేచాలు తెచ్చిస్తాను, ఆఁ ?' అని ఆమెను ఎగతాళి చేసేవాడు.

'బాగుంది, చాక్లెట్ అని తమాషాలు చేస్తున్నారు భలేవారే!' అని ఒకసారి సరళకూడా తన హాస్యాన్ని తిప్పికొట్టింది.

'చాక్లెట్ అని తమాషాకు అన్నానా? పిచ్చిదానా. కావాలంటే పరీక్షించి చూడు. సరళా, నీకు కొండమీది కోతి కావాలన్నా తెచ్చి ఇస్తాను' అని తానూ వినోదంగా నాటకంలో పాత్రలాగా అన్నాడు.

ఒకమారు సరళ నిట్టూర్పు విడిచింది. వినోదానికి అడ్డుపుల్లవేసే ఆ నిట్టూర్పు వల్ల రామన్న చకితుడయ్యాడు.

'ఏమిటి? నీకు అబద్ధం అనిపిస్తూందేం?'

సరళ మాట్లాడకుండా తల తిప్పింది.

'ఇంతకీ మొగుడిమీద నమ్మకం పోయిందను..

'ఉహుఁ' అంటూ మళ్ళీ తల ఆడించింది.

'అంటే మనస్సులో వుందేదాన్ని చెప్పవు?'

సరళ పెద్దరికంగా నవ్వింది.

'అంత సంతోషపువిషయం ఏమిటి? చెప్పనయినా చెప్పు సరళా.

'మీరు దాన్ని జరిపించరు అని తెలుసు నాకు.'

హుఁ అని రామన్న ఆమెను ఎగాదిగాచూసి నవ్వుతూ అన్నాడు, 'నాదీ నీదీ గుండెలు ఒకటైనాయి కదా, నా విషయం నీకు ముందే తెలుసుకదా?'

'అయింది - ఇలాంటిమాటలు మొదలయ్యాయంటే—'

'నోరు మూసుకుంటాను, సరేనా? ఏమిటి కళ్ళు మూసుకొనేదా? కాదు కాదు - ఇది చూసేవస్తువు కాదుకదా? కానీ, చెవులు మూసుకుంటాను, చెప్పు' అని చెవికి చేతులు అడ్డు పెట్టుకున్నాడు.

'మీరు ఎప్పటినుంచో చెవులు మూసుకున్నారు నా మాటలు వినకుండా.'

'పోనీ వదిలెయ్, డాక్టరుకే చెపుతాను. అడిగింది యివ్వండి అని అన్నాడు పుణ్యాత్ముడు. అందుకని నీవు నోరుతెరచి అడిగేట్లు మందు యివ్వు అని అడుగుతాను.'

'నోరుతెరిచి యెందుకు? నమస్కరించి అడుగుతాను.'

'అడుగు, అలాగైతే భక్తశ్రేష్ఠురాలా, ప్రసన్నుడైన నీ దేవుడు కళ్ళు మూసుకొని యిస్తాడు నీవు అడిగింది.'

తను ఆ మాటను ఎంత వినోదాత్మకంగా, ఎంత ఉల్లాసంగా, ఎంత అల్లరిగా చెప్పాడు! అయితే వేసవిలో కురిసే వానలా తన ఉల్లాసప్రవృత్తిని సరళ సమాధానం అకస్మాత్తుగా వచ్చి, చుట్టుముట్టి కురిసింది. ఆ వానవల్ల తడిసినట్లుగా తన దేహం ఒక్కసారి చెమటపట్టింది ఆమె సమాధానంతో. కళ్ళు మూసుకున్నాడు, తను. నవ్వు నర్తిస్తున్నది తన ముఖంలో. హృదయం పురకలేస్తున్నది. అయితే యిదంతా ఒక్కక్షణంమాత్రం. మరునిముషం సరళ నోటినుంచి 'మీరు కుముద పెళ్ళివిషయం ఆలోచించాలి.' అనేమాటలు వెలువడేసరికి మూసినకళ్ళు తెరవడానికి భయమేసినట్లయింది.

'ఏమిటిది? ఏం మాట సరళా?'

'వద్దన్నా మీరే విన్నారు కదా?'

'ఇలా మాట్లాడితే, సరళా, నేనేం చేసేది?'

'ఇప్పుడు చెప్పండి డాక్టరుకు.'

నిజంగా ఆ మాటను ఆమె సదుద్దేశంతోనే అన్నదనేది తర్వాత ఎన్నోరోజులు అయినతరువాత తెలిసింది రామన్నకు. డాక్టరుమాట తనే ముందు ఎత్తాడు. ఉద్వేగంతోకూడిన వాతావరణాన్ని ప్రసన్నంగాచేసే సదుద్దేశంతో సరళ బుద్ధిపూర్వ

కంగా, నవ్వులాటకని అలా చెప్పింది. అయితే యిదంతా రామన్న కప్పుడు తోచలేదు.

సరళ డాక్టరును అడగండి అన్నప్పుడు రామన్నకు ఒకే ఒక ఆలోచన వచ్చింది. తనకు కుముదకు వుండేసంబంధం సరళకు తెలిసిపోయింది. లేక కుముదే చెప్పి వుండాలి. ఈ నాలుగయిదు రోజులనుంచి తమమధ్య మాటలు అంతంతమాత్రం గానే వున్నాయి. ఇప్పుడు డాక్టరుమాట ఎత్తిందన్నతర్వాత ఏదో అనర్థం వచ్చి పడింది! అనర్థమేం కర్మ! కావలసిందే అయింది! అనిష్టమయింది! వీధిలో వెళ్ళేభూతాన్ని యింటిలోకి ఆహ్వానించినట్లు ఈ పాడు కుముదను ఏ చెడ్డ ముహూర్తంలో చేర్చిందో! ఈ పిల్లయినా ఎంత టక్కరిది? తనముందు ఎందుకు చెప్ప లేదు! ఎందుకేమిటి? తనను వలలో వేసుకోవడానికి ముందునుంచీ ఆమె ఈ ఆట ఆడుతూవుండాలి. సందేహమేలేదు. ఆనాడు గదికి పుస్తకం వెతకడానికి వచ్చింది. అంతకుక్రితం నా చేతికి తనచేతిని తగిలించింది - తనను నేను సినిమాకు తీసుకొని వెళ్ళేట్లు పరిశుద్ధహృదయంగల సరళను వొప్పించింది - ఇదంతా ముందునుంచే తయారుచేసుకున్న పథకం అయివుండాలి. అందుకోసం ఇప్పుడు సరళకే చెప్పేపింది, నేను జారిపోకుండా చిక్కిపోవాలని! అబ్బ!

'కుముదే చెప్పిందా నీతో?' అని వెనువెంటనే తన నోటినుంచి వచ్చింది.

'ఛీ! ఇలాంటిమాటల్ని ఆ పిల్ల తనంతట చెపుతుందా! నేను మీతో చెపుతాననికూడా తెలీదు దానికి.'

సరళ చెప్పిన యీ సమాధానం విని రామన్న సందేహం దృఢమైంది. సరళకు ఎలాంటి దెబ్బ తగలకుండా తను సమాధానం యివ్వాల్సింది. తన మనస్సులో వుండే ఆలోచనల లేశంకూడా ఆమెకు తెలియకూడదు అని, నవ్వుముఖంతో 'కానీ, డాక్టరుకు చెపుతాను' అన్నాడు.

ఆ రోజుమాత్రం రామన్న ఏకాంతంగా ఆలోచించవలసి వచ్చింది. రెండు మాటలు అతనిముందు స్పష్టంగా నిలుచున్నాయి; కుముదతో సంబంధం ఏ పరిణామం చెందుతుంది అనే వూహ జనించింది; కుముద బుద్ధిపూర్వకంగా వేసిన వల ఇది, అందువల్ల దీనినుంచి తప్పించుకోవడానికి బుద్ధినంతా వినియోగించాలి. ఆ

క్షణంలో కుముదమీద తనలో ఎంతో కఠోరమైన తిరస్కారభావం కలిగింది. నన్ను వలలోకి లాగడమా? నా ఇంటిలోవుండి నా భార్య అసహాయురాలిగా వుం దనేది బాగా తెలుసుకొని, దానినుంచి దుర్లాభాన్ని పొందాలని చూడడమా? అవ మానం-కోపం-తిరస్కారం-ద్వేషం-అసహనం——వీటితో సుడిగాలిలో చిక్కినట్లు అతను దిక్కుతెలీక అల్లాడాడు.

మర్నాటికల్లా వుద్వేగమంతా శాంతించింది. తనదీ తప్పు లేకపోలేదని వేరు వుపాయంలేక అతను రాత్రి పడుకోగానే అంగీకరించాడు. ఏమైనాకానీ, ఇంక ఈ జంజాటాలుమాత్రం వద్దు అని నిర్ణయించుకున్నాడు. ఆ రోజునుంచి కుముదను కన్నెత్తి చూడడానికికూడా అతనికి మనస్సు రాలేదు; సరళముందు ఆ మాటే ఎత్త లేదు కానీ తనకు లక్ష్యంలేకున్నా తనను ఏదో ఒక అపేక్షదృష్టితో చూస్తున్న దనేది గమనించాడు; పగలు సరళతో మాటలు - కథలు, సాయంత్రం బయట గాలికోసం తిరగడం; రాత్రి రాయడం. అంతా ఇప్పుడు సవ్యంగా జరిగినట్లున్నా లోలోపల అతనికి ఒక భయం వుండనే వుంది. 'డాక్టరు ప్రశ్న' ఎప్పుడు అని వార్యమవుతుందో అని. ఒకరోజు 'డాక్టరునైనా అడగండి' అని సరళ చెప్పి నప్పుడు అదిరిపడ్డాడు. 'ఎందుకు? ఏమైందిప్పుడు?' అని పిచ్చిగా అడిగాడు.

'కావాల్నా ఏం? అద్దమైనా చూసుకోండి' అన్నది. అప్పుడు తెలిసింది సందర్భం!

'హె! నన్నంటావా? నాకేమి రోగం' అని తప్పించుకోను ప్రయత్నించాడు.

'వూరికే మాట్లాడితే సరిపోయిందా? మొహమంతా పాలిపోయింది.'

'ఏదోవొకటి చెప్పవద్దు. నీకు నేను యీ రోజు అందంగా కనిపిస్తూ వున్న ట్టుంది-హహ!'

'నా కోసం అందంగా కనిపించేరోజులు యెప్పుడో పోయాయి.'

మాటలు మళ్ళీ పైపైకి పోవచ్చునని భయపడి రామన్న విషయాన్ని మార్చి వేశాడు. 'మందు తీసుకున్నావా? అంటే వద్దన్నమాట? నేను వెళ్ళేదా రాసుకోవ డానికి?' అన్నాడు.

'మీరు వెళ్లండి. కుముద భోజనమూ అయింది, ఆమె వస్తుంది——'

రామన్న త్వరత్వరగానే వెళ్ళిపోయాడు. అంతలోనే మరొక ఆలోచనా అతవిని కదిలించింది. తను ఈవిధంగా తనగదిలోనే యెక్కువసేపు వుంటూన్నప్పటినుంచి కుముద సరళదగ్గర ఎక్కువసేపు వుంటూన్నది. మళ్లీ ఏ వల విసరబోతున్నది?....

రామన్న ఒక్కసారి తలగోక్కుని లేచి నిలుచున్నాడు. ఎదురుగా చూశాడు. అతనికి నవ్వు వచ్చింది. పాపం! చూడకూడదా? తను ఇంతవరకు జ్ఞాపకాల సింహాసనాన్ని అధిష్ఠించివుంటే పుస్తకంమాత్రం ఓడిపోయి మొరపెట్టుకొనే శత్రువులా అలాగే నేలమీదికి తలవాల్చి పడివున్నది. తనదే పిచ్చి. పుస్తకంలో ఆశ్లోకానికి తను కోపం తెచ్చుకున్నాడు కదా! ఎందుకు? ఆశ్లోకం సత్యమైన దాన్నే చెప్తుంది అనేందుకు దానిమీద కోపం! ఆ శ్లోకం చెప్పేది అక్షరాలా నిజం. 'మళ్ళీ ఏ వల విసరబోతున్నది?' అని ఆ రోజు తను మనసులో ప్రశ్నించుకున్నాడు కదా! అది వల కాదు, కుముద విసిరింది కానేకాదు, అది విధి విసిరిన వల, సృష్టి మాయ విసిరిన వల. అనాదిగా జగత్తును వ్యాపించి విసిరిన వల. దానికోసమే చివరివరకు వుండి తను దానిలో చిక్కుకున్నాడు - ఓటమిని ఒప్పుకునేట్టుగా, నిల చినచోటనే శరణాగతునిలాగ రామన్న కుర్చీలో మళ్ళీ కూర్చున్నాడు.

# 14

ముఖాన్ని ముసుగులో దాచుకుంటే బయటి ప్రపంచం కనిపించదు, అయితే లోనిజగత్తు దాగివుండదు అని కుముద తెలుసుకోవడానికి ఎంతోసేపు పట్టలేదు. అంతేకాదు; బయటిప్రపంచం పూర్తిగా కనిపించకపోవడంవల్లనో యేమో, లోపలి ప్రపంచదృశ్యం ఇంకా బృహదాకారంతో ఎదురవుతుందనీ కుముద గ్రహించింది. మెల్లిగా ముసుగుతీసి అటూ ఇటూ చూచింది. అంతా పూర్వం ఒకసారి చూసినట్లు భావించింది. నిత్యం చూసేదృశ్యమే అయినా, ఏదో ఒకవిధంగా యిలా తన గది వాతావరణం - ఆఁ, వాతావరణమంటేనే సరి - ఒకసారి అలవాటయినట్లు తోచింది. ఎప్పుడు? ఎప్పుడు తనకు గది యీవిధంగా కనిపించింది? తను ముసుగువేసుకొని పడుకొనివుండాలి. అది సహించరానిదై వుండాలి, అప్పుడు తను ముసుగుతీసి తను చుట్టూ చూడాలి, ఇలా - అవును, కనిపించింది.

రాత్రి గడిచేకొద్దీ నిద్రరాక అలసిన కుముద మనసుకు ఏ రోజా, ఎంతకాలం ముందు అనేది జ్ఞాపకం రాలేదు. అయితే సందర్భంమాత్రం - ఒట్టి సందర్భం ఏం కర్మ? జరిగిందంతా, ఒక్కొక్కటిగా, ఒక్కొక్కమాట, పూర్తిగా జ్ఞాపకం వుంది.

అప్పుడు రామన్న మనస్సు సరిగ్గా లేదు అని కుముద భావించింది. ఒకనాటి ఉదయం, సరళక్క మూర్ఛపోయినప్పటినుంచి రామన్నముఖంలో ఒక చింతతో కూడిన ఆత్రుత కనిపిస్తున్నది. సరళక్కకు రోజంతా చింతాజనకపరిస్థితి - కోలు కొని రాత్రి 'ఇంక ఫరవాలేదు' అనిపించినప్పుడు, ఆ రాత్రిమాత్రం రామన్న తన గదికి వచ్చాడు. తర్వాత ఎన్నోరోజులవరకు రానేలేదు. భార్యను గురించిన చింతతో మనస్సు వ్యాకులమై అతను అలా చేసివుండవచ్చు అనుకున్నది మొదట్లో. అయితే రోజులు వారాలయ్యాయి, వారాలు నెలలయ్యాయి, అయితే రామన్న తన దగ్గరికి రానేలేదు! తన చింత ఇంతటికే పరిమితమైవుంటే కుముద సరియైన కారణాన్ని వెదకి సమాధానపడి వుండేది. అయితే ఇంట్లో సందర్భం వచ్చినాకూడా తనను ముఖమెత్తి చూసేవాడు కాదుకదా! కుముదకు సంశయం కలిగింది. ఆ తర్వాత భయమేసింది; లేకుంటే తానుగా అతనిగదికివెళ్లి మాట్లాడించి అడిగి వుండేది. లోపలి వుద్వేగాన్ని ఎన్నిరోజులని అణచిపెడుతుంది? మనసును అరికట్టేవుద్దేశంతో రాత్రి సరళక్కదగ్గరే ఎంతోసేపు గడిపేది. అప్పుడైనా రామన్నను కళ్ళారా చూడవచ్చని లోపల వొక ఆశ. అయితే తను సరళక్కదగ్గర కూర్చున్నప్పుడు రామన్న అక్కడికి తొంగికూడా చూసేవాడుకాదు! ఎన్నోసార్లు, తను వచ్చినప్పుడు రామన్న అక్కడ కూర్చొనివుంటే, తన్ను వాకిట్లో చూసినక్షణమే వెళ్లిపోయేవాడు. ఇదంతాచూసి ఒక్కొక్కమారు కుముదకు రామన్ననుగూర్చి ఎందుకో? ఏమిటో?- వ్యధ కలుగుతూవుండేది. ఒకమారు అలాంటిసందర్భంలో ధైర్యం తెచ్చుకొని సరళక్కను అడిగింది:—'ఎందుకు? ఆయనకు బాగు లేదేమిటి?'

'అడిగితే నాకేం రోగం అంటారమ్మా!' అని సరళక్క నిట్టూర్పు విడిచింది.

'కాదు, ముఖం పాలిపోయివుంది, అందుకన్నాను.'

'నేను అలా అంటే ఏమిటేమిటో అన్నారు.'

'అడగనైనా అడుగుతావా ఏమిటని. ఎందుకంటే—'

'నేను అడిగితే. ఆయన చెప్పేట్లు లేదు' మళ్ళీ సరళక్క నిట్టూర్చింది.

కుముదలో మళ్లీ అనుమానం మొలకెత్తింది. ఇదేమిటి? భార్యాభర్తలమధ్య మనస్పర్థలంటూ లేదాయె। తనకేమీ సంబంధమూ లేదు? తనదగ్గరికి రావడంగాని, చూడడంగాని లేదు. ఏదైనా సరళక్కకు తెలిసి—?

'నీకు చెప్పక మరెవరికి చెపుతారక్కా?' అని ముసిముసి నవ్వులతెరతో లోపలి ఆలోచనలను దాచిపెట్టను ప్రయత్నిస్తూ, కుముద ఓమాటు అడిగింది.

'హుఁ' దీర్ఘంగా నిట్టూర్చి, 'నన్ను కోప్పడ్డారు' అన్నది సరళక్క.

భార్యాభర్తలవిషయంలో మూడోవ్యక్తి కలుగజేసుకోవడంలో లోటుపాట్లు తెలిసిన కుముద వూరకుంది.

'ఆయనదైనా తప్పేమిటి?' సరళక్క విషాదం ధ్వనించేగొంతుతో అన్నది.

ఆ మాటకూ కుముద తలవంచుకొనే సరళక్క దుప్పటి సరిచేస్తూ మౌనంగానే వుండిపోయింది. అయినా సరళక్క మనస్సులో వున్నది ఇహ దాగలేదు. అది బయటపడి తీరాలి అని తను కుతూహలంతో వేచివున్నది. సరళక్క విచారలహరి వొడ్డుకు దాటింది.

'ఆయనదైనా తప్పేమిటి చెప్పు, కుముదా. బయట తను పనిచేయడానికి వీలుగా పెళ్ళి చేసుకోవడం, ఇక్కడ మంచమెక్కిన భార్యకోసం ఇంట్లో చేతులుకట్టుకుని నిలుచోడం ఎందుకు కుముదా?' సరళక్క ముఖంమీద విషాదం, నిరాశలతో కూడిన నవ్వు చోటు చేసుకుంది.

'అందుకే అన్నాను, ఆయనదైనా తప్పేముంది?'

ఇప్పుడూ కుముద మాట్లాడలేదు. ఆమె మాట్లాడుతుందేమో అన్న వూహ కూడా సరళక్కకు లేదు. ఆమె అలాగే తనమాటను పొడిగించింది.

'ఇంటికివస్తే ఏమైనా పనిచూడడమా, ఒక నవ్వా, లేక అలిసిపోయారా అని అడగడమా? ఏమీ లేదు, కాలుపెట్టడమే తరువాయి పరుపుమీద చావకుండా, బతక్కుండా పడివున్న పాడు ప్రాణం;'

ఇప్పుడుమాత్రం కుముదకు మాట్లాడాలి అనిపించింది.

'ఇదేమిటక్కా? లేనిదంతా కల్పించుకొని మనస్సుకు బాధ కలిగించుకోవద్దు. ఒకరోజు నువ్వు కనిపించకపోతే పిచ్చి పడుతుందాయనకు. నీకు ఎవరు చెప్పారు యీ పాడుకథలు?'

'పిచ్చి కుముద! ఇదంతా యెవరు చెప్పాలే? ఆయనముఖమే చెపుతుంది. మొదట మొదట రాగానే చూసేవారు ఏమైనా నెమ్మదించిందా అని. ఇప్పుడది ఖాయమైంది నెమ్మదికాదు అని; ఇప్పుడాయనరాగానే నన్నుచూసి తమ మనస్సులో వుండేదంతా కప్పిపెట్టుకొని, మరేదైనా మాట్లాడ్డానికి ప్రయత్నం చేస్తారే?-అప్పుడైతే మరీ ఆయన ముఖంచూస్తే నా పేగులు తోడేసినట్లవుతుంది. నేనైనా ఏం చేసేది చెప్పు, కుముదా? ఇంట్లో ఒకరిద్దరు పిల్లలైనా తిరుగుతుంటే బయటినుంచి రాగానే పిల్లల ఆట - అల్లరివల్ల ఏదైనా తనకీ ఒక ఓదార్పు. నా నుదుటిమీద ఏమీ రాయలేదు; వచ్చి ఆయన్ను దోచేశాను, పొయ్యేటప్పుడూ—'

ఇంతదీర్ఘంగా కలవరంతో మాట్లాడినందువల్ల సరళక్కకు ఆయాసం వచ్చిందో యేమో! అయితే ఆ ఆయాసాన్ని ఓర్చుకొనేశక్తి శరీరానికిలేక ఆమె కళ్లల్లో నిస్సహాయత సూచిస్తూ నీటిబిందువులు నిలిచాయి. కుముదకూ చాలా వేదన కలిగించింది.

'ఒక్కదానివే పడుకొని లేనిపోని ఆలోచనలు తెచ్చుకొంటావు, అక్కా. ఎవరికీ యీ యింటిలో ఎప్పుడూ అలాంటి వూహలు రాలేదు.'

సరళక్క దుఃఖావేశాన్ని ఆపుకుంటూ చెప్పింది. 'అయినా నాకు 'ఓదార్పు లేదు,' కుముదా' వున్నప్పుడు నా కర్తవ్యం నెరవేర్చలేదు. చనిపోయేటప్పుడైనా చేద్దామనుకున్నాను. అందుకే వొకమాట చెప్పాను ఆయనకు. నామీద కోప్పడినట్లుంది.'

'ఏమాటే అది, అక్కా! ఆయన కోప్పడేంతమాట నీ నోట్లోంచి వచ్చిందంటే నేను నమ్మను.'

'ఏమో, తల్లీ! కోపం వచ్చిందేమో నిజం.'

'అలాంటి దేమిటక్కా నువ్వన్నది?'

కుముద కొంచెం కవ్వించడానికి కొంచెం వినోదంగాను ఈ ప్రశ్న అడిగింది. దాన్ని అడిగేటప్పుడు చివరికి ఇది తప్పకుండా భార్యాభర్తల వాగ్వాదమే అని కుముద నమ్మకం. తను ఆ యింట్లో వుండడానికి వచ్చినప్పటినుంచి సరళక్క నోటినుంచి పరుషమైన లేక వంకర టింకర మాటగాని, ఆమెమాటను రామన్న కోపంతో గదమాయించడంగాని వినలేదు; ఇప్పుడేమో అతి నిస్సహాయస్థితిలో వుంది సరళక్క. అందువల్ల రామన్న కోప్పడడం సాధ్యంకాదు; జబ్బుతో నిస్సత్తువగా వున్నప్పుడు ఎలాంటివారైనా కుర్రతనంతో వ్యవహరిస్తారు. హృదయం చాలా మార్దవమవుతుంది. అలా అయి సరళక్క బాధపడి వుండవచ్చు అని తను మనస్సులో లెక్కవేసి కుముద ఆ ప్రశ్న అడిగింది.

'ఆయన్ని నేను మరోపెళ్ళి చేసుకోమన్నాను.'

సరళక్క చెప్పిన యీ జవాబుతో కుముద అవస్థ, పైనుంచి పడి స్పృహ తప్పినవాడు లేస్తున్నట్లుగా అయింది. తను ఎక్కడవున్నది? మాట్లాడుతున్నది యెవరు? ఏ సందర్భంలో దీమాట? ఒక్కక్షణం యేమీ తెలియలేదు. పెళ్ళి? రామన్నకు? మరొకపెళ్ళి? ఎందుకు? భార్యే ఆ మాట చెపుతున్నదికదా? ఎందుకని? ఇలాంటిమాటకు నవ్వేసే రామన్న కోప్పడ్డాడట? ఎం-దు-కు? ఇలా అనేక ఆలోచనలు అల్లరి చిల్లరిగా తనను చుట్టుముట్టాయి. దానికితోడు ముఖంలో ఏ భావమూ చూపించకూడదనే ప్రయత్నం! రామన్న పెళ్లినిగురించి తన కెందు కింత చింత - అని సరళక్కకు అనుమానంవస్తే? అందువల్ల - తన మానసిక ఆందోళనకి దూరమవాలన్నట్లుగా పైకి గట్టిగా నవ్వేసింది! బాధతోకూడా నవ్వవచ్చు అనే విచిత్ర అనుభవం తన కప్పుడు కలిగింది.

'అయ్యో! ఇలాంటి పిల్లచేష్టలు చేస్తే కోప్పడకేం చేస్తారక్కా?' అని నవ్వుతూనే అడిగింది.

'ఆయన కోప్పడ్డారు. నువ్వు నవ్వుతావు!'

సరళక్కకు వ్యధ కలగడంచూసి కుముద బాధపడింది. 'నవ్వుతున్నానని తప్పుగా అనుకోవద్దక్కా. కాదు, నువ్వే చూడు, భార్యను బ్రతికించుకోవాలని పగలు-రాత్రి కష్టపడేవాళ్ళతో మరోపెళ్ళి చేసుకోండి అంటే—'

'అంతమాత్రం నాకు తెలీదా, కుముదా? ఆయన నన్ను దక్కించుకోవాలంటే నే నెందుకు చావాలంటాను? అయితే, యింత కష్టపడేవాళ్ళకు కొంతైనా సుఖం దొరకనీ, అదీ నా కళ్ళముందే దొరకనీ అని___'

'మరొక భార్య. అంటే ఆయనకు సుఖ మనడానికి లేదు.'

ఆ మాట అన్నతర్వాత తన నాలికను రెండుగా చీరెయ్యా లనిపించింది కుముదకు. ఎలాంటి అసహజపుమాట వచ్చింది తన నోటినుంచి!....

కుముద దుప్పటి విసిరేసి పడకమీంచి లేచింది. ఆ రోజు తన నోటినుంచి వచ్చినమాట అసహజమైంది అని ఇప్పుడు తన కనిపించింది. అప్పు డనిపించ లేదు. అయినా ఆ రాత్రి సరళక్కతో జరిగిన మాటలవల్ల తన మనస్సు కలత చెందిందనేదిమాత్రం నిజం. మాటముగించి, సరళక్క నిద్రపోగానే తన గదికి వచ్చిన కుముదకు ఒక్కచోట నిలవడానికీ మనస్సు కాలేదు. అలా నిలుచుంటే తన మనస్సులోని ఆలోచన గబుక్కున తన ఎదురునిలిచి మాట్లాడిస్తుందేమోనని భయం. ఆ ఆలోచనను తప్పించుకునేట్లు గదిలో అక్కడా యిక్కడా తిరిగింది. చివరికి ఆ ఆలోచన తనను ఎదిరించకుండా వదలలేదు.

రామన్నకు పెళ్ళి! అది నీతోనే ఎందుకు కాకూడదు? ఈ ఆలోచన ఆ రోజు కుముదను పీడించింది. పదేపదే ఆ ప్రశ్నను పునరుచ్చరించి చివరకు కుముదకూ 'ఇది నిజమైయుండవచ్చా?' అనిపించసాగింది. అయితే ఆ అబద్ధపు గుండెధైర్యం ఎక్కువసేపు నిలవలేదు. ఆ విషయం నిజమైవుంటే రామన్న కోప్పడ్డాడు అనే మాటకు అర్థం లేదు. తనతో పెళ్ళి రామన్నకు అంత ఇష్టం కానిది, సహించరాని దనిపించిందా? ఎదురుగా అద్దంలో కనిపించే తనను చూసుకొన్నది; తనమీద రామన్నకు ఏవిధమైన అధికారం వున్నది అనేదృశ్యమే ఆమె కళ్ళముందు నిలిచింది. ఇలావుండీ - రామన్నకు కోపం! ఛీ - ఈ పెళ్ళి తనకు సంబంధించినదే కాదు - అనుకొన్నది. ఈనాటికి యెన్నిరోజులైంది రామన్న తనదగ్గరికి వచ్చి? కళ్ళెత్తిచూసి! 'ఆఁ - తెలిసింది -' అనిపించింది కుముదకు.

'మరెవరితోనైనా పెళ్ళి ఆలోచన అతని మనసులో వుండివుండాలి. అందుకని నా సహవాసం అతను తప్పించుకుంటూ వుండాలి!'

ఆ ఆలోచన రాగానే కుముద ప్రాణమే ఎగిరిపోయినట్లయింది. మరొకామెతో రామన్న పెళ్ళి - అనేవూహ కలగటంకూడా అసాధ్యం అన్నట్లుగా గట్టిగా కళ్ళు మూసుకొని, వుద్వేగంతో వూగిపోతూ - 'కాదు-కాదు. ఇది అబద్ధం-ఇది జరగదు' అని అద్దంలోని కుముదకు మొండిగా చెప్ప నారంభించింది. అద్దానికి చాలా దగ్గరగా వున్నప్పుడు ఆమెకు మెలకువ వచ్చినట్లయింది. ఇదేమి వెర్రి! లేనిపోనివి కల్పించుకొని భ్రమపడడం యెందుకు? అయితే ఇది కల్పన కాదు, సరళక్క చెప్పినదానిని తను స్వయంగా విన్నది, రామన్నకు రెండోపెళ్ళి——

ఛీ! ఇదెప్పటికీ సాధ్యంకాదు - అని తనని తాను ఓదార్చుకుంది. ఆ మాట విని రామన్న కోప్పడ్డాడు అని సరళక్కే చెప్పింది కదా! ఒక్కక్షణం సంతోషమనిపించింది అది తెలుసుకుని, వెంటనే విషాదమూ ఆవరించింది ఆమె ముఖాన్ని. రామన్నకు రెండోపెళ్లి సాధ్యంకాదు - అంటే - అంటే:- ఒకవేళ తననుగురించే ఆ మాట వచ్చివుంటే రామన్న తనని పెళ్ళిచేసుకోవడానికి సిద్ధంగా లేడు - అన్నట్లయింది కదా? అద్దంలోని కుముద ఓదారుస్తున్నట్లు తన ప్రతిబింబాన్ని చూసుకుంది.

మనసు నిజంగానే ఎంత చంచలమైంది! అలా ప్రతిబింబాన్ని ఎడతెగకుండా చూస్తూ నిలుచున్నప్పుడు మొదటి ఆలోచనో ఎక్కడో మాయమై ప్రతిబింబం ఆలోచనే ప్రాధాన్యత వహించింది. తన ప్రతిబింబాన్ని తనే మోహించినట్లు ఆనందం. అభిమానం రెండూ ఆమె ముఖంలో తాండవమాడాయి. 'రామన్న సొమ్ము ఇది' అన్నది. 'పెళ్లి కానీ కాకపోనీ, ఇది పూర్తిగా రామన్న సొమ్ము. రామన్న ఎవరినైనా పెళ్లి చేసుకోనీ ఇదిమాత్రం రామన్న సొమ్ము. తెలిసిందా?' అని తన ప్రతిబింబానికి తెలియజేసింది. యజ్ఞంలో ఆహూతి అయ్యే పశువుకూ స్వర్గం దొరుకుతుంది అనేది నమ్మనివాళ్లకు స్వర్గం గురించిన ఊహయే వుండదు- అని ఆ సమయంలో కుముద వాదించడానికి సిద్ధంగా వుంది. ఒకవిధమైన యజ్ఞంలో తన శరీరం ఆహూతి అయింది. కానీ ఆ శరీరానికి ఆనందమే కలిగింది అనేది పులకితమైన తన శరీరంద్వారా ఆమె గ్రహించింది. అద్దంలో చూడగా చూడగా ఆ శరీరంపట్ల మొదట అభిమానం, తర్వాత ఆనందం, తరువాత కనికరం, చివరికి వాత్సల్యం - కలిగాయి ఆమెకు. ఏమీ ఆలోచించకుండా త్వరత్వరగా ఆ శరీరాన్ని

సింగారించుకున్నది. ఆహుతి అయితే ఆనందం; ఎంత త్వరగా ఆహుతి అయితే అంత పరమానందం; అందువల్లనే ఇప్పుడే యీ ఆహుతిని అర్పించాలి, అని నిర్ధారించి గదినుంచి బయటపడింది! రామన్న గది తలుపు క్రిందిసందులోని వెలుతురులో కనిపిస్తున్నది. ఆ వెలుగుయొక్క చిన్న రేఖ బలంగా లాగుతున్నదో అన్నట్లు కుముద తిన్నగా ఆ తలుపుదగ్గరికి వచ్చింది.

అదే వెలుగురేఖ తలుపుదగ్గరికి రాగానే ఆమె కాళ్లకు ఒక్కక్షణం తగులుకున్నట్లయింది, ఆగింది. ఇదేమిటి? తెలియకుండానే తను తలుపు తట్టిందా? కాదు-అది తన హృదయం కొట్టుకునే శబ్దం- లబ్! డబ్! కాదు - గదిలోపలి గడియారం శబ్దం. టక్! టక్! ఉహుం - లోపల రామన్న అటూ ఇటూ తిరుగుతున్నాడు! చటుక్కున కుముదకు ఏదో తట్టినట్లయింది. అలా తోచినందుకు ముఖంలో చిరునవ్వు వెలసింది. మనస్సంత వేగమున్న శక్తి మరొకటి వుందా యీ ప్రపంచంలో? కుముద మనస్సు ఆ నిముషంలో ఆలోచనాప్రవాహంలో పదునాల్గు లోకాలలో సంచరించివచ్చిన ట్లనిపించింది. రామన్న అటూ యిటూ తిరుగుతున్నాడు! ఇప్పుడు అతనికి యెంత ఆశ్చర్యం కలుగుతుంది! దేవుడి అనుగ్రహంకోసం అలమటించే భక్తునియెదుట దేవుడు తనంత తానే సాక్షాత్తుగావచ్చి నిలుచుంటే ఆ భక్తుని అవస్థ యేమవుతుంది?.... మెల్లిగా తలుపుమీద చేయివేసింది కుముద. తలుపు తెరిచేవుంది! ఇప్పుడు తను లోపలికి వెళ్ళాలి! వెళ్లగానే రామన్న కళ్ళను వెనుకనుంచి గట్టిగా మూయాలి!....ఉహుం. కళ్ళుమూసితే జవాబు లేదు. రామన్నను కౌగలించుకోవాలి, బలంగా కౌగలించుకోవాలి, తన బాహువులలో చిక్కిన అతను క్రమేణ కరిగి తనలో లీనమైపోవాలి. అంత బలంగా వుండాలి తన ఆలింగనం. వద్దు - అదీ వద్దు....అదిగో - ఇప్పుడు యీ వైపే వస్తున్నాడు; లోపలి కలతవల్ల అతనిముఖం ఎంత సుందరంగా కనిపిస్తున్నది; ఏదో ఆలోచన వల్ల అతని పెదిమలు వణుకుతున్నాయి. వణకే ఆ పెదవుల్నిచూసి కుముద పులకించింది. ఆ పెదవుల్ని తన పెదవులతో పట్టి వణకకుండా చేయాలి. అంతటితో నెమ్మది కలుగుతుందా? రెండుచేతులతో అతని ముఖాన్ని గట్టిగా పట్టుకొని-? అబ్బ! ఆ ముఖం యిలాగే తనఎదుటనే వుంటే తనకు పిచ్చిపడుతుంది! దాన్ని ఎదుట చూపించకూడదు - దాన్ని దాచిపెట్టుకోవాలి, చుట్టివేయాలి.

ఆనాటిరాత్రి తను మనస్సుతో చాలా భ్రష్టురాలై నదనడంలో సందేహం లేదు. ఒకదానిమీద ఒకటి తరుముకువస్తున్న ఆలోచనలతో చివరకు స్పృహ తప్పిన ట్లయిందేమో! రామన్న మంచంమీద కూర్చున్నది. తను అతని సమీపంలో వున్నది. అతను తనని వారిస్తూ మంచంమీంచి లేవడం - వీటిని చూసినప్పుడే ఆమెకు మెలకువ వచ్చింది. 'ఇదేమిటి? ఎందుకిలా? ఇక్కడి కెందుకొచ్చావు?' అని తడబడుతూ రామన్న లేచి దూరంగా జరిగాడు.

అప్పుడు కుముద నుదురు-వొళ్లు అంతా చెమటపట్టి, వర్షంవల్ల చల్లబడిన నేల వూపిరి తీసుకున్నట్లు ఆమె హృదయం చల్లబడింది. ఆ వూపిరితో ప్రాణమే పో గూడదా-అనిపించిందామెకు. రామన్న ముఖ కవళికలనుచూడగా ఆమె వెర్రి దూరం కాసాగింది. చివరికి తను ఏమీ మాట్లాడకుండా ముఖం దించుకొని అక్కడ్నుంచిలేచి తనగదికి వచ్చింది. ఆనందంగా వున్నప్పుడు మనస్సువేగం ఎంత పుంజుకుంటుందో, అలాగే నిరాశతో మునిగినప్పుడు శరీరంలో చురుకుదనం తక్కువవుతుందేమో! ఎందుకంటే, అక్కణ్ణుంచి తనగదికి నడవడానికి కాళ్లకు ఎన్నియుగాలు పట్టింది! అలా వచ్చి, తన పడకమీదపడి, ముఖాన్ని గట్టిగా ముసుగుతో మూసుకున్నతర్వాతనే, ఆలోచనా స్రవంతి ఆగి, పైకి గట్టిగా అనుకుంది. 'నేను ఆయనకు అక్కరలేదు - అక్కరలేదు' మరుక్షణం తను ఈ ప్రపంచానికే అక్కరలేదు అనే వూహతో ఆమెశరీరం గడగడ వణికింది....

ఎప్పటిసంగతి యిది? హాఁ - ఆ రాత్రి సంగతి. ఆనాడు తను 'నేనింక మానసికంగా వితంతువుని' అనుకున్నది. సరే, ఇప్పుడు? సరళక్క శారీరికంగా లేకున్నా ఇంటినిండా, మనస్సునిండా ఆమె మూర్తి వ్యాపించివున్నట్లే వుంది. అందువల్ల తను చనిపోయేంతవరకు మానసికంగా విధవే! శారీరికంగా తను వితంతువు కాదు అనేది కుముద మరచిపోలేదు. మనస్సుకు అభిమానంవున్నట్లుగా దేహానికి స్వాభిమానం అనేది లేనేలేదు - అనుకొన్నది. దేహం-? కుముద ఒక్కమారుగా తత్తరపాటు చెందింది. అయ్యో! ఎంత సిగ్గుమాలినదయింది యీ దేహం - అని పారిపోయేదారి తెలియక, వేటగాళ్లచేత చుట్టు ముట్టబడిన మృగంలా కుముద మళ్ళీ పడకమీద కూర్చున్నది, రెండుచేతులతో తలను గట్టిగా పట్టుకున్నది.

# 15

పూ_ర్తిగా బయటికిరాని కఫం వచ్చినవానిలాగా అయింది రామన్న పరిస్థితి. బాధయినా చింతలేదు. బలవంతంగానయినా బయటికి తెచ్చుకోవాలి. లేకుంటే ప్రాణం కుదుటపడదు. రామన్న కుర్చీలో కూర్చొనే సరళ చిత్రాన్ని చూస్తున్నాడు. 'పిచ్చిదానా, చూశావా! నీ వుద్దేశం ఎంత బాగున్నదో దాని పరిణామమూ అంతే ఘోరంగా వుంది! చివరికి నాకంటే శ్రేష్టమైన రచయిత వయ్యావు నువ్వు! అది తెలియక నీదే తప్పు అన్నాను. తప్పు ఎవరిదీలేకనే విషాదం రసపట్టుగా నడిచింది' రామన్న తటాలున లేచాడు. నేను ముసలివాడినయ్యాను - అనుకున్నాడు. మనుష్యుడు వర్తమానాన్నికూడా మరిచి వెనకటిదాన్ని తలచుకోవడానికి వుత్సుకత చూపితే అది అతనికి ముప్పు దగ్గరికిరావడానికి గుర్తు అని ఎక్కడో చదివినట్లు అతనికి జ్ఞాపకం—ఛూ! మళ్ళీ జ్ఞాపకం - అంటూ అటూ ఇటూ తిరగనారంభించాడు. ఇలాగే తిరుగు—హుం! ఆ రోజు జ్ఞాపకం! పోనీ ఈ ఒక్క జ్ఞాపకం పూ_ర్తిగా బయటికిలాగి మనస్సును తేలికపరచుకొని పడుకుందాం - అని నిర్ధారణ చేసుకున్నట్లు అడుగులువేస్తూ అటూ ఇటూ తిరగసాగాడు. అవును. ఆ రోజు తను యిలాగే తిరుగుతున్నాడు. ఎందుకు? ఆ రోజు ఏమైంది? అవును కదూ? సరళ మళ్ళీ ఆ రోజు తన పెళ్ళివిషయం యెత్తింది. ఆ మాట వచ్చినప్పుడు ఒకసారి తనకు సిగ్గుతో పరుగెత్తాలనిపించింది. ఎందుకో-ఏమో? సరళ 'పెళ్లి' అనగానే తన కళ్ళముందు కుముదరూపం నిలిచింది. సమీపంలో ఆ మూ_ర్తి, ఎదుట సరళ-అందువల్ల తను సరళను వంచించాడు కదా అనే వూహ వచ్చింది. అప్పుడు అపరాధిలా పరుగెత్తాలనిపించింది. తనకు, కుముదకువుండే రహస్యసంబంధాన్ని గూర్చి సరళకు అనుమానం వచ్చింది; దాన్ని ఆ పేస్థితిలో తను లేడు; అనేది తెలుసుకొనే సరళ ఈ మాటను ఎత్తుతున్నదనే అనుమానం, ఆ మాట వచ్చినప్పుడు అతని హృదయాన్ని రంపంలా కోసింది. ఒక్కొక్కమారు - సరళ అంతఃకరణం శుద్ధమైంది. ఆమె నిర్మలమైన మనస్సుతోనే ఇలా చెపుతున్నది. తనకైనా కుముద సహవాసం అభ్యాసమైవుంది. ఊఁ అనేద్దామా అనిపించేది. అప్పుడు చటుక్కున నాలుకను కరుచుకునేవాడు. ఎలాంటి మూర్ఖత్వం! సరళ ఆలోచన యేమిటో! తన ఆలోచన యేమిటో! ఆమె 'మరొక వివాహం' అనిమాత్రం చెపుతున్నది; కుము

దతో పెళ్లి అని చెప్పలేదు. ఆవూహే వుండివుంటే స్పష్టంగా చెప్పేదికదా? అలా ఒక్కమారూ చెప్పలేదు. ఇలా వున్నప్పుడు తనే 'కానీ, నేను కుముదను పెళ్లి చేసుకుంటాను' అని చెపితే తన తప్పును బహిరంగంగా ఒప్పుకున్నట్లు కాదూ?

అయితే తనది తప్పు అని రామన్న ఎప్పుడూ ఒప్పుకోవడానికి సిద్ధంగా లేడు. ఒకవేళ తను కుముదను ప్రేమిస్తూవుంటే అది ఒకదృష్టిలో తప్పు అనిపించి వుండవచ్చు. అయితే తను కుముదను ప్రేమించడంలేదు. ప్రేమించడం లేదా? అంటే ప్రేమలేని శరీరసంబంధం వ్యభిచారం కాదూ? తను నిజంగా కామప్రవృత్తి కలవాడా? దాన్ని వొప్పుకోవడానికి రామన్న సిద్ధంగాలేడు. లేక తనకు తెలియకుండానే తను కుముదను ప్రేమిస్తున్నాడా? ఏ నిర్ణయానికీ రాలేనిస్థితిలో వుండగా మళ్ళీ సరళ 'మరొక పెళ్ళి' మాట ఎత్తగానే ఒక్కొక్కమారు అతనికి సహింప శక్యం కాలేదు. తన హృదయాన్నిగూర్చి రామన్న ఇంకా వొక నిశ్చయానికి రాకపోయినా కుముదనుగూర్చి అతనికేమాత్రం సందేహం లేదు. ఆ రోజు ఆ రాత్రి జరిగిన సంఘటనవల్ల రామన్నకు పూర్తిగా విశ్వాసం కలిగింది. ఆ రోజు తను మనస్సులో ఏ నిర్ణయమూ చేసుకోక ఇటూ అటూ తిరుగుతూ చివరకు మనస్సు శరీరం అలసిపోవడంతో మంచంమీద కూర్చున్నాడు. అప్పుడు ఒక్కసారి-తన మనస్సులోని అనుమానం-భయం-అపరాధబుద్ధి - ఇవి మూడూ మూడురకాలుగా రూపందాల్చి నిలిచాయా - అన్నట్లుగా కుముద తనగది తలుపుదగ్గరవచ్చి నిలుచున్నది. కుముద తనని ప్రేమిస్తున్నదనేందుకు ఆ రోజు ఆమె ముఖకవళికలను బట్టి రామన్న పూర్తి గ్రహించాడు. అయితే ప్రేమ సుకుమారమయినట్లే క్రూరమూ అయివుంది. ఆకర్షణీయమైనట్లే అతి భయంకరమూ అయివుంది. ఆనందకరమైనట్లే జుగుప్సాకరమూ అయివుంది - అనేదిమాత్రం రామన్న ఆ రోజువరకు ప్రత్యక్షంగా చూడలేదు. ఎలాంటిరూపం కుముదది ఆ క్షణంలో! దీపం పురుగుకి జ్వాలలా అతనికి కుముద ఆకర్షణీయంగా కనిపించింది. ఆమెకేసి చూడడానికి కూడా రామన్న భయపడ్డాడు; చూస్తే ఆమె సౌందర్యపాశం తనని లాక్కుంటుంది కదా అని భయపడినవానిలాగా ముఖంతిప్పి మంచంనుంచి లేవడానికి ప్రయత్నించాడు; అందుకోసమే చాచిన ఆమెచేతులు అతనిని ఇంకా సమీపించలేదు. ఒక క్షణం - అర క్షణం - ఈ కనురెప్పలలో - ఇక తను ఆహూతి అవుతాడు -

అయ్యాడు - అనేంతలో ఆమె చేయిచాచి తన ముఖమెత్తి చూసింది. ఎంత చమత్కారంగావుంది సృష్టివిలాసం! ఆ ఒక్కక్షణం చెమటపోయగా ఆమె సౌందర్యం జారిపోయినట్లయింది. ఇప్పుడు ఆమెముఖంలో మొదట వొట్టి క్రూరత్వం, తర్వాత సహించరాని ఛాయలు - అంతే మిగిలినట్లయింది. క్రమేణ తనూ ఆమెను తేరిపారచూశాడు. ఆ మారిన కవళికలనుచూడగానే ఇక తను ధైర్యంతో ఆమెను చూడగలనని గ్రహించాడు. అప్పుడు మాటలే అవసరంలేకున్నా తన నోటినుంచి ఏదోమాట వెలువడింది, ఆ మాటతో కుముదకూడా బయటపడింది.

అప్పట్నుంచి రామన్న భయం ఎక్కువైంది. తను ప్రేమించేమాట వేరు, మరొకరు తనని ప్రేమిస్తారనేమాట వేరు అనేది అప్పు డతనికి తెలిసివచ్చింది. ప్రేమే తనదయివుంటే ఆనందం వుంది, ప్రేమాస్పదమైనవస్తువు తనని తిరిగి ప్రేమించకపోయినా సుఖముంది. అయితే తను మరొకరి ప్రేమకి కారకుడన్నప్పుడు వేటలో బలి అయినట్లనిపిస్తుంది. వేటకుక్కల్నుంచి తప్పించుకొనే కుందేలులా ఆ రోజునుంచి రామన్న కుముదను తప్పించుకుంటూ తన గదిలో ఎక్కువసేపు దాక్కునివుండేవాడు. క్రమేణ సరళ సాన్నిధ్యంలోనూ భయపడేవాడు. 'మరొక పెళ్ళి' అనేమాటలు తనచెవిలో పడితే తన అవస్థ ఏమవుతుందో - అనే భయం. వీళ్ళదగ్గర్నుంచి కావలసినంత దూరంలోవుంటే చాలు, సురక్షితంగానూ వుంటుందని తెలుసుకున్నాడు. ఎంత పిచ్చివాడు తను! దూరం! అంటే ఏమిటి? ఆ శబ్దానికి అర్థమే లేదు అని క్రమేణ తెలియసాగింది. శారీరికంగా తను ఎంతెంత దూరంగా వుంటూ వచ్చాడో మనస్సు అతనిని అంతంత కుముదదగ్గరికి లాగసాగింది. కుముద శారీరికంగా సమీపంలో లేకున్నా మానసికంగా సమీపంలోనే వున్నది అనేది తెలిసి అతను హతాశుడయ్యాడు. ఇలా వున్నప్పుడు శారీరికంగా మాత్రం దూరంగావుంటే ఏమి సాధించినట్లు అని ఒక్కొక్కసారి అనిపిస్తుండేది. ఏలాగైనా ఆమె తనను ప్రేమిస్తున్నది. అందువల్ల ఆమె తిరస్కరించే భయం లేదు. ఒకసారి శారీరికవాంఛన తృప్తిపరిస్తేమాత్రం తప్పేముంది-అనిపిస్తుంది. పెళ్ళిమాటమాత్రం కుముద నోటినుంచి రాలేదుకదా! ఇంక ఏం భయం?-అనీ ధైర్యం కలిగేది. ఇంతకీ సరళ తరువాత........

అప్పుడు రామన్న తనమీద తనే అసహ్యపడ్డాడు. 'సరళ తరువాత' అని

ఎప్పుడూరాని వూహ వచ్చిందెందుకు? ఇంత కఠినుడా, కృతఘ్నుడా, అనాగరికుడా తను? లోలోపల తను సరళను కాంక్షిస్తున్నాడుకదా? ఛీ!-ఆ దేవిముందు రాక్షసుడు తను! తన కష్టనష్టాలను మింగుకొని, నా సుఖంకోసం ఆమె స్వయంగా మరోపెళ్లి చేసుకోమని అడిగి పీడిస్తుంటే యీ ఆలోచన యెందుకు? ఆమెవల్ల నాకు ఏ ఆటంకం కలిగింది అని నేను ఆమె మరణాన్ని కోరుతున్నాను - అని రామన్న పరిపరివిధాల తనని నిందించుకున్నాడు. కొన్ని నెలలతరువాత ఒకసారి తనంత తానే వెళ్ళి సరళ కాళ్లమీదపడి, అన్నీ వొప్పుకొని మరొక పెళ్ళికి సమ్మతించాలని నిర్ణయించాడు. అయితే చివరిఘడియలో ధైర్యం చాలలేదు. ఆతరువాత క్రమేణ సరళస్థితికూడా క్రమంగా క్షీణిస్తూవచ్చింది. ఈవిధమైన వుద్వేగకరభావనను ఆమెలో కలిగించడం ఆమె వుండేస్థితిలో మంచిదికాదు అని ఒక సాకు ఏర్పరచుకున్నాడు. అయితే ఒకవేళ ఆ మరోపెళ్ళిలో కుముదపాత్రే లేకుంటే ఎలా - అనే భయమూ అతన్ని వారించింది.

చివరికి మాటమాటకు, క్షణక్షణానికి కుముద రామన్న మనస్సులో నిలవ సాగింది. సరళస్థితి క్షీణమవటం ప్రారంభించినప్పటినుంచి కుముదని తప్పించుకోవటం రామన్నకు సాధ్యం కాలేదు. రోగికి సేవచేయడానికి, అనివార్యమవుతున్న దుఃఖదాయక సంఘటనఛాయలో రామన్న, కుముద పరస్పరం సహకరించుకోవలసివచ్చింది. సరళ చివరిఘడియలు ఇంక ఎంతోదూరంలో లేవు అనే వూహయొక్క వుద్వేగంవల్ల బడలిన రామన్న ఆత్మనిగ్రహశక్తి కోల్పోయాడు. ఎలాగైతేనేం చివరికి వొకరాత్రి వధ్యస్థానానికి ఎక్కించబడే అపరాధి ఉరిక్రింద నిలుచునే నిస్సహాయస్థితిలోలాగా, కుముదగదికి వెళ్ళాడు.

కుముద తనని ప్రేమిస్తున్నది. ఈ రోజు కాకుంటే రేపు ఆమెనే - అలా అనిపిస్తే - పెళ్ళి చేసుకోవచ్చు అనే రెండు ఆలోచనలు ఇపుడు, గుడ్డివాడికి రెండు చేతుల్లో రెండుకర్రలు ఆధారమైనట్లు రామన్నకు ఆధారమయాయి. కుముద నన్ను ప్రేమిస్తున్నది - అవునా? అని ఒక్కొక్కమారు అతనికి సందేహం రాకుండా వుండేదికాదు. ఒక్కొక్కప్పుడు ఎప్పుడూ తన స్పర్శకు మరింత కరిగిపోయే కుముద అంగాంగాలు తనచేయి తగలగానే బిగుసుకున్నట్లు అయేది. ఎందుకో? అయినా కుముదమాత్రం ఎప్పుడూ తన అయిష్టాన్ని వ్యక్తపరచలేదు. అదే రామన్న మన

స్సుకు ధైర్యాన్ని యిస్తూవచ్చింది. ఒక్కొక్కమారు వెనకటికి వొకసారి తనకు కనిపించిన క్రూర ముఖకవళికలతోవున్న కుముదరూపం కళ్లముందు నిలచేది: ఆ రూపం కళ్లముందు నిలిచినప్పుడు ఒకమారు తనూ క్రూరంగానే ప్రవర్తించే వాడు. అపరాధాన్ని చూపించినక్షణం పరుగెత్తే అపరాధిలా ప్రవర్తించేవాడు. ఎన్నోసార్లు తన ఆలోచనకు, తన నడతకు సిగ్గుపడినస్థితిలో కుముదపట్ల అతనికి కనికరభావమూ మొలకెత్తుతుండేది. అప్పుడు ఆమెను మాట్లాడించి రంజింపచేసు కోను యత్నించేవాడు. ఎక్కువగా మౌనంగావుండే కుముద ఒక్కొక్కసారి తనని నిరుత్తరునిగా చేయడం అతని మనస్సులో ఎంత అధైర్యాన్ని కలుగజేసేది?

'కుముదా, నామీద నీవు కోపగించుకొని వుండాలి' అన్నాడు ఒకమారు ఎంతో దయగానూ పశ్చాత్తాపంతోను.

కుముద జవాబు చెప్పలేదు. అయితే నిట్టూర్పును ఆపుకొనేయత్నంలో ఆమె శరీరం వణకడం చూశాడు.

'నీవు కోపగించినా నీ తప్పుకాదు అంటున్నాను' క్షమార్పణ అడిగే ధోరణిలో అన్నాడు.

'తప్పు చేసినవాళ్ళకు వేరేవాళ్ళను తప్పుపట్టే అధికారం లేదు.'

అబ్బ! ఎలాంటి జవాబు అది!

'అదే చెపుతున్నాను నేను. అందుకే తప్పు నీది అని నేను చెప్పనే చెప్పను.'

'నేను నాగురించి చెప్పాను. మరొకరిని తప్పుపట్టే అధికారం నాకు లేదు అన్నాను' అంటూ దూరంగా జరిగేప్రయత్నం చేసింది.

ఆమెను తనవైపు లాక్కుంటూ, 'పిచ్చిదానా! నువ్వు ఏం తప్పు చేశావు? ఇన్నిరోజులు నేను నిన్ను మరిచినట్లు నడుచుకున్నాను. అది నా తప్పు, అందుకు నువ్వు కోప్పడినా అది న్యాయమే' అన్నాడు.

చీకట్లో నవ్వుతున్న ఆ ముఖం కనిపించకున్నా ఆమె నవ్వులో అత్యంత తిరస్కారం-జుగుప్స-నిరాశలు ద్యోతకమయాయి అనేది రామన్నకు తెలియకపోలేదు. ఒక్కసారిగా అతనికి అధైర్యం కలిగినట్లయింది. దానిని తెలియనీయకూడదని కొంత కఠినంగా అడిగాడు, 'ఎందుకు? నీకు నమ్మకంలేదా నా మాటమీద?' అని.

'వుంచిన నమ్మకాన్ని వమ్ము చేయకూడదని మీతో ఎవ్వరూ వొప్పందం చేసుకోలేదుగా ?'

'ఎందుకు కుముద? నిన్ను మోసం చెయ్యాలని ఇలా చేశానని అనుకున్నావా?'

'కళ్ళుతెరిచి చీకట్లో నడవాలి అనే పిచ్చిదాన్ని నేను!'

'ఇంత నమ్మకంలేకుంటే నువ్వు ఏం చేయమంటావో చెప్పు. అది చేయడానికి సిద్ధం నేను.'

ఆ మాటకూ నవ్వింది.

'మోసం చేసినవాళ్ళు ఏం చేయగలరు? దాచిపెట్టడం తప్ప!' అన్నది.

'కావాలంటే యిప్పుడే పద. సరళముందు నా నోటిమీదుగానే అన్నీ వొప్పుకుంటాను.'

'ఎందుకు? ఇలాంటిమాటలు చెప్పి ఆమెను చంపాలంటారా?'

'ఆఁ! ఏమన్నావు?'

'ఏమంటే ఏమిటి? నీవు మంచమెక్కగానే మేము ఈదారి పట్టాము అని చెపితే ఆమె గుండెపగిలి ముక్కలై పోదూ? ఇలాంటి వుపకారం మీరేమీ చేయొద్దు నాకు.'

'నేనూ అందుకే వూరుకున్నాను. అయితే మరేం చెయ్యాలో చెప్పు. అందుకు నేను సిద్ధం.'

'అక్క ప్రాణంతో వున్నంతవరకు నా దగ్గరకు రావడం మానేస్తారా?'

ఆమాట యెందుకందో అప్పుడు తనకు తెలియలేదు. అందుకనే అదొక వినోదపుమాట అని భావించి నవ్వేశాడు. 'చెడ్డపని చేసేటప్పుడు దొంగతనంగా చేస్తారు. అయితే అది మానేసేదీ దొంగతనంగానే మానెయ్యాలి అని నువ్వు చెప్పడం మాత్రం బలేతమాషాగా వుంది: ఆఁ? హహ.'

'అంటే? ఇది చెడ్డపని అని మీరు అనుకుంటున్నా రనండి.'

'ఆఁ! ఏమన్నావు? ఛీ!-ఛీ! నా మాట అని చెప్పలేదు. అందరూ అట్లా అనుకుంటారు. అందుకు చెప్పాను.'

'అంటే మీ దృష్టిలో ఇది మంచిపని అంటారా ?'

'ఇదేమిటి, కుముదా ? మాటల్లో నన్ను వోడించాలి అంటావా ఏం ? మంచిది-చెడ్డది ! నాకూ నీకూ సంబంధించి యీ సంగతే వేరు. ఇద్దరు మనఃపూర్వకంగా అంగీకరించి ఒకపని చేసేటప్పుడు___'

'మీరూ మనసారా వొప్పుకుంటున్నారా ?'

'అంటే ? మనసు నీకోసం అలమటిస్తున్నదని ఎంతగా ప్రయత్నించినా నిన్ను విడిచిపోయేట్లు లేదు. నువ్వే చూశావు___'

'నాకేం తెలుసు ఇవి మీ మనస్సుకు నచ్చినమాట అని నాకు అనిపించింది. ఇది మీ శరీరానికి అలవడిన దురభ్యాసం అని' అని మధ్యలోనే తనని నిరుత్తరునిగా చేసింది.

ఎలాంటిమాట ! ఎక్కడినుంచి వచ్చింది ఆమె కంత చాతుర్యం. అలాంటి వూహ ! వచ్చిన సంకటాన్ని ఎదిరించడానికి ప్రకృతే ప్రాణికి తగినశక్తిని ఇస్తుందా ఎప్పుడూ ఇంతగా మాట్లాడని యీమె ఈరోజు ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నది ?

'ఎందుకు ? వూరుకున్నారేం ?'

'కాదు, కుముదా. తప్పు తెలుసుకోవాలి అని నీ మొండితనమే నీదైతే ఏమిటి చేయడం ? నిద్ర నటించేవారిని___'

'నటించేది యెవరు ? ఒకప్పుడు నాకు ఏ భయమూ వుండేదికాదు. నేను మీ ప్రియతమని అని చెప్పుకోవడానికి.'

'ఒకప్పుడు ఎందుకు ? ఇప్పుడు నువ్వు నా___'

'అయితే యిప్పుడు దాన్ని చెప్పుకోవడంలో నాకు ఆనందం లేదు.'

'వూరకే తప్పు___'

'నేను మీకు ఒక దురభ్యాసపు ఆటబొమ్మని' అని కుముద లేచి వెళ్ళిపోయింది.

ఈ అనుభవాలన్నీ ఇంతగా జ్ఞాపకం వుండడానికి రామన్నకు మరో కారణం వుండింది. ఆ రోజునుంచి కుముద తనకు ముఖం చూపించకుండా తప్పించుకుంటూ తిరిగింది. రాత్రి తన గదితలుపులను లోపల భద్రంగా మూసుకొంటూ వుండేది.

ఎప్పుడైనా తను నవ్వుముఖంతో ఆమెను ఎగాదిగా చూసి మాటలాడించను ప్రయత్నిస్తే తిరస్కారపుచూపుతో నిరుత్సాహపరుస్తుండేది. ఎక్కువసేపు సరళదగ్గరే గడుపుతుండేది. తనూ అక్కడ కూర్చుంటే తను లేచివెళ్ళేంతవరకు తల వంచుకొనేవుండేది. ఒకవైపు ఈ ప్రవర్తనవల్ల రామన్నకు పశ్చాత్తాపమూ కలిగింది. మరొకవైపు ఎగదోసినట్లూ అయింది. అయితే ఈ మనఃస్థితి విపరీతాలకు దారితీసే సందర్భం రాలేదు. తర్వాత ఒకటి రెండు రోజులలోనే తను, ఆమె సరళదగ్గర కూర్చోగానే 'కుముదా కొంచెం కాఫీ అయినా చేస్తావా? ఎందుకో నోరు చెడిపోయినట్లయింది' అన్నది సరళ. కుముదలేచి వంటయింటికిపోగానే 'కొంచెం ఆ తలుపుమూసి రండి' అన్నది సరళ. ఏ తలుపు? ముందుకు ఎందుకు? ఎందుకిలా మాట్లాడుతున్నది? రామన్నకు తెలియలేదు.

'వంటయింటి తలుపు మూసిరండి అన్నా. మీతో మాట్లాడాలి' అని సరళ విపులంగా చెప్పింది.

రామన్న కాళ్ళే ఆడలేదు. ఎందుకయితే తను భయపడ్డాడో చివరికి ఆ ప్రసంగం తప్పలేదు, కుముద కసి తీర్చుకునేలా చేసింది—

'తలుపు కాస్త ఓరగా మూసిరండి అన్నాను.'

'కాదు-అంటే-అబద్ధాలుచెప్పి ఆయాసం యెందుకు కొనితెచ్చుకుంటావు? అలాంటి దేముంది నాతో మాట్లాడడానికి?'

'అయినా తలుపువేసి, శిక్షకు సిద్ధమైన అపరాధిలా వచ్చి కూర్చున్నాడు.

'మీ చెయ్యి ఇలాగివ్వండి.'

యంత్రంలా చెయ్యి ముందుకు చాపాడు.

'నే నంటున్నానని మనసులో ఏమీ అనుకోవద్దు.'

'సరళా, ఎందుకు ఆయాసపడతావు?' చివరిప్రయత్నం చేసేవాడులా అన్నాడు. 'ఆయాసం' సరళముఖంలో వైరాగ్యం తొంగిచూపింది. 'నా ఆయాసంగురించి ఆలోచించవద్దండీ యింక.'

ఎవరో వెనుకనుంచివచ్చి తనగొంతును పిసికినట్లయింది రామన్నకు. ముఖాన్ని వెనక్కు తిప్పాడు. తను దుష్టుడు, క్రూరుడు, కృతఘ్నుడు, కాముకుడు—

'అయ్యో! అంత పెద్దదేం జరిగింది? ఎన్నిరోజులు ఇలాగే బాధపడుతూ పడుండాలి నేనైనా?'

'ఏమన్నావు?' రామన్నకు ఇదేదో వేరేవిషయం అని అనిపించింది. సరళ చేతి మీద చేయివేసి నిమురుతూ, 'మీమనస్సు గట్టిదనుకొని చెపుతున్నాను. నాకు వేళ సమీపించింది.'

ఆలోచించడానికిముందే రామన్న కళ్లల్లోంచి నీళ్ళు కారాయి.

'ఇదేమిటి చిన్నపిల్లల్లాగా? వున్నంతవరకు ఈ యింట్లో నేనూ కావలసినంత సుఖం అనుభవించాను. పోయినతర్వాత నావల్ల మీకు బాధ కలగకూడదు అని నేను వేడుకొంటున్నాను. మీరు ముందుగానే యేడవను ప్రారంభించారు కదా! చేతిగుడ్డ కోటులోనే పెట్టుకొచ్చారో ఏమో! నా చెరగుతో కళ్లు తుడుచుకోండి.'

అలాంటి సమయంలోనూ, ఆ మాటకు రామన్న ముఖంలో చిరునవ్వు వచ్చింది. ముఖంవంచి చెరగుతో కళ్ళు తుడుచుకునేటప్పుడు సరళ తన తలమీద చేయి పెట్టింది. అదెలాంటి స్పర్శ! మృత్యువు సమీపించినప్పుడూ తనలో క్రొత్తచైతన్యాన్ని కలుగజేసింది. సరళకు చావు సమీపించింది అనేదానినిగూర్చి అతని కిప్పుడు సందేహం లేదు. కన్నీరు కార్చడంవల్ల దుఃఖావేశమూ తక్కువైంది.

'సరళా, ఇంతగా మేమంతా పనికిరాకుండాపోయామా, ఎందుకు ఇంకా చని పోయేమాటనే ఎత్తుతావు?'

'పైకి అనకుంటేమాత్రం అదేమి నిలచేదా? చావు సమీపించింది అనే అధి కారంతో నేను చెపుతాను వింటారా?'

'చావుమాట వద్దు. అయితే నువ్వు ఏమేమి చెప్తావో అంతా చెప్పు.'

'వింటారా?' తనచేతిలో తన చెయ్యివేస్తూ అడిగింది.

'సందేహం యెందుకు?'

'ఎప్పట్నుంచో చెపుతున్నా, చెవిలో వేసుకోలేదు మీరు, కోప్పడ్డారుకూడా. అయితే మరోసారి చెప్పేఅవకాశం నాకు కలుగుతుందో లేదో? అందుకే—'

'ఏమాట?'

'చచ్చే పెళ్ళాం చివరికోరిక ఇది.'

'ఏమాట, సరళా! ఇంత ఎందుకు మనస్సుకు బాధ కలిగించుకుంటావు? ఏమిటో, చెప్పు—'

'ఏముంది? అదే—'

'ఏది? మరోపెళ్లి? హహ!' చెరిగిపోయే నవ్వుతో అడిగాడు.

'అవును, కుముదతో పెళ్లి.'

'ఏమిటి?'

రామన్నకు వీపుమీద గట్టిగా ఎవరో చరిచినట్లయింది.

'ఎందుకు? నా కళ్ళు మూసుకోపోయేలోపల అయిపోతే—'

'కుముదతో పెళ్ళి!'

'ఇలా యేమీ తెలీనివాళ్ళలా మాట్లాడవద్దండి. ఎన్నిసార్లు నేను మీకు చెప్పాను.'

'కుముదతో?'

'అవును. ఒక్కరోజూ నా మాట పూర్తిగా వినలేదు. ఎన్నిసార్లు చెప్పాలనుకున్నాను నేను.'

రామన్నకు చటుక్కున ఒకవూహ తోచింది. ఇప్పుడు మాటలుపెంచి లాభం లేదు. 'జరిగేది కాదు' అంటే ఆమె మనస్సుకు దెబ్బ. ఒకటి రెండు రోజులలో ఆలోచించి చెపుతానంటే సరిపోతుంది అనుకున్నాడు. అలాగే ఆమెకు చెప్పాడు.

'మళ్ళీ ఎందుకు ఆలోచనలు?'

'సరళా, నీ మాట నాకు ఎంత బాధకలిగించిందో తెలీదు నీకు. కొంచెం ప్రశాంతంగా ఆలోచించి చెపుతాను.'

'మీరు చెప్పేంతవరకు నేనుంటానో లేదో!' అని నిరాశతో నిట్టూర్పు విడిచింది.

'పిచ్చిదానివి నువ్వు!'

అయితే చివరికి తనే పిచ్చివాడయ్యాడు. ఇది జరిగిన మరుసటిరోజు ఉదయం సరళ - ఇక దేన్నీ చూడలేనట్లుగా - చివరిసారిగా వూపిరి పీల్చింది....

రామన్న ఎదుట చిత్రాన్నిచూస్తూ కూర్చున్నాడు. ఆనాటి జ్ఞాపకాలలో లీనమై పోయాడో ఏమో! అతని కన్నులనుంచి నీటిధార కారసాగింది. కళ్ల ముందు మంచు తెర వచ్చినట్లయి ఎదుట చిత్రం స్పష్టంగా కనిపించకపోయినా అటువైపే చూస్తూ కూర్చున్నాడు.

## 16

గట్టిగా తల పట్టుకొని కూర్చున్న కుముద కొన్ని నిముషాలతర్వాత నిట్టూర్చి లేచింది. శరీరం సిగ్గుమాలినదే కాదు. ఎన్నివిధాలుగా సిగ్గుమాలినదై వుంది అనే ఆలోచన వచ్చిందామెకు. 'మీ శరీరానికి అంటుకున్న దురభ్యాసం' అని ఒకరోజు తనే రామన్నకు చెప్పిందికదా? అయితే మరొకరికి చెప్పేఅధికారం తన కెక్కడిది? అంతగా మనసుకు అయిష్టం, జుగుప్స, అసహ్యం అనిపించినా తనశరీరానికి రామన్న దురభ్యాసమే కదా? ఒకరోజైనా అతని సాన్నిధ్యాన్నికోరకుండా వున్నదా తను? చివరిగడియల్లో సరళక్క ఆయనకు నోరుతెరిచి చెప్పింది. అప్పుడు భార్యను దక్కించుకోవడానికికూడా ఆయన వొప్పుకోలేదా తనతో పెళ్ళికి? నాతో పెళ్ళిని తప్పించుకోవడానికి భార్యను ఆహుతి యివ్వడానికి ఆయన సిద్ధమయ్యారు! ఇది తెలిసీ నా శరీరం - దీన్ని తెలుసుకున్నతర్వాతకూడా తను ఆయనసొమ్ముగానే భావిస్తోంది. అంతే కాదు - ఇప్పుడు ఆయన సత్త్వాన్ని లోపల దాచుకొనివున్నది. సిగ్గుమాలినతనం - అన్నది; తనకు ఎలా తెలియలేదు? ఒకనెల ముందుగానే తెలియవలసింది. అయితే గమనించలేదు....కుముద మళ్ళీ పడకమీదకూర్చున్నది. ఎందుకైనా సిద్ధమైన ఆమెకు ఈ కొత్తసమస్యవల్ల ఏ భయమూ కలగలేదు. అయితే, ఒకటే ఒక్క ఆలోచనవల్ల ఆమెకు విషాదం కలిగింది. ఇంటికి బిడ్డలు కావాలి అన్న సరళక్క కళ్ళార చూడకుండా పోయిందికదా - అని. ఇప్పుడు ఎవరికి సంతోషం కలిగించేవిషయం? రామన్నకా? అత్యంతతిరస్కారంతో ఒక నవ్వు వెలిసింది ఆమె ముఖంలో. ఒక్కసారి విజయరేఖకూడా తొంగిచూసింది. ఈ వార్త రామన్నకు చెప్పాలి. దాన్ని విని అతనికి కలిగేవ్యథను కళ్ళారాచూసి మనసారా నవ్వాలి - అనుకొని బయలుదేరింది.

# 17

రామన్న ముఖం ముడుచుకొని లేచాడు. ఇక ఈ యాతన వద్దు. రేపు కుముదకు స్పష్టంగా చెప్పెయ్యాలి. ఒక నిర్ణయానికి రావాలి. అప్పటివరకు శాంతి దొరికేట్లు లేదు అని లేస్తూ చేతిగడియారాన్ని చూసుకున్నాడు. ఉదయం నాలుగు గంటలైంది! ఎంతసేపు తను ఇలా కూర్చున్నాడనేవూహ వచ్చేసరికి ఒక్కసారిగా ఆయాసం రామన్నను చుట్టుముట్టింది. ఆవులించాడు. బయటికివస్తూ మరోసారి సరళచిత్రాన్ని చూశాడు.

'సరళా, నిన్ను దక్కించుకోవడానికి నేను వొప్పుకునుండాలి. అయితే యిప్పుడు వొప్పుకొనీ ప్రయోజనం లేదు. అందుకోసమే నువ్వు ప్రాణత్యాగం చేశావు అనేది యెప్పుడూ మరిచిపోను. నీ ఆహుతికి కారణమైనదాన్ని ఇంటిలో వుంచుకోలేను. క్షమించు' అని లోలోపలే వేడుకున్నాడు.

మరోపెళ్ళి! ఛీ!

అయితే పాపం! సరళకుమాత్రం బలమైన ఆకాంక్ష వుండేది. చివరికి పిల్లల కోసమైనా నేను పెళ్ళి చేసుకోవాలని___

రామన్న కొంచెం ఆగాడు. ఏదో ఆలోచనవల్ల ప్రాణం లేచివచ్చినట్లయి స్థిమితంగా నిట్టూర్పు విడిచాడు.

అవునుకదూ? లేకుంటే అది దారితెలియనిసమస్య అయ్యేది. అయితే ఇప్పుడు ఏ సమస్యాలేదు - అని స్థిమితంగా నవ్వుముఖంతో నడిచాడు. ఎదుట కుముదకూడా నవ్వుతూనే వచ్చింది. రామన్న ఒక్కక్షణం తికమకపడ్డాడు.

'లేదు - రాస్తూ కూర్చున్నాను, ఆలస్యం అయింది. ఇప్పుడు ముగిసింది. గంట చూశాను___'

'నాకూ ఒక సంతోషపువార్త చెప్పాలనిపించింది. అందుకోసం మీరు వచ్చేంత వరకు ఆగలేక నేనే వచ్చేశాను.'

'ఓహో! అలాగా? నేనూ వొకమాట చెప్పాల్సివుంది.'

'నేను తల్లిని కాబోతున్నాను.' ఒక్కసారిగా కుముద చెప్పింది.

ఆ! అన్నది రామన్న హృదయం. చటుక్కున అతని 'ఆఁ-అంటే-భలే-మంచి సంతోషపువార్త.'

ఆ మాట తననోటినుంచి వెలువడ్డతర్వాత రామన్నకు తోచింది - ఇంక ఏం చేసినా ఏమిటి ప్రయోజనం-అని.

రామన్న జవాబు విని కుముద చకితురాలైంది. 'ఈమనిషి తనలాగే అంతటికీ సిద్ధమైవుంటాడు కదా!' అనుకున్నది.

రామన్నే మొదట నిలదొక్కుకున్నాడు. 'ఆఁ-ఇప్పుడు నేనూ సరళ ఫోటో ముందు ప్రతిజ్ఞ చేసివచ్చాను.' కుముదకు అధైర్యం కలిగింది. 'ఏమని?' నిట్టూర్పు తోనే అడిగింది.

'ఆమె చివరి కోరికను తీర్చితీరుతాను' అని రామన్న ప్రయత్నపూర్వకంగా అన్నాడు.

ఆ! అన్నది కుముద హృదయం. చటుక్కున ఆమె 'అనుకున్నది జరుగుతుంటే కళ్ళారా చూసేభాగ్యం లేకపోయింది అక్కకు' అన్నది. ముఖాన్ని క్రిందకు దించింది.

తర్వాత రెండునెలలలో కుముద-రామన్నల వివాహం అయింది. అక్కమాటను జరపడానికి కుముద, భార్య చివరికోరిక తీర్చడానికి రామన్న పెళ్ళి చేసుకోవడానికి ఒప్పుకున్నాడు అని అందరూ వాళ్ళిద్దరి నిష్ఠను ప్రశంసించారు. భార్యా భర్తలకు సుఖం దీర్ఘాయువు లభించాలనీ ఇంటినిండా బిడ్డలు తిరగాలనీ మనఃపూర్వకంగా ఆశీర్వదించారు.

# అ న ం త ం

## 'అనాది'లో సంఘటనలకు పది సంవత్సరాల తరువాత

### 1

కామం అనాది. దానికి అంతమే లేదు.

ప్రేమ అనంతం. దాని ఆదినే కనుగొనలేము.

అనాద్యనంతం కామం, అనంతం - అనాది ప్రేమ.

అందువల్ల కామమంటే ప్రే—

రామన్న ఆగాడు. ఏ విషయం? తను అసలు ఆలోచిస్తున్నాడా? ముఖమెత్తి ఎదురుగా చూశాడు. కిటికీలోంచి బయట కనిపిస్తున్నది నగరం, జనసమూహం, జీవనంయొక్క ఒక అణువు, సమాజంయొక్క ఒక ప్రతీక. ఇంతసేపటివరకు కిటికీలోనుంచి వెలుపలికి చూస్తున్నప్పుడు ఇదేమీ కనిపించలేదే? శూన్యమనస్కుడై కిటికీవెలుపల చూస్తుంటే మనస్సుమాత్రం కామం, ప్రేమ అని ఏమిటో ఆలోచిస్తున్నదికదా! అంటే తను శూన్యమనస్కుడు కాలేదు! అలాకాదు, తనకు శూన్యమనిపించినా మనస్సు తనకు తెలియకుండా, తననుమీరి జాగృతమయ్యే వుంది! అంటే తను వేరు, మనస్సు వేరు!

రామన్న చిరునవ్వుముఖంతో తనని తానే నిందించుకొన్నట్లుగా నిట్టూర్చి కిటికీ నుంచి వెను దిరిగాడు.

కామం, ప్రేమ! తను, మనస్సు! ఎందుకిలా దీర్ఘాలోచన? మరో గంటలోపల తను సభకు వెళ్ళాలి. తనని సత్కరించి తీసుకుపోవడానికి కార్యకర్తలు వస్తారు; సమయం గడవక వాళ్ళకోసం నిరీక్షిస్తూ తను కిటికీదగ్గరికిపోయి నిలుచున్నాడు. అప్పుడు ఈ రకమైన ఆలోచనలు తనని ఆవరించుకొన్నాయి. ఏది యేమైనా ఆలో

చిస్తూనేవుండాలి. లేకుంటే మనస్సు ఎక్కడ్నుంచో తన ఆలోచనలను జ్ఞప్తికి తీసుకుంటుంది.

రామన్న చేతిగడియారాన్ని చూసుకున్నాడు - ఈ గడియారం కొనుక్కొని అవెన్నో సంవత్సరాలయ్యాయికదా? కుముదను పెళ్ళి చేసుకున్నప్పుడు కొనుక్కున్న గడియారం___

రామన్న ఆలోచనలను ఆపాడు. కుముదకూడా సభకు రావలసివుంది. ఆమె సిద్ధమైందో లేదో? చూసివద్దాం అనుకొంటే ఆమె సిద్ధంగావుంటే యెలా అనే భయం. ఒకవేళ సిద్ధంకాకుంటే సభకు ఆలస్యమవ్వచ్చు కదా? లేక ఏదైనా సాకు చెప్పి, తప్పించుకొంటుందో? తప్పించుకోనీ అనే తన మనస్సులోని కోరికకు రామన్న తనని తానే నిందించుకొన్నాడు. సాకులకేం తక్కువ? మోహన్ ఆట ల్నుంచి ఇంకా తిరిగి వచ్చాడో లేదో?

రామన్న మళ్లీ కిటికీదగ్గరికి నడిచాడు. కొడుకు మోహన్ వచ్చాడా, వస్తున్నాడా అని నిరీక్షిస్తూ.

మోహనుడికేం అవసరం? సభ సత్కారాల ఆకాంక్ష అతని కెక్కడిది?.... రామన్న ఓ క్షణం ఆగాడు. వున్నట్టుండి ఆశ్చర్యం వేసింది. ఒక గంటముందే తను తయారై కూర్చునివున్నాడు! అయినా ఆ సభ, ఆ సత్కారం, ఆ గౌరవం, ఆ సన్మానపత్రం వీటివల్ల తనకు ఆనందం కలగలేదుకదా! ఒకానొకకాలం అది. అప్పుడు వుపన్యాసానికి ఆహ్వానమంటే వుత్సాహం వుండేది. ఒకానొకకాలం అది. అప్పుడు తనచేతిఖర్చుతోనే తను రాసిందాన్ని ప్రచురించడానికి వెనుకముందు చూచేవాడు కాదు. ఒకానొకకాలం అది. అప్పుడు తన ఆలోచనలని మరొకరు వినాలి, తన విప్లవాత్మకకృతులను విమర్శకులు లక్ష్యంతో చదవాలి అనే ఆశ వుండేది. సభలో తన్ను పరిచయం చేసినప్పుడు రామన్నకు చాలా సంతోషం కలిగేది. మెడలో దండ వేసేటప్పుడు హృదయం పొంగేది. అయితే అప్పుడు తనను ప్రజలు లెక్కచేయలేదు. ఇప్పుడు?....హుఁ....పళ్ళు వున్నప్పుడు శనగలు లేవు, శనగలు వున్నప్పుడు పళ్ళు లేవు అంటారుకదా - అలా అయింది తన జీవితం. లేక అదే జీవితంలోని సారస్యమా? కోరినప్పుడు కోరుకున్నది దొరికితే జీవితం నీరసం అవుతుంది కదా? కోరుకున్నదంతా దొరికితే మానవుని ప్రగతి-సాహసాలే

మాయం కావచ్చుకదా? అందుకోసమే దుష్యంత, శకుంతలల వివాహజీవితం వయస్సు మీరినతర్వాత ప్రారంభమైందేమో; ఈనాటిసభలో తను ఈ విషయాలే చెప్పవచ్చుకదూ?

ఆలోచనలను నెమరువేసుకుంటూ రామన్న మెల్లిగా నడిచి కుర్చీలో కూర్చున్నాడు. నిజంగానే ఆలోచించవలసిన విషయం. బిడ్డ కారణంగా శకుంతలా. దుష్యంతులు వొకరి నొకరు కలుసుకున్నారు. అయితే అపత్యం భార్యాభర్తలను కలిపే గ్రంథి అని చెప్పే భవభూతే తన నాటకంలో బిడ్డ సీతారాములను వేరు చేసింది చిత్రించాడు. నిజంగా ఇది మహత్వపూర్ణమైన ఆలోచన....రామన్న చటుక్కున లేచాడు. కిటికీలోంచి చూశాడు. మోహన్ వచ్చాడా? రామన్నకు ఆత్రుత, అధైర్యం. సాయంత్రంసమయం, చిన్నవాడైన మోహన్ ఆలస్యం చేస్తాడేమో అని ఆత్రుత. అయితే ఆటల ఆనందంలో కళ్ళు విప్పారివచ్చే కొడుకును చూడడానికి అధైర్యం. దృష్టి సారించిచూస్తే ఎవరినో చూసినట్లవుతుంది. ఎవరిరూపం తన కళ్ళముందు నిలుస్తుంది అని తెలుసు రామన్నకు. మోహన్ తన కొడుకు, తనవల్ల కుముదకు పుట్టిన కొడుకు; అయినా మోహనుడికళ్లను చూసినప్పుడు సరళ రూపమే తన కళ్లముందు నిలుస్తుంది.

ఈనాటికి పదిఏళ్ళయింది రామన్న ఈ రహస్యాన్ని భేదించలేక. సరళ తన మొదటిభార్య.

ఆమెకు తల్లి అయ్యే ఆరోగ్యం లేదు. కుముదను పెళ్ళి చేసుకున్నాడు. ఆమెకు పుట్టినబిడ్డకు సరళ కళ్ళు ఎలావచ్చాయి. ఎన్నోసార్లు మోహన్ను చూడను వెనుకాడేవాడు రామన్న, వెనకటి జ్ఞాపకాలకు బెదరి.

## 2

'ఇంట్లో బిడ్డలుంటేనే అందం' అనేది సరళ.

రామన్నకు తెలుసు. అత నెప్పటికీ మరువలేదు అలాంటి సందర్భాలను.

'ఇంట్లో బిడ్డలు లేకుంటే ఇల్లు బిక్కుబిక్కుమని వుంటుంది' అనేది.

'బిడ్డలను పొందటానికి పెళ్ళాం-కావాలికదా? అందుకే నేను పెళ్ళాం ఆరోగ్యం బాగయ్యేట్లు చేస్తాను' అని రామన్న సమాధానం.

'ఈ రోజో రేపో అని మంచమెక్కిన నాలాంటి పెళ్ళాన్ని కట్టుకొని ఏం చేస్తారు?'

'నా పెళ్ళాం ఎలావుండాలి అనేవిషయం నాకు వదిలెయ్.'

'నాలాంటి భార్యవుంటే వట్టి వూహలలోనే వుంటుందావిడ.'

'పిచ్చిదానివి, సరళా, నువ్వు! ఒక నాలుగురోజులు మంచమెక్కితే ఇక కోలుకోవు అనే అనుకున్నావా ఏం?'

'లేనిఆశలు కల్పించుకోవద్దు మీరు. అందుకే చెపుతున్నాను, నేను కళ్ళు మూసే లోపల మీరు మరోపెళ్ళిచేసుకొని ఇల్లు, బిడ్డలు అన్నీ సుఖాలు పొందడం చూడాలి అని నా ఆశ.'

'ఓహోహో! నీ మొగుడంటే కావలసినపిల్ల కోరుకునేరూపసి అని అనుకుంటున్నావేం? లేదు; నిన్ను ఇక్కడేవదలి నేను కన్యాన్వేషణకు బయలుదేరాలనా?'

'ఎవరూ కోరుకోవద్దు, ఏ అన్వేషణా వద్దు. మన కుముద వుంది___'

'పాపం! ఆ పిల్ల ఆహూతి కావాల్నా?'

'అబ్బ! ఏదోవొకటి మాట్లాడవద్దు. ఆమెకూ పద్దెనిమిదేళ్ళు. మీరు, మీ పుత్తకాలంటే దానికి ఎంత అభిమానం తెలుసా?'

'ఆ అభిమానం స్వప్రయోజనార్థం ఉపయోగించుకోమంటావా?' అని రామన్న తన మాటలకు తనే నవ్వాడు. సరళ పోయింది, కుముదను తను పెళ్ళిచేసుకున్నాడు, పిల్లవాడూ పుట్టాడు. అయితే అది చూడడానికి సరళ ప్రాణంతో లేదు....

రామన్న కూర్చున్నచోటినుంచే ఎదుటి గోడవైపు చూశాడు. సరళచిత్రం వేలాడుతున్నది. ఒకేవిధంగా తేరిపారజూశాడు. చటుక్కున ఆలోచన కలిగినట్లుగా మళ్ళీ సర్దుకు కూర్చున్నాడు.

సరళ ప్రాణంతో వున్నది! తన సంసారాన్ని చూసుకొంటున్నది! అందువల్లనే మోహనుడికళ్ళు సరళకళ్లను అంతగా పోలివున్నాయి. తన సంసారాన్ని చూపి

తీరాలి అనే పట్టుదలతో సరళకళ్ళు ఆమె శరీరంతోబాటు సమసిపోలేదు. మిగిలి వున్నాయి, తన జీవితాన్ని చూస్తున్నవి; ఈ రోజు తనకు జరుగుతున్న సన్మాన సభచూసి ఆ కళ్ళు ఆనందంతో విప్పారుతాయి....రామన్నకు భయమేసింది; అతని దేహం వణికింది....ఈ పదేళ్ల తన అనుభవాలన్నిటిని ఆ కళ్ళు చూసివుండవచ్చా?

ఛ్ఛా—అన్నాడు రామన్న.

బైటనుంచి పిచ్చుకొకటి ఎగిరివచ్చి సరళ చిత్రంమీద కూర్చున్నది.

ఛ్ఛా—అన్నాడు కోపంగా.

పిచ్చుక ఎగిరింది, రామన్న మనస్సులోని ఆలోచనా చిత్రపటమూ ఎగిరింది. ఏదో దెబ్బనుంచి తప్పించుకున్నవానిలా రామన్న తటాల్న కుర్చీలోంచిలేచి త్వర త్వరగా అడుగులేస్తూ కిటికీదగ్గరికి వచ్చాడు. వూపిరాడనివానిలాగా బయటి గాలి వైపు ముఖమెత్తాడు. చేతిగడియారాన్ని చూసుకున్నాడు.

ఇంకా పూర్తిగా 55 నిమిషాలున్నాయి కార్యకర్తలు వచ్చి తనను పిలుచుకొని పోవడానికి.

# 3

'ఇంకా 55 నిముషాలు, ఒకగంటే అనవచ్చు' అనుకున్నది కుముద, తన చేతి గడియారాన్ని చూసుకొని.

గడియారాన్ని మరోసారి చూసింది, నిట్టూర్పు విడిచింది. పదేళ్లయింది గడియారాన్ని యిలాగేచూసి ఇలాంటిదే మాటచెప్పి. పోనీ, ఎందుకు వెనకటి ఆలోచనలు? మోహనుణ్ని త్వరగా రమ్మని చెప్పాను. ఈ పిల్లవాడు ఇంకా యెందుకు రాలేదో-అంటూ పనిలో మునుగను సిద్ధమైంది. చేయడానికి యేపనీ లేదు, వున్న వాటినే సవరించసాగింది.

ఆ రోజూ ఇలాగే సామాన్లు సవరిస్తూవున్నాను కదూ?

పాడు జ్ఞాపకం; వద్దనుకున్నదాన్నే మళ్ళీ మళ్ళీ చూస్తుంది. ఈ రోజు పదేళ్ల

మోహనుడి రాకకోసం వేచివున్నది. ఆనాడు ఒక సంవత్సరపు మోహనుడు మేల్కొనడంకోసం వేచివుంది.

పదే సంవత్సరాలు. ఒకజన్మ అంత దీర్ఘమైన కాలావధిలా భాసిస్తున్నది. అయినా ఒక్కొక్కమాటా యిప్పటికీ కళ్లముందు జరిగినట్లు స్పష్టంగా తలపుకు వస్తున్నది.

మోహనుడి మొదటిసంవత్సరం పుట్టినరోజు. పుట్టినరోజేమో నిజం, అయితే పండుగరోజు అని అనిపించలేదు. పెళ్ళికిముందే మూర్తిదాల్చిన బిడ్డ. ఆ బిడ్డ కోసమే రామన్న తనను పెళ్లి చేసుకొన్నది. బిడ్డ లేకుండవుంటే తనపెళ్ళి అయ్యేది కాదు, తను మరొకరిప్రాపకంలో చిక్కుకునేది కాదు, ఇప్పుడు ఈ బిడ్డకోసమే తన దురవస్థ! అప్పుడు తను ఆ బిడ్డను ప్రేమించేదే సాధ్యమయ్యేదికాదు. ఒక సంవత్సరం బిడ్డకు తల్లిపాలు అవసరమూ లేదు. ఈయన కామకేళిఫలితం, ఈయనే అనుభవించనీ అని ఆ బిడ్డను అక్కడేవదలి ఎవరికీ తెలియకుండా వెళ్ళాలని నిశ్చయించుకున్నది. సాయంకాలం వెళ్ళాలని ఉదయమే నిశ్చయించింది. అప్పుడు రామన్న తనగదికి వచ్చాడు. ఒక్కసారి వొళ్ళు ఝల్లుమనింది; భయమేసింది; తన నిశ్చయం కరిగిపోతుందా అని అధైర్యం కలిగింది. రామన్న యెందుకు వచ్చి వుండవచ్చు అనేదాన్నిగూర్చి అధైర్యం కలిగింది. ఎందుకు? ఎందుకు? వెనకటి అనుభవం గుర్తుకు వచ్చింది. రామన్న, భర్త, ఇప్పుడైతే యథావిధిగా వివాహ మాడిన భర్త! మంచమెక్కిన భార్య బాధపడుతుందనే భయమూలేదు, అందుకని ధైర్యంగా వచ్చాడు. తన హక్కు పొందడానికి వచ్చాడు అనే ఆలోచనతో లోపలి ద్వేషం కళ్ళల్లో ప్రస్ఫుటమవుతున్నట్లు అతన్ని చూసింది. ఈ యింటిలో తన అస్తిత్వానికి ఇదొక కారణమా? తనబిడ్డకు తల్లి అనేవిషయాన్నికూడా మరిచి తన భోగపువస్తువు అనే వచ్చాడుకదూ తన దగ్గరికి?

'కుముదా.'

'అదిగో, ఆ గొంతు పరిచయమైందే కదూ? ఎన్నిసార్లు తను ఆ గొంతువిని మైమరిచిపోలేదు? నాకు తెలుసు. ఈ మాట దేనికి సూచకంఅనేది నాకు బాగా తెలుసు.

'కుముద ఈ రోజు మోహనుడి పుట్టినరోజు పండగ అని—'

తను చటుక్కున అతన్ని ఎగాదిగా చూసింది. హుం.... నేనే పిచ్చిదాన్ని! నాగురించి యితనికి యే ధ్యాసా లేదు. ఈయన వచ్చింది మోహనుడికోసం. ఇంక నా అవసరంలేదు ఈయనకు; వంచించి వశం చేసుకునేవరకు నాలో ఆ శక్తి ఉండేది. వచ్చినకోపాన్ని ఆపుకొనే ప్రయత్నంలో పెదవుల్ని కదిలించింది.

ఈ సంగతి - తలపుకి వచ్చినప్పుడల్లా కుముద తనని తానే ఈ ప్రశ్న వేసుకొనేది. తనకి కోపం వచ్చింది. రామన్నమీద ద్వేషం ఉడికిపోయింది. ఎంతగానో తలచుకొని దాన్నే తను నమ్మింది. అయితే వొక్కొక్కసారి, ఎక్కువగా కలలో ఆ స్మరణ వచ్చినప్పుడు మరొక అనుభవం కలుగుతుండేది. రామన్న వచ్చినప్పుడు తను తికమకపడింది భయంవల్ల కాదు, ఆతృతవల్ల. రామన్నమీద కళ్ళల్లో ద్వేషం లేదు, అతన్ని బిగి కౌగలించుకోవాలి అనే ఆవేశం అది. తన పెదవి కొరుక్కున్నది మనస్సులో వచ్చిన ఆలోచనల్ని ఆపుకోవడానికి మాత్రమే.

కుముద అవస్థ అసలు ఇదే. బుద్ధిపూర్వకంగా సాధక-బాధకాలను కారణాలను చెప్పి, రామన్నను ద్వేషిస్తున్నాను అని మొండిగా చెప్పుకొనేటప్పుడూ హృదయం రామన్నకోసం అలమటిస్తున్నది అనేవిషయం ఆనాటినుంచే తను గ్రహించింది.

'—మోహనుడి పుట్టినరోజు పండగ అని నీకు యీ చేతిగడియారం-' అని రామన్న చెప్పినప్పుడు తనశక్తి పూర్తిగా వుడిగిపోయింది. తనకు స్పృహకూడ తప్పిందో ఏమో! ఎందుకంటే మళ్లీ క్రిందికి చూసినప్పుడు రామన్న చెయ్యిచాపి చేతికి గడియారాన్ని కట్టాడు.

'ఇదే ఆ గడియారం' అని ఇప్పుడు మళ్ళీ ఒకసారి దాన్ని చూసింది. 'ఇంక సుమారు ఒక గంట!' అని విషాదంతో నిట్టూర్చి అద్దంముందు కూర్చున్నది. నవ్వు వెలసింది ముఖంలో. ఎంత సిగ్గుమాలినది తను అని అన్నది ప్రతిబింబంతో. మరోగంటలో రామన్నతో తనూ సభకు వెళుతుంది. కాబట్టి ఈవిధంగా సింగారించుకోవలసి వచ్చింది కదా? అందుకోసమే మోహన్ను త్వరగా రమ్మని చెప్పినా ఆ పిల్లవాడు ఇంకా రాలేదుకద! వీధివాకిలి తెరిచిచూసింది. మోహన్ అయిపు లేదు; ఎవరి అలికిడీ లేదు. లోపలకూడ ఎవరిఅలికిడీ వున్నట్లు లేదు అని నిట్టూర్చి తలుపుమూసి మళ్ళీ అద్దంముందు కూర్చున్నది.

ఈరోజు రామన్నతో వెళుతుంది. అతని శ్రీమతి అని. ఆరోజు రామన్నను వదలి వెళ్ళింది. మతిచెడి.

చేతిగడియారాన్ని రామన్న ఇచ్చిన క్షణంనుంచి ఆమెకు ఆత్మవిశ్వాసం నశించినట్లయింది. అందులోను రామన్న గదిలోంచి బయటపడినక్షణం నిద్రిస్తున్న బిడ్డను బలంగా గుండెలకు హత్తుకొన్నప్పుడు రామన్నమీద తనలో ఇంకా ఆప్యాయత వుంది అని తోచి గడగడ వణికింది. ఆనాటి సాయంకాలం రామన్న మళ్ళీ తనగదికి వచ్చాడు. ఎవరినో చూడాలని బయలుదేరాడు. 'నేను ఒక గంటలోపల వస్తాను; ఇంకా మాట్లాడితే 55 నిముషాలలోపల వస్తాను' అని నవ్వుతూ చెప్పి వెళ్లారు.

అతను బయటపడినక్షణం తను తన చేతిగడియారాన్ని చూసుకొని, 'ఇంక 55 నిముషాలు' తనకు ఆ యింటినుంచి బయటపడడానికి - అనుకున్నది.

హుం....ఏమో అయి ఎక్కడికో వచ్చింది. అని తలుపులను కుదిపేలా సరుకొని లేచింది.

మోహన్ రావచ్చేమో అని నిరీక్షిస్తూ తలుపుదగ్గరికి వచ్చింది, తెరిచి చూసింది, నిరాశతో కోపంతో తలుపును గభాలున మూసింది, కోపంతో నడిచివచ్చి అద్దం ముందు నిలుచుకొని జుత్తు సవరించుకోసాగింది.

# 4

రామన్న ఠపీమని లేచాడు తలుపుశబ్దం విని ఎవరో వచ్చారులావుంది' అంటూ కిటికీదగ్గరికివచ్చి చూశాడు, ఎవరూ లేరు.

'తలుపు శబ్దమైంది___' అని తనలో తానే అనుకుంటున్నట్లుగా మళ్ళీ గదివైపు నడిచాడు. బల్ల కెదురుగావచ్చి నిలుచున్నాడు. పైనవున్న పెన్సిలు తీశాడు. ఒక్కసారిగా నవ్వేశాడు. నవ్వుముఖంతోనే కుర్చీలో కూర్చొని, 'మనస్సుతీరే విచిత్రంగా వుంది' అనుకున్నాడు.

తలుపు చప్పుడయింది, ఎవరో వచ్చారు అనుకున్నాడు. పిచ్చివాడుకదూ తను!

తలుపు శబ్దమైతే ఎవరన్నా వెళ్ళివుండవచ్చు. అయినా తలుపుశబ్దం అంటే 'లోపల ప్రవేశం' అని సంకేతం అయినట్లయింది.

రామన్న ఒక్కుమ్మడిన బెదరినట్లయి లేచాడు. కిటికీదగ్గర చేరాడు. దూరంగా చూశాడు భయపడినవానిలాగా, చివరికి స్థిమితంగా నిట్టూర్చి వచ్చి కూర్చున్నాడు.

'ఎవరైనా పోయీ వుండవచ్చు' అనేది అపశకునంలా తన నోటినుంచి వచ్చిందికదా? ఎవరైనా నిజంగానే బయలుదేరి వెళ్ళివుంటే?

రామన్న వొళ్ళు ఝల్లుమంది. ఆలోచన ఆపుకోలేనివానిలాగా ఒకక్షణం కళ్ళు మూసుకున్నాడు. వెంటనే కళ్ళు తెరిచాడు. మూసినకళ్ళముందు నిలిచిన తలపులకు భయపడినట్లు.

ఆరోజు తలపులు ఎప్పటికీ వద్దు, తన శత్రువుకూ వద్దు అనుకున్నాడు.

అప్పుడుకూడా ఒక సత్కారసభ ఏర్పాటయింది. అయితే తనకొక్కడికే తెలుసు; కుముదకు చెప్పలేదు. అనిరీక్షితంగా ఆమెను ప్రసన్నం చేసుకోవాలని తనకు ఒకవూహ కలిగింది, ఆరోజు మోహన్ పుట్టినరోజు. నిజంగా పిల్లవాడి పుట్టిన పండుగలా లేదు. వివాహ ప్రథమ వార్షికోత్సవంలాగా వుంది. ఏదో కారణంవల్ల మోహన్ పెళ్ళికిముందే తమ సంసారంలో ప్రవేశించినందువల్ల అతని పుట్టినరోజుపండగనే కొన్నినెలలు ముందుకు నెట్టే ప్రతిపాదనను ఇద్దరూ అంగీకరించారు. ముందురోజే కుముదను మాట్లాడించడానికి ప్రయత్నించాడు; వివాహం అయిన ప్రథమ వార్షికోత్సవమని ఆమెను ఉత్సాహపరచ ప్రయత్నించాడు. కట్టిన యిల్లు బీటలువారితే అది తప్పించడానికి పూతలు పూయమూ? అలాగే తమపెళ్ళి - అన్నది కుముద! అబ్బ! ఎంత కఠినమైనమాట! ఎలాగైతేనేం మరునటిరోజు తను గడియారం తీసుకెళ్ళాడు. వెళ్లినక్షణం వొళ్ళుమరిచి అలాగే నిలిచిపోయాడు.

ఈమె తన కుముదేనా అనిపించింది. కుముద తల్లి అయినప్పటినుంచి ఆమెను చూస్తూవున్నా ఈ మార్పు తనదృష్టికి రాలేదుకదా? ఒక సంవత్సరంపూర్వం ముగ్ధబాలికగా వుండేది. తననిచూసి సిగ్గుపడేది. తను దగ్గరికి తీసుకుంటే నవ్వేతుండింది. కోరికతోవున్నా ఆ కళ్ళలోనూ భయపుఛాయలు వుండేవి. అయితే యిప్పుడు? మాతృత్వంవల్ల శరీరం నిండుకుంది. బిడ్డను పోషించినందువల్ల పెద్ద

తనపుకాంతి వచ్చింది. ముఖంలో సౌమ్యాకర్షణ వచ్చింది. బిడ్డకు ఆధారమైన కొన్ని అంగాలు కొత్త శక్తిసౌందర్యాలను రంగరించుకున్నాయి. రామన్న స్థైర్యం వుడిగిపోయింది. తను యెందుకొచ్చాడో మరిచి 'కుముద' అన్నాడు; ఆ పేరు వెలువడగానే మెలకువ వచ్చినట్లయింది.

తను పిలిచినతీరుచూసి కుముద ఆత్మరక్షణకు ప్రయత్నించే ప్రాణిలాగయ్యింది. తన పిలుపు అర్థం తనకూ తెలిసింది. ఒక పురుషుని పిలుపు అది. దాన్ని అడిగిన క్షణమే వశం కావడానికి సిద్ధమైన ప్రాణిలా నిలుచుంది కుముద.

అప్పుడు రామన్న వివేకశక్తి తిరిగి పొందాడు. తన వ్యక్తిత్వమూ భాసమైంది. తానొక సుశిక్షితుడు, సామాజికజీవనంలో సుసంస్కృతుడు, రచయిత. బుద్ధిజీవి అనేచిత్రం చెరిగిపోయి ప్రకృతిలోని మిగిలినప్రాణుల్లో తనూ ఒక ప్రాణి. ఇంకా చెపితే అమానుషవ్యక్తి అనవచ్చు అనుకున్నాడు. స్త్రీని స్త్రీలాగామాత్రం చూడడం అనాగరికమైంది. స్త్రీ పురుషులలో భేదం లేదు. ఇద్దరూ సమానమే అనడం సంస్కృతిలక్షణం అని తెలిసిన రామన్నకు కుముదనుచూసిన ఆ క్షణం తనలో వుద్భవించిన వికారాలకు సిగ్గువేసింది.

'కుముదా, యీ రోజు మోహనుడి పుట్టినపండుగ—' అని మరేదో విషయాన్ని ప్రస్తావించాడు. ఎలాగో ఏమిటో, చివరికి ఆమెచేతిని చేతిలోకి తీసుకుని గడియారాన్ని కట్టాడు. అదొక్క క్షణం, క్షణం కాదు యుగం, కాదు క్షణం కాదు యుగం కాదు కాలం తటస్థమైంది. తను ఆమెచేతిని తనచేతిలోకి తీసుకున్నప్పుడు అనుకున్నాడు రామన్న.

అదే మదాంధతలో దారి తప్పిందేమో; తను స్నేహితునియింటికి వెళ్ళాడు.

'దారి తప్పిందేమో?' అని స్నేహితుడు అడిగినప్పుడు తత్తరపడి స్పృహ వచ్చినవానిలా తికమక చెందాడు. అదిచూసి స్నేహితుడు నవ్వినపుడు తన స్థితి స్థిమితపడివచ్చి తనూ నవ్వడానికి యత్నించాడు. తాను స్నేహితుని యింటికి వెళ్ళడం ఎందుకు? వెళ్ళడానికిముందు దాన్నిగూర్చి ఆలోచించనూ లేదు. అయినా 'ఏమిటి ఈవేళప్పుడు వచ్చావు?' అని మిత్రుడు అడగగానే 'ఒక గొప్పపని వుంది. రహస్యపు పని' అని జవాబు ఇచ్చాడు.

'ఏమిటో, రామన్న గొప్పపని? ముఖంచూస్తే చాలా జోరుగా వున్నటున్నావు. మళ్ళీ రహస్యమనీ అంటున్నావు? ఆఁ? ఇంకేదైనా విషయంవుందా ఏం?'

'ఆఁ?'

'దబాయించొద్దోయ్! మీరు రచయితలు, మీమీద నమ్మకమేలేదు. సాహిత్య మంటే జీవితానికి ప్రతిబింబం అని స్పష్టంగా చెప్తారు. ప్రేమకథలు రాసేముందు అందుకే స్వంతంగా అలాంటి అనుభవం పొందడానికీ వెనుకముందు చూడరు. అందుకే అడిగాను ఏదైనా కథ జరిగిందా-కొత్తది అని-? ఆఁ! హహ.'

ఎదురుగావున్న స్నేహితుడిపళ్లను రాలగొట్టాలి, అతన్ని నేలకీడ్చి తాండవ నృత్యం చేయాలి. వెంటనే కైలాసానికి పరుగెత్తాలి అనిపించింది రామన్నకు. అయితే సభ్యసమాజంలో అంత ప్రామాణికంగా నడవడానికి లేదు. తనకు కుము దకు వివాహం జరగడాన్నిగూర్చి వీళ్లంతా ఏమనుకుంటున్నారో తెలుసు రామన్నకు. దాన్నిగూర్చి ఏమీ చేయడానికి లేదు. స్నేహితుడిమాటకు వొకటే జవాబు. అన త్యపు నవ్వు. ఆ నవ్వునే ప్రదర్శించాడు.

'రచయిత అంటే ఎవరు, లైసెన్స్ (License) లేని శ్రీకృష్ణుడు అనుకుం టున్నావా?' అన్నాడు.

'నాకేం తెలుసు, రామన్న. చావలేదు, స్వర్గం చూడలేదు. పుస్తకాలు వ్రాయ లేదు, పేరు చెడలేదు-ఆఁ?'

'పుస్తకాలు రాస్తే పేరు చెడుతుందను.'

'నే నెందుకనాలి, నువ్వే చూస్తున్నావుకదా, రామన్నా? పుస్తకం మంచిదుంది అంటే, ఇంతకంటె బాగా రాయవలసింది అంటారు. పుస్తకం బాగులేదు, ఈయన చిత్తుపేపర్ల వ్యాపారంచేస్తే మంచిది అంటారు. మంచిపుస్తకమని తమకు తెలిసి వుంటే చెడ్డది అంటారు, చెడ్డపుస్తకమని అందరికీ తెలిస్తే చవుకబారు సాహిత్యం అంటారు. మొత్తంమీద పుస్తకంవల్ల రాసినవాడికీ సుఖం లేదు. చదివేవానికీ సుఖంలేదు. ఆఁ?'

'అంటే రాయించుకొన్నవాడికొక్కడికే సుఖం అను. ఆఁ?' అని తనూ అతనిలాగానే సకిలించాడు.

'పోనీ వదిలెయ్‌! అదేం గొప్ప రహస్యమన్నావే?'

స్నేహితుడి ప్రశ్నకు ఆరోజు తాను ఇచ్చిన జవాబు ఈనాటికీ రామన్నకు ఆశ్చర్యం కలుగుతున్నది. ఎలాంటి అబద్ధం, ఎంత అప్రామాణికంగా వుంది తన జవాబు! దాన్ని తను ఎంతటి శుద్ధమైనమనస్సుతో అన్నట్లు చెప్పాడు! ఆరోజు తను బుద్ధిపూర్వకంగా కపటంగా ప్రవర్తించాడనేది తెలిస్తే, తనే తెలిపితే సమాజం తనని యీనాడు గౌరవించేదా? ఎవరు చెప్పగలరు? గౌరవించనూ వచ్చు. తన లాంటి అనేకమంది వంచకులసమూహమే సమాజం. ఈనాటి వాళ్ల గౌరవమూ ఒక విధమైన వంచనకాదని ఎలా చెప్పడం? అయితే, ఆనాటి తన జవాబు నిజంగానే అసత్యమైనదా? తను బుద్ధిపూర్వకంగా, ఆలోచించి అలా చెప్పాడా?

'అదేమిటో రహస్యం, గొప్పది అన్నావుకదా?' అని స్నేహితుడు అడగగానే తను జవాబు చెప్పాడు.

'ఈ రోజుకు సరళపోయి రెండేళ్ళయింది' అని.

'హుం....కాదు, రామన్నా, వెనకటిదాన్ని తలచుకొని—'

'ఛీ! నేను దుఃఖిస్తాను అనుకోవద్దు. అందుకే గొప్పమాట అన్నాను. తన తరువాత నేను దుఃఖించకూడదు, నేను సుఖంగా జీవించాలి, ఇల్లు పిల్లలతో కళకళలాడాలి, తను యెప్పుడూ చూస్తుండాలి అని సరళ వెయ్యిసార్లు నాకు చెప్పింది. ఈనాటి ఈ రెండోపెళ్లి సరళ సంతోషంకోసయే! ఆమే చూసిపెట్టింది అనవచ్చు. త్వరత్వరగా ముహూర్తం చూసిందీ అందుకోసమే. అయినా ఆమె—'

'రామన్నా, నూరుజన్మలకు ఒక్కసారి దొరకవచ్చు అలాంటిభార్య. అవ్వైనా పెట్టి పుట్టివుంటే. ఆమె కళ్ళారా మీ పెళ్ళి అయినది చూడలేదు అని బాధ పడ్డం తప్పు. ఎక్కడున్నా నిన్ను చూస్తుంటానని చెప్పింది కదా?'

'అయినా మా మనస్సుకు స్థిమితం వుండొద్దూ? అందుకే ప్రతిసంవత్సరం యీ ఒక్కరోజు స్మారకదినంగా జరుపుతాను. ఏదో యోగంవల్ల యీ రోజు మా మోహమడి పుట్టినరోజు రెండూ కలిసేవస్తాయి. ఈరోజు సంసారంలోని సుఖమయ వాతావరణాన్ని సరళ చూడనీ, చూస్తుందని నా భావన. అందుకే యీరోజు పిల్లవాడికి వొక బంగారుగొలుసు, కుముదకు వొక మంచిచీర—'

'హూఁ హూఁ! ఏమే విన్నావట్సే?'

'ఏయ్, అరవకు నాయనా! అందుకే రహస్యం అని చెప్పాను. రహస్యమన్నా ముఖ్యసహాయం మీ యింట్లోవాళ్ళవల్లే కావలసి వుంటుందనుకో—'

'అలాగుంటే రహస్యం యేం యేడ్చింది?'

'సాయంత్రంవరకు రహస్యం. తెలిసిందా? సాయంత్రం నువ్వు ఇంట్లో వాళ్లను పిలుచుకొని వాకింగ్‌కని బయలుదేరి దారి తప్పిందేమో అన్నట్లుగా మార్కెట్టుకు వెళ్లు. అక్కడికి వెళ్ళినతర్వాత వాళ్లకు చెప్పు. రెండిటినీ ఆమే యెన్నుకోనీ. మీరు ఇంటికి వచ్చేవేళకు నేనూ వచ్చివుంటాను, వాటిని తీసుకువెళతాను.'

'అంటే? మేము మార్కెట్టునుంచి మా యింటికే రావాలను, భలే, రామన్నా! మీ యింటికే వస్తాము, బ్రహ్మాండంగా చేయి, విందుభోజనం పెట్టించు, ఆ తర్వాత నువ్వు బహుమతి యిచ్చినట్లుగా—'

'ఈ రోజు వద్దు. ఈ రోజు మీరుంటే—'

'మేముంటే నీకేం అడ్డం? చేసిందంతా నువ్వు, నువ్వు రచయితవి, బహుమతి యిచ్చి నీ భార్యను నువ్వు చుంబించినా మాదేమీ అడ్డంలేదు. ఆఁ? హహ!'

'అలాంటిదేమీ లేదు! అయినా యీ రోజు వద్దు. ఈ రోజు - అదుండనీ, నేను వస్తాను, ఇక్కడ నోట్లు పెట్టాను చూడు.'

'బుద్ధి సరిగ్గా వుండకపోతే రచయిత లవుతారో ఏమో!....'

ఇంకా ఏమేమి గొణిగాడో స్నేహితుడు. తనుమాత్రం అక్కడ్నుంచి జారుకున్నాడు. బయటపడిన ఆ క్షణం రెక్కలొక్కినపక్షి తను అనిపించింది రామన్నకు. పగలు ఎలాగో బైటనేగడిపి, చివరికి మిత్రుడు తెచ్చిన వస్తువులను తీసుకొని సాయంకాలం పక్షిలా యింటికి వచ్చాడు.

ఇంట్లో కుముదా లేదు, మోహనుడూ లేడు!

రామన్న ఒక్కుదుటున కుర్చీలోంచి లేచాడు. పదేళ్ళ క్రిందటిస్మరణ - ప్రవాహంలో తాను చిక్కుకొన్నాడనే జ్ఞానం అతనికి లేదు ఒక క్షణం. చీర, దండలను పట్టుకున్నవానిలా చేయెత్తుకొని కిటికీదగ్గరకు నడచివచ్చాడు. అప్పటికి స్పృహ వచ్చిందతనికి.

నాకు పిచ్చి పట్టడానికి ఎంతోసేపు లేదు ? అని చేతిని దించేశాడు. కాని చీర పడి పాడయిపోతుందనే భయంతో మెల్లిగా చేయి కిందికి దించాడు. నాకు పిచ్చి పట్టదూ అని మరొకమారు గొణుక్కుంటూ తల విదిలించాడు.

ఒక్కసారి నవ్వు వచ్చింది రామన్నకు. ఆ రోజు ఆ చీరకోసం తనకు వచ్చిన ఆలోచన జ్ఞప్తికి తెచ్చుకొని.

హుం....ఈనాటిసభ త్వరగా ప్రారంభమైతే మంచిది. లేకుంటే తనకు పిచ్చి పడుతుంది అనటం ఖచ్చితం అనుకొన్నాడు.

విషయాన్ని మార్చడానికి ఎంత ప్రయిత్నించినా మనస్సు వినలేదు; స్మృతివి వెన్నంటే నడిచింది. వెనకటిదృశ్యాలు ముందు నిలవగానే రామన్న మరొకమారు నవ్వాడు. ఆ రోజు ఆ చీరకోసం పుట్టిన ఆలోచనను తలచుకొని.

# 5

కుముదకోపం చీరమీదికి తిరిగింది. మోహన్ ఇంకా రాలేదనే అసహనంతో కూడిన కోపంతో, అద్దంముందు నిలుచుని జుత్తు సవరించుకొంటున్నప్పుడు పమిట జారింది. జారిన పమిట చూపిన యౌవనసంపదనుచూసి కోపం మరింత ఎక్కువయింది. పూర్తిగా ప్రతిబింబాన్ని చూసింది. కట్టినచీరతో తన వ్యక్తిత్వానికే ఒక కళ రావడం గమనించి చీరమీద చురచురలాడింది.

పాడుచీర ! ఆనాటినుంచి యీనాటివరకు చేదు జ్ఞాపకాలతోనే నేసినట్లుంది - అంటూ అద్దానికి వెన్నుతిప్పి కూర్చున్నది. అభ్యాసవశాత్తు తొడమీదిచీరను సరి చేసుకొంది. తటాలున మైల అయినట్లు వదిలేసింది....

....పదిఏళ్ళ వెనకటిమాట. పొద్దున రామన్న చేతిగడియారం ఇచ్చాడు. కాదు, చెయ్యి పట్టుకొని కట్టాడు. అప్పుడు వొక్కక్షణం, అతనిచేతిని పట్టుకొని లాగాలనిపించింది. వెనకటివన్నీ మరిచి ఒక్కసారి జీవితంలో చివరిసారి, కౌగలించుకోవాలనిపించింది. అంతలో రామన్న చెయ్యివదలి బయటపడ్డాడు. తాను ప్రేమావేశంలో పడుకున్న మోహనుణ్ణి హృదయానికి హత్తుకొనింది. అప్పుడు స్పృహ

కలిగినట్లయింది తనకు. ఇంక యీ యింట్లోవుంటే తను రామన్నవశ మయ్యేది నిజం. ఆ అవమానాన్ని సహించను వీలుకాదు; అక్కణ్ణుంచి బయలుదేరాలి అని నిశ్చయించింది. కాల్చిన యినుములాగయింది తన శరీరం. ఏది తగిలినా వణుకుతూంది. తను అక్కణ్ణుంచి బయలుదేరి తీరాలి, బయలుదేరి తీరాలి—

పది సంవత్సరాలతర్వాత ఇప్పటికీ కుముదకు ఈ రహస్యం అర్థం కాలేదు. ఒకవైపు ప్రగాఢమైన ప్రేమ, మరొకవైపు విపరీతమైన ద్వేషం. ఎందుకని? ఒక్కొక్కసారి అనిపిస్తుంది రామన్నది కాదు, తప్పంతా తనదే అని. అలాంటి సమయంలో సరళక్క జ్ఞాపకంవచ్చి కుముదకు తన ఆ ప్రవర్తన అక్కకు ద్రోహం కాదా అనిపించేది.

ఎన్నిసార్లు చెప్పలేదు సరళక్క? ఒక్కొక్కసారి రామన్న యింటికి రావడం ఆలస్యమైతే చెపుతుండేది.

'ఈయన యింటికి రావడం ఎంత ఆలస్యమక్కా?'

'ఆలస్యం యెక్కడైంది? ఆయన వచ్చేవేళే అది.'

'అదికాదు సరళక్కా! నువ్వు ఒక్కదానివే యింట్లో—'

'అయితేనేం? నా పని నా కుంటుంది—'

'కాదు, అక్కా, నువ్వు జబ్బుమనిషివి, అయినా—'

'అయ్యో, పిల్లవు నువ్వు, కుముదా. రేపు పెళ్ళి అయిందంటే నీకూ తెలుస్తుంది. మొగుడికి యెంత పనుంటుందో బయట.'

'పెళ్ళానికి వొళ్లు బాగులేకున్నా—'

'చూడు, కుముదా, మగవాళ్ల స్వభావం అది. యింటి బయటపని, ఇల్లువదిలి తిరగడం. స్త్రీ మాటే వేరు. తను, తనయిల్లు, తనపిల్లలు, పని - రెండుచేతులా - ఇదంతా ఎలా వదలగలదు ఆడది?'

సరళక్క సహనస్వభావానికి ఆశ్చర్యపడుతుండేది తను. రామన్న తనను లక్ష్యం చేయకున్నా ఆమెకు అసహనం కలుగలేదు.

'పురుషునిజీవితం వేరు. ఎవరు? ఈయన్నుగూర్చి చెపుతున్నావా! పాపం!

ఆయన బయటికివెళ్ళేదే అపురూపం. చదవడం, రాయడం, ఎప్పుడైనా విసుగు పుట్టినప్పుడు వొక్క గడియసేపు బయటికి వెళ్ళివస్తారు' అని రామన్నను ఆమె అభిమానంతో సమర్థిస్తూ వుండేది.

'బయటికి వెళ్ళినప్పటిమాట వదిలెయ్. ఇంట్లో వున్నప్పుడుసయితం గంటలు-గంటలు నేను యింటిలో వున్నానో లేదో అనేమాటే లేదాయెనకు. రాసేదాంట్లో మత్తుగా పడివుంటా రెప్పుడూ' అనేటప్పుడు సరళక్క పాలిపోయినబుగ్గలు అభి మానంతో ఎరుపెక్కేవి.

'ఇలాంటివాళ్లకు పెళ్ళాం వున్నాఒకటే, లేకున్నా వొకటే' అని తనే వొక మారు తిరస్కారంతో అన్నది కుముద.

'అయ్యో! పిచ్చిదానా! మనది మనం చెప్పుకోకూడదు. అయితే నేను లేకుంటే ఒక్కక్షణమూ సంతోషం వుండదాయనకు. ఒక్కసారంటే వొక్కసారి వొకనెల పుట్టింటికి వెళ్ళాను, పెళ్ళయిన కొత్తల్లో. ఆ నెలంతా వొక్క అక్షరమైనా రాయ లేదు పుణ్యాత్ములు' అని ఆ విషయం సంతోషంతో చెప్పింది సరళక్క!

'ఇలాంటి సుఖసంసారం నాది కాబట్టే ముత్తయిదుగానే చావాలి అని నా పట్టు దల,' అన్న అక్కమాటకు తను ఆపుకోలేక యేడ్చింది.

అదే రామన్న కదా యిప్పుడూ? ఆ రామన్న తనకు పూర్తిగా తెలిసినవాడే కదూ? తెలిసే తను అతనిని మెచ్చుకోలేదూ?

అయితేనేమి? ఆ రామన్న తనవాడు కాలేదు, తనవాడు కాలేదు అనే ఆలోచన కుముద మనస్సులో దృఢంగా వుంది. తను మెచ్చింది రామన్నను, రామన్న మెచ్చింది - తన శరీరాన్నా? భార్య మంచమెక్కిందనీ, కొత్త అనుభవమనీ, రామన్న తనను కలిశాడుకదూ? పెళ్ళి కాకుండా మాతృత్వం పొందటంవల్ల తనకు సమాజంలో బాధ కలుగుతుందని, తప్పనిసరి అయి, కనికరంతో, వుపకారబుద్ధితో తనని పెళ్ళి చేసుకున్నాడు అని నమ్మింది.

ఇతని ప్రేమ కావాలి, వుపకారం అక్కరలేదు; సమాజం తనను వెలివేసినా ఫరవాలేదు, ప్రేమకోసం సుఖాన్ని త్యాగం చేయనూ తను సిద్ధంగా వున్నప్పుడు ప్రేమలేని వివాహబంధంలో తనని బంధించాడు కదా?

ఆనాటికి తన ప్రేమకథ ముగిసింది అనుకున్నది కుముద. పెళ్లి అయిన ఒక నెలకు 'మేనత్త' నెపంతో వూరు వదిలింది. పెళ్ళి అయింది. సమాజంవల్ల భయం లేదు అనే స్థిమితంలేదు తనకు; ప్రేమలేనిపెళ్ళి అనే వ్యభిచారపు గర్భం తనదని లోపల పెరుగుతున్న ప్రాణాన్ని ద్వేషించసాగింది. మేనత్త కాకున్నా దూర సంబంధం ఒక ముసలిప్రాణం వుంది, అక్కడ నెలలు గడుపుదాం అనుకున్నది. అదీ సంభవం కాలేదు.

'ఎంత సలక్షణంగా నిండుగా కనిపిస్తున్నావే? కడుపుతో వున్నావా యేం?' అని మర్నాడు పొద్దునే ముసలామె అడిగింది.

'పెళ్ళి అయిందన్నదైనా తెలియచెయ్యకూడదటే? పెళ్ళికి పిలవకపోతే పోయింది। శనగపప్పు హోళిగలు పళ్ళులేని ముసల్దానికి పనికి రావనుకున్నావా యేం?'

ఒకటి రెండు రోజులలోనే వెళ్ళిపోదాం అనిపించింది కుముదకు.

అయినా—

కుముదకు ఇప్పటికీ నవ్వు వస్తుంది అది తలచుకొంటే. ఆ ముసలిజీవం సహవాసంలో ఎంత సొగసువుంది అనేది తలచుకొంటే ఆ కొద్దిరోజులు తన సుఖం పొందినరోజులు అనిపిస్తుంది.

'ఆలస్యంగా పెళ్లి చేసుకునేది, నెలలోపు గర్భం। యీనాటి పిల్లల పెళ్లి సుఖం యింతే' ఒకరోజు ఏదో సందర్భంలో అననే అన్నదికదా ఆ ముసలామె?

'పెళ్లి అంటే ఏమిటి అన్నది తెలిసిన తర్వాతైనా మా పెళ్లి అవుతుం దత్తా' అని అన్నది, ఎందుకోసమో, తనూ రెట్టించింది.

'ఏం తెలుస్తుంది మీ తాడు। పెళ్లి అంటే అదొక్కటే కాదు।'

'అది అంటే ఏమిటత్తా?'

'ఇప్పుడు చేసుకొని కూర్చున్నావు కదా, అది' అని మొండిగా చెప్పింది ముసలామె.

'అది వదిలేస్తే మరేముంది పెళ్లిలో?'

'అలా తెలుసుకొనే పాడైపోతారు, కుముదీ యిప్పటి ఆడపిల్లలు! అది వదిలేస్తే ఏముంది అని? మొగుడూ అదేమాట చెబితే మీ గతియేమిటి?'

'నా కనిపిస్తుందత్తా. భర్తకు అదొక్కటి ముఖ్యం అనిపిస్తుంది. స్త్రీకి పుట్టిన బిడ్డల్ని పెంచడమైనా వుంటుంది.'

పళ్లలేని నోరుతెరిచి మనస్ఫూర్తిగా నవ్వింది ముసలామె ఆ మాటకు!

'మగవాడికే అది ముఖ్యం అని! అయ్యో! వెర్రిదానా? అదే ముఖ్యం అయి వుంటే మగవాడు పెళ్ళే చేసుకునేవాడు కాదు. ఇంటిభోజనంకంటే హోటల్లో తిండంటే రుచి మగవాడికి. నిన్ను పెళ్ళిచేసుకొని, నీ పిల్లల రోగాలు, రొష్టులూ సహించి, నువ్వు ముసలిదానివయ్యేది చూస్తూ కాలంగడిపే మగవాడికి పెళ్ళిలో కావాల్సింది వేరే వుంటుంది, కుముదీ!'

కుముద నివ్వెరపోయింది ఆ మాటకు. చదువూ గిదువూ లేని ఈ ముదిజీవితంలోని బుద్ధికి ఆశ్చర్యపడింది. అంతలో ముసలామె కన్నీరు కార్చడం చూసి మరింత చకితురాలయ్యింది.

'ఎందుకు, అత్తా, నాకు బుద్ధిచెపుతూ నువ్వు యేడుస్తున్నావే?'

'ఏడవడం కాదమ్మా. వెనకటిరోజుల సుఖం జ్ఞాపకం వచ్చింది, సంతోషం ఆగలేదు.'

ఈ ముసలామె సుఖం చవి చూచిందనడమే కుముదకు కొత్తవార్త. ఎప్పటి నుంచో విధవగానే వున్న యీమెనుచూసి తన కనిపించింది - కుముదకు వొక్కసారిగా నవ్వు వచ్చింది.

'నవ్వుతున్నా వెందుకు, కుముదీ?'

'ఏమీ లేదత్తా. నువ్వు 'సుఖంగా గడిపినరోజులు' అన్నందుకు ఏదో ఆలోచన వచ్చింది___'

'అంటే యేమిటే? నేను పెళ్లి చేసుకోలేదు, సుఖం అనుభవించలేదు అనుకుంటున్నావా?' ముసలామె నవ్వుతూనే అన్నది. 'నేను పుట్టినప్పట్నుంచి యిలాగే వున్నానని అనుకుంటున్నావేం?'

'వా కనిపించిందిగదా ఆ రోజులు జ్ఞాపకంవచ్చి బాధ అనిపించిందేమో అవి.'

'బాధ అనిపించడం? కాదు, పిచ్చిదానా, ఆ రోజులు జ్ఞాపకంవస్తే సంతోషం కలుగుతుంది. లేకుంటే యిన్నిరోజులు ఎలా చస్తున్నాను ప్రాణాలు బిగబట్టుకొని? ఎక్కడైనా చెరువులోనో బావిలోనో సుఖంగా వుండేదాన్ని. అయితే వెనుకటి ఆ రోజులు జ్ఞాపకం వుండడంవల్లనే యిప్పటికీ నేను సుఖంగా వున్నానను.'

'అంతటి సుఖం ఏమిటత్తా?'

'నువ్వు యింకా చిన్నదానివి, నీకు తెలియదు.'

'అయ్యో! ఆ సాకు చెప్పవద్దు, అత్తా. యీనాటిపిల్లలు చాలా తొందరగా పెద్ద వాళ్లవుతారు.'

'ఎందుకు పెద్దవాళ్ళవుతారో! ఆ పనికి పశువులుకూడా త్వరగా పెద్దవవుతాయి!'

'నీకు రెండో ఆలోచనే లేదు, అత్తా.' బాధతో అన్నది.

'నీ మాట చెప్పలేదు, కుముదా. మొత్తంమీద యిప్పటి పిల్లలమాట చెపుతున్నా. మా కాలంలో 8—10 యేళ్లకే పెళ్ళి అయ్యేది. గంగ-గౌరి, పంచమి-చతుర్థి, సెన గలు పంచడం, ఊయాల్లూగడం - అంటూ పిల్లతనపు ఆటలతో ఒకటి రెండు సంవత్సరాలు సంతోషంగా గడిపేవాళ్ళం. అలాగే పెరిగిన ఆడపిల్లలతో తిరిగే వాళ్ళం; వాళ్ళమాటలు - కథలవల్ల జ్ఞానం వచ్చేది—'

'అదంతా వుండనీ, అత్తా, నీ సుఖం ఏమిటో కాస్త చెప్పు.'

'అదే చెపుతున్నాను. ఇదంతా చెప్పకపోతే అది తెలియదు. వూహ తెలిసే లోగా మాకంతా తెలిసేది- మనవాళ్ళు ఎలా, వాళ్ళ స్వభావం ఎలాంటిది, మనవాళ్ళు ఎలాంటివాళ్ళు, ఆయన ఎవరెవరితో వుంటారు - అది - ఇది - అంతా. అందుకే నాకు మా వాళ్ళప్రవర్తనపట్ల కోపమూ రాలేదు, ఆశ్చర్యమూ అనిపించలేదు.'

'ఎందుకని మీ ఆయన ప్రవర్తన బాగుండలేదా, అత్తా?'

'బాగో ఓగో! నలుగురూ షరీకయినట్లుండేవారు.'

'అంటే-అంటే-బయట ఏమైనా—'

'బయట వుంది వొకామె పోటీగా!'

'అయినా మీ ఆయనమీద కోపం రాలేదంటావు, కదత్తా?'

'అంటే? బిడ్డ మురికిలో చెయ్యిపెడితే బిడ్డమీద కోపగించుకుంటావా? మురికి అని తెలీదు దానికి. అదేదో కొత్తది, ఒక మోజు.'

'అదేం మోజు, అత్తా? యింట్లోవాళ్ళు యీయనకోసం ఏడుస్తుంటే?'

'ఏడవడానికి నాకేం రోగం? నాతో తగవులాడారా? నన్నేమైనా కొట్టిచంపారా?'

'అయితే నిన్నువిడిచి మరొకామె___'

'అయ్యో! వెర్రితల్లీ! నన్నువిడిచి అంటావ్! నన్నెందుకు వదులుతారు?'

'కాదు, అత్తా, వదిలి అంటే - ఇలా - కాదు - అంటే - నువ్వు యింట్లో వుంటే రోజూ ఆయన___'

'రోజూ అంటావు! అందుకే చెప్పాను యిప్పటి పిల్లలకు పెళ్లి అంటే అదొక్కటే అని. నాతో సంసారంచేస్తే చాలుకదా? రోజూ ఏం చేస్తారు, మిగిలినప్పుడు ఏం చేస్తారు. నాకూ చేతినిండా పని వుండేది, ఇంటినిండా మనుషులు....అత్త, మామ, మరుదులు, మరదళ్ళు, వచ్చేవాళ్ళు, పొయ్యేవాళ్ళు - ఇదంతావదిలి రోజూ కబుర్లాడడానికి నేనేం పిచ్చిదాన్నా?'

'ఇదే నీ ఆ హాయిఅయిన రోజుల జ్ఞాపకాలు అను.'

'ఇది రోజూటిమాట. సుఖం కలిగించేరోజు అనేది మరొకటి వుంది.'

'వీటిమధ్యలో అదెలాంటి సుఖపు దినమో!'

'ఎటువంటి దంటావే? విన్నావంటే తెలుస్తుంది.'

'చెప్పేట్టుంటే చెప్పు, అత్తా.'

'హుఁ....గుచ్చిగుచ్చి నన్ను మాట్లాడించావు, ఇకముందు చెప్పేట్లయితే చెప్పు అంటుందిచూడు తెలివైంది! నోట్లో నీళ్ళు వూరింతర్వాత ముద్ద తినకుండా వుంటారా? చెపుతాను విను. ఒకరోజు పనంతా ముగించుకొని రాత్రి మాగదికి వెళ్ళి పడుకోవాలనుకున్నాను.'

'ఒక్కదానివేనా?'

'అంటే? నేనేమి పిరికిదా న్ననుకున్నావా?'

'కాదు. అంటే మీ ఆయన___?'

'మా ఆయన అన్నంతినగానే బయటికి వెళ్ళారు. అన్నమూ సరిగ్గా తినలేదు. ఏ ఆలోచనలో వున్నారో ఏమో అని నేనూ వూరుకున్నాను. రాత్రి-అయినతర్వాత అడుగుదాం అనుకున్నాను.'

'రాత్రికి వస్తారని నమ్మకం వుందను.'

'దేనిలోనైనా నమ్మకం లేకుంటే సంసారంలో సుఖం వుంటుందా చెప్పు పిల్లా. వెనక మూడు నాలుగురోజులు ఆయన యింటికి రానేలేదు. ఏదో స్నేహితుల్తో పేకాట ఆడుతుండాలి అనుకున్నా.'

'సుఖపడాలనే పట్టుదల వుండేదను నీలో?'

'ఏమన్నావు?'

తన మాటలతీరు ముసలామెకు తెలియలేదేమో. కొంత తికమకపడింది తన ప్రశ్నకు.

'నేను ఎక్కడివరకు వచ్చాను?'

'మూడు నాలుగురోజులు మీ ఆయన యింటికి రాలేదు. ఆ రోజు నువ్వు పడుకునేందుకు వెళ్ళావు-'

'ఆఁ....అంతలోపల ముందు తలుపు చప్పుడు అయింది. నాకు ఆశ్చర్యం వేసింది. ఒకవేళ ఆయన వచ్చినా యింత త్వరగా వచ్చేవారు కాదు. అన్నమూ సరిగ్గా తినలేదు. ఏమో కోపమొచ్చిందో ఏమో - అని....అంతలో గదిలోపలికి వచ్చారు. చొక్కావిప్పి. ఉష్ అంటూ వచ్చి 'చిన్నీ' అన్నారు-'

'ఏమన్నారు?'

'చిన్నీ అన్నారు. నేను పెళ్ళిలో చాలా చిన్నదానిగా కనిపించానని నన్ను చిన్నీ అంటుండేవారు. తర్వాత కాపురం ప్రారంభం అయ్యేటప్పుడు ఒకమారు నన్ను చూసి 'ఏమే! నువ్వు ఆకాశంలో చుక్కవు. పెళ్ళిలో దూరంనుంచి చూశాను. ఇంతే కనిపించావు. ఇప్పుడు దగ్గరనుంచి చూస్తే'-అంటూ-కాదు. ఇంతకీ నన్ను 'చిన్నీ' అంటూ పిలుస్తుండేవారు. 'చిన్నీ' అన్నారు. 'ఎందుకు ఈరోజు సరిగ్గా అన్నమే తినలేదు?' అని అడిగాను.

'ఎందుకో, తలనొప్పి, చిన్నీ' అన్నారు. 'అమృతాంజనం తెచ్చేదా?' అని అడిగాను. 'అమృతాంజనం రానీ' అన్నారు—'

'ఏమన్నారు?'

'అమృతాంజనం రానీ అన్నారు. అది ఆయన మాటలతీరు. 'ఏ ఔషధమూ వద్దు, చిన్నీ. ఇలారా నువ్వు' అని నన్ను చేర్చుకొని నా తొడమీద తలపెట్టుకొని పడుకొన్నారు, నేను క్రిందికి చూసేలోపల నిద్రపోయారు. కుముదీ! మొగుడు అంటే ఆట ఆడే పిల్లవాడు అని ఆ రోజు నాకు తెలిసింది. బైట ఏ ఆటయినా ఆడనీ, ఎంతసేపయినా ఆడనీ, విశ్రాంతి, స్థిమితం, ఆధారం అంటే యింటిలో భార్యే చూడు. యిప్పటికీ - ఇప్పుడు నా నోట్లో పళ్లు లేవు, కళ్లకు చూపులేదు, అంగాంగాలు యెండిన బెండు అయిపోయినాయి - అయినా యీ నాటికీ ఆ జ్ఞాపకం వచ్చింది అంటే ఆనాటి సంఘటన కళ్ళకు కట్టినట్లవుతుంది.'

'చాలు, చాలు, అత్తా!'

'అయ్యో! పిచ్చిదానా! నీకేమైందే యేడవడానికి?'

'నేను ఏడవను, అత్తా, ఏడవను' అని ఆపుకోలేక గదికి పరుగెత్తింది. ఆ రాత్రి లాగా గాఢమైన నిద్ర మరెప్పుడూ రాలేదు.

పొద్దున నిద్రలేవగానే చూసింది, రామన్న వచ్చివున్నాడు.

చేతిలో పట్టుకున్నది, ఆ రోజు చేతిలో పట్టుకున్నది, ఇదే చీరనే.

తక్షణం క్రితంరాత్రి మధుర జ్ఞాపకం కలలాగా అనిపించింది.

'పాడు! ఈ చీర అంటే సుఖాన్నే మరిపించే తెర!'

అయినా యేదో కారణంవల్ల ఈ రోజు తను దానినే కట్టుకున్నది కదా? వెనుక వొక్కసారిమాత్రం దాన్ని కట్టుకున్నప్పుడు మోహనుడికి జ్వరం వచ్చింది.

ఛీ! ఎంత చెడ్డ ఆలోచన! మోహన్ రావచ్చు. ఇంతలోనే నిరాశతో ఒదిగి పోయినదానిలా అక్కడే కూర్చొన్నది ఎదుటి గోడను చూస్తూ.

# 6

రామన్న నవ్వుముఖంతోనే కిటికీవరకువెళ్లి ఒకటి రెండు నిమిషాలు దూరం వరకు సారించి చూసాడు. చేతిగడియారాన్ని చూసుకొన్నాడు. ఇంకా యెంత లేకున్నా 45 నిమిషాలుంది సభనుంచి ఆహ్వానం రావడానికి. లేకుంటే వచ్చినవాళ్ళు కారణంలేకుండా నవ్వుతున్న తననిచూసి ఏమైనా అనుకోవచ్చు. కారణం లేదని కాదు. ఆ కారణాన్ని ఇతరులకు చెప్పడానికి లేదు. ఇదీకాక పదిఏళ్ల వెనకటి విషయం. అదీకాక తనకు అదొక సొంత అనుభవానికి సంబంధించిన విషయం.

పోనీ వదిలెయ్ అనేట్లుగా నిట్టూర్చి కుర్చీదగ్గరికి నడిచాడు; పుస్తకాల బీరువాను చూసి ఆ వైపువెళ్లి, బీరువాతెరిచి పుస్తకాలను చూడసాగాడు; ఒక పుస్తకం తీసుకొని పుటలు తిప్పాడు. సంస్కృతశ్లోకం ! పుస్తకంపేరు చూశాడు. కాళిదాస కవి వ్రాసిన అభిజ్ఞాన శాకుంతల నాటకం శ్లోకాన్ని మరోసారి చదవ నారంభించాడు.

'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్ సుఖితోఽపి జంతుః।
తచ్చేత సా స్మరతినూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని॥

(పర్యాకుల స్తిష్ఠతి)'

హుఁ హుఁ అని గొణిగి రామన్న తనూ 'పర్యాకులు' డుగానే నిలిచాడు.

అందుకే యీ పుణ్యాత్ముణ్ణి శ్రేష్ఠకవి అని పొగుడుతారు జనులు. అని కాళిదాసుకు యోగ్యతాపత్రం యిచ్చి శ్లోకాన్ని మరోసారి చదువుతూ కుర్చీలో వచ్చి కూర్చున్నాడు. కాళిదాసు శ్రేష్ఠకవి.

ఇందులో సందేహమే లేదు. బయటి ప్రపంచంకంటె మనుష్యుని అంతరంగ ప్రపంచంలో ప్రవేశించి, సంచరించి, మనకందరికీ అనుకూలమయ్యేలా అంతఃకరణాల స్వభావాన్నే రాశాడు అనవచ్చు.

ఈ రోజు తను వుల్లాసంగా వుండాలి. ఏ రచయితకూ దొరకని గౌరవం తనకు సార్వజనిక సభ, సార్వజనిక సన్మానం ! ఇంకేం కావాలి ? సర్వజనులూ ప్రశం

సలు చేస్తారు కాబట్టి. కుముదకూడా తనతో రావలసినదే. ఆమె వేష భూషణ అలం కారాలు - అన్నిటికంటే యెక్కువగా ఆమె అంగాంగాలలో స్ఫురించే నిగ్రహం కల జీవనం - దీన్ని క్షణమాత్రం కళ్ళారా చూశాక రామన్నకు స్వర్గం లభించిన ట్లయింది. స్వర్గం ఎందుకు? మోక్షమే లభించిందనవచ్చు కుముద కట్టుకున్న చీరను చూసి.

ఆ చీర! ఆనాడు తను మనఃపూర్వకంగా ప్రేమ కానుకగా తెచ్చియిచ్చిన చీర! ఆ చీర కట్టుకున్న సౌందర్యమూర్తిని చూసినతర్వాత ఒక్కక్షణం ఆనందమనిపిం చింది. మరుక్షణంనుంచే మనస్సు వుద్విగ్నమైంది. 'దుఃఖపూరిత' మైంది. ఎందు వల్ల, వెనకటిది జ్ఞాపకంవచ్చా? జరగబోయేదానికి సూచకంగానా?

కాళిదాసు చెపుతాడు, సుందరమైన వస్తువులను చూసినప్పుడు వెనకటిజన్మల జ్ఞాపకాలు మనకు తెలియకుండానే మనల్ని ఉదాసీనంగా చేస్తాయని.

వెనకటిజన్మ అంతదూరం ఎందుకు? ఈ జన్మలోని తలపే రామన్నను బాధ పెట్టసాగింది. పదేళ్లక్రితం, మదాంధతతో, అబద్ధంచెప్పి స్నేహితుణ్ణి వంచించి తను ఆ చీరను తెచ్చాడు - కుముదకోసం.

ఉత్సాహంతో యింటికి వెళితే కుముదే లేదు!

ఒకక్షణం తత్తరపాటు చెందాడు రామన్న. మరుక్షణం నిరాశతో నిర్విణ్ణు డయ్యాడు. కానీ తక్షణం గట్టిగా నవ్వేశాడు.

నవ్వుకు, సంతోషానికి సంబంధంలేదు. అత్యంత సంతప్తహృదయంనుంచీ నవ్వు వెలువడవచ్చు అనేది ఆ రోజు అనుభవం అతనికి చెప్పింది. ఆ రోజు తను నవ్వింది యెందుకు? నాటకంలో పాత్ర అయివుంటే ఎందుకనేది దీర్ఘమైన స్వగ తంతో అన్యులకు తెలిపివుండవచ్చు. 'ఒరే! మూర్ఖుడా! రామన్నా, ఏమైంది నీ దురవస్థ! ఎలా పడింది నీ చెంపమీద దెబ్బ! హహ! చీర తెచ్చావుకదూ? హ హ హ హ! ఒరే ప్రేమవంచకుడా! నీకోసం ప్రాణం వదలి, నీవే నా ప్రాణం అని చెప్పిన నీ భార్య సరళ బతికివున్నప్పుడు ఒక్కసారైనా ఆమెకోసం ఎప్పు డైనా మంచిచీర తెచ్చావా? హః! ఇప్పుడు తెచ్చాడు! ఎవరికోసం?....' అయితే

యీ వుపన్యాసం తనకూ వినపడనంత మెల్లిగా స్వగతం పలికి తను ఆరోజు నవ్వి వుండాలి.

పది సంవత్సరాలతర్వాత, ఈనాడు ఆలోచించి చూస్తే? ఆలోచనను ధైర్యంగా ఎదిరిస్తే?

రామన్న భయపడ్డాడు. అంతరంగంలోని ప్రశ్నకు సరిగా తను ఎదురుచూస్తున్నది ఒక్కసారి దృష్టికి వచ్చింది. ఎదుట గోడకు సరళ చిత్రం!

ముఖంనిండా నవ్వు వుంది ఆ చిత్రంలో. పెదవుల్లో, నోటిలో, కపోలాలలో, కన్నులలో - చూసిన చోటల్లా నవ్వు! రంగులకుబదులు నవ్వులోనే కుంచె ముంచి రచించినట్లుంది చిత్రం. మొదట బీదతనం, ఆ తర్వాత బడలిక. సుఖాన్ని చూడకుండా నవ్వే జీవితం సరళది.

'ఏం చేస్తున్నారు?' అన్న దొకసారి.

'రాస్తూన్నాను' అని తను జవాబు చెప్పాడు.

'చాలు వూర్కోండి. ఎప్పుడుచూసినా రాయడమే! ఏమి సుఖముందో దాంట్లో?'

'సరళా, నీకు సుఖం యివ్వవలసినబాధ్యత వుంది నాకు. అందుకు ఇలా ఏకధాటిగా రాస్తున్నాను.'

'నాకా? ఇంకా ఎంతసుఖం తెచ్చి యివ్వాలంటారు? దీనికి అవధి ఎక్కడుంది?'

'ఎక్కువగా చల్లాలి. అప్పుడే నీకు శోభిస్తుంది' అంటూ తను - కన్నీటితో స్మరించుకున్నాడు - ఆమె పెదవులమీద మృదువుగా తట్టాడు.

'మాట్లాడుతూనే రాయకూడదా? అంటే మీ పుస్తకాలు అమ్మకం అయినట్లే.'

'మాట్లాడుతుంటే వినేది ఇల్లాలు, రాసిందాన్ని చదివేవాళ్ళు ఇతరుల భార్యలు' అని తను నవ్వులాట కన్నాడు.

'వాళ్ళు చదివేది వొకరోజు ఆలస్యం కానీ, ఈరోజు రాయొద్దు.'

'ఏవిటి? ఈరోజు ఏమిటి విశేషం?'

'ఏరోజైనా ఏముంటుంది? మీ యిల్లాలి నైనప్పటినుంచి—'

'హుం, వుండు, వుండు! ఛీ! మళ్ళీ మరిచిపోయాను నేను! ఈసారి మరిచి పోయాను! సరళా క్షమించు నన్ను. నేను రాయడం అనే ఒక స్వార్థంలో ఈ రోజు మన పెళ్ళి వార్షికోత్సవం అనేది —'

సరళ తన నోటిమీద చెయ్యిపెట్టి వారించింది.

'అలాంటిమాటలు మాట్లాడవద్దు. సంవత్సరంలో ఒక్కరోజు వుత్సవం కాదు మన పెళ్లి. నాకుమాత్రం ప్రతిరోజూ పండగదినమే అనిపిస్తుంది.'

'సరళా, నీలాంటిదాన్ని చేపట్టేయోగ్యత నాకు లేదు, జన్మజన్మాంతరాలు కావాలి దాన్ని పొందడానికి.'

'ఎన్ని జన్మలయినా నేను మీ సాన్నిధ్యం వదిలేదాన్ని కాదు' అని ఆమె నవ్వింది.

'వెనకటిజన్మలో నువ్వు ఎవ్వరికీ కొంచెంకూడా యిచ్చిపెట్టుకోలేదు సరళా.'

'ఎందుకు? ఆ వూహ ఎందుకు వచ్చింది మీకు?'

'కాదు, నాలాంటి దరిద్రపుమొగుడు ముడిపడ్డాడు కదా నీకు? ఒకరోజు ఒక మంచిచీర తెచ్చియిచ్చే తాహతు లేదు, నీ సౌందర్యం ఇంకా శోభించడానికి!'

'భార్య సౌందర్యం శోభించేది ఆమె కట్టిన చీరవల్లకాదు, ఆమెను చేపట్టిన వ్యక్తి ప్రేమవల్ల.'

'ఇంతకీ సౌందర్యానికీ కన్సెషనురేటు (Concession Rate) వుంది అను.'

ఆ మాటకూ సరళ నవ్వింది. ఏమాటకూ నవ్వే. అప్పుడు నవ్వు. ఇప్పుడు-ఇప్పుడూ చిత్రంలోనూ నవ్వు!

రామన్న నిట్టూర్చాడు. 'వ్యాకులమనస్కుడు.' కాళిదాసు సర్వాంతర్యామిగా వున్నాడో ఏమో? సుఖస్మరణవల్ల దుఃఖం కలుగుతుంది అని ఎంత సరిగ్గా చెప్పాడు!

హుం....మరొక మాటనుమాత్రం కాళిదాసు చెప్పలేదు. దాన్ని తను అనుభవంలో చూస్తున్నాడు. అదేమంటే, దుఃఖం స్మరించడంవల్ల సుఖం కలగడం! లేకుంటే వెనకటిదంతా తను ఎందుకు స్మరిస్తూ కూర్చోవలసి వచ్చింది?

మరొకమారు చేతిగడియారాన్ని చూసుకొన్నాడు. హుం. ఆలోచనల వేగానికి గడియారం వేగానికీ ఎంత భేదం వుంది. ఇంకా నలభై రెండునిముషాలు తన సన్మానంచేసే స్వాగతసమితి - వచ్చేనిరీక్షణకు. ఇప్పుడు తను కొంత గంభీరంగా కూర్చోవడానికి ప్రయత్నించాలి....మళ్లీ నవ్వు వచ్చింది. ఛీ! ఆ చీర జ్ఞాపకం పూర్తి చేసేద్దాం. ఆపివుంచితే సత్కారసమితివాళ్ళు వచ్చినపుడు ఆ జ్ఞాపకం అడ్డు వడుతుంది.

ఛూ! ఇదేమిటి క్రూరతనపు ఆలోచన అని మళ్లీ కుర్చీలోంచి లేచాడు. ఎందుకు యీ పాడు జ్ఞాపకాలు? వెనక చేతులుంచుకొని గది పొడుగునా నడిచాడు. మొదటి భార్య పోయింది; ఆమె చనిపోయేముందు ఏదో కారణంవల్ల ఇంట్లోవుండే మరో ఆమెని మోహించాను; మంచమెక్కిన భార్యకు తెలియకుండా ఆమెతో అక్రమ సంబంధం పెట్టుకున్నాడు. ఆ పిల్ల గర్భవతి అయింది. భార్య - చనిపోయింది. ఆ పిల్లను పెళ్ళి చేసుకున్నాడు. ప్రపంచంలో రోజూ ఎన్నోచోట్ల ఎంతోమంది ఇలా ప్రవర్తిస్తూ వుండవచ్చుకదూ? వాళ్ళకు కలగని వ్యథ నన్నే ఎందుకు పీడించాలి? అథవా వ్యభిచారాన్ని అదుపులో పెట్టుకోలేని బలహీనుడినా నేను?

ఛీ! 'వ్యభిచార'మని కుముదను అవమానిస్తున్నాను. అది వ్యభిచారం కాదు. నిజంగా అది -

అది ఏమిటి? ప్రేమా? కామమా?

ఇప్పటికీ మాటిమాటికీ సరళగురించి తీయటితలపులు తనకు వస్తుండబట్టి తన ప్రేమ ఇప్పటికీ సరళమీదనే వుందని నమ్మివున్నాడు. ఎందుకని? ఇద్దరిని ఒకే విధంగా - ప్రేమించడం సాధ్యం కాదా? లేక పెళ్లి అయినతర్వాత కామజీవనం ప్రారంభమైందని మొదటిభార్యమీద ప్రేమ, కామజీవనంతర్వాత పెళ్ళి అయిందని రెండవభార్య కుముదవిషయంలో - వ్యభిచారం అనాల్నా?

ఒక్కొక్కసారి కుముదమీదా ప్రేమ కలిగేది - కాదు ప్రేమ వుండేది - ఎందు కుండకూడదు - అనిపిస్తుంది రామన్నకు. ఆరోజు తను చీర తీసుకొని వెళ్లినప్పుడు కుముద యింట్లో లేనందువల్ల మొదటిక్షణం తన అంతఃకరణం శూన్యమనిపించ లేదూ? అది ప్రేమలక్షణం కాదూ? తర్వాత జరిగినవిషయం సంగతి వేరు;

అప్పుడు తను బుద్ధిపూర్వకంగా ఆలోచించి లోపలితాపంవల్ల నవ్వు అనే నివ్వు రవ్వల్ని ప్రసరించాడు. అయితే మొదటిక్షణం కలిగిన అంతఃశూన్యత అర్థం ఏమిటి?

అయినా రామన్నకు అనుమానం. కుముదకు తనమీద నిజంగా ప్రేమవుంటే ఆమెకు నేనంటే యింత అసహ్యం వుండేదికాదు. ఈ రోజుకు పది ఏళ్ళయింది. ఒక్కరు మరొక్కరి సామీప్యాన్ని కోరకుండా సంసారం నడపడం ప్రారంభించి, ఇంతయినా తనకు మరోవ్యక్తిపట్ల ఆకర్షణ కలగలేదుకదా? ఇది నిజమైన ప్రేమ లక్షణమై వుండవచ్చా?

ఆలోచనలభారంవల్ల ఆయాసం వచ్చినట్లయి రామన్న మళ్ళీ కుర్చీలో కూర్చు న్నాడు. ఒక్కుమ్మడిన కుముద మూర్తి కళ్ళయెదుట నిలిచింది.... అటూ యిటూ చూశాడు; ప్రత్యక్షంగా కుముద లేదు. తన మనసులో నిర్మించుకున్న మూర్తి.... మనస్సు కాదు, తన స్మృతిముందు తెచ్చి నిలిపినమూర్తి. పదిఏళ్ళవెనుక, ఆమె యింట్లో లేనప్పుడు, తాను సరిగ్గా వూహించి ఆమె మేనత్తయింటికి వచ్చినప్పుడు ఎదుట నిలిచిన మూర్తి.

ఆమెముఖంలో చిరునవ్వు వెలసివుండడంచూసి రామన్న భయపడ్డాడు. దారి పొడుగునా అనేకమంది నవ్వినందువల్ల అతనికి ఆ విషయమై భయం కలిగింది. హుం....జనం నవ్వక వూరకుంటారా?

కుముద యింట్లో లేనందువల్ల తన అవస్థ వర్ణనాతీతం. చివరకు ఆమె మేనత్త వూరికే వెళ్ళివుండవచ్చని వూహించాడు; ఇంతవరకు ఎన్నోచోట్ల వెతికి వచ్చాడు; ఎవరినీ అడిగేందుకు లేదు, మరొకరికి తెలియడానికి లేదు. ఇలా బాధపడి తిరిగి ఒక నిశ్చయంతో స్టేషన్ దారిపట్టాడు; నిర్ణయం గట్టిచేసుకొని టిక్కెట్టు కొని కంపార్టుమెంటులోకి వెళ్ళేలోపల రైలు కదిలేవేళయింది. లోపలికి దూకాడు; మిగిలిన పైతరగతి ప్రయాణీకులు ఆశ్చర్యపడి తనవంక చూశారు. ఎందుకు చూడరు అనుకుంటూ ఖాళీగావున్న బెర్త్ ఆక్రమించాడు! మాట్లాడేందుకు మనసు కాలేదు. మిగిలినవాళ్ళూ తనని పలకరించలేదు. అప్పుడప్పుడు చాటుగా చూస్తున్నా రంతే. ఎంతోసేపు నిద్రరాలేదు. వేళ అవుతూవుంటే మిగిలినవాళ్ళు తమ పడక

లను పరిచారు; ఇంతలో రామన్న ఆయాసంతో ముక్కుతూ మూలుగుతూ పడుకు నేందుకు పడకను___

ఛీ! ఎంతటిమూర్ఖుడు తను! ఎంత అపహాస్యంపాలు తన అవస్థ! తను వూరికి బయలుదేరినప్పుడు చేతిలోవున్న ఆ వొక్కచీరనుమాత్రం తీసుకున్నాడు కదా! ఇప్పుడు దాన్నే తన పడక అని విప్పుతున్నాడు. మిగిలిన ప్రయాణికులకు చాలా వినోదంగా వుంది. చివరికి తన పరిస్థితికి తనే నవ్వాడు.

అయినా మిగిలినవాళ్ళు తనని ఆలాగుచూసి దారిపొడుగునా నవ్వుకోనుండవచ్చు కదా అని రామన్న కుముద ఎదుటపడడానికి సందేహించాడు. ఏ అవలక్షణం తన ముఖకవళికల్లో కనిపిస్తున్నదో! ఇప్పుడు కుముదకూడా తనని చిరునవ్వుతో చూస్తున్నది. ఆ రోజుపొద్దున తనను ఏ దృష్టితో చూపిందో అదే చిరునవ్వుతో వున్న మూర్తి ఇప్పుడు రామన్నకళ్ళకు కట్టినట్లుంది.

రామన్న ఆలోచించాడు. ఈనాటికి పది సంవత్సరాలయినా తన కళ్ళఎదుట నిలిచే కుముద మూర్తి ఆ నాటిదే. ఎంత ప్రయత్నంచేసినా మరెటువంటి మూర్తిని కూడా జ్ఞాపకం తెచ్చుకోలేకున్నాడు. మనస్సు ఎంత మోసం చేస్తున్నది! లేక ప్రపంచంలో మనుషుని వ్యవహారమే అంతేనా? అందుకే శంకరాచార్యులవారు జగమే మాయ అని చెప్పివుండవచ్చా? ఏ వస్తువూ తను వున్నట్లు కనిపించనే కని పించదా? చూసేవానికి యిష్టమైనట్లు, ప్రేమ వున్నట్లు ఆ వస్తువుకు రూపం వస్తుంది. అంతేకాక, అదే స్వరూపం చివరివరకూ నిలిచివుంటుంది.

హుం....తత్త్వజ్ఞానంతో ఇంతగా గాలంవేసినా వ్యర్థం, ఆత్మవంచన. వున్న దాన్ని వొప్పుకొనితీరాలి. కుముద తనని ముందు ఆకర్షించింది శారీరికంగా. ఎప్పుడూ తనయెదుట నిలిచేది మోహనమూర్తే. రమ్మని సూచ్యంగా తెలుపు తున్నవో అన్నట్లున్న చూపులు, చూడగానే కౌగిలించాలనిపించే నిండుభుజాలు, దగ్గరకుచేరితే అయస్కాంతంగా ఆకర్షించే పెదిమలు, నిండైన ఎద, ఆమె అడుగు లేస్తుంటే తనవొళ్ళు వణుకుతుందేమో అన్నట్లు కదిలే అంగాంగాలు___

తనకు సిగ్గులేదా అనిపిస్తుంది ఒక్కొక్కసారి. అయితే అక్కడ సిగ్గుప్రశ్నే లేదు; తను బుద్ధిపూర్వకంగా కల్పించుకొనే చిత్రం అది కాదు. దాన్ని తుడిపే,

మరిపించేశక్తికూడా తనకు లేదు. ఆనాడు మేనత్తయింటికి వెళ్ళినప్పుడు సాక్షాత్తుగా కుముదే ఎదుట నిలుచునేసరికి, ఆమెముఖంలో చిరునవ్వును చూసినప్పుడు రామన్న కళ్ళను చీకట్లు కమ్ముకున్నట్లయింది వొక్క-క్షణం.

ఓహో! రామన్నకు సరిగ్గా జ్ఞాపకం వచ్చింది. చీర తీసుకువెళ్ళింది అప్పుడు కాదు, రెండోసారి. ముందు మోహన్ పుట్టకముందు, పెళ్ళిఅయిన కొన్ని రోజుల లోనే కుముద మేనత్తయింటికి మొదటిసారి వెళ్ళిందికదా? అప్పుడూ తన అవస్థ అలాగే వుంది. అప్పుడూ కుముద నవ్వుముఖంతోనే తనకి ఎదురయింది. అప్పుడు! ఇప్పుడు! ఎప్పుడయితేనేం? కుముదను తలచుకొన్నప్పుడు ఆమెది ఒకే రూపం తన కళ్ళెదుట నిలుస్తుంది. అప్పుడు, మొదటిసారి, ఇంకా మోహనుడు కలగటానికిముందు, పెళ్ళి పనులన్నీ ముగిసినతర్వాత హఠాత్తుగా తనమీద అసహ్య పడి వెళ్ళిందికదూ! ఆనాటి అనుభవం తలచుకుంటే ఇప్పటికీ వొళ్ళు ఝల్లుమం టుంది. నవ్వుముఖంతో ఆమె నిలుచునివుంది, మాటలేక తను నిలుచుని వున్నాడు. మాతృత్వం దగ్గరవుతున్నందువల్లనో ఏమో, ఆమె ముఖంలో పెద్దతనపుకళ వచ్చింది. కళ్లల్లో దయాదృష్టి వుంది; దాన్ని ఎదుర్కో-లేక తను అపరాధిలా నిలు చున్నాడు. ఎంతసేపు అలా నిలవవలసివస్తుందో అని భయం. ఆ మూర్తి అంత సేపు ఎదుటనిలిస్తే తను స్పృహలేక ఏమైనా చెయ్యవచ్చు - ఇది నిజం - అనేం తలో లోపలినుంచి ముసలిఆమె కంఠం వినిపించింది.

'కుముదీ, ఎవరే మగవాళ్ళు వచ్చారు?'

ఏమని సమాధానం చెపుతుంది? తనకి పరిచయం లేదనా? స్నేహితుడనా? దూరపు ఆప్తుడనా? ఎవరో దారిన పోయేవాడనా-?

'అత్తా, మనవాళ్ళు వచ్చారు. ఇలారా.'

ఆక్షణం రామన్నకు ధైర్యం వచ్చింది. నమ్మకమూ కలిగింది - కుముద యింకా తనని ప్రేమిస్తున్నదని. 'మనవాళ్లు' అన్నదికదా - మా ఆయన' అనలేదు. అంత ఆత్మీయత వున్నట్టు లేదు.

'ఓహ్! నీ మొగుడా? ఇలా యెందుకొచ్చాడు బడి ఎగ్గొట్టిన పిల్లాడిలా?' అంటూ ముసలామె గదిలోకి వచ్చింది.

చిత్రంలోని బొమ్మల్లా తామిద్దరూ నిలుచున్నది చూసి ముసలామెకళ్లల్లో చిలిపితనం తొంగిచూసింది.

'ఎందుకయ్యా, పెళ్లికి నన్ను పిలవకపోయినా తొలి బాలెంతతనానికిమాత్రం నామీద భారం వేశావా?'

తను సమాధానం యివ్వకుండా వెర్రివానిలా పళ్లు బయటపెట్టాడేమో!

'నవ్వు, నాయనా, నవ్వు. ఒకరోజుకాకుంటే మరోరోజు అందరూ ఇలాగే ముసలివాళ్లవుతారు. అందుకే చిన్నవయసులో నవ్వుతూ, పేలుతూ వుండాలి. ఇలా యెందుకు నిలుచున్నావు, కుముదీ? యింటికొచ్చినవాళ్లను కూర్చోమని చెప్పొద్దా?'

'ఇల్లు నీదత్తా.'

'ఈమనిషి నీవాడు. నువ్వున్నచోటే అతనిల్లు. కూర్చోనాయనా. విశ్రాంతి తీసుకో, ఆవిడ వూర్లోవిషయాలన్నీ చెప్పి నీతల చెడపకుంటే నేను టీ చేసుకొస్తాను, ఆతర్వాత స్నానం చేద్దువుగాని. పెళ్ళాం ఎక్కడికిపోతుందో, వచ్చిన మర్నాడే వెనకనే పరుగెత్తడానికి.'

తన సమాధానాన్ని అపేక్షించకుండా, చివరిమాటనే తనలో తనే అనుకుంటూ ముసలామె వెళ్ళినతర్వాత రామన్నకు కొంచెం ధైర్యం వచ్చింది.

'కుముద___'

'ఏవిఁటి?'

'నామీద కోపమా?'

'ఎందుకు?'

'పెళ్లి నీకు అక్కరలేకుండెనా?'

'లేకుంటే దిక్కుమాలిన దాన్నయ్యేదాన్ని. మీ దయవల్ల బయటపడ్డాను.'

'తెలిసింది. నా మీద కోపం నీకు.'

'మీమీదకాదు, నా మీద.'

'అఁ?'

'మీ తియ్యటిమాటలకు మోసపోయి—'

'కుముదా, కుముదా, అలా అనవద్దు. నిండుమనస్సుతో పెళ్ళి చేసుకున్నాము యిద్దరమూ.'

'పెళ్లి అయినందువల్ల, పుట్టేబిడ్డకు ఒక తండ్రి దొరికాడు. నాకేమి—'

'కుముదా, నిన్ను మనస్ఫూర్తిగా—'

'చాలు మీ మనస్ఫూర్తి. రచయితలు మీరు. మాటలకు అర్థాలు తెలుసు; అందుకే 'మనస్ఫూర్తిగా' అంటున్నారు, 'ప్రేమతో' అని పొరపాటున కూడా-'

'ఎందుకు, కుముదీ, ఇంకా మాట్లాడుతూనే వున్నావేం?' అంటూ ముసలామె లోపలికి వచ్చింది. అది రామన్న ఎప్పుడూ మరువలేదు. అప్పుడు ఆ ముసలావిడ రాకుంటే ఆ క్షణంలో ఆవేశంలో తను ఏమైనా అనేవాడేమో! ముసలావిడ ప్రవేశంవల్ల సన్నివేశంలో రసావేశాలకు భంగం కలిగింది. అందువల్లనే తనకు ధైర్యం వచ్చిందేమో! కుముదకు అప్పుడు చెప్పినమాట ఇప్పుడూ తనకు విడివడని సమస్యగానే అనుభవిస్తున్నాడు. పదిసంవత్సరాలయింది, ఆ చిక్కు విడలేదు.

కుముదను తను ప్రేమించగలడు, ప్రేమిస్తున్నాడు అనవచ్చు; అయితే సరళ స్మరణ సమసిపోయేంతవరకు కుముదమీద తనకి ప్రేమ అని ఎలా ధైర్యంగా చెప్పగలడు? ఆరోజు ఆ ప్రశ్నకు కుముదనే అడిగాడు. ఆమె సమాధానం విష్ఫురంగా వుంది.

'మీ ప్రేమ వద్దు. మీతో జీవితం వద్దు' అన్నది.

అయితే చివరకు వొప్పుకున్నది. తన ఇంట్లో వుపచారంకోసం వుండటానికి, ఒక్క షరతుమీద; ప్రసవం అయ్యేవరకు ఆవిడ మేనత్తఇంట్లోనే వుండేట్లు, ఆ తర్వాత తనదగ్గరికివస్తే తను ఆమెతో దాంపత్యజీవిత అధికారాన్ని చెలాయించకూడదు.

'ఒప్పుకున్నాను, సంతోషంగా వొప్పుకున్నాను' అన్నాడు.

ఒప్పుకున్నానన్నాడు. తనకే ఆశ్చర్యం. ఏ సందర్భం? ఏమిటి వొప్పుకుంటున్నాను?....చివరకు కొన్నిదృశ్యాలు స్మృతిపథంలోకివచ్చి - దీర్ఘంగా నిట్టూర్చి - కాళిదాసు మహాకవి అనేది వొప్పుకున్నాను అనుకున్నాడు.

# 7

'ఆరోజు వొప్పుకోవడం తప్పయింది' అన్నది కుముద ఎదురుగావుండే గోడతో. ఈరోజు తను భర్త సన్మానసమావేశంలో అతని నీడలా, అనివార్యంగా, ఈర్ష్య బడడం ఆనాటితప్పుకు తగిన ప్రాయశ్చిత్తం అనుకున్నది. ఎంతైనా స్త్రీ స్వభావం: మళ్ళీ అద్దంవైపు ముఖంతిప్పి కూర్చున్నది. ముఖం కనిపించాలి, చీర కనిపించ కూడదు అంటే ఎలా జరుగుతుంది పిచ్చిదానా - అని తన్నుతానే నిందించుకొంది. దాంపత్యంలోని అనుకూలాలు కావాలి, అననుకూలాలు అక్కరలేదు అంటే ఎలా? పెళ్లికిముందు తను ఎలాగైనా ప్రవర్తించనీ, యిప్పుడు పెళ్ళిఅయిన గృహిణి. 'మగనాలి-'! తిండికి బట్టకు కరువులేదు. సుఖపడేందుకు హక్కులేదు! ఆనాడే తను ధైర్యంగా ప్రవర్తించవలసింది.

లోపల పెరుగుతున్న బిడ్డకోసం తను మెత్తబడింది. అందుకని మొదట్లో ఆ బిడ్డమీద కుముదకు కోపం కలిగేది. రామన్నబిడ్డ - దాన్ని చూపినప్పుడంతా రామన్నను మరవడానికి లేదు. రామన్నను తలచుకొన్నప్పుడల్లా - ఇప్పటికీ శరీరం పులకిస్తుంది కుముదకు!

ఒకదృష్టితో చూస్తే తన ఆనందగోపురపు కలశం ఆ బిడ్డ.

'కుముదా, నీ వొళ్లు నిండుగా వుండడంచూస్తే నీకు మగబిడ్డ కలుగుతా డని పిస్తోంది' అన్నది ఒకరోజు ముసలావిడ.

'ఏది కావాలనో అలా జరుగుతుంది. అదేమన్నా మనచేతిలో వుండేదా అత్తా' అని తను కొంత పెద్దతనం పుట్టిపడేధ్వనితో అన్నది.

'హు....ఇప్పుడంటుంది ఎవరిచేతిలో పని అని?' అని ముసలావిడ తనని మందలించింది.

కుముద అప్పుడప్పుడు ఆలోచించేది, ఇదేవిటీ రహస్యం? మనుష్యుడు పూర్తిగా పరతంత్రుడు అని చెప్పేట్లయితే అతని జన్మనే చూడాలి. తనకు ఇది తెలిసిందా? ఇప్పుడడిగితే 'తెలుసు' అని చెప్పవచ్చు. నిజమే. అయితే అప్పుడు? అప్పుడు మరేదీ తెలియదు, దేనిమీద ఆశాలేదు, దేన్నిగురించిన స్పృహకూడా లేదు.

ఎంత ఆశ్చర్యం! ఇప్పుడు, జరిగిందంతాచూసి ఆలోచించి, లెక్కవేసి, సాధక బాధకాలను లెక్కించినతర్వాత రామన్నమీద కోపం. అయితే అత్త చెప్పేమాట నిజమైతే రామన్న అందరు మగవాళ్లవంటివాడా? లేక మగవాళ్లంతా రామన్నలాంటి వారా? ఆకలైనప్పుడు రుచి, పొట్ట నిండినతర్వాత నిద్ర. ప్రపంచం తీరే అంత. అయినా రామన్నదిమాత్ర మేమిటి తప్పు? తప్పు తనదికూడా. చేతులు కలిస్తేనే చప్పట్లు. బ్రతుక్కు రెండుప్రాణాలు కావాలి. కొత్త ఆకు చిగురు వెయ్యాలంటే పాత ఆకు రాలిపోవాలి. నిజం, అయితే తనొక్కతే ఎందుకని పాత ఆకు కావాలి? రామన్న ఎందుకు రాలిపోకూడదు?

క్రమేణ కుముదలో ఒకవిధమైన మార్దవం కలిగింది. రామన్న వ్యభిచారానికి మోసపోయిన అమాయకురాలు తను అనే ఆలోచన వెనక్కుపోయి ఒక కొత్త ప్రాణాన్ని సృష్టిలోతెచ్చి బ్రతికించి, పెంచే తల్లి తాను అనే ఆలోచన ఆమెను పుల కితురాలిని చేసింది. ఆ యోగ్యత తనలో వున్నదా అన్న అననుభవంవల్ల భయం, ఆ యోగ్యత తనలో చోటు చేసుకుంటున్నదనే నిత్యానుభవంవల్ల వుత్సాహం. తొడలు భారమనిపించేకొద్దీ సంతోషం; పుట్టేబిడ్డను కూర్చోపెట్టి, ఆడించి పెంచ డానికి ఆధారమైనశక్తి వాటికి కావాలికదా? ఒకొక్కమారు ఏదో చెప్పలేని వేదన హృదయంలో; కాదు, హృదయంలో కాదు, శరీరంలో. కానీ ఒక అవ్యక్తఆనం దాన్నిచ్చే బాధ అది.

పాపం! రామన్నని కోప్పడి ఏం ప్రయోజనం—అనుకునేది అప్పుడప్పుడు. ఎంతయినా పురుషుడు. క్షణికబుద్ధి, క్షణిక సుఖంకోసం లోభం! చిరంతన మాతృత్వసుఖపు అనుభవం మగవాడి కుండదు. అందరు మగవాళ్ళలాగానే రామన్న కూడా అనుకుని అతనిమీద కనికరం కలిగేది. అదే ఆలోచనాసరణిలో తనకు మగబిడ్డ కలుగుతాడనే నమ్మకం వుండబట్టి ఆ శిశువుపట్ల ఒక్కొక్కమారు దయ కలిగేది. అద్దంముందు కూర్చున్నప్పు డొకసారి గర్వంతో చిరునవ్వు ముఖంలో వెలిసేది. పిచ్చి భర్త! ఇలాంటి సౌందర్యంకోసం మోహపడడంలో ఆశ్చర్య మేముంది?

ఒక్కొక్కసారి సరళక్కవిగురించి ఆలోచించేది. పాపం! ఏ సుఖాన్నీ చూడ కుండా కృంగి కృశించి ప్రాణం విడిచిందికదా! ఇల్లు అంటే పిల్లలు జెల్లలు నిండి

వుండాలి అనేదామె. హుఁ....అప్పుడు తను ఎంత ముగ్ధగా వుండేది! ఒకరోజు-అక్కతో మాట్లాడుతుంటే తను అడిగినప్రశ్న ఎంత పిచ్చిది!

'చూడు, కుముదా, స్త్రీకి సుఖం అంటే తనది అనే యిల్లు, బొజ్జనిండా తిని అరిగించుకొనే భర్త, ఇంటినిండా తిరిగే పిల్లలు.'

'నీకు నీ యిల్లు వుంది___'

'తినేది జ్ఞాపకం వుంటేమాత్రం, తిన్నదాన్ని అరిగించుకొనే భర్త వున్నాడు' అని సరళక్క నవ్వుతూనే చెప్పింది.

'అయిందికదా, ఈరోజు కాకుంటే రేపు బిడ్డలూ పుడతారు.'

తనమాటకు అక్క దీర్ఘంగా నిట్టూర్చి పడుకునే ఇంటివాసాల్ని లెక్కపెడుతూ చూస్తూ మౌనం వహించింది.

'ఆ తర్వాత___'

'పిచ్చిదానివి నువ్వు' అన్నది అక్క.

తనకేమీ తెలియలేదు. భర్తవుంటే పిల్లలు పుట్టితీరాలి అనేదాన్ని సిద్ధాంతంగా తను అనుకున్నది.

'పిచ్చిదానివి నువ్వు, కుముదా, ఈ జబ్బునుంచి నేను కోలుకోవడమే కష్టం-'

'అక్కా!'

'ఒకవేళ కోలుకున్నానే అనుకో. అప్పుడూ బిడ్డలసుఖం నాపాలిట లేదు.'

'ఎందుకని?'

సరళక్క కిలకిల నవ్వింది. ఆ నవ్వువల్ల ఆమె ముఖం అలసిపోయి మరింత మనోహరంగా కనిపించింది.

'ఎందుకు-అని? ఎందుకు-ఏమిటి-అనేదంతా రేపు నీకే తెలుస్తుంది పెళ్లి అయిన తర్వాత,' అన్నదక్క.

అంటే? పెళ్ళి అయినా బిడ్డలు పుడతారని నమ్మకం లేదు. ఆడది తల్లి అవుతుంది - అనే నమ్మకమూ లేదు! ఈ రహస్యం యేమిటో - తెలియలేదు అప్పుడు తనకు.

అప్పుడు తెలియలేదు. ముందు తెలియనూ ఆలస్యం కాలేదు.

బుద్ధి వున్నప్పుడు తెలియలేదు. బుద్ధిని పోగొట్టుకొన్నతర్వాత తెలిసింది!

ఎంత వుద్విగ్నమనస్కురాలైనా కుముదకు ఆ జ్ఞాపకాలవల్ల హృదయంలో కొత్త చైతన్యం కలిగినట్లయింది.

బుద్ధిని పోగొట్టుకున్నతర్వాతే తెలిసింది.

కుముదకు ఇప్పటికీ ఆశ్చర్యం. అప్పటి తన మనఃస్థితిని తలచుకొని. ఒక కాలం వుండేది. అప్పుడు రామన్నను చూస్తూనే, రామన్నను తలచుకొన్నంతవే బుద్ధి తనవశం తప్పిపోయేది. ఎందుకు అలా అవుతుండేదో! అందరికీ అలాగే అవుతుందా అనేదాన్నిగురించి కుముదకు నిశ్చయమైన భావనలేదు. తనకుమాత్రం అలా అయ్యేది. బుద్ధి, దేహం రెండిటిమీదా వశం తప్పేవి. యోగులమాటను చెపుతారు కదా? ప్రత్యక్షంగాలేనిది వాళ్ళకు కనిపిస్తుందట. శరీర సుఖదుఃఖాల జ్ఞానం వాళ్ళకు వుండదట. మోహనుడి తల్లి అయే అర్హతను సంపాదించేముందు తనూ అలాంటి యోగసిద్ధిని సంపాదించిందేమో!

తనకు ఇంకా జ్ఞాపకం వుంది. ఒకరోజు జరిగిన సంఘటన. ఆరోజు తన కథ ముగిసిందనే అనుకుంది. తన రహస్యం సరళక్కకు తెలిసిపోయిందనుకుంది. ఆనాటి తన అనుభవం తర్వాత తనకే ఆశ్చర్యం కలిగించింది.

జరిగింది చిన్న సంభాషణే. రాత్రి 9 గంటలై వుండవచ్చు. రామన్న బయటికి వెళ్ళినవాడు ఇంకా రాలేదు. తనూ అన్నం తినలేదు. సరళక్కా పాలు తీసుకో లేదు. అక్క అంతసేపు వూరకుండడం ఎప్పుడూ లేదు. ఒకటి రెండుసార్లు గట్టిగా చెప్పింది—

'అక్కా, నీకు పాలు తెచ్చియిచ్చేదా?' అని.

'నాకేం అవసరం? ఆయన రానీ భోజనం కానీ.'

'నేను కూర్చొనుంటానక్కా. ఆయన వచ్చేంతవరకు—'

'నేనూ కూర్చొనుంటాను. నాకైనా యేం పనివుంది?'

'కూర్చో. అయితే పాలు తీసుకొని—'

'వుండనివ్వవే, కుముదా! నేనేమీ ఆకలితో చచ్చిపోనులే!' అని సరళక్క కొంత విసుగ్గానే అన్నది.

కొంతసేపయింది. అయినా రామన్నా రాలేదు. తన కేమనిపించిందో ఏమో! 'అక్కా పాలు తెస్తాను' అని లేచింది.

'వద్దని చెప్పలేదటే? నే నొక్కదాన్నే—'

'నేనూ ముగిస్తాను, అక్కా.'

సరళక్క తనమాట అపార్థం చేసుకుంది.

'అయ్యో! పిచ్చిదానా! నిన్ను ఎవరు తినొద్దన్నారు? నేను నీకు ఎంతసేపట్నుంచి చెపుతున్నాను. ఇంకా పెరిగేపిల్లవు నువ్వు, ఆకలి చంపుకోకూడదు అవి. ఆకలైతే నువ్వు అన్నం తినెయ్యి. నేను కూర్చొనుంటాను.'

'అలాకాదు, అక్కా. నేను ఆకలి అయిందనలేదు. ఆయన బయట అనుకోకుండా ఎవరిఇంట్లోనైనా అన్నం తింటూవుంటారు.'

'అంటే? ఎప్పుడు చెప్పారు?'

'ఎప్పుడైనా చెప్పనీ. అందుకే అన్నాను, ఇద్దరం పూర్తిచేద్దాం.'

'ఏవిటో-ఏవిటో! ఎప్పుడు చెప్పారో ఏవిటో!' అని సరళక్క అసహనంగా గొణిగింది. తను అక్కకు పాలు తెచ్చియిచ్చి లోపల భోజనానికి అంతా సిద్ధం చేసింది. సిద్ధం చేసేటప్పుడే బయటినుంచి ఎవరిదో మాట వినిపించినట్లయింది. ఆగి విన్నది. బయట ఎవరూ లేరు, అయినా తను విన్నది నిజం అనిపించి భోజనం సిద్ధంచేయడం ఆపింది. కొంతసేపటి తర్వాత బయటికి రాగానే—

అయ్యో! ఇంత త్వరగా భోజనం అయిందటే, కుముదా?' అన్నది.

'లేదు. అన్నం సిద్ధం చేశాను. అంతలో ఏదో మాట వినిపించినట్లయింది.'

'ఎవరిమాట?'

'ఎవరూ లేరు, అయినా మాట వినిపించింది—'

'అంతలోనే లేచివచ్చావా? పో. ఇక్కడికే తీసుకురా నీ విస్తరి, ఒక్కదానివే లోపల కూర్చునేదానికంటే.'

'లేదు, నేను మరికొంత సేపు చూస్తాను.'

'ఆయన ఎక్కడో అన్నంతిని వస్తారని చెప్పావుగా?'

'అవును, అక్కా. అయితే అంతలోనే మాట వినిపించిందన్నానుగా?'

'అంటే? ఆయనే యింటికివచ్చారు, నాకు తెలీకుండా అంటావా ఏం?'

'లేదక్కా, స్నేహితులు బలవంతంచేసి భోజనానికి పిలుచుకువెళ్ళారేమో? ఈయనా బయలుదేరినవాడు 'చాలా ఆలస్యం అవుతుంది, నేను యింటికి వెళ్తాను' అని చెప్పి యింటికి బయలుదేరారని—'

'కడుపులో ఆకలికి కళ్లు మసకలు కమ్మాయి నీకు' అని అక్క నవ్వుతూ వుండగానే వీధితలుపు శబ్దమైంది. తలకు కొంగు చుట్టుకొని తలుపుతెరిచి, లోపలికి పరుగెత్తి వచ్చింది. ఎందుకో ఏమో! గబగబ కొట్టుకుంటున్నది గుండె. వంటయింటి వరండాలోంచే వింటూ నిలుచున్నది.

రామన్న రాగానే అటూ ఇటూ చూసి, 'ఓహో! మందు-పాలు తీసుకునేశావే? మంచిదయింది! మీ రెక్కడ నాకోసం కాచుక్కూర్చుంటారో అని అనుకున్నాను.'

'మీ భోజనం అయిందా?' సరళక్క అడిగింది.

రామన్నకు సందర్భమే అర్థం కాలేదేమో? 'ఏమన్నావు?' అన్నాడు.

'కాదు, ఎవరో స్నేహితులు బలవంతంచేసి పిలిచారని—'

'ఆఁ! నీకు ఎవరు చెప్పారు?'

'కుముద చెప్పింది.'

'ఆమెకు ఎవరు చెప్పారు?'

'ఎందుకు? మీరే చెప్పలేదా వెళ్ళేటప్పుడు?'

రామన్న తికమకపడినట్లు చూశాడు. తనని వెతుకుతున్నాడేమో! సరళక్కనూ ఎగాదిగా చూస్తూ నిలుచున్నాడు.

'ఏమిటి? ఏమైందిప్పుడు? ఎక్కడో వొకచోట భోజనం అయిందికదా!'

అక్కమాటకు రామన్న గట్టిగా నవ్వాడు.

'మీ రిద్దరు ఆడవాళ్ళూకలిసి ఆలస్యంగా వచ్చినందుకు నాకు వుపవాసశిక్ష ఇవ్వా

లవి ఇలా చేసినట్లుంది. అయితే నేను తప్పు వొప్పుకుంటాను. ఎందుకంటే ఆకలి అవుతున్నది.'

'ఆకలి అవుతున్నదా? అంటే స్నేహితుడింట్లో భోజనం—?'

'ఆ పుణ్యాత్ముడు చాలా బలవంతం చేశాడు. నేను వొప్పుకొని సగందూరం వెళ్ళాను. అయితే అంతలోపల నా కనిపించింది ఇది అంతా అయ్యేసరికి ఎంత ఆలస్యం అవుతుందో ఏమో - అందుకే మధ్యలోనే అతనికిచెప్పి వచ్చేశాను. హహ!'

'అంటే-మీ భోజనం కాలేదు?' సరళక్క చాలా ఆశ్చర్యపడినట్లు అడిగింది. రామన్న తల పంకించాడు.

'మొదట బలవంతానికి వొప్పుకున్నారు. ఆ తర్వాత ఆలస్యమవుతుందని తిరిగి వచ్చారు!' సరళక్క అదే ధ్వనితో తనలో తనే మాట్లాడుకునేట్లు అన్నది.

ఆ తర్వాత సంభాషణ వినడానికి తను నిలవలేక రామన్నకు భోజనం సిద్ధంచేసి తప్పుకున్నది. ఆ రోజు సరళక్క, రామన్న ఇద్దరూ తననిచూసే చూపుల అర్థం గ్రహించింది. బయట జరిగినసంగతి తను సరిగ్గా చెప్పడం ఎవరూ నమ్మరు. నమ్మకుండా వేరే గత్యంతరమూ లేదు. అంతెందుకు? తనే నమ్మలేదు. అయినా తనకు స్నేహితులు బలవంతం చేయడం, రామన్న తప్పించుకు తిరిగిరావడం రెండూ స్పష్టంగా వినిపించినట్లయింది. తను ఊహించిందే నిజమైంది. తనుకూడ నమ్మలేనిమాట అది. తనూ నిజంగా నమ్మేదికాదు. ఆ మరో సంఘటనా జరిగి వుండకపోతే.

ఆ రెండవ సంఘటనవల్లనే తన మనస్సు చెల్లాచెదరై పోయింది. తనకు భయమూ కలిగింది. ఇదేమిటో ఒక మోసం లేక పిశాచాలాటగా వుంది - అన్నది తన భయం. ముందు రామన్న రాత్రి భోజనంవిషయమై జరిగినవిషయంగూర్చి తనకు ఆశ్చర్యంకలిగినా కొన్నిరోజులలో అది మరిచిపోయింది. అక్కకు రామన్నకు ఇద్దరికీ ఆశ్చర్యంకలిగినా వాళ్ళూ దాన్ని మరిచిపోయారు. తర్వాత కొన్ని రోజులు 'ఈ రోజు భవిష్యం ఏమిటి?' అని తనని నవ్వుతూ పీడించేవారు.

ఒకరోజు పొద్దు వాటారే సమయం. తను అక్కతో మాట్లాడుతూ కూర్చున్నది. రామన్న ఏదో వొకపుస్తకం తీసుకురావడానికి త్వరత్వరగా బయటపడ్డాడు.

'ఇప్పుడే వస్తాను నేను. ఒకవిషయం కావలసివచ్చింది. సందర్భం చూసు కొందామంటే పుస్తకమే లేదు. దాన్ని తీసుకోగానే వచ్చేస్తాను' అని త్వరత్వరగా బయటికి వెళ్ళాడు.

నాలుగయిదునిమిషాలు తను అక్కతో మాట్లాడి లేచింది. లేవగానే 'అయ్యో యొయ్యో!' అని బాధ కలిగిందానిలా కుడికాలు పట్టుకొన్నది.

'ఏవిటి? ఏమైంది కాలికి?'

'జారిపడ్డాను.'

'ఏమన్నావు?' అన్న అక్కమాటకు తనకు స్పృహ వచ్చినట్లయింది. తబ్బిబ్బయి అక్కను చూస్తూ నిలుచుంది.

'పగటికలలు కంటున్నావా ఏవిటీ, కుముదా?' అని అక్క నవ్వుతూనే అడిగింది.

'లేదక్కా. నిజంగా జారిపడి కాలికి దెబ్బతగిలి చాలా నొప్పిపట్టినట్లయింది వొక్కసారిగా' అని కాలు పట్టుకొని చెపుతుంటే దెబ్బా తగల్లేదు, బాధా కలగలేదు అని తనలాగే అక్కకూ తెలిసింది.

'సరే, దీనికి నీకు త్వరగా మందు ఇప్పించాలి' అని అక్క నవ్వుతూండగానే ఎవరో 'తలుపు తియ్యండి' అన్నారు.

తలుపు తెరవగానే రామన్న, మరొకరి భుజాలమీద చేతులేసి నిలుచునివున్నాడు. త్వరగా వెళుతుంటే జారిపడి కుడికాలికే దెబ్బ తగిలించుకొని వచ్చాడు!

ఆ రోజునుంచి కుముదకు పూర్తిగా నమ్మకం కలిగింది. ఎందుకిలా అవుతున్నది అన్నది తెలియకపోయినా రామన్నవిషయమై తనకు కలుగుతున్న అనుభవాలవల్ల తను పూర్తిగా రామన్నకు వశమైంది అన్న నమ్మకం కలిగింది.

ఎన్నోసార్లు అనుకుంది. ప్రేమ అంటే యిలా వుంటుందా? ప్రేమించేవస్తువు మీద యింత ఆత్మీయత ఏర్పడుతుందా? తనదేమో అలాంటి అవస్థే అయింది. కడుపులో బిడ్డ రూపు దాల్చడానికి తను ఈవిధంగా యోగాభ్యాసం చేయవలసి

వచ్చింది. మాతృత్వం అంటే కామతృప్తికి శిక్ష కాదు, సంభోగమదంయొక్క ఆయాసఫలం కాదు, స్త్రీ పురుషుడుకూడిన చెడ్డ పరిణామం కాదు, ఏ వాస్తవిక కారణంగా పుట్టిన కార్యం కాదు. రెండుహృదయాలు ఒకటైన బాహ్యసంకేతం - ఆ మాతృత్వం ప్రభావంవల్లనే ఆనాడు తను వొప్పుకుంది, గర్భం తాల్చగానే మళ్ళీ రామన్నతోనే వుండను అన్నది. దాంపత్యజీవితంమాత్రం వీలులేదనీ మొండిగా షరతు పెట్టింది.

అలా వొప్పుకోకుండావుంటే బాగుండేదేమో అనిపిస్తుంది అప్పుడప్పుడు. తర్వాత ఆ చీర ప్రసంగం వచ్చినప్పుడుమాత్రం 'వొప్పుకున్నది తప్పు' అనిపించింది.

'నేను వొప్పుకోకుండా వుండవలసింది' అన్నది. గబుక్కున చుట్టూ చూసింది. ఏదో మాట్లాడానుకదూ నేను? వొప్పుకోకుండా వుండవలసింది అన్నానుకదూ? చేతిగడియారాన్ని చూసుకొన్నది, జ్ఞాపకం వచ్చింది. ఈ రోజు ఈయనతోగూడ యీాయన సన్మానసభకు పోవడం వొప్పుకోకుండా వుండాల్సింది అనే ఆలోచనవల్ల తన నోటినుంచి అలాటిమాట వచ్చిందేమో అని స్థిమితపడి లేచింది. 'ఈ పిల్ల వాడిస్వభావం నాకు తెలుసు. ఆడుకోవడానికివెళితే మరేధ్యాసా వుండదు. ఎన్ని సార్లు చెప్పాను, ఈ రోజు సభకు పోవలసివుంది, త్వరగా ఇంటికి రా' అని. ఇంకా అయిపులేడు. వీడు వచ్చేదెప్పుడు, తయారయ్యేదెప్పుడు? అని మరోసారి గడియారం చూసుకొంది. 'అబ్బ! ఇంక అర్ధగంటమాత్రమే వుంది బయలుదేరడానికి' అని కలవరపడుతూ వాకిట్లోకివచ్చి మోహనుణ్ణి ప్రతీక్షిస్తూ నిలుచుంది.

# 8

'ఇంకా అరగంట! అబ్బ! పొద్దే పోదు' అనుకున్నాడు రామన్న చేతిగడియారాన్ని చూసుకొని. ఛీ! ఎంత పిచ్చివాణ్ణి నేను! ఏళ్ళకొద్దీ జ్ఞాపకాలను నెమరు వేసుకుంటున్నా పొద్దేపోదు - అంటున్నాను! పోనీ - ఈ రోజుటి సన్మానసభ మాత్రం స్మరించుకొనేవిషయం కాదుగద, అందుకోసం తను వేచివున్నాడు. తను రచయిత కావడంవల్ల అందరిముందు సన్మానం తనకు. వయస్సు 45. నిజంగా

అభిమానం కలగవలసినమాట. ప్రజాప్రభుత్వంవుండే యీ కాలంలో ప్రజలే తనవి సత్కరిస్తున్నారు. నిజంగా గర్వపడవలసినవిషయం. అయినా దాన్నిగూర్చి తనకు ఎలాటి వుత్సాహమూ లేదే? ఎందువల్ల? ఎందువల్ల ఏమిటి? ప్రపంచమంతా మోసం - క్షమించాలి, అది సౌజన్య మనిపించుకోదేమో?- ప్రపంచమంతా మాయ. హుం! మోసం అంటే మొరటుగా వుంటుంది, మాయఅంటే తత్త్వజ్ఞానం, ఇక్కడుంది సాహిత్యశక్తి. అయినా యింట్లో ఆలోచించేటప్పుడు 'మోసం' అనేశబ్దాన్నే వాడవచ్చుకదూ? మోసం, తనసాహిత్యమే మోసం, ఈనాటి సార్వజనిక సన్మాన సభ మోసం. తనసాహిత్యం ఎలాంటిది? ఇప్పటి తను ప్రవర్తన, జీవితం - ఇలాంటివిషయాలను రాశాడా తను? ప్రేమగల భార్య - ఒకావిడ, శారీరికసంబంధంగల భార్య ఒకావిడ. ఆ కథను రాశాడా తను! చెప్పడానికి భాషలేదు, శక్తి లేదు, ఔచిత్యంలేదు! చెబితే వినేవాళ్ళు తెలుసుకుంటారా?

పిచ్చివాడు! పిచ్చివాడు! జనం తెలుసుకుంటారనే ఆత్మవిశ్వాసంతో ఇన్ని సంవత్సరాలు 'నీదే అయినశైలిలో 'విచార పరిప్లుత, విచారప్రచోదక' వుపన్యాసాలను ఎన్నిటినిచేశావో గుర్తువుందా? సాహిత్యకృతుల నెన్నిటిని వ్రాశావు? సమాజం ముందుకుపోయిందా నీ 'సేవ' వల్ల?

మోసం! ప్రపంచమంతా మోసం. నిజమైనదేమిటంటే వొకటే - మన పాశవికప్రవృత్తితోకూడిన జీవితం. భర్తృహరి చెప్పినట్లుగా, ఆహారం, నిద్ర, భయం, మైథునం - ఇదే నిజమైన జీవనం. మనుష్యుని సహజజీవనం యీ పనులతోటే. మిగిలినదంతా కృతకం, మోసం; కొంతకాలం ఈ పనులను వెనక్కినెట్టి మనల్ని మనమే 'సుసంస్కృతులము' అనుకుంటూవుంటాము; ఒకరోజు ఒత్తిడికి తట్టుకోలేక యుద్ధం, వ్యభిచారం, దోపిడీలతో వెనకటి నిగ్రహాన్ని తృప్తిపరచుకుంటాము; అప్పుడు క్షణకాలం సిగ్గు, ముఖానికిముఖం చూపలేక, వెన్నుకు వెన్ను తగిలించి బ్రతుకుతాము. 'సుసంస్కృతు'ల మవుతాము; ఆ తర్వాత మళ్ళీ - ఆ తర్వాత మళ్ళీ—

నీ చైర్గచ్ఛత్యుపరిచ దశాచక్రనేమిక్రమేణ.

ఈ రోజు సభలో ఇదేవిషయాన్నిగూర్చి మాట్లాడితే? ఓ-సన్మానపత్ర సమర్పణ

ఒకటి వున్నదికదూ? విధి క్రూరమనేది యిందుకే. నా సాహిత్యసేవనే కాదు, నా ఆదర్శదాంపత్యాన్నికూడా పొగడివున్నారు సన్మానపత్రంలో!

ఎంతటి ఆదర్శం! పది సంవత్సరాలయింది 'దాంపత్య' మనేది మరిచిపోయి; పది సంవత్సరాలయింది సంసారనాటకాన్ని ముగించి.

అయినా యీరోజు సభకు నాతో రావడానికి కుముద వొప్పుకున్నది కదా! ఆశ్చర్యం! వెనకటి కొకసారి యిలాగే వొప్పుకున్నది ఆశ్చర్యకరంగా, మోహనుణ్ణి కన్న తరువాత యింటికి వచ్చింది. ఆఁ....ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది, చీరసంగతి ఆ తర్వాత మోహనుడి మొదటి పుట్టినరోజుపండుగ. ఆ రోజూ వెళ్ళిపోయింది కదూ? నాతో వుండడానికి ఆవిడ వొప్పుకున్నా వొప్పందంప్రకారం తను బ్రహ్మచారిగా ప్రవర్తించినా బయలుదేరి వెళ్ళింది. ఇప్పుడూ అలాగే చేస్తే! సన్మానసభ వాళ్ళు పిలవడానికి వచ్చేలోపల వెళ్ళిపోతే?

రామన్నకు గాభరా కలిగింది. మెల్లిగా కిందికి దిగే మెట్లవద్ద నిలుచుకున్నాడు. క్రింద ఇంకా కుముద అలికిడి వినపడుతున్నది.

ఛీ! ఎంత అధీరప్రవృత్తి కలవాడయ్యాడు తను!....ఓ-మరో ఆలోచన. మోహనుడు ఇంట్లో లేడు, వాడినివదలి ఆమె పోలేదు.

మోహనుణ్ణివదలి తనూ వుండలేడు, మోహనుణ్ణివదలి కుముదా వుండలేదు; అందువల్ల తాను-కుముద వొకరినివిడిచి మరొకరు వుండలేరు.

భలే! ఇదొక లెక్క-అంటూ మళ్ళీ పైకి నడిచాడు.

ఒకేవస్తువుకు సమానమైన రెండువస్తువులు పరస్పరం సమానంగా వుంటాయి.

ఒకేజీవితానికి అంటుకొన్న రెండు ప్రాణాలు పరస్పరం అంటుకొని వుండాలి కదా?

భవభూతికూడా చెప్పాడు. 'ఆనందగ్రంథిరేకోయం అపత్యమితి బధ్యతే' అని; భార్యాభర్తలను ఒకటిగాకూర్చే ముడి బిడ్డ అని.

మోహనుణ్ణి తీసుకొని మేనత్త యింటినుంచి మొదటిసారిగా కుముద వచ్చినప్పుడు తనూ అలాగే అనుకున్నాడు. వాడివల్ల తనతో మాటలాడుతుంది, మేనత్త

యింట్లో వాడిచేష్టల్ని వర్ణిస్తుంది. తను బిడ్డ నాడించేటప్పుడు గర్వం-సంతోషం కలుగగా తనని చూస్తుంది; క్రమేణ తన కనిపించింది తమలోని వైమనస్యం దూరమై తనూ కుముదా-తనూ కుముదా-ఏమిటి?

ప్రేమ సంసారాన్ని గడపవచ్చుననా? కాదు - ఆవిధంగా తనకు ఆలోచనే రావడంలేదు. తనూ కుముదా మొదటిలాగా వుండవచ్చు అనే ఆశ పుట్టింది. మొద టిలా ఎందు కుండకూడదు అని - ఒక్కసారి ధైర్యంతెచ్చుకొని ఆమెను అడ గనూ అడిగాడు:

'మొదటిలాగా అంటే?' అని కుముద సవాలుచేసింది.

'కాదు-అంటే-వూరక ఇలా వుండేదానికంటే-అని అన్నా.'

'ఇలాగంటే?'

'కాదు-ఏమీ యిది లేకుండా-అంటే-'

'ఇప్పుడేం తక్కువైంది మీకు?'

'తక్కువని కాదు-అంటే-వూరకే అంటే-ఒక్క యింట్లోనేవుంటూ-ఎందుకు-'

'కావాలంటే వొక్కయింట్లో వుండవద్దు.'

'ఛీ! ఛీ! అలా అనలేదు నేను-'

'కాకుంటే ఏమిటి మీరనేది?'

ఎలా అంటున్నాడో, ఏమంటున్నాడో! అయితే మళ్ళీ ఆ ప్రసంగమే రాలేదు. ఇలాగంతా సంభాషణ జరుగుతుంటే వొళ్లోవున్న బిడ్డ - మోహన్ - తనదగ్గరికి రావడానికి ప్రయత్నిస్తున్నాడు. కుముద అభ్యాసబలంవల్లనో ఏమో బిడ్డను గట్టిగా పట్టుకొని కూర్చోపెట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నది. బిడ్డ మొండితనం ఎక్కు వైంది. కుముద కొంత బలంగానే బిడ్డను ఆపిందో ఏమో - బిడ్డచేతులు ముందుకు చాచి ఏడ్చేసూచన చేశాడు. రామన్నకు ప్రాణం నిలిచినట్లయింది. ఇంతవరకు జరిగిన సంవాదం, సంభాషణ ఏవిధంగాను తను తలచినట్లుగా సాగలేదు. అడగా లని మొండితనంతో ఆలోచించిపెట్టుకొన్న మాటలన్నీ సర్వనామాలైపోయాయి. చర్చను ముందుకెలా సాగించాలి అనేదే తెలియకపోయింది. ఇలా అయి ముందుకు చేతులుచాచి తనదగ్గరికి రావాలనేబిడ్డ ఆపత్తునుంచి తనని తప్పించడానికి వచ్చిన

పరమాత్ముని అవతారమా అనిపించింది. శ్రద్ధతోగూడిన భక్తునిలా తనూ ముందుకు చేతులు చాచాడు, బిడ్డను ఎత్తుకోవడానికి. చిన్నపిల్లలకు అదెక్కడినుంచి వస్తుందో కుంటరిబుద్ధి? ఇంతవరకు తనదగ్గరికి రావాలని మొంకికెత్తిన పిల్లవాడు, తను చేతులు ముందుకు చాచగానే కూర్చున్నచోటె వాళ్లమ్మను రెండుచేతుల్తో గట్టిగా పట్టుకున్నాడు. వాడు అలా చేస్తాడని తెలీక, వాణ్ణి ఎత్తుకోవడానికి వెళ్ళిన తన చేతులు, బిడ్డచేతుల్ని తల్లినుంచి వేరు చేసేటప్పుడు——

జ్ఞాపకం రావడంతో యిప్పటికీ శరీరం వణుకుతున్నది. అప్పుడు కలిగిన విద్యుత్ప్రసారంసుఖం అతనికి అంతక్రితం మెప్పుడూ అనుభవం కాలేదు. ఒక్కక్షణం, కాదు, కాదు, పదింతలు-కాదు-నూరింతలు, కనురెప్పలు కొట్టుకునేంత అల్పకాలంలో తనశరీరంలో, కుముద శరీరంలో, తననుంచి ఆమెలోకి, ఆమెలోంచి తనలోకి విద్యుత్ప్రసారమే కాదు, ఆ అనుభవాన్నిగూర్చి ఒకరినుంచి మరొకరికి సందేశం, ఆ సందేశానికి వొకరినుంచి మరొకరికి జవాబు. ఆ జవాబుకు ఇద్దరి వొప్పుదల - ఇంతేకాకుండా ఇంకా ఏమేమో జరిగివుండాలి. అంతసేపు బొమ్మల్లాగా తా మిద్దరూ నిలుచున్నారు.

ఎన్నియుగాల, ఎన్నిజన్మాల అనుభవం ఆ క్షణాంశంలో మెరిసిపోయిందో! రెండుప్రాణాలు సృష్టి తమకు వొప్పించిన కర్తవ్యభారాన్ని, లోతును, జ్ఞానాన్ని ఆ క్షణకాలంలో అనుభవించాయి. ఇరువురి శరీరాలు అకస్మాత్తుగా ఒకదాన్నొకటి తాకి రెండూ లేనట్లయిపోయాయి.

రామన్న నవ్వాడు, అత్యంతనిరాశతో - ఆ రోజు జ్ఞాపకంవల్ల, దాన్నిగూర్చి నేడు తన ఆలోచనలవల్ల. రెండుశరీరాలు తమ్ము తాము మరిచాయని తన సాహిత్యశక్తి కల్పించి చెప్పనీ; నిజంగా జరిగింది ఒకేదేహం తన్ను తా మరిచింది. తనకు స్పృహవచ్చింది అనేంతలో కుముద అక్కడ లేదు.

అయినా రామన్నకు ఆనందమే అనిపించింది. ఆ వొక్కక్షణం అనుభవంలో వెనకటి చాలానెలల మానసికయాతనను మరచిపోయాడు, కాదు-పోగొట్టుకున్నాడు. అప్పుడు మరొక ఆలోచనకూడా వచ్చింది. ఇన్నినెలలవరకు కుముద ఆవిధంగా సహాయనిరాకరణ చూపించి, చివరికి సహకారం ఇవ్వకుండానే తనతోవచ్చి వుండటానికి ఎందుకు వొప్పుకున్నది అన్న ఆలోచన అప్పుడతనికి కలిగింది.

మొదటిలాగా కుముద ఆనాటికీ తనని ప్రేమిస్తున్నది?

దాన్నిగూర్చి రామన్నకు అనుమానమే లేదు. ఆమెని సోకిన అతనిచెయ్యి ఆ నమ్మకాన్ని ఇచ్చింది. ఎంత చమత్కారముంది సృష్టిలో! దేహం జడమనుకుంటాము! అయితే అదే దేహం ఒక అత్యంతసూక్ష్మమైన, అత్యంతగహనమైన అనుభవాన్ని ఎంత స్వల్పంలో సులభంగా తెలియచెప్పింది అనేది తలచుకుంటే దేహాన్నిగూర్చి మనకున్న కల్పన తప్పనిపించింది. దేహం నశ్వరమేమో నిజం. అయితే జడం కాదు.

ఆ రోజు తన చేతిస్పర్శకి కుముద ఎలా సమాధానం చెప్పింది? క్రియ - ప్రతిక్రియ న్యాయం ప్రకారం తన చెయ్యి తాకగానే ఆమెదేహం బిరుసుగా సీలగకుండా ఎంత మృదువయిందంటే ఆమె దేహమే తనచేతిలో ఇమిడిపోతుందేమో అనిపించింది. చలి సుఖాన్ని అనుభవించేవాడు ముద్ద ముద్దయి దుప్పటిలో వొదుగుకున్నట్లు కుముద శరీరమంతా తన అరచేతిలో వొదిగిపోతుందేమో అనిపించింది.

ఆ రోజు విశ్వాసం రామన్నకు ఇప్పటికీ మిగిలివుంది. ఆవిడ తనతో ఎంత దూరంగా వుందో అంతదగ్గర వున్నది అని అతని నమ్మకం. ఒకటి రెండుసార్లు ప్రతిఘటించి మరింత దూరం పోవడానికి ప్రయత్నించినా రబ్బరుదారానికి కట్టిన చెండులా మళ్లీ దగ్గరకే వచ్చింది.

కుముద తనని ప్రేమిస్తున్నది!

ఈనాడు ఆవిడ సన్మానసభకు వొప్పుకోడమూ అందువల్లనే.

ఎవరు చెప్పగలరు? ఈ రోజు సన్మానవైభవాన్నిచూసి ఆమె హృదయం కరిగినా కరగవచ్చు.

ఆ ఆశతో రామన్న చేతిగడియారాన్ని చూసుకున్నాడు. ఛీ, ఇంకా ఎంతలేదన్నా; అరగంట! త్వరగా రాకూడదా? ఛీ! మన మనుషులకు సమయప్రకారం ప్రవర్తించడమే తెలియదు, అని గొణుగుతూ కిటికీదగ్గరికి నడిచాడు. ఏమైనా కనపడవచ్చునే. ఆశతో.

# 9

మోహనుడి రాకను నిరీక్షిస్తున్న కుముదకు ఒక్కసారిగా భయమేసింది. వీధిలో ఎక్కువ సద్దుకూడా లేదు. సాయంకాలమైంది. ప్రతిప్రాణీ ఇంటికి చేరు కునేవేళ. మనుష్యుడుమాత్రం అన్నిప్రాణాలకూ అతీతమైన ప్రాణి - అనే ఆలో చనవచ్చి ఆమె ముఖంలో చిరునవ్వు మొలిచింది. మనుష్యుడి నాగరకజీవితమంటే సృష్టినియమానికి విరుద్ధమైన జీవితం. ప్రతిప్రాణి యింటిని చేరుకోవాలనుకునే ఈ సాయంకాలసమయంలో నాగరీకుడు ఇంటినుంచి బయటపడతాడు! విక్షిప్త ప్రాణి! తన మోహనుడింకా విక్షిప్తుడు.

తండ్రిలాగానే కొడుకు! మనస్సుకు తోచినట్లు నడచుకుంటాడు. నేను రమ్మ న్నప్పుడు వస్తాడా? వస్తాడు, ఇంక ఆకలైతే-అంటూ మళ్ళీ లోపలికి నడిచింది కుముద.

ఆకలైనప్పుడు వస్తాడు - అనేప్పుడు మరొక ఆలోచనవచ్చి కుముద తనలో తనే నవ్వుకుంది. తండ్రిలాంటి కొడుకు. మనస్సులో ఏదైనా పడిందంటే మరొ కరి లెక్కలేకుండా దాన్ని జరిపే మొండితనం. రామన్న అలాగే.

ఎంత మధురమైన జ్ఞాపకాలున్నాయి తనకు! ఇప్పటికీ తాను రామన్న సాన్ని ధ్యాన్ని కోరుతున్నది అందుకోసమే. ఎన్నిసార్లు నిశ్చయం తీసుకోలేదు? రామన్నకు తనమీద ప్రేమ అనే నమ్మకం లేదు; రామన్నకు తనమీద ఆదరముందనే నమ్మకం లేదు; రామన్న ఇంట్లో, రామన్న మనస్సులో తనంటే మన్నిక వున్నట్లూ లేదు; తనంటే పశ్చాత్తాపం రామన్నకు. ఇదంతాతెలిసీ తను ఇక్కడే వున్నది. అదొక కఠిన తపస్సులాగుంది, రామన్నతో వుండికూడా రామన్నకు దూరమైవుండడం. అయినా తను మిగిలేవున్నది.

రామన్న అవతారమే మోహనం! కాదు - రామన్నతో తను బ్రతికిన సుఖాను భవపు ప్రతీకే మోహన్. అందుకే మోహనుడిమీద తనకింత మమత వుండివుండ వచ్చు? మాతృత్వ మమతకు నిస్వార్థదృష్టి వుంటుందని చెపుతారు. తనదిమాత్రం అలా కాదనే ఆలోచన అనేకమార్లు కుముదకు వచ్చేది. మోహనుణ్ణి తను ప్రేమిం

పడం మోహనుడికోసం కాదు. మోహనుడిలోవుండే రామన్న పోలికలకోసం. అందుకే మొదట మొదట మోహనుణ్ణిచూస్తే ఒక్కొక్కసారి ఎక్కడలేని కోపం వచ్చేది. పాపం! వేరొకరిమీద కోపంవల్ల మోహనుణ్ణి ఎన్నిసార్లు కొట్టలేదు తను!

ఒక్కసారిమాత్రం - దాన్నెప్పటికీ మరవలేదు కుముద. ఇప్పటికీ ఆ దృశ్యం కళ్ళకు కట్టినట్టుంది. మోహనుణ్ణి ఎత్తుకొని తను నిలుచున్నది; ఎదుట రామన్న ఏమో మాట్లాడుతున్నాడు. సామాన్యంగా పురుషులు ప్రవర్తించినట్లే లొంగదీసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు; అతని కళ్ళల్లోని కాంతిని చూచినక్షణం తనకు తెలిసింది రామన్న హృదయం తనకోసం ఆరాటపడుతున్నదని. మెలకువతో వుండాలి, ఇతనికి నేనంటే చాట్టి విలాసవస్తువుగా వున్నాను. వెనకటికాలంలో ఆడవాళ్ళు వుపయోగించే ఎంగిలాకునై వున్నాను. నాకూ హక్కువుందని ఇతను మరిచిపోతున్నాడు, మెలకువగా వుండాలి - అని తను ఎక్కువ మాట్లాడకుండా అతని మాటల వలనుండి తప్పించుకోవాలనుకుంటున్నది. అప్పుడు చేశాడు మోహనుడు తుంటరిపని; అతన్ని తీసుకోవాలనే నెపంతో రామన్న చేశాడు తుంటరిపని.

ఆ రోజు మోహనుణ్ణి తను ఎన్నిసార్లు దండించింది! ఎందుకని? తర్వాత తెలిసింది, తను మోహనుణ్ణి దండించిందెందుకో! తన అస్థిరస్వభావాన్ని వాడు బయటికి లాగాడని. రామన్న చెయ్యి తన ఎదకు సోకగానే, ఆ క్షణంలో తనబుద్ధి-నిర్ణయాలన్నీ మట్టిపాలయ్యాయి. సోకినచేతిని గట్టిగా పట్టుకోవాలి, అనిపించింది. మోహనుడు ఏడవ నారంభించాడు. పాపం! ఆ పిల్లవాడు తను మొరటుగా పట్టుకున్నందువల్ల ఓర్చుకోలేక పోయుంటాడు. పాపం! ఆ రామన్నమీద తను ఇంతవరకు బుద్ధిపూర్వకంగా పెంచుకున్న ద్వేషమంతా ఒక్కక్షణంలో మాయమైంది కదా! ఆకలిగొన్నదేహం నిత్రాణమైనట్లు వణికింది; పెదవులు ద్రవించాయి; హృదయంలో ఎక్కడో ఝుమ్ అనసాగింది; తనకు స్పృహే తప్పుతుందేమో అనిపించింది. అంతలో మోహనుడి ఏడుపువిని స్పృహ వచ్చినట్లయింది, తనూ ఒక్కుమ్మడిన లోపలి కెళ్ళిపోయింది.

పాపం! మోహనుడి తప్పేముంది, ఇదంతా ఇలా జరగడానికి? అయినా ఆ క్షణంలో ఏడ్చేమోహనుడు గమనికకు రాగానే బలంగా ఒకదెబ్బ వేసింది. వాడి

ఏడపు ఎక్కువయినకొద్దీ తన ఆవేశమూ ఎక్కువయింది. లోపల అణగివున్న ద్వేషమంతా బయట పడిందేమో! నా మూర్ఖత్వపు బాహ్యచిహ్నం. నా వ్యభిచార వృత్తి యొక్క మూర్తి. నన్ను అపమానపూరిత జీవితంలో దింపిన కారణం-అని ఏమేమో మనసులోతోచి తాను ఆ ఆలోచనల ఆవేశంలో మోహనుణ్ణి కొట్టింది కదా?

ఆ జ్ఞాపకంవచ్చి కుముద గడగడ వణికిం దొకక్షణం.

అబ్బ! ఎట్లా కొట్టింది తను! కొట్టగా కొట్టగా ఆవేశం యెక్కువై వొంటిమీద స్పృహ తప్పిందో ఏమో తనకు! రామన్న అక్కడికి వచ్చిందే తెలియలేదు. తనని ఆపింది తెలియలేదు. చివరికి తనవొకదెబ్బ రామన్న భుజానికి తగిలినప్పుడే తనకు వొళ్ళు తెలిసింది. ఏడ్చేపిల్ల వాణ్ణి ఒకచేత్తో పట్టుకొని. మరొకచేత్తో తన చేతిని. కోపంతో కాకున్నా బలంగా పట్టుకొని ఆపాడు రామన్న.

ఆ రోజు రామన్న కోప్పడివుంటే? తనతో తగవులాడివుంటే? అయితే. రామన్న ఏమీ చేయలేదు. అతను కోప్పడివుంటే తనూ కోప్పడివుండేది. తగవులాడివుంటే తనూ ఆవేశంతో అరచివుండవచ్చు. చివరికి బాగా కొట్టివున్నా సరిపోయేది. అయితే అతను ఏమీ చెయ్యలేదు. బిడ్డను ఎత్తుకొని తనని ఆపి. తానే అపరాధం చేశాడా అన్నట్లు దయాపూర్వకంగా తనవైచూస్తూ నిలుచుండిపోయాడు. ఒక్కసారి అనిపించింది అవిధంగా నిలుచున్నందుకు అతనికే ఒక దెబ్బ వెయ్యాలి అని. అతను వూరికే నిలుచున్నందువల్ల తనకే అసహనీయమైన సిగ్గు వేసింది.

'వద్దంటే నేనే బయటికి వెళతాను' అన్నాడు.

తనకు మొదట ఆ ప్రసంగం అర్థం కాలేదు.

'నావల్ల నీకు ఇంతబాధ కలిగేట్లయితే నేను ఇల్లువదలి వెళతాను' అన్నాడు.

చివరికి మాట్లాడాడు. మాటకుమాట మాట్లాడి మనస్సు తేలికపరచుకోవడానికి అవకాశం దొరికింది. 'మీ రెందుకు వెళతారు? ఇంటి యజమానులు మీరు!' అన్నది - తాను.

'నాలాగే ఈ యిల్లు నీదికూడా. కుముదా.'

'నా యిల్లు ఎట్లా అయింది? గతిలేక ఆశ్రయించిన పిల్లను నేను!'

'కుముదా, కుముదా, ఇలాంటిమాట లాడకూడదు నువ్వు' అని వేడుకున్నాడు.

'అంటే ఎలాంటిమాటలు మాట్లాడాలి? నా పిల్లలమీద చెయ్యి వేసుకోవడానికి నాకు అధికారంలేదు, ఈ యింట్లో!'

ఆ మాట అంటుంటే తనకు ఏడుపు ఆగలేదు. 'నీకు ఏ అధికారానికీ కొరవ లేదు, కుముదా, ఈ ఇంట్లో.'

'నాకు మీ ఇల్లూ వద్దు, అధికారమూ వద్దు' అంటూ అతను పట్టుకొన్న చేతిని విడిపించుకోవడానికి ప్రయత్నించింది.

'కుముదా-' రామన్న చేతిని వదలలేదు—'కుముదా, నాకు తెలుసు నీకు ఏదో అసంతృప్తి వుంది అని. చెప్పు, నావల్ల అది దూరమయ్యేట్లయితే నేను కావలసింది చేయడానికి సిద్ధంగా వున్నాను. నాది ఏమైనా తప్పయివుంటే చెప్పు-'

'మీ తప్పు! అయ్యయ్యో! మీవల్ల ఎప్పుడైనా తప్పు జరిగిందా? బుద్ధిమంతులు, పేరున్న రచయితలు, మీరు చేసిందిచూసి మెచ్చుకొనేవాళ్లు ఇంతమంది వున్నప్పుడు-'

'కుముదా, ఈవిధంగా నువ్వు మాట్లాడితే ఏమనేది? ఇంట్లో, అదీ నీతో నేను కట్టెవిరిచి పొయ్యి పెట్టినట్లు ప్రవర్తించానా ఎప్పుడైనా?'

'నాతో మీరు ఎలా ప్రవర్తిస్తే యేం, దారితప్పి గతిలేక వచ్చిన ఆడదాన్ని-'

'కుముదా, కుముదా, ఈవిధంగా కఠినంగా మాట్లాడవద్దు. దారితప్పినమాట ఎత్తవద్దు. దారితప్పినవాణ్ణి నేను - నన్ను సరియైనదారిలో నడిపేదానివి నువ్వు. నువ్వు కుముదా-'

'మీరూ వద్దు, మీ దారీవద్దు' అని తను చెయ్యి విడిపించుకొని దూరంగా జరిగింది.

చెయ్యి విదిలించుకొన్నందుకు గాభరాచెందిన పిల్లవాడు-మోహన్-మళ్ళీ ఏడవ నారంభించాడు. కుముదదగ్గరికి వెళ్ళాలని ప్రయత్నించాడు. రామన్నకు భయం కలిగించో ఏమో, తను మళ్ళీ బిడ్డను కొడతానని. రామన్న బిడ్డను ఎత్తుకొని అను

మౌనంగా చూశాడు. పిల్లవాడు తనదగ్గరికి రావాలని మొండికెత్తాడు. చివరికి ఏడవ వారంభించాడు.

కుముద ఆపుకోలేకపోయింది. ఆవేశంతో బిడ్డను లాక్కొంది.

'కుముదా, కుముదా, నామీద వొట్టు-' అని రామన్న పిల్లవాణ్ణి గట్టిగా పట్టుకోవ డానికి ప్రయత్నించాడు.

తను వదలలేదు.

'నేను బయట తిప్పి తీసుకొస్తాను, కుముదా' అన్నాడు.

'మీరు తిప్పడమూవద్దు, రావడమూవద్దు. నేనే బయటికి తీసుకెళతాను. మళ్ళీ రాను. మీరున్నారు, మీ యిల్లున్నది, వుండిపోండి' అని అక్కడ్నుంచి బయలు దేరి, తనగదికి వచ్చింది. బిడ్డను కూర్చోబెట్టి తన వస్తువులను సర్దుకోనసాగింది.

హుం....అని కుముద స్మృతిప్రవాహంలో మునిగి లేచినట్లు నిట్టూర్చింది.

ఈ రోజు అలా జరిగివుంటే తను అలా ప్రవర్తించేదా? 'తిరిగి రాను' అన్నది ఆ రోజు, ఆ తర్వాత ఏమేమి జరిగిందో! అయితే ఈ క్షణం యిక్కడే వుంది, రామన్న యింట్లో; కాదు తన యింట్లో. ఊహుం, అదీ కాదు. మోహనుకి యింట్లో. పిచ్చిది తను! తను దురభిమానంతో ఆమాట అనుకుంటున్నది. ఇది రామన్న యిల్లు, తన యిల్లు కూడా; అందువల్ల ఇది మోహనుకి యిల్లు. తమ యిద్దరి తపః ఫలం మోహనుడు. లేకుంటే మోహను డెవరు?

ఇప్పుడు తను అలా ప్రవర్తించేది కాదు. దానికి నిజమైనకారణం వేరే వున్న దన్నవిషయం ఆమె మనస్సు వొప్పుకుంటున్నది. ఈ రోజు తను ఏ కారణం వల్లయితే అలా ప్రవర్తించలేదో, అదేకారణంవల్ల ఆ రోజు తను అలా ప్రవర్తిం చింది - అన్నదీ ఆమెకు తెలుసు.

ఆ కారణం - రామన్నమీద తనకున్న భావన.

కుముద ఎప్పుడూ ఓటమి చెందటానికి ఆ భావనే కారణం. ఈనాటివరకు ప్రతి సందర్భంలోను చివరికి వోడేది తనే అన్నది ఆమెకు తెలుసు.

తొమ్మిదేళ్ళముందు జరిగిన ఆ ప్రసంగం తన మొదటి ఓటమి అని ఆమెకు

తెలుసు. 'నేనే బయటికి తీసికెళతాను. తిరిగి రానేరాను' అని తను అర్భాటం చేసిందే ఓటమియొక్క మొదటి ఘోషణ కదా!

ఎందుకని? తను ఎందుకు అలా అన్నది? పూర్తిగా ఆలోచించేనా? కాదు. ఒక నిశ్చయానికి వచ్చినతర్వాతనా? అదీకాదు. మనస్సులో వుందేదాన్ని ధైర్యంగా చెప్పడానికా? ఊహుఁ - అలాంటి ఏ కారణంవల్లనూ కాదు.

ఒకటే కారణం. భయం. తనపట్ల తనకే భయం. రామన్న అంటే భయం.

రామన్న చెయ్యి తనకి తగిలినప్పుడే ఆమెకు స్పష్టమైంది. ఇది జన్మజన్మాంతరాల సంబంధం. ఒకమాటతో తీసివెయ్యడానికి లేదు అని.

ఒకసారి రామన్నే చెప్పలేదా - శకుంతలా దుష్యంతుల కథను?

'శకుంతలే నేనైవుంటే దుష్యంతుణ్ణి సమీపానికే రానిచ్చేదాన్ని కాదు' అన్నది తను.

'ఎందుకని? అలాంటిదేం చేశాడు అతను?' అని రామన్న అడగగా తనకు ఆశ్చర్యం కలిగింది.

'ఏమన్నారు? అలాంటిదేం చేశాడతనా? ఇంకేం చెయ్యాలి? ఏకాంతంగా పెళ్ళి చేసుకొని ఆమె తల్లికాబోతున్నప్పుడు నాకేం గుర్తులేదు, నిన్ను పెళ్ళి చేసుకున్నది - అంటే?'

'పాపం! అతనిదేం తప్పు? శాపం ప్రభావానికి లోనయ్యాడు.'

'అబ్బబ్బబ్బబ్బబ్బ! ఎవరికి చెప్తారీ కాకమ్మకథలు! కాళిదాసు మగవాడు, దుష్యంతుడూ మగవాడు___'

'అయితే యీ కథను మొదట రాసినవాడు కాళిదాసు కాదు. మహాభారతంలో వుందీ కథ.'

'అంటే? ఈ పాడు కథనే ఎందుకు ఎంచుకున్నాడో! ఎవరైనా నవ్వుపోరూ?'

'ఎందుకని?'

'అబ్బ! ఎందుకంటారా? పెళ్ళి చేసుకున్నదే జ్ఞాపకంలేదనే జీవి ఎలాంటివాడతను!'

'గొప్పమనిషి అతను.'

'చాలు పూర్కోండి!'

'అదేవిటి కుముదా? రేపు నేనే అన్నాననుకో, నిన్ను పెళ్ళి చేసుకున్నది గుర్తు లేదని. అప్పుడు అందరూ నన్ను పిచ్చివాడంటారా లేదా?'

'అంతకంటె పెద్దగా అనకపోతే మీ అదృష్టమే.'

'సరేనా? నేను చేస్తే పిచ్చి అంటారు. కోర్టులో కేసుపెడ్తారు; అదే దుష్యంతుడూ చేశాడు. అతన్ని పెద్దమనిషి అన్నారు, నాటకం రాశారు.'

'చాలు, మీదీ ఒకమాటలతీరా అని.'

'కాదు, నువ్వ శకుంతల అయివుంటే ఏం చేసేదానివేం?'

'అవును, ఖచ్చితంగా అతన్ని అతనివారికి వదిలేసేదాన్ని.'

'నువ్వు అలా చేయవు అని ఋజువుచేయడానికే కాళిదాసు ఆ నాటకం రాశాడు.

'నేను చెయ్యను అని చూపించడానికి!'

'అంటే, నువ్వే శకుంతల అయివుంటే - అంటున్నా.'

'ఏమంటారో ఏమిటో మీకే తెలియాలి!'

'అలాకాదు. ఇలా చూడు. శకుంతలా దుష్యంతుల వివాహం ఎలా జరిగింది? దుష్యంతుడి అంతఃపురంలో కావలసినంతమంది సౌందర్యవతులు వున్నారు; శకుంతలకుమాత్రం గాంధర్వవివాహం ఇలాంటి వాటివిషయమూ తెలియదు. అంతేకాక, దుష్యంతుడు అక్కడికి వచ్చింది వేటకని. ఏదో, కణ్వాశ్రమందగ్గర వుంది అని తెలిసింది, మహర్షికి నమస్కరించిపోదాం అని—'

'ఆ కథంతా నాకు తెలుసు—'

'అలాకాదు, ఆ కథలోవుండే పట్టు చెపుతాను వీకు. ఎవరికీ తెలీకుండానే హఠాత్తుగా కలుసుకోవడం జరిగింది. అది పరిచయమైంది, పరిచయం ఆకర్షణ అయింది, ఆకర్షణ స్నేహమైంది, స్నేహం ప్రేమ అయింది—'

'చివరికి పెళ్ళి అయింది—'

'ఆఁ, ఇదంతా కొన్నిరోజుల్లోనే అయింది.'

'అవును. దానికీ నేను చెప్పేదానికీ—'

'సంబంధం వుంది కుముదా. జ్ఞాపకంలేక, ముందాలోచనలేక, అవసరంలేక, పెద్దల సహాయంలేక పెళ్ళి అయింది. ఎందుకని?'

'దుష్యంతుడు దైవసమానుడని.'

'హహ! శకుంతల కేం తక్కువ? ఇద్దరిదీ బాధ్యత. ఇద్దరిదీ ప్రేమ గాఢంగా, అన్యోన్యంగా వుండేది. ప్రపంచంలో వాళ్ళు ఎక్కడవున్నా ఒక్కరోజు కాకపోతే మరోరోజు కలుస్తారు అని తెలియజేసేందుకు కాళిదాసు ఆ నాటకం రాశాడు. అందుకనే తర్వాత మారీచుడి ఆశ్రమంలో దుష్యంతుణ్ణి చూసినప్పుడు, మొదటి సారి కణ్వుని ఆశ్రమంలో అతన్ని చూసినప్పుడు ఎలా అయిందో అలాగే అయింది ఆమె అవస్థ.'

'కథను కావలసినట్లు రాసుకోవచ్చు. నాకేమో నమ్మకంలేదు' అన్నది, అప్పుడు. ఆ మాటలో నమ్మకం కలిగేట్లు శిక్ష తనకు పడిందేమో అనిపిస్తుందిప్పుడు. శకుంతల అలా ప్రవర్తించడం సహజమని ఇప్పుడు వొప్పుకోవడానికి తను సిద్ధంగా వుంది.

రామన్న తనని పెళ్లి చేసుకున్నది తెలుసుకుంటే తను ఎప్పటికీ అతనితో సంసారం చేయకుండావుండవలసింది. తనంతతానే కోరి వచ్చాడు. అంతేకాక సరళక్క నిత్యం ఆ ప్రస్తావన తెచ్చేది. తనకుకూడా పెళ్ళి అంటే అయిష్టం లేదు. అయినా సరళక్క ప్రాణంతో వున్నంతవరకు రామన్న బహిరంగంగా ఆ మాటనే ప్రస్తావించలేదు; అయినా తన సాహచర్యాన్ని కోరుతుండేవాడు. సరళక్క పోయిన తర్వాతకూడా అతనే ఆ విషయాన్ని ఎత్తలేదు. చివరకు తను గర్భిణి అని చెప్పినప్పుడు పెళ్ళికి వొప్పుకున్నాడు. దీని అర్థమేమిటి? రామన్న తనను కోరుకోలేదనేగా? బుద్ధిపూర్వకంగా తనని మోసంచేశాడు - అనేగా? ఇలాంటివాడితో సంసారం చేయడమంటే ఎలాంటి మనస్సుతో? అందులోనే పెళ్ళి చేసుకున్న పురస్కారభారాన్ని తనమీద వుంచాడు! పెళ్ళి కాకుండివుంటే తను స్వతంత్రంగా వుండి వుండవచ్చుకదా? పెళ్ళి కాకుండావుండివుంటే అతనిమీద తనకే అధికారం వుండేది.

ఇప్పటిలా కాదు. ఇప్పుడు తను పెళ్ళయినది. అధికారభోగవస్తువు. పెళ్ళి కాకుండా వుండివుంటే? భోగ్యవస్తుప్రాప్తికోసం భిక్షుకుడై వుండాల్సింది అతను!

హుం....అదంతా సరే. తనను ఎవరూ వద్దనలేదే? పెళ్ళికి తను సమ్మతించి వుండనక్కరలేదే? తను సమ్మతించి యిప్పుడు రామన్నను దూషిస్తే——?

దూషణ ఏముంది, ఆడదాని తలరాత. శకుంతల కథ - అని నిట్టూర్చింది. ఏదో శక్తి తనని రామన్నవశంలో వుంచేసింది. తను చేసేప్రయత్నాలన్నీ వ్యర్థమవు తుండేవి. బుద్ధి వొకవైపుకు లాగితే, హృదయం మరోవైపుకు లాగేది. తను ఎంత దూరంకాను ప్రయత్నించేదో, అంత సన్నిహితంగా తనని ఆశక్తి దగ్గరికి లాగేది.

అందువల్ల ఎప్పుడూ తనకు భయం వుండేది. రామన్న భోగ్యవస్తువు కావడంలో తనకు సంతోషం వుండినా, అతను తనను వొట్టి భోగ్యవస్తువు అని అనుకోవడమే తనకు అసహ్యమనిపించేది.

తను అతన్ని ప్రేమిస్తున్నట్లే అతనూ తనను - లేదు, ఆ నమ్మకం ఆమెకు లేదు. అందుకే భయం. తనెక్కడ మళ్ళీ అతనికి వశమైపోతుందోనని——

రామన్న సాన్నిధ్యం ఆ భయాన్ని ఎక్కువ చేస్తూవుండేది. అతనిస్పర్శ మరీ - అందువల్ల ఆనాడు చెప్పింది 'మళ్ళీ రానేరాను' అని.

హుం....అయినా వచ్చానుకదా; వచ్చాను, ఇంటిని సరిచూసుకున్నాను, ఇంట్లో పిల్లవాణ్ణి పెంచాను——

తన పగటికలల్ని ఆపింది కుముద. చేతిగడియారాన్ని చూసుకొన్నది. 'ఇదే మిటి? ఎంతచెప్పినా ఇంకా రాలేదు ఈ మోహనుడు? ఇంతలో సభకు ఆహ్వా నించడానికి వచ్చినా వస్తారు. ఛీ! ఏం పిల్లవాడబ్బా వీడు! ఎక్కడి కెళ్ళాడో తొంతడానికి!' అంటూ లేచి మళ్ళీ తలుపుదగ్గరికి వచ్చింది.

## 10

'ఇదేమిటి? ఏమీ కనపడ్డంలేదే?' అన్నాడు కిటికీఅవతల చూస్తున్న రామన్న. మరుక్షణం అతనికే ఆశ్చర్యం కలిగింది.

వీథిగుండా పశువులన్నీ వెళ్ళాయి. వెనక పశువుల్నికాచే కుర్రవాళ్ళచేష్టలూ సాగుతున్నాయి. అదిగో అక్కడ ఎవరో ఇద్దరు బయలుదేరారు - ఒకరు నిలబడి నవ్వుతున్నారు. వీథిలో ఈ చివర చేరిన కాకులు ఒక్కసారిగా గుంపుగా రెక్కలు కొట్టుకుంటూ లేచి వీథివైపుకు ఎగురుతున్నాయి. ఆ కుక్క వాటిని పట్టుకోడానికి ప్రయత్నించి మొరుగుతున్నది....ఇదంతా కనిపిస్తున్నా నేను 'ఏమీ కనబడ్డం లేదే!' అన్నాను కదా!

మనుష్యప్రపంచమంటే ఇంతే! తనకు కావలసినవుంటే కనిపించడం. లేకుంటే ప్రపంచమే లేదు అనడం....హుం...అని ఏమేమిటో గొణుగుతూ అడుగు వేయ సాగాడు. గది చివరివరకు నడిచి అలాగే గొణుగుతూ మళ్ళీ కిటికీదగ్గరికివచ్చి బయటికి చూశాడు....'కండూయమానాం....' గొణగడం ఆపి తనలోనే నవ్వు కున్నాడు. ఎలాగైతేనేం నా టక్కరితనం నాకే తెలిసివచ్చింది - అని నవ్వాడు. అదొక అలవాటు అతనికి. మనసులోని ఆలోచనల్ని మరవాలనిపించినప్పుడు ఒక సంస్కృతశ్లోకం గొణుక్కోవడం. అందుకోసం లోపలి ఆలోచనల్ని అణిచిపట్టి వెనక్కి నెట్టెయ్యాలనుకున్నప్పుడు కాళిదాసు శ్లోకాన్ని - దాన్నొక్కదాన్నే - మళ్ళీ మళ్ళీ గొణుగుతాడు. ఇప్పుడూ అదే శ్లోకాన్ని గొణుగుతున్నాడు.

'కార్యాసైకతలీనహంసమిథునా స్రోతోవహా మాలినీ
పాదాస్తామభితో నిషణ్ణహరిణా గౌరీగురోః పావనాః।
శాఖాలంబితవల్కలస్య చ తరోర్నిర్మాతుమిచ్ఛామ్యధః
శృంగే కృష్ణమృగస్య వామనయనం కండూయమానాంమృగీం॥'

ఆ శ్లోకం వాతావరణమే ప్రశాంతమైంది అని ఎప్పటినుంచో అతనికొక భావన. మాలినీతీరంలో ఇసుకతిన్నెలు; హంసి-హంస; ఈశ్వరుని అడుగుజాడలు వున్నాయి; సమీపంలో వొక చెట్టు; దానిమీద నారచీరలు ఆరవేసివున్నాయి; ఆ చెట్టుక్రింద వొక కృష్ణమృగం; దాన్ని నాలుకతో నాకుతున్న ఒక మృగి-ఆడుది.

భలే! శకుంతల జ్ఞాపకంతో బాధపడుతున్న దుష్యంతుడు సరియైనచిత్రాన్ని చిత్రిస్తున్నాడు. ఆ శ్లోకంలోని వాతావరణంలా, దాని అర్థం, అక్కడి శబ్దాలు, వాటి వాడకం అంతా సౌమ్యంగా వున్నాయి. ప్రశాంతసూచకంగా వున్నవి. ఎందుకని? తెలియదు. అదే కవిప్రతిభ; ఉన్నట్లుండి మనసులో పరిణామం కలిగిస్తాయి.

తను ఈ శ్లోకపాఠాన్ని గొణిగేసందర్భమూ అలాంటిదే. దాన్ని తను ఎప్పటికీ మరిచిపోలేదు.

ఆ రోజు - ఎప్పుడు? 7—8 సంవత్సరాలముందు వుండవచ్చు. అప్పు డొక రోజు - తనిలాగే కిటికీదగ్గర నిలుచునివున్నాడు నిరీక్షిస్తూ. ముందురోజో, అంతకు ముందురోజో - ఇప్పుడు జ్ఞాపకంలేదు. అప్పుడది ఒక్క సంవత్సరమంత దీర్ఘమనిపించింది—కుముద మోహనుణ్ణి తీసుకొని బయటికి వెళ్ళింది. ఆమె బయటికి వెళ్ళినప్పుడు తాను అదే కిటికీలో నిలుచునివున్నాడు. తర్వాత అలాగే ఎన్నిగంటలు-లేక ఎన్నిరోజులు నిలుచున్నాడో, ఆమె రావచ్చుననే నిరీక్షణతో. ఆమె రాలేదు. ఎన్నోసార్లు అనుకున్నాడు, తనూ వెళ్ళిచూసుకొని రావాలి అని. అయితే తను వెళ్ళినప్పుడు ఆవిడవస్తే - అనే సంశయంతో నిలిచినచోటే నిలిచిపోయాడు. ఆమె రాలేదు. మళ్ళీ తన మేనత్తఇంటికి వెళ్ళివుండవచ్చు అని సమాధానపడ్డాడు. ఒక రాత్రి యింట్లో దీపంలేదు. రెండురోజులు తనకు అన్నం లేదు. ఒక్కొక్కసారి అనిపిస్తుంది. వెళ్ళి ఆమెను క్షమాపణ వేడుకురావాలని; మరొకసారి అనిపిస్తుంది, ఈమాటు ఏంచేసినా ఆమె రాదు అని.

తప్పు తనదే అని ఇప్పు డతనికి తోచింది. ఏ ఒప్పందంమీద ఆమె రావడానికి అంగీకరించిందో ఆ ఒప్పందం భగ్నం చేయడానికి తను యత్నించడం తప్పు అనిపించింది. ఆమె వెళ్లినతర్వాత. అయితే అంతకుముందు ఎంత ఆత్మవిశ్వాసంతో తను ఆ ఒప్పందం భగ్నం చేయడానికి సన్నద్ధుడై బయలుదేరాడు!

: ఆనాటి జ్ఞాపకానికి ఇప్పుడు రామన్నకు మళ్ళీ నవ్వువచ్చింది. ఇప్పుడు తన వయస్సు 45, అంటే అప్పుడు తను 37—38; అయినా ఒక అవివేకియువకునిలా ప్రవర్తించాడు కదా!

కామీ స్వతాం పశ్యతి! ఇంతటి అవివేకి యువకులనుచూసే కాళిదాసు ఆమాటను చెప్పాడో ఏమో! ఆ రోజు మోహనుణ్ణి తను ఎత్తుకోవడానికి వెళ్లినప్పుడు, కుముదకు తనచేయి తగిలినప్పుడు ఆమెకళ్లల్లో కనిపించిన సంతృప్తితోకూడిన నవ్వును చూసి తను వుత్సాహం చెందాడు. వెంటనే ఆమె ప్రతిఘటించింది, ఆర్భాటం చేసింది, గదికివెళ్లి తనవస్తువుల్ని సవరించుకొని పెట్టుకుంది; ఇంకా ఏం చేస్తుందో అనేభయంతో తను మెల్లిగా నడిచిపోయి సగం తెరిచిన తలుపుసందులోంచి

చూశాడు. కుముద తన ఫోటోముందు నిలబడివుండడం కనిపించింది. ఎవరికి తెలుసు ఏం చేస్తుందో చూద్దాం. దాన్ని కిందపడేసి కాళ్ళతో తొక్కనూవచ్చు అని భయంతో తను చూస్తూవుండగా ఆమె తటాలున దాన్నెత్తి నుదుట పెట్టుకొన్నది తనకు నమస్కరిస్తున్నట్లుగా. ఆ తర్వాత - ఆ తర్వాత - దాన్ని ముద్దుపెట్టుకొంది. తను కళ్ళారాచూసిన దృశ్యమది. కల్పన కాదు. ఆ దృశ్యాన్ని చూడగానే తనకు కొత్తచైతన్యమే వచ్చినట్లయింది. కుముద నిజంగా తనని ప్రేమిస్తున్నది. ఏదో తప్పు అభిప్రాయంవల్ల తనమీద కోపపడింది. ఆ తప్పు అభిప్రాయాన్ని పోగొట్టాలి అనుకున్నాడు.

ఎంత పిచ్చివాడయ్యాడు అప్పుడు తను! తప్పు అభిప్రాయం ఏమైవుండవచ్చు అనే ఆలోచనలో మునిగి చివరికి దాన్ని తెలుసుకున్నాడు - అనుకొని తనొక బృహస్పతి అపరావతారం అనుకుని గర్వంతో విర్రవీగాడు.

కామీ స్వతాం పశ్యతి!

సరే. కుముద కోపం తను వొప్పందాన్ని అక్షరాలా పాలించనందువల్ల. తనను ఆమె యింత ప్రేమిస్తుండే, తనుమాత్రం ఎప్పుడో వొక్కసారి ఆమె కోపంతో చెప్పినమాటను నమ్ముకొని కూర్చున్నాడు కదా! 'దాంపత్య' జీవితం వయోధర్మం; దాన్నికోరడం పాపమూ కాదు. అహితమూ కాదు. స్త్రీ పురుష అనేభేదం సృష్టి నియమంలోని ఒక అనుకూలం. వయోధర్మానికి ఈ భేదం లేదు - అని ఏదేదో తెలిసినట్లుగా, తనొక రెండవ వాత్స్యాయనునిలా తర్కించేసి సిద్ధాంతీకరించ సన్నద్ధుడయ్యాడు.

ఇప్పుడు ఏడెనిమిది సంవత్సరాలతర్వాత అనిపిస్తుంది. ఆనాటి తన ఆలోచన, వ్యవహారం రెండూ సిగ్గుమాలినతనానికి పరమావధి అని. అలాంటి సిగ్గుమాలిన తనానికి తగినశిక్ష పడింది. పొద్దుటివరకు కుముద తన గదితలుపుతెరిచి పడుకొని వున్నా తనకు ఆ వైపు చూడనుకూడా ధైర్యం కలగలేదు. అలాంటిశిక్ష పడిం దా రోజు తనకు.

ఆమె ఆ మాటను చెపుతుందని తను కలలోకూడా అనుకోలేదు. ఆ అభిప్రాయం వుండివుంటే తనామెను మాట్లాడించేవాడే కాదు.

అయితే ఏమైంది? కామీ స్వతాం పశ్యతి! కామాంధుడైన తను అనుకూలించిందుకనే యీది వెళ్ళాడు. అదే వున్మాదంతో ఆమెను సంబోధించాడు.

'కుముద.'

తనను ఒక్కమారుగా చకితురాలై చూసి ఆమె చిరునవ్వు నవ్వింది. అప్పుడే తెలుసుకోవాల్సింది తను. ఆ చిరునవ్వువల్ల ముఖం సౌమ్యంగా కనిపించలేదైతే.

'కుముద.'

'లోపలికి రండి.'

'కుముదా, కుముదా, అయిందేదో నువ్వు మరిచిపోతావని నాకనిపించింది. అలా చూస్తే నాదే తప్పు. నేను వొప్పుకుంటాను.'

'మీలాంటి అభ్యుదయవాదులు దీన్ని తప్పు అనుకోవచ్చా?'

'ఆఁ? ఏమన్నావు?'

'కాదు-పాతకాలపు ఆలోచనలుగలవాళ్ళు అలా అనవచ్చు. అయితే, మీరు—'

'ఏమిటి? ఏమిటి? ఏ విషయం నువ్వు మాట్లాడుతున్నది?'

'వేశ్యల్ని పెళ్లి చేసుకోవడం?'

'కుముదా!' కొరడాదెబ్బకు ఆక్రోశించేవానిలా అరిచాడు.

'ప్రేమించని ఆడదాని సహవాసం అంటే వేశ్య సహవాసం అని మీరే-'

'కుముదా, కుముదా, ఎందుకు దండిస్తావు నన్ను ఇలాంటిమాటలతో? నిన్ను ప్రేమించకుండావుంటే నిన్ను పెళ్ళి చేసుకునేవాడినా నేను? ఎందుకు లేనిపోని ఆలోచనలు తలలో నింపుకొని—'

'నాకే పిల్లవాడు కావలసివుంది, అందుకే మీరు బాధ్యులు అని అనను నేను, ఇప్పటికైనా సరిపోయిందా?'

'కుముదా, కుముదా, ఏదో తప్పు అభిప్రాయంవల్ల నువ్వు ఏదేదో కల్పించుకున్నావు—'

'నా అభిప్రాయం తప్పదు. ఇప్పుడు మీరు ఎందుకు వచ్చారనేది నాకు తెలుసు. దాన్ని తప్పు అంటారా? అయితే వొకమాట. మీతృప్తికి నేను అడ్డంరాను. ముందు ఒకమాట నాకు చెప్పండి. ఇప్పుడు మీరు ఇక్కడికి వచ్చింది, నేను మీ భార్యననే అధికారంతోనా, లేక మిమ్మల్ని మోహించిన ఒక వేశ్య అనా? దేన్న యితే మీరు చెపుతారో ఆ పాత్ర అభినయించడానికి నేను సిద్ధం.'

ఆ మాటచెప్పి దీపాన్ని ఆర్పేసింది. అబ్బ! చీకటి అనేది ఎంత భయంకర మైంది అనేది అప్పుడు తెలిసింది తనకు. నిలుచోడానికి భయం; పారిపోవడానికి భయం; తననుంచి తను పారిపోవడానికి సాధ్యంకాదని హఠాత్తుగా భయం.

తర్వాత కుముద ఇంటినుంచి బయటపడేవరకు తను ఆమెకు ముఖం చూపింద లేదు.

నేను తనను ప్రేమించడంలేదు - అన్నది కదా! అందుకు తను ఏం సమాధానం చెప్పాలి? 'లేదు, కుముదా, నిన్ను నేను ప్రేమిస్తున్నాను' అని చెప్పాల్నా? వొట్టి మాటలు. అప్పటి ఆమె పరిస్థితిలో ఆమె ఆ మాటల్ని నమ్మలేదు. ఆమె నమ్మనీ, నమ్మకపోనీ; తన విషయ మేమిటి?

కుముదను తను అప్పుడు ప్రేమించేవాడా?

ఇప్పుడు కుముదను ప్రేమిస్తున్నాడా?

రామన్న నిట్టూర్చాడు, మళ్ళీ కిటికీబయట చూశాడు. ముఖం తుడుచుకున్నాడు. మెల్లిగా అడుగులేస్తూ కుర్చీమీద కూర్చొని ముఖమెత్తి ఎదురుగా గోడను చూశాడు. 'ఇద్దరిని ఒకేసమయంలో ప్రేమించడం మంచిది, సాధ్యమవుతుంది అని నువ్వు చెప్పకుంటే నేను యీ ప్రశ్నకు సమాధానం చెపుతాను, సరళా' అన్నాడు గోడకు వ్రేలాడదీసిన సరళ చిత్రాన్ని సంబోధిస్తూ.

ఎగాదిగా చూశాడు ఆ వర్ణచిత్రాన్ని. విరాళతో తల విదిలించాడు.

'నువ్వూ జవాబు చెప్పవు.'

హుం—అని నిట్టూర్చి ఆలోచనల్లో మునిగినట్లు నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

'సాధ్యం అవుతుందో లేదో నువ్వు చెప్పు. ప్రామాణికమో కాదో నేను చెప్తాను' అన్నాడు మరోమారు చిత్రాన్ని చూస్తూ.

ప్రామాణికతనుగూర్చి అతనికి ఇప్పుడు ధైర్యం వచ్చింది. ఏడెనిమిదేళ్ళ అనుభవం, అనుభవానికితోడు ధైర్యం వచ్చింది. ఒకేసమయంలో ఇద్దరిని 'ప్రామాణికంగా' ప్రేమించవచ్చు అని ఈ అనుభవంనుంచి గుణపాఠం నేర్చుకున్నాడు రామన్న.

కుముదనూ తను ప్రేమిస్తున్నాడు అనేదాన్నిగురించి ఇప్పుడు తనకు సందేహం లేదు. అయితే దాన్ని ఎవరిముందు చెప్పడం? 'ఇప్పుడు నీ మీద ప్రేమ వుంది' అంటే ఆమెకు విశ్వాసం కుదుతుంది అనే నమ్మకం లేదు. అంతేకాక, 'నిన్ను ప్రేమిస్తున్నాను' అంటే ఆమెకు ఓదార్పు కలుగుతుందనే నమ్మకమూ లేదు. తన వాక్కుైనే ప్రేమించాలనే ఆశ స్త్రీకి సహజంగానే వుండేటప్పుడు ఆమెకు ఆ మాటవల్ల ఓదార్పు కలుగుతుందనడం ఎలా?

అయినా కుముదమీద తనకు ప్రేమ—వున్నది అని ఆమె రెండోసారి ఇల్లు వదిలిపోయినప్పుడే అతను గ్రహించాడు. ఆరోజుకూడా కిటికీలోంచి బయటికి చూస్తూవుంటే యిలాగే 'ఏమీ కనిపించడంలేదు' అనిపించింది. ఇప్పుడు మళ్ళీ చూస్తే ఏమేమో కనిపించింది. అప్పుడు ఎన్నిసార్లు చూసినా ఏమీ కనిపించలేదు; శూన్యత ఆవరించింది లోపల, బయటకూడా. అంతేకాదు; మళ్ళీ మళ్ళీ చూస్తే దూరంగా కుముదే వస్తున్నట్లుగా కనిపించేది. దృష్టి అంతా కుముదే నిండినట్లుండేది; దృష్టిని కాదు, మనస్సును అనాలి. అందుకంటే మనసులోవుంటేనే కళ్ళకు కనిపించేది. ఆ అనుభవంవల్ల తను కుముదను ప్రేమిస్తున్నట్లు మనస్సుకు తట్టింది. సరళనూ ప్రేమించే తను కుముదనూ ప్రేమిస్తున్నాడు కదా! ఇది ఆత్మవంచన కావడానికి లేదు—అనే ఆలోచనా కలిగింది.

అది ఆత్మవంచన కాదు. ఒక అనుభవంవల్లమాత్రం అతనికి పూర్తిగా తెలిసిపోయింది. కుముద వియోగాన్ని సహిస్తున్నప్పుడు. ఏ కారణంవల్లనో ఏమో, కొత్తనవల రాయడం ప్రారంభించాడు. రాసేటప్పుడు సరళ, కుముద ఇద్దరూ తన దగ్గరే కూర్చున్నట్లు అనిపించింది. వాళ్ళసామీప్యంలో లాభాన్ని పొందాలేమో

అన్నట్లుగా గంటలు గంటలు వ్రాస్తూవుండేవాడు. ఎలాగో ఒకరోజు ఆ నవల రాయడం ముగిసింది. ఒకరిద్దరికి చదివి వినిపించాడు; వాళ్ళ మెప్పుదల, పట్టుదల వల్ల కొన్ని రోజులలోనే అది ముద్రితమైంది. అబ్బ! ఎంత పొగిడారు విమర్శకులు! దినపత్రికలలో ప్రచురితమైన విమర్శలను చదివి (లైబ్రరీలలో) ఇంటికి వచ్చాడు. రాగానే,

'కుముదా, కుముదా, నా నవలనుగూర్చి—' అని ప్రారంభించి ఒక్కసారిగా పిడుగుపడినట్లు నిలిచిపోయాడు.

కుముద ఎక్కడుంది? ఆమె తన ఇల్లువదిలి వెళ్ళింది అనేవిషయం మరిచిపోయాడు. అయినా తను తన సంతోషంలో భాగం పంచుకోవడానికై కుముదనే యెందుకు పిలిచాడు?

ఆ ప్రశ్నకు సమాధానం, కుముదను తను ప్రేమిస్తున్నాడనేదే.

రామన్నకు దాన్నిగురించి తర్వాత ఆశ్చర్యమూ అనిపించలేదు. భార్యనూ పిల్లల్నీ నిస్వార్థ ఆత్మీయతలో ప్రేమిస్తుంటే, ఇద్దరు భార్యలను అలాగే యెందుకు ప్రేమించకూడదు—అని తనలో తర్కించుకున్నాడు.

ఆ చర్చనుగురించిన నిర్ణయం ఎంతోకాలం కాలేదు. భార్యతోవుంటే శరీర సంబంధం కారణంగా చర్చలో చిక్కు యేర్పడింది. అయితే అది తప్పు అన్నాడు. భార్యాభర్తల ప్రేమ శారీరికసంబంధంవరకే అని అనుకోవడమే తప్పు అని భావించాడు. ప్రేమలక్షణాలే వేరు, ప్రేమకూ శరీరసంభోగానికి అంత సన్నిహిత సంబంధంవుంటే వేశ్యలపట్ల సమాజంలో తిరస్కారభావమే వుండేదికాదు అనుకున్నాడు. భార్యాభర్తల సంబంధంలో అది ముఖ్యంకాదని అనుకోవచ్చా? అది ముఖ్యం కాకుంటే చాలా సమాజాలలో 'అది' లేకపోవడం లేక అశక్యత వివాహ విచ్ఛేదానికి కారణమయ్యేవి కాదు. అలా అయితే-? ఒకరోజు విడిపోయింది యీ చిక్కు రామన్నకు. శరీరసంభోగం స్త్రీ పురుషులకు ప్రకృతి అప్పగించిన ఒక బాధ్యత. ఒక వుద్దేశంకోసం పైన వుంచిన బాధ్యత ఆ వుద్దేశంయొక్క జ్ఞానం లేకుంటే అది చెడ్డది. ఆ వుద్దేశం బాధ్యత అనిపిస్తే అది సహజధర్మం. ఆ వుద్దేశం మాలేదో కాదు. సృష్టిని నడిపించడం. చిరంతన యువతి - సృష్టి అంటే; యువతి

తనం లేదు. చావులేదు. ముసలితనం పొర వూడిపోతున్నట్లు. చావుయొక్క సత్యం మాసిపోతున్నట్లు పాతదనంలో కొత్తది చిగురిస్తుంది. ఆ బాధ్యత ప్రాణులలో స్త్రీ పురుషులలో పంచబడింది. అందువల్ల కామతృప్తికి ఏ స్త్రీ అయినా చాలను కుంటే. విసర్గతృప్తికి ప్రేమతో పెళ్ళి చేసుకున్న భార్యే కావాలి. ఏది ఎలావున్నా ప్రేమకు కామతృప్తికి సహజసంబంధం లేదు—

అయితే? తను కుముదతో సంబంధాన్ని పెంచుకున్నది ఏమిటి—?

నిజమే. కుముద తనను ఆకర్షించింది శారీరకదృష్ట్యా. కుముదను తను పెళ్ళి చేసుకున్నది వ్యవహార అనుకూలదృష్టితో.

అదంతా నిజమైనా ఈనాడు ఎదుట లేకున్నా కుముద తనను ఆకర్షిస్తున్నది కదా? ఆమె సహవాసంవుంటే చాలు తనకు ఓదార్పు లభిస్తున్నదికదా—సంవత్సరంకంటే ఎక్కువ కాలం! ఆమె సాహచర్యం. ఆమె చలనం. ఆమెతో మాట్లాడడం. తగవుకూడా ఆమెతోనే సొగసు అనిపిస్తుంటే వెనకటివి తలచుకొని ఏమిప్రయోజనం అనుకున్నాడు.

చివరికి చర్చలో గెలిచాడు—ఎన్నో నెలలతర్వాత.

అప్పుడు కుముద మళ్ళీ యింటికి వచ్చింది. ఎందుకని? ఏ ఆలోచనతో? ఆమెతో ఎలా నడచుకోవాలి? మళ్లీ తను ధైర్యం కోల్పోయాడు. ఇప్పటికీ తన అవస్థ అలాగే వుంది. ఒక్కసారి ఆమెతో మనసువిప్పి మాట్లాడితే, ఒక్కసారి ఆమెకు మనస్సుకు హత్తుకునేలా చెబితే తను సంసారాన్ని గెలిచినట్లు అనుకున్నాడు. మాట్లాడే ధైర్యమే లేదు. మళ్ళీ యిల్లువదలి వెళితే ఎలాగ అనే భయంతో—

ఛీ! ఇప్పుడెందుకు ఆ ఆలోచనలు? ఈనాటి సన్మానసభకు వస్తుంది కదా? అక్కడ జరిగేదంతా చూసి ఆమె మనస్సు ప్రసన్నమైందంటే—

చేతిగడియారాన్ని చూసుకొని కుర్చీలోంచి లేచాడు. ఇప్పుడు సభకోసం తొందర. కుముదతో మోహనుడూ వస్తే మంచిది. అయితే ఆ పిల్లవాడు ఇంకా ఇంటికే వచ్చినట్లు లేదు అనే సంశయంతో మళ్ళీ కిటికీవైపు నడిచాడు.

# 11

తలుపుదగ్గర నిలుచున్న కుముదకు మోహనుడు కనిపించనేలేదు. ఎందుకనో పొద్దుటినుంచి వొక్కటీ సరిగ్గా జరగడంలేదు: అలాచూస్తే యేదీ పెద్దనీ జరగ్గలేదు. అయినా మనసులో వొకవిధమైన దిగులు. ఎక్కడో ఎప్పుడో, ఏనాడో ఏదో పెద్దది జరిగింది. లేక పెద్దది జరుగుతుంది అనే భయం లోపల అణగివుంది. అప్పుడప్పుడు వచ్చేదా వద్దా అనేట్లుగా మెల్లిగా తలెత్తుతున్నది. మోహనుడు త్వరగా వస్తే చాలు.

తనొక పిచ్చిది! మోహనుడు రానే వస్తాడు. వూరికే భయపడుతున్నది. పిల్లలతో ఆటలలో మునిగివున్నాడో ఏమో! అయినా త్వరగావస్తే మంచిది. వొళ్ళు చేతులు గుడ్డలు అన్నీ మురికి చేసుకొని ఆలస్యంగా రావడం, ఆతర్వాత 'నేనూ మీతో వస్తాను' అని మొండికెత్తడం. పోనీ, అలాంటిదేముంది? వేళకు సరిగ్గా పోయితీరాలి అనేదేముంది? సభ ఏర్పాటైనదే తమకోసం. తమకోసమే కార్యక్రమమంతా—

'తమ': 'తమకోసం!'

కుముదకు తమాషా అనిపించింది. ఆనాటిసభలో తననూ చేర్చుకున్నందుకు. పిచ్చిది! తనకేమిటి సంబంధం? సభ రామన్నను సత్కరించడానికి. తను వెళ్ళేది రామన్నను పెళ్ళాడిన భార్య భర్త గౌరవంచూసి అసూయపడాలని, ఆనందపడాలని. భార్యను పిలిచే అలవాటు ఏర్పడివుండాలి. కుముదకు ఇలాంటి సందర్భాలలో హాజరుకావడమంటే ఎప్పుడూ మనసు పడేదికాదు. భార్యలకు స్వాభిమానమనేదివుంటే వాళ్ళు ఇలాంటి ఆహ్వానాలను నిరాకరించాలి - అని ఆమె చెప్తుండేది. భర్తను సన్మానించే ప్రతిక్షణమూ సభ్యులు అతనిభార్యను అప్పుడప్పుడు చూస్తారు; కొందరు చిరునవ్వు నవ్వుతారు, కొందరు దగ్గరగా కూర్చొన్నవాళ్లకు ఏమేమో చెపుతారు (తననుగూర్చి). ఆడవాళ్ళయితే మనస్ఫూర్తిగా అసహ్యపడతారు—ఎలాగైతేనేం సభకు రాకుండా వుండాల్సింది అని అనిపిస్తుంది. తనకు ఇవన్నీ తెలిసివుండీ తను ఈనాటిసభకు పోవడానికి వొప్పుకున్నది! ఎందుకని - అనేది తెలుసామెకు. కార్యకర్తలు చాలా యుక్తిగా లొంగదీసుకున్నారు.

మీకు మాదొక విన్నపం'. 'మీరు మా మాటకు కాదు అని చెప్పకూడదు'. 'మిమ్మల్ని సన్మానించడమనేది మా తృప్తికోసం. అలా అంటే మమ్మల్ని సత్కరించుకొన్నట్లు' అని ఇత్యాదిగా 'మీరు - మీ' అని ఇది ఇద్దరికీ సన్మానం అనేట్లుగా మాట్లాడారు. ఇద్దరిదీ కాదు అని తనకూ తెలుసు, వాళ్ళకూ తెలుసు; తనను గురించి మహా అయితే ఒకమాటను వాళ్ళు చెపుతారు. అదేమిటంటే తను రామన్న భార్య - అన్నది. పాపం! వాళ్ళకేం తెలుసు!

కుముదకు పౌరుషం వచ్చింది. 'వాళ్ళకేం తెలుసు, వొకానొకకాలంలో రామన్న సాహిత్యానికి తనే పూర్తిగా ప్రేరణ అని వాళ్ళకేం తెలుసు!' అనుకున్నది. తాము బ్రతికే జీవితానుభవం కావడంవల్ల ఇతరులజీవితాలూ తమలాటివే అనుకుంటే తప్పు వాళ్ళదికాదు. కుముదకు తెలుసు, అలాటి 'సంస్కారవంతు'ల, 'ఓర్చుకున్న' వాళ్ళ సంసారస్వరూపం తెలుసు. రోజంతా భర్త ఆఫీసు తొందర, ప్రమోషన్ల చర్చ; తినడానికి ఇల్లు, తిని ఆనందించడానికి హోటలు. ఆయాసం వచ్చినప్పుడు పడుకోవడానికి యిల్లు, కలిసి మానసోల్లాసం కావాలంటే సినిమా; కామతృప్తికి యిల్లు, ప్రేమ మోహంవుంటే పార్కులో పరాయిస్త్రీ. ఇలాంటి భార్యాభర్తల సంభాషణ తగవుకు పీఠిక. సాహచర్యం పడకమీద; ఎన్నోసార్లు యింట్లోనే పని చేయడంవల్ల, భర్త ఆలక్ష్యంవల్ల, బిడ్డల్ని పొందడంవల్ల, పెళ్ళిలో భర్తఎదుట చిన్నపిల్లగావున్న భార్య తర్వాత భర్తదగ్గర అతని అక్కలాగానో అమ్మలాగానో తయారవుతుంది. తెలుసుకున్నా, తెలుసుకోలేకపోయినా స్త్రీల తలరాత యిది. అలాచూస్తే, అశిక్షితులైన స్త్రీలే సుఖం పొందేవారు; పని చేసేవారు. స్వంతంకోసం సంపాదించుకుంటారు. తమకు ఇష్టమైనభర్తతో బ్రతుకుతారు.

కుముదకు వొకసారి నవ్వు వచ్చింది, రామన్న వొకమాట అన్నందుకు. ఇదే విషయమై చర్చ జరిగినప్పుడు రామన్న ఆవేశంతో అన్నాడు. 'తమ వ్యక్తిత్వాన్ని చూపించేంత మగతనం వుండాలి ఆడవాళ్ళకు' అని. ఆ మాటకు తను గట్టిగా నవ్వింది. ఒకనిముషం రామన్నకు తెలియలేదు. ఆతర్వాత అతనికీ తోచింది. ఇద్దరూ పొట్ట చెక్కలయ్యేలా నవ్వారు.

కుముద నిట్టూర్చింది. రామన్నతో అంత ఆత్మీయతతో తను మెలగిన కాలం అది___

అదెంతటి ఆత్మీయత! శరీరాలు రెండు అనే జ్ఞానమూ తన కుండేదికాదు. ఒక్కొక్కమారు ఆ ఆలోచనలవల్ల భయమేస్తుండేది. ఒకసారైతే - కుముద ఇప్పుడూ భయంతో వణికింది.

మోహనుడు ఇంకా కలగలేదు. తన పరిస్థితి కొత్తదేమీ కాదు అన్నది తెలిసి వున్నా వొకవిధమైన అధైర్యం వుండేది. స్త్రీకి అది సహజమైంది. భార్య జన్మ సఫలమయ్యేదే తల్లి కావటంతో అనిచెప్పి రామన్న తనకు ధైర్యం ఇస్తుండే వాడు. అయినా భయం. ఎందుకు కాగూడదు? బయటినుంచి ఒక్క ధూళికణం. మల్లచివర శరీరంలో చేరితే శరీరానికి ఎంతబాధ కలుగుతుంది? ఇదిమాత్రం - ఇవి ఏమిటో ఏమో! కుముదకు మొదట ఆ భయం. పిల్లవాడా, పిల్లా అనేభయం లేదు. ఏదైనా ఒక సరియైనరూపం దాలుస్తుందా - అని భయం. దానికంటె ముందు ఇంకా ఒక భయం. తన సంగతే క్షేమంగా సురక్షితంగా వుంటుందని ఎలా చెప్పడం? ఏమైనా ఎక్కువ తక్కువ అయితే తన ఆయుస్సుకే ముప్పువస్తే? ఈ ఆలోచనవల్ల మొదట్లో తన పరిస్థితి అసంతోషజనకంగా వుండేది. ఏదో చెప్పలేని ఆగ్రహం కలిగేది. వొక్కోసారి మనస్సులో రామన్నను దూషించేది; ఎవరిభారం, ఎవరు అనుభవించాలి? స్త్రీకి ఇవొక అన్యాయం అనుకునేది. తనకు ఎప్పుడూ అదే ఆలోచన అయితే రామన్నకు పొరపాటునకూడా దానిధ్యాసే లేదు కదా? ఏమీ కానట్లుగా ఎప్పటిలాగే వ్యవహరిస్తున్నాడుకదా అనుకునేది. పడుకున్నప్పుడు ఇలాంటి ఆలోచనలతో నిద్రరాకుంటే రామన్నమీద తనకోపాన్ని వ్యక్తం చేయడానికి అతని కభిముఖంగా పడుకుంటూవుండేది. తను ఎంతోసేపు నిద్రరాక పొర్లాడినా రామన్న గాఢంగా నిద్రించేవాడు. అప్పుడు మహాభయం వేసేది. రామన్నకు తనపట్ల ఇప్పుడు ఆసక్తి లేదా? మార్పుచెందుతున్న తన శరీరాన్ని చూసి అతను అసహ్యపడుతున్నాడా? రామన్న ప్రేమకథ ఇంతటితో ముగిసిందా? ఒక్కొక్కసారి ఇలా వూహించేటప్పుడు నిద్రలోనే రామన్నచేయి తనకి తగిలేది. అతనికి తెలిసో తెలియకనో తనపొట్టకి తగులుతుండేది. అలాంటిసమయంలో చలితో ఆమెశరీరం వణికేది. అన్ని ఆలోచనలు ఆగిపోయినట్లయి మెల్లిగా

తంగిమ మార్చి మళ్ళీ రామన్నవైపు ముఖంతిప్పి పడుకునేది: కాస్సేపటికి నిద్ర పట్టేది.

ఈ పూర్వస్మృతివల్ల ఇప్పటికీ గొంతు నిండినట్లయింది కుముదకు. ఎంతో తాదాత్మ్యం ఇద్దరిలో? ఎవరు తెలుసుకోగలరు ఒకానొకప్పుడు తామిద్దరిలో అలాంటి తాదాత్మ్యం వుండేదని? మోహనుడు లోపల పెరుగుతున్నకొద్దీ తనకూ ధైర్యం హెచ్చింది. రామన్న సంతోషమూ ఎక్కువయింది. ఒక్కొక్కమారు రామన్న మాటలతో తనకు నవ్వువచ్చేది. తను చేసిన తుంటరిపనులను గర్వంతో చూసే పసివాడిలాగుండేవా డాయన. 'హాఁ లేవొద్దు!' 'అబ్బెబ్బే దాన్ని ఎత్తవద్దు!' 'వూరికే మెట్లు ఎక్కొద్దు!' అనే అతనిమాటలు విని నవ్వవలసి వచ్చేది. భారం శరీరంలో, బయట వుండేవాన్ని ఎత్తిపెట్టుకున్నది కాదు. అందువల్ల అదీ తన శరీరంలో వొక అవయవంలాగే సహజమైవున్నది అనేవిషయం అతని కెలా తెలియదం? భర్త అంటే అనుభవంలేని ఒక బిడ్డ అని అప్పుడు తోచింది తనకి. ఒకరాత్రి, ఏదో కారణంతో కొంత అస్వస్థత అనిపించి తనకు నిద్రరాలేదు. అప్పుడు దీపం వెలిగించి, లేచి పరుపుమీద కూర్చుంది. పక్కనే పడుకొని వున్నాడు రామన్న. ముఖంమీద విశ్రాంతితోకూడిన మౌగ్ధ్యం. గాఢనిద్రవల్ల శరీరం బొమ్మలా నిశ్చలంగా వుంది. ఎడమ అరచేయి తలక్రిందవుంది. ఎడమ వైపున్న అతని కుడిచేయి ఇంకా తనమీదనే వుంది. తను లేచికూర్చొని మెల్లిగా ఆ చేతినెత్తి తన తొడమీద వుంచుకుంది. రెండుచేతులతో పట్టుకున్నది; వెచ్చని ఆ చేయి తనకూ వెచ్చనవిపించింది; రెండుచేతులతో ఆ చేతినెత్తి తన పొట్టమీద పెట్టుకునింది: ఒకక్షణంలో కళ్లకు చీకటి క్రమ్మినట్లయింది; రామన్న చెయ్యి పొట్టకు తగలగానే ఏదో మెరిసినట్లయింది; ఎదురుగా పడుకున్న రామన్న తనలో లీనమైనట్లయింది; గాభరా చెందింది; నిజం, నిజం, రామన్నే తనలోపల మాయమైనాడు; అదిగో - అదిగో - అణగివుండడానికి ప్రయత్నిస్తున్నాడు - అని తికమకపడి చేతిని గట్టిగా పట్టుకొన్నది; రామన్న చటుక్కునలేచి, 'ఏమిటి? ఏమైంది కుముదా' అని కూర్చున్నాడు; అంతలో తనకు తెలిసింది ఏమైందన్నది; ఆ జ్ఞానం వల్ల ఆనందం పొంగిపొరలి తనముఖంలో నవ్వు నిండింది; ఒకక్షణం తనని నిదానించిచూసి, తనచేతినిచూసి చిరునవ్వుతో ముఖం వికసించగా 'ఓహో!' అన్నాడు!

ఆరోజు మొదటిసారి తనలో కొత్తప్రాణం కదిలింది!

వాడే నా మోహనుడు! కాదు, మా యిద్దరి మోహనుడు - అనుకున్నది కుముద. అప్పట్నించి మోహన్, రామన్న ఇద్దరూ ఒకేవ్యక్తి అనిపించింది కుముదకు.

ఆ మోహనుణ్ణి ఒకరోజు కొట్టిందికదూ? మోహన్, రామన్న తనకు వొకటే అయినప్పుడే తను రామన్నను కొట్టినట్లే కదా? అందుకనే మోహనుడికి పడిన దెబ్బలవల్ల రామన్నకు దెబ్బ తగిలిందేమో!

కుముద చాలా నిరాశతో నిట్టూర్చింది. ఏళ్ళకు ఏళ్ళనాటి అన్ని చేదుజ్ఞాపకాలను ఒకేమారు బయటికి వచ్చినట్లుగా దీర్ఘంగా నిట్టూర్చింది.

'తిరిగి రానేరాను' అని చెప్పింది ఆరోజే, అయినా తిరిగివచ్చి యీనాటికి ఎన్నో సంవత్సరాలు - యుగాలేమొ!-జరిగాయి.

అదీ ఒక అనుభవమే - అనుకునేంతలో ఆమెకు వొక్కసారిగా నవ్వు వచ్చింది, ఎలాంటి అనుభవం! ఇప్పుడు వినోదంగా వుంది. తను అంత అల్లరి చేసి, అంతకోపంతో మోహనుణ్ణి తీసుకువెళ్లింది. ఎక్కడికని పోవడం? మళ్ళీ మేనత్త యింటికే.

పొద్దున్నే చేరింది మేనత్త యింటికి. ఒకచేతిలో మోహన్, మరోచేతిలో చిన్నసంచీ. ఏదో శ్లోకాలను గొణుగుతూ ముసలావిడ కళ్లాపి చల్లుతున్నది. తను వచ్చిం దింకా ఆమె గమనించలేదు.

చివరికి 'అత్తా' అని ఆమెను పిలవవలసి వచ్చింది.

ముసలావిడ ఒక్కసారి తిరిగి, తననిచూసి, నమ్మలేకపోవడంవల్లనో, సరిగా కనిపించకపోవడంవల్లనో కనురెప్పలు ఆడించి మళ్ళీ దృష్టిసారించిచూసి, 'ఎవరు? కుముది!' అన్నది.

'ఏమిటే! కుముదీ? చెప్పాపెట్టకుండా వచ్చావు? వొక్కదానివే వచ్చావా యేం?

మాట్లాడుతూ ఇద్దరూ లోపలికి వెళ్ళారు. అప్పుడే నిద్రనుంచిలేచిన మోహన్ ఎక్కడికొచ్చామని తెలియక తన నొకమారు ముసలావిడని ఒకసారి చూస్తూ

న్నాడు; మాట్లాడుతూవుండగానే వాణ్ణి తను క్రిందికి దింపాలనుకున్నదో ఏమో, పిల్లవాడు తనను గట్టిగా పట్టుకొన్నాడు; తను క్రిందికి దింపాలనుకునేసరికి ఒక్క పోటుగా ఏడవసాగాడు.

'ఏమే? మళ్ళీ గర్భంతో వున్నావేమే!'

ఆక్షణంలో కుముదకు అత్తమాట తెలియనేలేదు. ఏ ప్రసంగం? ఏం మాట?

'ఏమన్నావత్తా?' అని తను ఆశ్చర్యపడి అడిగింది.

'కాదు, బిడ్డ ఏడుస్తున్నది, అందుకడిగాను' అన్న దత్త.

అంతలో మోహన్ను ఎత్తుకున్నచోటే తను కూర్చున్నది. మోహనుడు పూరుకున్నాడు.

'బిడ్డ ఏడుస్తున్నది అంటూ నువ్వు ఇంకేందో అడిగినట్లయింది' అన్నది తను.

'ఏమీలేదు; మళ్లీ కడుపుతో వున్నావా అన్నాను.'

'ఉస్సు! నాకేమన్నా పిచ్చిపట్టిం దేమత్తా?'

'వయస్సు అయినతర్వాత పెళ్ళి కావడం, పిచ్చిపట్టినట్లే మరి.'

'బిడ్డ ఏడవడానికీ దానికీ ఏం సంబంధం?'

'మొదటిబిడ్డ ఇంకా పాలు తాగుతుండగానే మళ్ళీ కడుపొస్తే బిడ్డలిట్లా అల్లరి పెడతారు.'

ఇదేం తత్త్వజ్ఞానమో, అనుభవజ్ఞానమో, శాస్త్రీయజ్ఞానమో? కుముదకు తెలియలేదు. ఆవిడ నవ్వేసింది.

'నవ్వుతావెందుకు?'

'నీమాటకు నవ్వు వచ్చిందత్తా.'

'నవ్వు వచ్చేందుకేముంది? మొన్నమొన్న మొగుడిదగ్గరికి వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చావు. అందుకడిగాను.'

'అంటే నాకేం రెండోపని లేదేం?' తను నవ్వుతూనే అడిగింది.

'పెళ్ళయి కనేది మొదటిపని. పెళ్ళి కాకుండానే కనేది రెండోపని - యిప్పటి పిల్లలకు!'

అబ్బ! ముసలావిడ ఎంత ద్వేషంతో ఆ మాటను చెప్పింది!

'అందరూ అలా వుండరు. అత్తా. చెడ్డవాళ్లు యీ కాలంలో వున్నట్టే ఆ కాలంలోనూ వుండనే వున్నారు.'

'ఆ కాలంలో సిగ్గువుండేది. ఏ నుయ్యో గొయ్యో చూసుకొని ప్రాణాలు తీసుకునేవాళ్ళు. ఇప్పటిలాగా ధైర్యం లేదు. తికమకపడి పెళ్ళి చేసుకుంటారు.'

'ఎందుకత్తా? నేను అంత చెడ్డదాన్నని—'

'అయ్యో! వెర్రిదానా? మాటకువచ్చి చెప్పాను. నామాట అంతగా పట్టించుకోవద్దు.'

అత్త ఈమాట అంటుండగానే, తనకు ఏమైందో ఏమో. ఒక్కసారిగా ఏడుపు ఆపుకోలేకపోయింది.

ఇప్పుడు తలచుకుంటే నవ్వు వస్తుంది. అయితే అప్పుడు తన వెక్కిళ్ళుచూసి ముసలావిడ కలవరపడింది.

'అయ్యో! కుముదా, కుముదీ! దీన్ని కొయ్య. నా నాలిక చెడ్డది. ముసల్దాని మాట ఏం చెపుతావు? అదేమో అంటారే, తనకులేని కుంకుమ మరొకరి నుదుట చూస్తే ఏమొస్తుంది అని? కుముదా, నాపాటికి నేను కూర్చొని కూర్చొని ఇలా మాట్లాడ్డం నేర్చుకుంటాను. అయ్యో. పిచ్చిదానా! మంచి ఆయుష్మంతుడుకానీ నీ మొగుడు. ఇంకా నలుగురు బిడ్డల్ని కను. నేనుందేంతవరకు ఇక్కడికే రా ప్రసవానికి—'

ముసలావిడమాటకు ఏడుపు మాయమై నవ్వు ఆపుకోలేకపోయింది. ముసలావిడ మండిపడింది.

'ఇదేమిటే? ఉన్నట్లుండి ఏడుస్తావు. ఉన్నట్లుండి నవ్వుతావు! నీతో మాట్లాడాలన్నా ఎలా?'

'లేదత్తా. అందుక్కాదు. నేను కడుపుతో లేను అని చెప్పినా—' కళ్ళను తుడుచుకుంటూ నవ్వులో మాటలురాక తను ఆగింది.

'ఇప్పుడు లేకుంటే లేదు. ఇంతలోపలే కావచ్చు. ఇంకా చిన్నదానివి నువ్వు. అంత చింత ఎందుకు నీకు?'

'లేదత్తా. నేను ఏమీ చింతపడడం లేదు. అలాంటిది నాకు అయ్యేట్లూ లేదు.'

'వూరికే నోటితో అనేమాటలు—'

'లేదత్తా నిజమే. ఇక ఎప్పటికీ లేదు.'

'అంటే యేవిఁటే?'

'అంటే ఏవిఁటి?' అన్నది తనకూ తెలియలేదు. తాను దాన్నిగూర్చి ఆలోచించనూలేదు. అయినా మనస్సులో వుండేదాన్నంతటినీ, మరొకరిముందు చెప్పటానికి అదే మొదటి అవకాశమైనందువల్ల, ఒకేధాటిగా చెప్పింది చెప్తూ చెప్తూ తనకే దానిలో విశ్వాసంలేదనిపించి తర్వాతమాటలో తత్తర బిత్తర అయిపోయింది. ముందుచెప్పిందే మరిచి మరోసారి చెప్పింది. ముందు చెప్పింది. జ్ఞాపకం రాగానే తర్వాత చెప్పబోయేది మరిచింది. చివరికి తను ఇదేమీ చెప్పకుండావుండవలసిందేమో అనిపించింది. నాలుక తడబడింది—

'అయ్యో! ఏం చెప్తుందో అని అన్నాను! మొగుడు పెళ్ళాల తగువు అను' అని దీర్ఘంగా నిట్టూర్చింది అత్త.

తను ఏం చెప్పిందో ముసలావిడకు అర్థమే కాలేదు అని తనకు సంతోషం కలిగింది. అంతవరకున్న ఆలోచనలను బయటపెట్టినందువల్ల మనస్సు తేలిక పడింది.

లేక ఆవిడకు అంతా తెలిసిందా!

లేక తనకు తెలుసు అన్నదే ముసలావిడకు తెలియదా?

ఎలాగైతేనేం తను మళ్ళీ రామన్నదగ్గరికి వెళ్ళేట్లు చెయ్యడానికి ముసలావిడే కారణమైంది!

....జ్ఞాపకం తనను ఎక్కడెక్కడికో తీసుకెళుతున్నది కదా! ఇప్పుడెందుకు ఆ జ్ఞాపకాలు?

ఎందుకనో? అనాడు మువలావిడ చెప్పినమాట మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం వస్తున్నదీరోజు!

ఏదో చెప్పిందికదా! మొదట అదొక తమాషా అనిపించి తను నవ్వింది. ఆ తర్వాత ఆమాట తనను కదిలించినట్లయింది. ఏ సందర్భం? హాఁ, జ్ఞాపకం వచ్చింది. ఆమాట ఈమాట మాట్లాడేటప్పుడు ముసలావిడ ఒకసారి తనని, 'నీ మొగుడు ఏంచేస్తాడు?' అని అడిగింది.

'పుస్తకాలు రాస్తారు.'

'అదికాదు నేనడిగింది. బొజ్జ నింపడానికి ఏం చేస్తాడు అన్నాను.'

కుసుమకు నవ్వు వచ్చింది. 'ఏమత్తా, పుస్తకాలురాస్తే బొజ్జ నిండదేం!' అని నవ్వుతూనే అడిగింది.

'ఏమో తల్లీ! నాకెలాతెలుస్తుంది? పొలం - యిల్లు చూసుకోవడం, వర్తక వ్యాపారం చెయ్యడం, లేక నౌకరీచేసేది -మా కాలంలో మగవాళ్ళు చేసేపనులివే. ఇప్పటికాలంలో ఏమేమో చేస్తారు.'

'పుస్తకం రాసేవాళ్ళు నలుగురిలో పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తారత్తా.'

'దానికేముంది? మనిషి ప్రవర్తన బాగుంటే ఏంచేసినా పేరు ప్రఖ్యాతులు వుంటాయి....హాఁ....అంటే - పుస్తకాలు రాస్తాడు? ఎంతిస్తారు నెలకు అతని పుస్తకాలు రాసిందానికి?'

'అదేం నెలజీతమూ - నెలనెలా చేసేపని అనుకుంటున్నావా అత్తా? ఎప్పుడు రాయాలనిపిస్తే అప్పుడు రాయడం——'

'అయితే? మిగిలినవేళలో కడుపునిండాలంటే ఎలా?'

'పొలమూ-ఇల్లూకూడా వుంది. పెద్దవాళ్ళు పెట్టిపోయింది.'

'అయ్యో! పిచ్చిదానా! దాన్ని చెప్పకూడదూ ముందు? అంతవుంటే చాలుగా! ఇంట్లో మనుషులు ఎక్కువగా వున్నారా?'

'ఎవరూ లేరు. ఇన్నిరోజులు మేమిద్దరమే.'

'అంటే? ఇప్పుడు అతన్నొక్కడినే విడిచివచ్చావా?'

తను ఆ విషయాన్నే ఆలోచించలేదు. ఇప్పుడు జవాబూ ఇవ్వలేదు. మాట్లాడుతూ మాట్లాడుతూ ముసలావిడ ఒక్కసారిగా నవ్వింది.

'ఎందుకత్తా? ఏం—'

'ఏదో గుర్తు వచ్చింది—'

'ఏమిటి?'

'ఏముందీ? ముసల్దానికి పనేముంది? మొదటివిషయాల్ని జ్ఞాపకంతెచ్చుకొని నెమరువేసుకుంటూ కాలం గడపడం?'

'అయినా నవ్వావుకదా, అత్తా?'

చివరికి బలవంతంచేసి అత్త జ్ఞాపకంచేసుకున్న కథను విన్నది.

'కాదు - నేనూ ఒకసారి నీలాగే కోప్పడ్డాను. అప్పటి తమాషాలు గుర్తొచ్చాయి—'

'అంటే - నాలాగా—?'

'చూడు కుముదీ, మొగుడికోపం వేరు, ఆడదానికోపం వేరు.'

'ఎందుకో, ఆడదీ ఒకమనిషి కాదేమిటి?'

'అవును. అయినా ఆడది మనిషి అని మీసాలురావు. మగవాడు మనిషి అని తల్లి కాదు. దేవుడు తను అనుకున్నట్లు చేశాడు. ఒక్కొక్కరికి వొక్కొక్క స్వభావం యిచ్చాడు. బయట నలుగురు మనుషులతో తిరిగేమగవాడు కోప్పడతాడు, తగవులాడతాడు. మళ్లీ మర్నాడు వాళ్ళతోనే వ్యవహారాలు జరుపుతాడు. అయితే మనకలాంటి వ్యవహారాలు లేవు. మనం కోప్పడ్డాము అంటే రోజంతా మనస్సులో కుములుతూ కూర్చుంటాం.'

'ఏలాగైతేనేం నువ్వు చాలా మొండిదానివి అనత్తా.'

'మొగుడికోపం ముక్కుచివర, ఆడదాని మొండితనం పొయ్యిచివర.'

'అంటే? నువ్వు వంటచేసేదానివి కాదా యేం?'

'అయ్యో! నేనేం నీలాగా వొక్కదాన్నా యింట్లో. ఇంటినిండా మనుషులు. నేను వంట చెయ్యకుంటే ఎవరికడుపూ నిండదు.'

'అంటే కోపంవస్తే యేం చేసేదానివి?'

'ఆ కది చేసేదేముంది? విడిగా పరుపువేసుకొని పడుకునేదాన్ని. ఎంత మాట్లా డించినా మాట్లాడేదాన్ని కాదు—' ఒక్కసారిగా నవ్వింది.

'ఎంత తమాషాఅయిన విషయం జ్ఞాపకం వచ్చింది, అత్తా?

'వినోదం కాదు; అదే, నీమాదిరి అన్నానుకదా! చూడు, కుముదీ, ఒక్కొక్క మగవాడిస్వభావం వొక్కొక్కవిధం. అయితే ఆడదానిది అలాకాదు. ఇంట్లో కష్ట పడడం, తన యిల్లు అని తను పనిచేసినా 'పని చాలా ఎక్కువయిందా?' 'తల నొప్పా' 'చాలు ఇంక విశ్రాంతి తీసుకో' ఇలా భర్త ఏమైనా తనను అడగాలి అని అనిపిస్తుంది మనకు. ఆయన విశ్రాంతి తీసుకో అంటే మనమేం తీసుకోము. మనకోసం బాధపడేవారు వున్నారుకదా అన్నదే ఓదార్పు. ఒక్కొక్కసారి గౌరి గంగ అని, పండుగ పర్వం అని చీర సింగారాలుచేసుకొని కూర్చుంటారు. అప్పుడు మగవాడు దాన్నిచూడనీ, సంతోషపడనీ అని ఆశ. అయితే చెప్పాను కదా! ఒక్కొక్కమగవాడిది ఒక్కొక్కవిధమని. మా ఆయనకు ఇలాంటి అల వాటు వొక్కటీ లేదు. పెళ్ళాం అనేది వుంది, యింట్లోలేక లేదు అనేమాటే లేదు. ఒక్కసారి ఏదో మాటకుమాట పెరిగి మాకు తగువొచ్చింది. నాకూ చాలా కోపం వచ్చింది. చివరికి నేనూ చెప్పాను. 'నాలుగురోజులు నేను పుట్టింటికి వెళతాను' అని. 'పోవాలనిపిస్తే పో' అన్నారు. నేనే ఆయనకు అక్కర్లేకపోయానని నాకు కోపం వచ్చింది. నేను సర్దుకోవడానికి ప్రారంభించాను. రాత్రిబండికి పోదాం అని.'

'ఎందు కాగావత్తా! తర్వాత ఏమయ్యింది?'

ముసలావిడ గట్టిగా నవ్వింది. నవ్వుతూనే అన్నది. 'నాకోపం కథ అక్కడితే ముగిసింది.'

'అంటే?'

'అంటే ఏముంది? అందుకే చెప్పలేదూ నీకు ఆడదాని కోపం చేటని.'

'కాదు. అయితే. ఏమైంది? తగువు తీరిందా? మీ ఆయన క్షమాపణ అడిగారా?'

'ఏమన్నావు! క్షమాపణ అడగడమా? ఓసి పిచ్చిదానా! అంతమాత్రానికే అద దానికి వోదార్పు కలిగేట్లయితే మాటకొకసారి తప్పయిపోయింది అనవచ్చు. తమలో తమకు వచ్చేతగవుకు తప్పయింది అనే మొగుడికి ఆ మాటలో గొప్పతన మేముంటుంది.'

'అయితే నువ్వు యెందుకు పోలేదు___'

'నేనెలా వెళ్తాను. కుముదీ? అదే చెప్పానుకదా అంతా సర్దుకున్నానని. అప్పుడాయనా కోపంతో బయటికి బయలుదేరారు. ఆ పెట్టె తెరిచారు. ఈ పెట్టె తెరిచారు. పరుపుఎత్తి పారేశారు; నా కనిపించింది తామూ వెళ్ళిపోతానని బెదిరిస్తారేమోనని. అయితే అంతా విసిరేసి 'ఛీ! ఎక్కడుందో నా షర్టు?' అని తిరగ సాగారు. నేను వొక్కమాటా లేకుండా వంకీకి తగిలించివున్న షర్టు తీసిచ్చి సర్దుకోడంలో మునిగాను. షర్టు వేసుకొని వున్నచోటల్లా చేతులుపెట్టి. బొమలెగరేసి ఈవైపు అవైపుచూసి 'నాశనం! ఒక్కటీ వుండేచోట వుండవు. నా డబ్బులు___' నేను చటుక్కునవెళ్ళి దిండు క్రిందవున్న ఆయనపర్సు తీసుకొచ్చాను. నా పనిలో మునిగిపోయాను. కొంతసేపటికి బయటినుంచి అల్లరి వినిపించింది. తలుపుదగ్గిరకెళ్ళి చూశాను. ఈయనా వెతుకుతున్నారు! ఇంకిద్దరు వెతుకుతున్నారు! ఎందుకో?- అని ముందుకువెళ్ళిచూస్తే ఇంట్లో వున్నవాళ్ళందరూ వెతుకుతున్నారు ఈయన కాళ్ళ చెప్పులకోసం! ఆపుకోలేనంత దుఃఖం వచ్చింది. త్వరత్వరగా ఇంట్లోకి వెనక్కువెళ్ళాను. అక్కడున్నాయి ఆయన చెప్పులు. వాటినితెచ్చి ఠప్ అని విసిరేసి. కాళ్ళు దబాదబా వేస్తూ నాగదికివెళ్ళి. తలుపు దబాలునమూసి. చిలుకువేసి. కట్టిన నా పరుపుపరిచి గొల్లని ఏడుస్తూ కూర్చున్నాను. ఏడ్చాను-ఏడ్చాను-ఏడ్చాను-కుముదీ___'

ముసలావిడకు చెప్పేటప్పుడు నవ్వు ఆగలేదు.

'పోతుంటే ఎవరూ వద్దనలేదని చిన్నపిల్లల్లా ఏడ్చావో ఏమో!'

'పోతుంటే వద్దనలేదని!' ముసలామె నవ్వు ఆపుకుంటూ. కళ్ళు తుడుచుకుంటూ చెప్పింది. 'నన్ను ఎవరు వద్దనేవాళ్ళు? నేను ఏడ్చింది నాకోసం కాదు. ఆయనకోసం___'

'ఆయనకోసం!'

'కాదు. నేను ఇంక బయలుదేరబోతున్నాను. అప్పుడే ఇంతగొడవ జరిగింది. వస్తువు దొరక్క, యీయనకు! ఇంక నేను వెళ్ళానంటే ఈ యున్ను చూసేదెవరు? ఈయన చొక్కాలు, పంచెలు దొరికేదెల్లా? శుభ్రంగానైనా వుంటాయో లేదో అనే ఆలోచనవచ్చి యేద్చేశాను, కుముదీ.'

కుముదకు ఎక్కడో ఒకవిధమైనబాధ కలిగినట్లయింది. అత్త తన కథను చెప్పడంలేదు. అయితే తనకు, కుముదకు - బుద్ధి చెపుతున్నది అనిపించింది. తను లేనప్పుడు రామన్న భోజనంలేక పడుకున్నదృశ్యం కళ్ళఎదుట నిలిచింది; వుత్తరం హడతో రాయడానికి ప్రయత్నించే రామన్న తన కలంకోసం వెతుకుతున్నాడు; అతని బట్టలు మాసిపోయాయి - ఇంకా ఏవేవోదృశ్యాలు కళ్ళముందు నిలిచాయి. అత్త ఏమేమో చెపుతున్నది. మనసులేదు. అత్తమాటలు ఇంకా సాగాయి; 'తెలిసిందా కుముదా? బయట ఎలావున్నా ఇంట్లో పిల్లవాడిలాగు భర్త! పెరిగినపిల్లలకు ఇల్లువిడిచి బయట ఆడుకునే అలవాటు ఎక్కువైతే తల్లికి మొదట్లో గిట్టదు. మన కనిపిస్తుంది. మనం పిల్లల్ని ప్రేమిస్తాం. పిల్లలు మనల్ని ప్రేమించరు అని. నోరువిడిచి చెప్పరు పిల్లలు. అయితే కాలికి ఒకముల్లు గుచ్చుకుంటే పరుగెత్తి మనదగ్గరికే వస్తారు....అందుకే చెప్పానుకదా - భర్త తనప్రేమను చూపించే విధమే వేరని....ఎందుకని? నా మాటలు చెవి కెక్కుతున్నాయా లేదా, కుముదీ? ఆదేవిటే? నా కథవిని నువ్వెందు కేడుస్తావు?'

తను ఏడ్చింది. ఏడుపు ఆగక జలజలపారేయి కన్నీళ్ళు. తర్వాత ఒకవారానికి తను మళ్ళీ ఇంటికి వెళ్ళింది.

ఇంట్లో కాలు పెట్టగానే రామన్న మోహనుడి నెత్తుకొని ముద్దు పెట్టుకోవడం చూచి తనవొళ్ళు ఝల్లుమన్నది.

గడియారాన్ని చూసుకొన్నది. అయ్యో! పిలవడానికి వచ్చేవేళ అయింది. ఎవరికి తెలుసు? 'మోహనా! నువ్వూ పద' అనవచ్చు రామన్న బయలుదేరే టప్పుడు. ఈ పిల్లవాడు ఇంకా రాలేదు. వాడిగుడ్డలైనా సిద్ధంచేసివుంచుతాను అను కుంటూ కుముద ఆపనిలో మునిగింది.

# 12

రామన్న కిటికీలోంచి చూస్తున్నాడు. పగలు గడచిపోతున్నట్లుగా, రాబోయే రాత్రి నీడలా క్రమేణ మసకలు కమ్ముకుంటున్నట్లు అనిపించింది. పగలు-రాత్రి. భర్త-భార్య- ఇదొక కవుల సంకేతం. కాదేమో-అనుకున్నాడు. పగలు-రాత్రుల సంబంధం తనకు కుముదకు వుండేసంబంధంలా కాదూ? నడుమ చీకటి కమ్ముకొని వున్నది కదూ? రామన్న కిటికీలోంచి బైటికి చూశాడు. మోహన్ రావచ్చునేమో అని. వస్తే మంచిది అనుకున్నాడు; అతనినీ సభకు పిలుచుకొనివెళితే పోతుంది. అని మరొకసారి అనుకున్నాడు.

కిటికీలోంచిచూస్తే మోహనుడు వస్తున్నసూచనలే లేవు. రావచ్చు - అంటూ మళ్ళీ కుర్చీదగ్గరికి నడిచాడు. మోహన్ బయటినుంచి వస్తాడనేటప్పుడు రామన్న కళ్ళముందు ఎప్పుడూ ఒకే ఒకదృశ్యం నిలుస్తుంది. కుర్చీలో కూర్చొని కిటికీవైపు చూడగానే మళ్ళీ అదేదృశ్యం అతని కళ్ళయెదుటవచ్చి నిలుచున్నది. ముఖంలో ఆనందకళ వెలిసింది.

ఎన్నిసంవత్సరాల క్రిందటిదృశ్యం! ఈ మధ్యకాలంలో మోహనుడు ఎంత పెరిగాడు! అయితే ఆనాటిదృశ్యం యింకా సమసిపోలేదు. ఏడో ఎనిమిదో సంవత్సరాల ముందు మాట. కుముదకి రెండోసారి తనమీద కోపంవచ్చి తననువదలి వెళ్ళిపోయింది. ఆ సమయాన్ని తను ఎలా గడిపాడో! అయితే వొకరోజుపొద్దున్న హఠాత్తుగా తిరిగి వచ్చింది; ఆమెను ఏవిధంగా ఆహ్వానించాలి అనే సంభ్రమంలో వున్నప్పుడు ఆమె ఎత్తుకొన్న మోహనుడు ఒక్కసారిగా తననిచూసి చాలా సంతోషంతో పిలిచి రెండుచేతుల్ని ముందుకు చాచాడు. తనూ వాడిని ఎత్తుకోవాలని అడుగు వేయబోయి మళ్ళీ ఆగాడు; అంతలో కుముదే ఒకటిరెండు అడుగులు ముందుకువచ్చి వంగి మోహనుణ్ణి కిందికి దించింది; వాణ్ణి ఎత్తుకొని బయటికి వెళ్ళిబఃకుతున్నహృదయాన్నే పట్టుకొంటున్నాడా అన్నట్లు, బలంగా హృదయానికి హత్తుకొని, ఏకధాటిగా ముద్దుపెట్టుకున్నాడు; మోహనుడు రెండుచేతులతో రామన్న కంఠాన్ని చుట్టుకొన్నాడు; అప్పుడు అత్యంతవుల్లాసంతో కుముదవంక చూశాడు.

అబ్బ! అదెలాంటి దృశ్యం! మాటలు చాలవు. ప్రతిభావంతుడైన చిత్ర

కారుదే కావాలి దాన్ని వర్ణించడానికి. మోహనుడిముఖంలో ఎంత ఆనందపుకళ వచ్చింది! అందుకే ఆనందమే రసం అంటారో ఏమో? ఎందుకంటే ఆ ఆనందం తోగూడిన ముఖాన్ని చూసిన వాళ్ళకందరికీ ఆనందం కలుగుతుంది; ఆ పిల్లవాడి నుండి ఆనందకిరణాలే వెలువడి ఇంటినంతట్నీ ఆనందమయంగా చేశాయేమో అని పించింది.

ఇంక కుముదముఖం! రామన్నకు కుముదను చూడగానే వేరొకభావన కలి గింది. ఆమెను చూసినప్పుడెల్లా తనహృదయాన్ని లాగివేసే మోహనస్త్రీగావే ఆమె కనిపించింది; తాను భోగి, ఆమె భోగ్య, అనే ఆలోచనే ప్రధానంగా వచ్చేది. అయితే ఆరోజుమాత్రం కుముదను చూసినప్పుడు భోగ్యస్త్రీ అనే ఆలోచనే రాలేదు. ఇంతెందుకు? ఆమె స్త్రీ అనే ఆలోచనే రాలేదు. అత్యంత సంతృప్తితో కూడిన భావం ఆమెముఖంలో; మిగలినవాళ్ళ ఆనందాన్నిచూసి తృప్తిచెందే సాత్త్వికకళ కనపడింది ఆమె ముఖంలో; తనని తాను మరిచి మరొకరి సుఖం కోసమే బ్రతికే నిస్వార్థభావం ఆమె ముఖంలో తాండవమాడింది.

మాతృత్వమూర్తిగా భాసించింది ఆరోజు కుముద. ఆశ్చర్యంకలిగించేమాట ఏమిటంటే వెనుక తమ యిద్దరిలో ఏ వైమనస్యమూ కలగలేదు అన్నట్లుగా నవ్వు ముఖంతో తనతో మాట్లాడింది?

'ఒక చిన్నపిల్లవాడు, ఒక పెద్దపిల్లవాడు' అన్నది నవ్వుతూనే.

'ఆఁ?'

'కాదు, మీ యిద్దర్నీ చూస్తే ఎవరు పిల్లలు అని చెప్పటమే కష్టం అన్నాను.'

మోహనుడు, ఆ మాటలో అర్థాన్ని గ్రహించినట్లు, కళ్ళు పెద్దవిచేసి తనను చూశాడు. మోహన్ విప్పారినకళ్ళను చూడగానే హృదయంలో ముల్లు గుచ్చుకున్న ట్లయి, ఎదటిదృశ్యం చటుక్కున మారిపోయింది.

రామన్న నిరాశతోకూడిన నవ్వుతో నిట్టూర్చాడు. ఎప్పుడూ తనకు, కుముదకు మధ్య అటువంటిప్రసంగం కృత్రిమవాతావరణం కల్పించేది.

మోహనుడికళ్ళనుగూర్చి రామన్నకు ఇప్పటికీ ఆశ్చర్యం కలుగుతుంది. అతన్ని చూడగానే అధైర్యం కలుగుతుందేది.

ఆ కళ్ళు మోహనుడివి కావు. సరళ కళ్ళు!

రామన్నకు అనుమానమే లేదు. మోహన్ నవ్వేటప్పుడైతే సరళ నవ్వు ముఖంతో మాట్లాడుతున్నదేమో అని ఒకక్షణం భ్రమ కలిగేది. ఎన్నోసార్లు అలా భ్రమించి అదిరిపడ్డాడు.

మోహనుడికి సరళ కళ్ళు ఎలా వచ్చాయి? మోహన్ తనకు, కుముదకు కలిగిన బిడ్డ.

లేక ఆ కళ్ళు సరళకళ్ళే అని తనకు భ్రాంతా?

లేక సరళే రూపంలో తమమధ్య తిరుగుతోందా? తను తల్లి కాలేదనే విచారం ఆమెను ఎప్పుడూ పీడించేది; ఇంట్లో బిడ్డలుండాలి అని ఆమె ఎప్పుడూ కోరుకుంటుండేది. తనూ ఎన్నోసార్లు ఎగతాళి చేశాడు.

'బజారులో కొనుక్కోనిపద్దాం. ఈకాలంలో డబ్బులిస్తే ఏం దొరకవు? అంటూవుండేవాడు.

బజారులో కాయలు కూరలు దొరుకుతాయని ఇంట్లో కూరలు చేసుకోకుండా వుంటామా' అన్నదొకసారి.

'వూరికే కష్టపడడం అలా చేయడమంటే.'

'అందుకే దానిరుచి ఎక్కువ.'

'పోనీ, వదిలెయ్. సరళా! నేను అన్నది, అంతగా అవసరమైతే దత్తు తీసుకుంటే పోతుందని.'

'నేననేది, ఇంట్లో పుట్టిపెరిగే బిడ్డ—'

'నేనూ కాదనలేదు, నువ్వూ కాదనలేదు, అయినా—'

'చాలు. నేనేమన్నా చిన్నపిల్లననుకున్నారా? నావల్ల మీకు బిడ్డలప్రాప్తి లేదని నాకూ తెలుసు.'

'నువ్వంటే నాకు సుఖం. ఎక్కువగా నాకేమీ కావాలనిపించదు.'

'మీరు నామాట వినండి—'

'ఆజ్ఞ.'

'మరో పెళ్ళి చేసుకోండి.'

'ఏమన్నావు?'

'నేను వున్నప్పుడే చేసుకుంటే, యీ యింట్లో పిల్లలు పుట్టిపెరగడం చూస్తాను.'

'అయితే? ఇలాంటిదాన్ని పెళ్ళి చేసుకుంటే బిడ్డలు పుడతారని నమ్మకం వుండాలికదా? ఏమంటావు? మరోసారి మోసపోకుండా బిడ్డలుంటే ఆమెనే పెళ్ళి చేసుకునేదా? అఁ! హహ.'

'చాలు. వూరుకోండి! ఏదోవొకటి మాట్లాడవద్దు!'

రామన్న ఇప్పుడు ఎంతో బాధతో జ్ఞప్తికి చేసుకున్నాడు. ఆనాడు తను 'ఏదోవొకటి' మాట్లాడలేదు అని. తనమాటే తనకు శాపంలాగై తల్లి కాబోతున్న కుముదను పెళ్ళి చేసుకున్నాడుకదా? నిజం, ఆ బిడ్డఏమో తనది నిజం, అయినా——

రామన్న ఈ ఆలోచనతో అదిరిపడ్డాడు. తను కన్నులారా చూడాలి అనే పట్టుదలతో సరళ మోహన్‌కళ్లల్లో కనిపిస్తోందా? నా మూర్ఖత్వం చూసి నవ్వుతున్నదా?

లేక-?

రామన్నకు మరో అనుమానం వచ్చింది. కుముదను ఆరాధిస్తున్నప్పుడూ తను సరళనే ప్రేమిస్తుందేవాడా?

ప్రేమికులహృదయంలో అణగివున్న ఆలోచనల ప్రభావం ఆ ప్రేమఫలంమీద పరిణామాన్ని కలిగిస్తుందా? కుముదను కలిసినప్పుడు తను సరళరూపాన్ని తలచుకొన్నాడా?

ఛీ! ఎంత పిచ్చి ఆలోచన! పూర్తిగా మైమరచే సర్వాత్మనా తాదాత్మ్యమయ్యే అటువంటిసందర్భంలో మరొక ఆలోచన హృదయంలో రావడానికి సాధ్యమా?

అలావుంటే రైతు పొలంలో బీజాలను నాటేటప్పుడు 'బాగా పండనీ' అనే ఆలోచనను మనస్సులో వుంచుకొని విజయాన్ని సాధించవచ్చుకదా?

ఉహుఁ. అలాకాదు. ప్రకృతి కది విరుద్ధం. బీజంలోని గుణదోషాలే పంటలో కనిపిస్తాయేకాని బయటివి కావు. తనకొడుకు తనవంటివాడు - అయితే-? తన వొక్కడికొడుకే కాదుగా? తనకు, కుముదకు——. కాదు కాదు, బిడ్డ తనదే. పంట

శిశువిదే. అయితే చుట్టూవున్న గాలి, బయటి నేల, నీరు - వీటి పరిణామమూ కని పిస్తుంది. అది గుణ - దోషాలను కలిగించేది కాదు; గుణదోషాలు కలిగేది బీజం వల్ల. అలా వచ్చిన గుణ-దోషాలమీద ఈ బాహ్యకారణాల ప్రభావం కొంత వుంటుంది. ఆడది గాలి - నేల - నీరు వున్నట్లుగా; పుట్టుకతోవచ్చిన గుణం, శరీరనిర్మాణం వీటినిర్ణయం భర్తవల్లనే - బీజంవల్లనే—

రామన్న కుర్చీలోంచి లేచాడు. ఇదేమిటి? ఇలా ఎందుకు ఆలోచనాలహరిలో చిక్కుకొనటం అనుకుంటూ చేతిగడియారాన్ని చూసుకొన్నాడు. ఇంకా ఇరవై నిమిషాలు! కిటికీదగ్గరికి వచ్చాడు. మోహనుడు ఇంకా వచ్చాడో లేదో, అను కుంటూ.

ఓ! అని నవ్వాడు. మోహనుడిప్రసంగమే కదూ తను ఏదేదో ఆలోచిస్తూ యువరచయితలా అన్నీ తెలుసు అనుకుంటూ అడ్డదారిని పట్టింది? అడ్డదారికాదు - అనిపించింది మరుక్షణం. తన తర్కమేమో అడ్డదారి తొక్కివుండవచ్చు. అయితే అనుభవం ప్రత్యక్షంగానే వుందికదా! నిలుచున్నచోటే తిరిగి నిలిచి గోడకు వేలాడ దీసిన సరళ వర్ణచిత్రాన్ని చూశాడు.

సందేహమే లేదు. అన్నాడు.

దగ్గరకు నడిచివచ్చి వర్ణచిత్రాన్ని తదేకంగాచూస్తూ 'అవే కళ్లు' అనుకున్నాడు.

కుముదా ఒకసారి ఆదేమాట అన్నదికదూ?

ఒకసారి? ఎప్పుడు? ఓ - మేనత్తఇంటికివెళ్ళి హఠాత్తుగా వచ్చినప్పుడు, తను మోహనుణ్ణి ఎత్తుకొని ముద్దుపెట్టుకున్నాడు. అప్పు డావిడ ఏదో మా యిద్దర్నీ గూర్చి అన్నది. ఆ మాటకు మోహన్ సంబరపడ్డాడు. తన నొకసారి ఆవిడ నొక సారి చూశాడు కదూ? అప్పుడు—

రామన్న వైరాగ్యంతో నిట్టూర్చి కుర్చీమీద కూర్చున్నాడు. ఆరోజు, ఆ వొక్క క్షణం తన జన్మంతా సుఖమయి మనిపించింది!

అవును, అప్పుడన్నది కుముదా.

'వీడికళ్ళు ఎవరివిలాగున్నాయి చెప్పండి?' అని.

తను వొక్కసారిగా స్ఫురించినట్లుగా 'ఎవరివిలాగా' అంటూ మోహన్‌ని మళ్ళీ వొక్కసారి చూశాడు.

అప్పు దతనికి తోచింది. ఎవరివిలా! తనకు తెలుసు. అయితే ఆ మాట చెబితే! ఆనందంగా ప్రారంభమైన ఆమె గృహప్రవేశం పాడుకావచ్చు కదా?

'ఎవరివిలా?' అంటూ ప్రశ్న తెలియనివానిలా అడిగాడు.

'మోహనుడి కళ్ళు ఎవరివి లాగున్నాయి అని అడిగాను. ఇంతల్లోనే మరిచి పోయారా?'

మరవడం! ఓహో - ఈమెకూ తెలిసింది పిల్లవాడికళ్ళు ఎవరివిలాగున్నా యని. తను సరళను మరచిపోయాడు అని సూచిస్తున్నదే? ఆ సూచనే ఆధారం అనిపించింది తనకు.

'ఎవరిలాగేమిటి? నీ కళ్ళలాగే' అన్నాడు.

ఉహుం. అని అసమ్మతిని సూచించేలా నవ్వుముఖంతోనే తల నాడించింది కుముద.

'అలా అయితే? నాలాగున్నాయంటావేం? ఛీ!' అన్నాడు.

కుముద ఒక్కసారిగా నిట్టూర్చి వూరుకున్నది.

ఆమె నోటినుంచే ఆమాట రానీ అని నిరీక్షించాడు. తనకు నిరాశకలిగింది. ఆమె కొంచెంసేపటి తర్వాతయినా చెప్పవచ్చేమో అని ఆశపడ్డాడు. అయితే ఆమె దృష్టి ఎక్కడో దూరంగా వెళ్ళినట్లుంది. ఆమెముఖంలో నిరాశ అలముకున్నది. ఓసారి నిట్టూర్చింది. తనను చూసింది. ఇప్పుడైనా చెపుతుందేమో అనుకునేలోపల మోహన్ మళ్ళీ ఆమెవైపు పరుగెత్తాడు. వాడిని ఎత్తుకొని లోపలికెళ్ళింది.

ఒకవేళ అప్పుడు తను చెప్పివుంటే?- అనే ఆలోచన రామన్నకు ఆ తరువాత చాలాసార్లు వచ్చింది. 'నువ్వు చెప్పేది నిజం. పిల్లవాడికళ్ళు సరళ కళ్లలాగే వున్నాయి! అని తను చెప్పివుంటే. ఆమెకు సమాధానం కలిగివుండేదా? అయితే- మనుష్యుడిస్వభావమే విచిత్రమైనది-! ఆనాడు తను. కుముద. మోహన్ అనిరీక్షితంగా ఒక అలౌకిక సుఖక్షణాన్ని అనుభవించారు. ఆ క్షణాను సాధ్యమైనంతవరకు

తటస్థంగా వుంచాల అని రామన్న ఉద్దేశం. ఏ ఉద్దేశంవల్లనయితే తను అలా ప్రవర్తించాడో ఆ ప్రవర్తనవల్ల విరుద్ధమైన పరిణామం కలిగింది। సరళ స్మరణ తను సరళను జ్ఞాపకం తేవడం, అందులోనూ కుముద కడుపునపుట్టిన బిడ్డ సరళను పోలుతున్నది అని తను చెప్పడం ఆమెకు కోపం తెప్పించవచ్చు అని తన భయం. ఆమెను బాధ పెట్టకూడదు అనే సదుద్దేశం తనకు. సదుద్దేశానికి దుష్పరిణామం।

ఇందువల్లనే జనం దైవం వొకటివుంది అని నమ్ముతారో ఏమో। నిజంగానే మనుషులు నమ్మే దైవశక్తి అనేదొకటివుంటే మానవుడంత చెడ్డవాడు. మారే ప్రాణి మరొకడు లేడు అనాలి. ఎవరికి తెలుసు? తన విధివ్రాతకూడా విపరీతమైనదే నేమో?

లేక——? రామన్నకు ఒక ఆలోచన వచ్చింది, దైవం అనేది లేదు; అయితే ఎప్పుడు మనిషికి తనబాధ్యత తెలియదో, లేక ఎప్పుడైతే మనిషి తన బాధ్యతనుంచి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తాడో అప్పుడు 'దైవం' అనేవాడు; అంటే 'దైవం' అన్నప్పుడు ఒక్కసారి తన తప్పును వొప్పుకున్నట్లే.

నిజం. ఇప్పుడు సిద్ధంగా వున్నాడు ,రామన్న తనతప్పును వొప్పుకోవడానికి. ఆరోజు జరిగింది విపరీత దైవగతికాదు, తనతప్పుకు తగిన ప్రాయశ్చిత్తం. 'పిల్లవాడి కళ్ళు ఎలావున్నాయి చెప్పండి?' అని కుముద అడిగినరీతి, అడిగేటప్పటి నవ్వుముఖం వీటివల్ల ఆ ప్రశ్నకు సమాధానం ఇద్దరికీ తెలుసు అని అర్థం. మోహనుడి కళ్ళనుపోలే కళ్ళున్న, తనకు కుముదకూ ఇద్దరికీ పరిచయంవున్న వ్యక్తులు ఎంతమంది వుంటారు? 'ఎవరి కళ్ళు?' అంటే 'సరళ కళ్ళు' అనే సూటియైన సమాధానాన్ని కుముద అపేక్షించిందా?

అయితే తను చేసిందేమిటి? సూటియైన సమాధానాన్ని యివ్వలేదు. 'నీలాగా' అని ఒక అప్రామాణికమైన సమాధానం ఇచ్చాడు; అది కాదన్నప్పుడు 'నాలాగా అంటావా?' అని నోటికి వచ్చిన జవాబు చెప్పాడు, ఆవిడ ఎంత వుత్సాహంతో అడిగిందో ఆ ఉత్సాహం తనకులేదు అనేలా వ్యవహరించాడు.

ఎందుకని? కుముద తనను మెచ్చుకోవాలని।

అందుకని తనకు శిక్షపడింది. భర్తతో తన సాంసారిక జీవితాన్ని వూహించు కోవడంలో దూర్వాసుణ్ణి మరచిన శకుంతలకూ శిక్షపడింది, అలాగు.

నిజంగా ఇదొక గొప్పవిషయం. కేవలం తన స్వార్థదృష్టితో తన బాధ్యతను తప్పించుకొనే, తన కర్తవ్యాన్ని మరచే మానవుడికి ప్రాయశ్చిత్తం తప్పదు.

రామన్న ముఖంలో నవ్వు వెలిసింది. 'నిజంగా గొప్పవిషయం' అని తనవి తానే ఎగతాళి చేసుకున్నాడు. గొప్పవిషయమట! అలా అయితే ఇలాంటివిషయా లను సభలలో చెప్పడానికి తను సిద్ధంగా వున్నాడా? జనం విననీ, వినకపోనీ - తనమటుకు తను సిద్ధంగా వున్నాడా?

ఊఁ - అంటూ రామన్న గడ్డం నిమురుకున్నాడు. చెప్పాలి, ధైర్యంగా స్పష్టంగా చెప్పాలి. జనం వినకుంటే, వాళ్ళు వినేలా ఆసక్తికరంగా చెప్పాలి? తను రచయిత కదా? జనులకు కావాలని వీధిలో శ్వానమైథునం కథను చెప్ప డానికీ తను సిద్ధం; అయితే తన జీవితంలోనే పరస్పరం ప్రేమించుకొనే రెండు హృదయాలే వైమనస్యంలో కాలిపోతున్నాయి. ఆ కథను తను ఎందుకు చెప్ప కూడదు?

చెపుతాము - అనుకున్నాడు. ఈనాటికి నా సాహిత్యజీవనంలో ఒకయుగం ముగిసినట్లవుతుంది; సర్వజనుల మన్ననను అధికారరీత్యా పొందినట్లవుతుంది ఈరోజునుంచి. ఆ తర్వాత తన ప్రామాణికమైన ఆలోచనలగురించే చెప్పవచ్చు. చెప్పడానికి అడ్డులేదు - అని గడ్డాన్ని నిమురుకుంటూనే గొణుగుతూనే లేచి కిటికీ దగ్గరికి నడిచాడు.

బయటికి చూశాడు. ఆ తర్వాత కిందికిదిగే మెట్లదగ్గరికివచ్చి కిందిశబ్దాలను ఆల కించాడు. చేతిగడియారాన్ని చూసుకొన్నాడు. 'సభ సరియైనవేళకు ప్రారంభ మయ్యేట్లయితే ఇంకా 18 నిముషాలు' అనుకున్నాడు. లేక, ఆలస్యంగానే ప్రారంభం కావడం నిజం; మంచికే అయింది, మోహనుణ్ణి పిలుచుకొనిపోవడం సాధ్యమవుతుంది - అంటూ ఆయాసం చెందినవానిలాగా ఉష్ అని రెండుచేతుల్ని తలవెనుక పెట్టుకొని ముఖమెత్తి కూర్చున్నాడు.

# 13

కుముద ఆగింది. ఏదో శబ్దమైనట్లుందే? మోహనుడు వచ్చాడా? మంచిది. నేనూ వాడికోసమే అన్నీ సిద్ధంచేసి - కాదు, తలుపుశబ్దం కాదు! కుముద ముఖం పైకెత్తి చూసింది. ఓ! కొడుకురాకను తండ్రి ఎదురుచూస్తున్నట్లుంది! ఒక నిముషం మెట్లమీదిశబ్దం వినింది. క్రమేణ ఆమెముఖం చిరునవ్వుతో వికసించింది. శూన్యదృష్టితో ఎదుట, దూరదూరంగా ఏదో చూసినట్లుగా నిలుచుంది. సమాధానపడి నిట్టూర్చి మళ్లీ అద్దంముందు కుర్చీదగ్గరికి నడిచింది. కూర్చుని అద్దంలో తన ప్రతిబింబాన్ని తదేకంగా చూచుకొంది.

'నీకు చాలా సంతోషంకదూ? రామన్న మోహనుణ్ణి ప్రేమిస్తున్నాడు అని. ఆఁ?' అని తన ప్రతిబింబాన్ని అడిగింది. ప్రతిబింబం నవ్వింది.

చాలా సంతోషం - అని మరొకసారి తనలో తాను అనుకొన్నది. ఎవరో ఎవరినో ప్రేమిస్తున్నారని తన కెందుకు సంతోషం కలగాలి?

పిచ్చిది తను! మొదట మొదట ఏమో అనుకుంది. అప్పుడు తను తిరిగి మోహనుడితో రాగానే రామన్న మోహనుణ్ణి ఎత్తి ముద్దుపెట్టుకున్నాడు కదూ! అప్పుడు? తనకెంత సంతోషం వేసింది? మోహనుడిస్థానంలో తనే వున్నదేమో అనే భ్రాంతితో 'వొళ్ళు ఝల్లుమంది. రామన్న ముఖాన్నీ వుల్లాసాన్నీ చూసిన తర్వాత రామన్న తనకోసం - కుముదకోసం - చూపుతున్న ప్రేమనే మోహనుడి మీద కురిపిస్తున్నాడు అని స్పష్టమైన భావన కలిగింది. ఆనాటి ఆ దృశ్యాన్ని సరిగా చూసివుంటే-! అనే ఆలోచన చటుక్కున కలిగింది. ఇంట్లో పిల్లలుండాలి అని ఎన్నిసార్లు చెప్పేది? రామన్న తనను - కుముదను - పెళ్ళిచేసుకోవాలి, వాళ్లిద్దరికీ పిల్లలు పుట్టాలి, అవి తను కళ్ళారచూసి చనిపోవాలి అని అక్క ఎంతో చెపుతుండేది. ఇప్పుడు ఆవిడ ప్రాణంతో వుండివుంటే? తనకు రామన్నకు పుట్టిన బిడ్డ. రామన్న ముద్దుబిడ్డతో ఆడుతుండటం చూసివుంటే? కుముద అత్యంత వాత్సల్యపూరితమైనదృష్టితో కొడుకును చూసింది. హృదయం ఝల్లుమంది. అక్క - కాదు, అక్క కళ్లు! కాదు - మోహనుడి కళ్ళు! అంతా అక్క కళ్లలాగే వున్నాయికదా! ఇంతవరకు తను ఎందుకని గమనించలేదు? కొడుకుని దృష్టి

పారించి చూసింది; ఏమీ సందేహం లేదు. అక్కకళ్ళే! ఈనాటి యీ దృశ్యాన్ని చూస్తున్నది! ధన్యురాలయింది సరళక్క.

అంతలో రామన్నకూడా తనను నవ్వుతూ చూశాడు. తనకు ఏమనిపించిందో ఏమో? మోహనుడికళ్ళు ఎవరివి లాగున్నాయి అని అడిగేసింది!

ఎంత వుత్సాహంతో ఆ ప్రశ్న అడిగింది? తను చూపించి రామన్నకు తెలియనీ... తనకు కలిగిన సంతోషం అతనికీ కలగనీ. తామిద్దరూ ఆరోజు సరళక్కను స్మరించి కృతకృత్యులవుదాం - అని రెట్టించి ఆ ప్రశ్నను అడిగింది.

రామన్నకు తనప్రశ్న అర్థం కాలేదేమో! రెండోసారి అడిగినప్పుడూ మోహనుణ్ణిచూసి, 'నీవి లాగున్నాయి' అన్నాడు. ఛీ! ఎంత అసంబద్ధమైనమాట! ఇంత స్పష్టంగా కనిపించేవాటిని సరిగ్గా చూడకూడదూ? రామన్న అలా ఏమీ చేయలేదు. 'నా వున్నట్టున్నాయంటావా యేం?' అన్నాడు.

తనకు చాలా నిరాశ కలిగింది. తర్వాత అక్కడ నిలుచుని మాట్లాడాలనిపించ లేదు. తనదగ్గరికివచ్చిన మోహనుడి నెత్తుకొని చరచర లోపలికి వెళ్ళింది.

మగవారిస్వభావం ఇంత కృతఘ్నతాపూర్వకంగా వుంటుందా అనే అనుమానంతో ఎన్నోరోజులు అల్లాడింది. సరళక్క కళ్లు ఎలావున్నాయనేది పూర్తిగా మరిచిపోయాడా రామన్న? అలాగయితే తను ఏ ఆశపెట్టుకొని జీవించాలి? తనతో సంసారం చేసేటప్పుడుమాత్రం భార్య వుందనేతలపు వుండేట్లయితే ఆడదానిగతి ఏమిటి?

అవును. మగవాళ్ళస్వభావమే అంత. తను విన్నదికదా మేనత్త అనుభవాన్ని? పాపం! పాతకాలపు ఆలోచనల ముసలావిడ! అయితే ఇంకా గర్వంతో చెప్పుకొంటుంది - భర్తతో తను గడిపిన బ్రతుకుగురించి. ఒకసారి అదేదో చెప్పింది కదా? హుఁ....బయట ఇంత విచ్చలవిడిగా నడచుకొనే భర్తను దగ్గరికి రానివ్వకూడదు అని తను చెప్పినందుకు అత్త సమాధానం ఇలా చెప్పింది.

'అయ్యో! కుముదీ! భర్త బయట ఏమేం చేస్తాడు అన్నది మనస్సులో పెట్టుకుంటే బ్రతకడమే కష్టం ఆడదానికి.'

'అంటే ఏమత్తా! రోజూ రాత్రంతా మరో స్త్రీదగ్గర వుండివస్తే మనస్సుకైనా మైల అనిపిస్తుందా లేదా?' అని తను అభిమానంతోనే అడిగింది.

'అవ్వవ్వవ్వ! ఎట్లయితేనేం - మడి మైల ఆలోచన ఇప్పటి పిల్లలకూ వుందను. అఁ?'

'నేను అడిగిందానికి ఏమంటావు?' అని తను రెట్టించింది.

'చూడు కుముదీ, చప్పట్లకు రెండుచేతులూ కావాలి. అవునంటావా లేదా? నాదీ తప్పువుంది. నేను ఎలా ఆయనమీద కోపం తెచ్చుకునేది?'

'నీ తప్పు వుందా?'

'వుందంటే, దానికి కారణం ఎవరు? కాదు, కుముదీ, పెద్దసంసారం ఇంట్లో. వది జంటలతర్వాత మేమిద్దరం పన్నెండోవాళ్ళం. ఆయన ఇంటికివస్తే మేము వంటయింటిపక్కలే తిరిగేది, ఆయన నన్ను మాట్లాడిస్తే మా అత్త జవాబు చెపుతుంది, సుఖం-దుఃఖం-నవ్వు-బాధ ఏమైనా చెప్పాలంటే నేను పనంతా ముగించుకొని వెళ్ళాలి - వెళితే ఆయనకు నిద్రవచ్చేది. పొద్దున - వేకువనే ఆయనకు మెలకువ వచ్చేలోపలే నేను సద్దుచెయ్యకుండా పనిలో దిగేదాన్ని. ఆయనకు ఎందుకు విసుగుపుట్టదు చెప్పు? ఇంట్లో తనను గమనించేవాళ్ళు లేరనేగా తను బయటికి వెళుతుందేవారు? అయ్యో! వింటున్నావా లేక నన్ను వూరికే ఎగాదిగా చూస్తున్నావా?'

'అత్తా, నువ్వు చదవడం, వ్రాయడం నేర్చుకోనుంటే—'

'మా కాలంలో నా పెళ్ళే అయేదికాదు.' అని నవ్వేసింది ముసలావిడ.

అయితే - ఆమెమాట నిజమా? ఇంట్లో సహవాసం లేదని బయటికి వెళ్ళేట్లయితే భర్త వొక్కడిమీదే ఎందుకు అభియోగం? పగలంతా ఆఫీసులో కష్టించి రాత్రి ఆయాసంతో ఇంటికివచ్చే భర్త సహవాసం ఎలా దొరుకుతుంది భార్యకు? ఆమెకూడా అలాగేచేస్తే సమాజం సహిస్తుందా?

పోనీ - రామన్న సరళక్కను మరవడానికి ఏ కారణమూ లేదు కదా?

లేక—?

కుముదకు వెనుకటి కొకసారి వచ్చిన ఆలోచన నేడు మళ్ళీ తలఎత్తింది. రామన్న సరళక్కను మరువలేదు. అయితే తనకోపం అలా అబద్ధం చెప్పి వుండాలి.

ఎంత అన్యాయం! సరళక్కను తలచుకొంటే తనూ అసూయపడుతుందనే ఆలోచన రామన్న కెలా వచ్చింది?

కుముద మళ్ళీ అద్దంలో తనముఖాన్ని ఎగాదిగా చూసుకుంది.

ఆ ప్రతిబింబం ముఖంమీది కవళికల్ని చూడగానే ఆమెకు ముళ్లు గుచ్చుకున్నట్లయింది.

'ఎంత పనికిమాలినదానివి నువ్వు? రామన్న నిన్ను ప్రేమించడంలేదు. ఇంకా సరళక్కనే ప్రేమతో జ్ఞప్తికి తెచ్చుకుంటున్నాడని ఎన్నిసార్లు వీలిగి ముఖం మాడ్చుకున్నావు! నువ్వు - నువ్వు—'

ఎదుట వున్నది ప్రతిబింబం అని తెలిసి కుముద ఆవేశం అణగిపోయింది.

ఇంతవరకు కళ్ల ఎదుటవున్న ఒక లావుపాటి, నల్లనితెర సర్రని తొలగినట్లయింది.

కుముద దీర్ఘాలోచనలో మునిగింది. ఆమెకళ్ళు ఏనాటిజ్ఞాపకాలనో నెమరువేసుకోవాలన్నట్లు మూతపడ్డాయి. ఒకటి రెండు నిముషాలలో బావిలో తోసినపాత్ర నిండి పైకివచ్చేవిధంగా నీటితో నిండిన కళ్లు పైకెత్తింది ఆమె.

కుముదకు ఇప్పుడు అనిపించింది. తన వైవాహికజీవితం తనకు, రామన్నకు ఇద్దరికే సంబంధించింది కాదు అన్నది. తను ఆవిషయమే గ్రహించలేదు.

ఆరోజు తన మేనత్త చెప్పలేదూ? ఇంట్లో మిగిలినవాళ్ళకోసం పరస్పర సహవాసం తృప్తికరంగా వుండేదికాదు అని? ఆ విషయం అత్త తెలుసుకొంది, అందుకని ఆమె భర్తను కోప్పడలేదు. అంతేకాదు, దొరికే అల్ప అవకాశంలో తన హృదయాన్నే అతనిమీద ప్రేమ కురిపించింది. ఆ ప్రేమ రుచిమూసి భర్త అన్యమనస్కుడు కాకూడదు అని. నిజానికి అప్పుడు మేనత్త తనకు మార్గదర్శిని అయింది, తనుమాత్రం గ్రుడ్డిదానిలా ప్రవర్తించింది.

తన పరిస్థితి మేనత్త పరిస్థితికంటె చాలా భిన్నమైంది అనేది కుముదకు తెలుసు. అయితే అందువల్లనే అది చాలా కష్టము అయింది.

రామన్న తనను పెళ్ళి చేసుకున్నాడు. తను, రామన్న ఇద్దరే ఇంట్లో అనుకున్నది కదూ?

తనెంత బుద్ధిలేనిది?

ఇంట్లో, మూడవవ్యక్తి లేకున్నా మనస్సులో మూడవవ్యక్తి లేదా? సరళక్క జ్ఞాపకం ఇంట్లో మూడవవ్యక్తే అనవచ్చు. తాము చేసిందేమిటి? ఆ వ్యక్తి చూపులు తప్పించుకోను ప్రయత్నించడం। ఎంత మూర్ఖతనం। ఎందుకని? సరళక్కే తమ ఇద్దరివివాహాన్ని కోరిందికదా? దాన్ని తాము బహిరంగంగా వొప్పుకొనివుంటే? ఇంతేకాక రామన్న ఎన్నో సంవత్సరాలు అనురాగంతో సంసారాన్ని చేసినవాడు. అతను హృదయంలో సరళక్క నిలిచివుండడం ఆశ్చర్యం కాదుకదా? స్పష్టమైనదానిని, సహజమైనదానిని కళ్ళు తప్పించి మరవడానికి ప్రయత్నించిన తమ అవస్థ, కాలికి దెబ్బ తగిలినవాడు నిష్ప్రయోజకుడయినట్లు అతి జాగరూకతతో మెలగ ప్రయత్నించినట్లయింది; దెబ్బ తగిలినచోటే తెలీకుండా ప్రవర్తించారు।

రామన్న ఇంకా సరళక్కనే ప్రేమిస్తున్నాడని తాను—

సరళక్క స్మరణ తనకు - కుముదకు - గిట్టదని రామన్న—

ఇద్దరూ ఇంతవరకు రెండువైపులా పదునుగావున్న కత్తిని మధ్య వుంచుకొని ఒకరిదగ్గరికి వొకరు రావడానికి ప్రయత్నించారు।

కుముద తత్తరపడినదానిలా వొక్కసారిగా ఆగింది. ఇదేవిఁటి। తన ఆలోచన సరిగ్గా వుందా? లేక దాహమేసినవాడు ఎండమావినిచూసి నీటి ప్రవాహమని తర్కంతో సిద్ధమైనట్లు నడచుకొన్నదా తను? రామన్న నిజంగానే తనను ప్రేమిస్తున్నాడా? తామిద్దరు అపరాధం చేసినవారిలా సరళక్కను తప్పించుకోవడానికి ప్రయత్నించకుండా ఆమెను తమ స్నేహితురాలిగా ఎంచుకునివుంటే బాగుండేదా?

కుముద కళ్లముందు వెనకటి ఒక జ్ఞాపకం వర్ణచిత్రంలా నిలిచింది. పెళ్ళి

ఆయన మొదటిరోజుల్లో రామన్న నిత్యం సరళక్కనుగూర్చి మాట్లాడుతూ వుండే వాడు. అది తనకు రుచించేదికాదు, అప్పుడప్పుడు రామన్నమాటలు తొ్రటుపడేవి.

పాపం! రామన్నమాత్రం ఏం చేయగలడు? అన్ని సంవత్సరాలు ప్రేమగా సంసారాన్ని గడిపిన సరళక్కను ఎలా మరువగలడు? ఆమెద్వారా పరిచయమైన తనతో ఏం మాట్లాడగలడు? అయితే తనకప్పుడు తెలియలేదేమో? సరళక్కను గూర్చి మాట్లాడడమంటే సరళక్కనే ప్రేమించడమని తను అనుకొన్నది. అది తప్పా? మోహనుణ్ణి ప్రేమిస్తూనే తను రామన్నను ప్రేమించడంలేదూ? అలాగే - సరళక్క స్మరణను ప్రేమిస్తూనే తనని ప్రేమించగలడు కదా?

కుముద ముఖంలో నవ్వు వెలిసింది. ఆదర్శప్రేమ అంటే తన మేనత్తది. కాదు, ఎలాంటి స్త్రీ హృదయం! భర్త బయట ఎక్కడికి వెళుతాడు, ఏం చేస్తాడు అన్నది తెలిసే అతనిప్రేమ సంపాదించేది కదా! ఛీ! ఆ వూహ కల్గటం అసహ్యం అనిపించలేదూ అని తను అడిగితే ముసలావిడ అత్యంత అభిమానంతో సమాధానం చెప్పింది.

'కాదు, కుముదీ, బయట తిరిగివచ్చే భర్త చొక్కామీద కాకి రెట్టవేస్తే ఆ చొక్కానే తీసిపారవెయ్యాలనా లేక సబ్బుపెట్టి బాగా వుతకాల్నా?'

'అంటే, ఏమత్తా, స్నానం చేయకుండా భర్తను లోపలికి వదలేదానివికాదా యేం?'

'ఆయన మనస్సు స్వచ్ఛంగావుంటే స్నానం అయినట్లే. నా మనస్సు స్వచ్ఛంగా వుంటే అదే సబ్బు' ముసలావిడ తెలిసిమాట్లాడిందో, లేదో - మొత్తానికి ఒక తత్త్వజ్ఞానసారంలాంటి మాటను అన్నది.

కుముద ఒక్కసారిగా కుర్చీలోంచి లేచింది. ఆలోచనలతో ఒక్కచోట కూర్చోవాలనిపించదు ఆవిడకు; ఆలోచన ఇంకా వేధిస్తూనేవుంది.

నిజమా? నిజమా? నిజమా?

ఆలోచన ఆమెవెనక పడింది, వదలదు. చటుక్కున పట్టుకొంటుంది. వెంటనే జారిపోతుంది.

రామన్న తనని ప్రేమించడం - నిజమా? నిజమా? నిజమా?

ఇంకెవరినైనా నమ్మవచ్చు. అయితే తనను తాను నమ్మడం సాధ్యం కాదు అనే అవస్థ అయిందామెది. పది సంవత్సరాలనుంచి ఆగిన ఆలోచన, తనకు ఇష్ట మనిపించే ఆలోచన, ఇప్పుడు తన గుండెల్నే చీరి బయటపడేట్లు వేదనను కలిగి స్తున్నది! తనకు ఇష్టమైన ఆలోచన అనేందుకు తనబుద్ధి దానిని లేనిపోని కార ణాలను వెదికి సమర్థిస్తున్నది.

తను మేనత్తఇంటికి మొదటిసారి వెళ్ళినప్పుడు రామన్న తనని వెదుక్కుంటూ వచ్చింది.

తను ఇంటికి మరలినతర్వాత రామన్న మోహనుణ్ణి ముద్దాడింది,

తనకొకసారి జ్వరం వచ్చినట్లుంటే రామన్న భయపడి పరుగెత్తి డాక్టరును పిలుచుకొచ్చింది,

తనతో 'సంసారజీవితం' లేకున్నా మరొకచోట మనస్సు కలగకుండా వుండడం,

ఆరోజు తనకోసం కొత్తచీర తేవడం—

ఒకటా, రెండా - సందేహపర్వతశిఖరం పడినందువల్ల బండరాళ్ళమీద బండ రాళ్ళు పడినట్లుగా వెనకటిజ్ఞాపకాలు ఒకదానిమీద మరొకటి తనని వూపిరాడకుండా చేశాయి!

నిజం, తను రామన్నకు మొదట భోగవస్తువు, తరువాత వివాహమాడినభార్య! నిజం; సమాజంలో అటువంటి నడవడికమీద ఆక్షేపణ వుంది, పెళ్ళికాకుంటే తను సమాజానికి వెలి అయ్యేది. అయితే రామన్న తనను పెళ్ళి చేసుకున్నాడుగా? తన నుంచి వొత్తిడి లేదుగా? తనను ప్రేమించడంవల్లే ఎందుకు పెళ్ళిచేసుకోనుండ కూడదు? తనకు వుపకారం చెయ్యాలని అలా చేశాడనేక్రోధం తన కెందుకు అలాగైతే తనకోసమే అలమటించడానికి కారణం లేదుకదా? అతనిజీవితంలో మరొక స్త్రీ సహవాసం లేనేలేదన్నది తను ఖచ్చితంగా చెప్పగలదు. నిజం, తనే ఆయనజీవితంలో ప్రవేశించిన మొదటి విలాసవస్తువు.

—అయితే దానిలో తప్పేముంది?

మరొకరితో వాదించడానికి సిద్ధమైనట్లు మళ్ళీవచ్చి కుర్చీలో కూర్చున్నది.

దానిలో తప్పేమిటి? - అని తనలో తనే ప్రశ్నించుకుంది.

ఈనాటి సమాజనీతి మారుతున్నది. నేడు భర్త, భార్య పెళ్ళికిముందు స్వతంత్రంగా మసలుకుంటారు. సమాజంలో వొకర్నొకరు కలుసుకుంటారు. స్నేహాలు పెంచుకుంటారు. పరస్పరం పరిచయం ఎక్కువైతే ఒక్కొక్కసారి పరస్పరం హృదయాలు సమరసమైతే ఒకరినొకరు మోహిస్తారు. పెళ్ళికిముందే ఒక్కొక్కసారి శారీరికంగా సన్నిహితులవుతారు. అందులో తప్పేమిటి?

కుముద వణికింది. మోయలేనిభారాన్ని ఎలాగో మోస్తున్నదానిలా. ఆమె సర్వాంగాలు వణికాయి. తన ఆలోచన సరిఅయినదేనా? ఏ బాంధవ్యంవల్ల సమాజంలో స్థానం, బాధ్యత నిర్ణయమవుతాయో ఆ బంధనాన్ని ఇలా తుచ్ఛంగా ఎంచడం సరియైనదేనా?

నిజమైన ప్రేమవుంటే సంసారజీవితం అప్రస్తుతం అనిపించింది కుముదకు. తన, రామన్నయొక్క అనుభవాలను తలచుకొన్నది. తాము ఒకరినొకరు కలిసింది ఎలాగా? శారీరిక ఆకర్షణవల్లకాదు. ఒకరు ఎదుటలేకుంటే మరొకరికి స్థిమితం వుండేది కాదు. ఒకర్నిచూస్తే మరొకరు తమను తామే మరచిపోయేవాళ్ళు. ఒకరికోసం ఏదైనా చేయడానికి మరొకరు సిద్ధమయ్యేవారు. ఒకరి సుఖంవల్ల సుఖం దుఃఖంవల్ల దుఃఖం కలిగేది మరొకరికి, పరస్పరం హృదయాలు వొకటైనపుడు పరస్పరం దేహాలు ఒకటైన స్పృహలేదు. ఒకటి అయితీరాలనే కోరిక లేదు. ఒకటికాక గత్యంతరం లేదు! హృదయాలు కలిసినతర్వాత ఇక ముగిసింది కథ. సమాజం చాలా తప్పు చేస్తున్నది.

హృదయం ఒకటికాక శరీరం ఒకటికావడం నిజమైన వేశ్యావృత్తి: పెళ్ళి అయినా వేశ్యావృత్తికి అవకాశం వుంది.

కుముద మళ్ళీ లేచింది. తన ఆలోచనలకు తత్తరపడింది. ఇదేమిటి? పది సంవత్సరాలు భర్త సాన్నిధ్యం లేనందువల్ల ఇలా ఆలోచిస్తున్నానా అనేభయం కలిగిందామెకు.

భయంతోపాటు ఎక్కడినుంచో ఆనందమూ తల్యెత్తింది.

అవును, మోహనుణ్ణి పిలుచుకొనే సభకు వెళ్ళాలి. ఎందుకు రాలేదో మోహన్ః అయినా వచ్చేవేళ అయింది. పోనీ, సభకు అంత తొందరయినా ఏముంది! మోహనుడు వచ్చినతర్వాత, వాణ్ణి పిలుచుకొనివెళితే పోతుంది.

అయితే—

కుముద ఒక్కమారుగా గందరగోళపడింది. ఇలాంటిసభ, ఇంతమంది జనం వస్తారు, అయితే రామన్న సరైనగుడ్డలు వేసుకుంటున్నాడా? లేదనే దృఢంగా నమ్మింది. హుం - మగవాడిస్వభావమే యిలాంటిది లేదు. ఈరోజయినా సరైన బట్టలను వేసుకోవాలి రామన్న - అని అలమారు చూడసాగింది - అప్పుడు ఆమెకు స్ఫురించింది, తన కాళ్లు, చేతులు వణుకుతున్నాయి - ఊపిరి ఆరాటం ఎక్కువవుతోంది.

అయితే దాన్ని గమనించకూడదనే పట్టుదలతో అన్నట్లు డ్రాయర్లను సద్దు చేస్తూ లాగింది. వేసింది - గుడ్డల్ని చూడాలని.

# 14

ఏమిటీ శబ్దం? రామన్న ఒక్కమ్మడిన లేచాడు. ఓ-క్రింద! అయితే ఆవిధంగా కొట్టేదెందుకు? మెట్లదగ్గరికి నడిచాడు రామన్న ఆలోచనల్ని ఆపి నిలిచాడు. చేతులువాచి నిట్టూర్చాడు. ఎవరికి తెలుసు? కుముద కోప్పడుతూవుండవచ్చు. తనతో సభకు రావలసివచ్చిందే-అని—

ఎందుకని!—రామన్న తనలో తాను నవ్వు నవ్వుకున్నాడు - కోప్పడితేనే కుర్చీ-బల్ల-డ్రాయర్లను కొట్టాలని నియమముందా? ఉత్సాహంతోనూ అలా చేయవచ్చు, అసహనీయమైన ఆతురతతో అలా చేసివుండవచ్చు, ఇంకా ఏదో కారణం వల్ల అలా చేసివుండవచ్చు కదా!

కుముద కోప్పడలేదు అని అనుకొని స్తిమితంగా కూర్చుంటే సరిపోతుంది - అనుకున్నాడు. అదిగో! శబ్దమూ తగ్గిపోతున్నది. రామన్న కూర్చోవాలనుకున్నప్పుడు మరోమారు కిటికీలోంచి బయటికిచూసి కూర్చున్నాడు,....హుం....ఈ

స్వాగత సమితివాళ్లు త్వరగా వస్తేనే మంచిది. ఎందుకో ఒకవిధమైన దిగులుగా వుంది హృదయంలో. ఏదో అనుకోని సంఘటన అయివుండవచ్చేమో అనే - ఒక్కొక్కసారి వుత్సాహం. ఒక్కొక్కసారి భయం.

మనుష్యుని మనస్సే విచిత్రమైంది కదా? జగత్తు నాశనాన్ని ఒక్కదెబ్బతో చేయగల అణుబాంబును వెదికేమనిషి మనస్సునుగూర్చి పరిశోధించగూడదు? లేక- అది కాకుంటే అణుబాంబు పరిశోధననే కోరుతుంది మనస్సు. అనేందుకు భవభూతి చెప్పినట్లు 'కిమపి కిమపి' - ఏదో ఏదో ఒకరహస్యం అనాలా?

ఇప్పుడు తను భయపడ్డాడు కదా? అదేం తమాషా? కుముద కోప్పడింది అనుకున్నాడు. ఎందువల్ల? తను కుముదకు భయపడతాడని. తను కుముదతో మొదటి లాగానేవుంటే ఆమె చేసే డ్రాయరులాగే శబ్దాన్ని విని 'కుముద వుల్లాసంగా వుంది' అనుకునేవాడు. జరిగే సంఘటనలు జరగనే జరుగుతాయి. వాటి అర్థం తన మనస్సునిబట్టి వుంటుంది!

అంటే?

రామన్న ఏకాగ్రతతో యోచిస్తున్నట్లు కళ్ళు మూసుకున్నాడు.

సంఘటన అర్థం మనస్తత్వాన్నిబట్టి వుంటుంది.

అంటే ___?

మనస్సుని అదుపులోవుంచుకుంటే సంఘటన అనుకూలమవుతుందా?

కుముదను సరిగ్గా అర్థం చేసుకుంటే ఆమెకూడా___?

ఉహుఁ....ఇదేదో మనసు గడబిడగావుంది అనుకున్నాడు.

అయినా ఈనాటిసందర్భంలో ఏదో అనుకోని సంఘటన జరగవచ్చు - అనిపించింది. ఎందుకని? ఎందుకేమిటి! అనిపించింది.

అలా నిజంగానే అయితే? కుముద తనను సరిగ్గా అర్థంచేసుకుంటే! హుఁ- అబ్బ! భారాన్ని మరొకరిమీదనే వేస్తున్నాడుకదా? నేనే తప్పివుండవచ్చుకదా? కుముదను నేను నిజంగా ప్రేమిస్తూవుంటే ఈ అధైర్యం ఎందుకు? తన ప్రేమను గూర్చి ఆమెలో నమ్మకం కలిగించవచ్చుగదా?

కుముదకు తను ప్రాణం అనేదాన్నిగూర్చి రామన్నకు సందేహమేలేదు. ఆనాడు, పెళ్ళికిముందు, ఆమె తనదైనప్పటినుంచి తనకా నమ్మకంవుంది. అయినా తనతో కొన్నిసంవత్సరాలనుంచి - ఎడముఖం పెడముఖంగా సంసారం జరిపింది.

ఎంత త్యాగబుద్ధి ఆమెది! అయితే ఆ త్యాగంలో ఆమెకు సుఖముందా? తనకూ ఆమెకూ వయస్సులో 14-15 ఏళ్ళ అంతరం....ఛీ! మళ్ళీ తనమనస్సు ఆదేదారిని పట్టింది. వైవాహికజీవితంలో సుఖం అంటే కామజీవనంలో తృప్తి అనే తన వూహ....వూహ తనదికాదు, వేలకొద్దీ ఏళ్లనుంచివున్న సంప్రదాయసిద్ధమైన ఆలోచన తనలో పాతుకుపోయివుంది. లేక ప్రకృతిలో ప్రతిపురుషుని విషయమూ ఇంతేనా? వున్నా వుండవచ్చు. కామజీవనం మగవాడికి ఒక తృప్తి. వాళ్ళకు బాధ్యతలేదు. స్త్రీ మాటవేరు; అలాటిజీవితం ఆమెకు కొత్తబాధ్యతనే యిస్తుంది. పురుషుడిజీవితం రాత్రి దొంగలాగా - చేసింది దాచిపెట్టవచ్చు; స్త్రీ జీవితం పగలు-దొంగలా, రహస్యంగా వుంచడానికి లేదు.

ఈ ఆలోచన ఇప్పుడెందుకు - అనుకున్నాడు. పదిఏళ్లయింది తన సంసారిక జీవితం నిలిచిపోయి.

ఓ! రామన్నకు చటుక్కున కొత్తవూహ వచ్చింది. తన వెన్ను తనే తట్టుకున్నాడు. వెంటనే చుట్టూ చూశాడు, సిగ్గుపడినవానిలా, ఎవరైనా చూసివుంటే తనను పిచ్చివాడనవచ్చు - అనుకున్నాడు.

అయినా ఇది వెన్ను తట్టుకోవలసినమాటే - అని మరొకసారి చెప్పుకున్నాడు.

పది ఏళ్లయింది తను బ్రహ్మచర్యజీవితాన్ని ప్రారంభించి.

అయితే ఈ అవధిలో తనకు కుముద తప్పితే మరొకరిమీద కోరికే లేదుకదా!

తను కుముదను ప్రేమిస్తున్నాడు అనేందుకు వేరుకారణం అవసరమా?

రామన్నకు ఒకక్షణం ఆలోచన కలిగింది? నిజమా? ఇంతసులభంగా తను కుముద ప్రశ్నకు, సమాధానం చెప్పగలడా? ఈ వొక్కమాటకు కుముదకు స్థిమితం కలుగుతుందా?

రామన్న నిరాశతో నిట్టూర్చాడు, పిచ్చివాడు, పిచ్చివాడు తను. లేక, అంత దౌర్బల్యుడా? ఇలాంటిమాటకు, కుముద సరే, మరేస్త్రీ సమాధానపడుతుంది?

చివరికి, తనను మొండివాడననవచ్చుకదా? నిజం. ఇదే తాయిలం కావాలి అని మొండికెత్తిన పిల్లవాడికి మరి దేనిమీదా ఆశలేదని కదూ; తను కోరింది దొరక్కపోతే వాడు రోజంతా ఇంకేమీ తినకుండా వుపవాసం వుంటాడు. అయితే అంతమాత్రానికే ఆ పిల్లవాడికి ఆ తాయిలంమీద అనన్యప్రీతి వున్నది అని ఎవరైనా చెప్పగలరా?

తను మొండివాడు - కాదు కాదు, అలా అనవచ్చు కుముద, తను ఆమెతో వాదించ మొదలిడితే. అయినా ఇప్పుడు తనమటుకు నమ్మకం కలిగింది కదా? కుముదను తాను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాదన్నదాంట్లో సందేహంలేదు. అంటే? ఇంతకుముందు తనకు సందేహం వుందా? ఛీ! తనకు సందేహమేలేదు. అంటే___?

రామన్న కోపంతో తల విదిలించాడు. లోపల వ్యాపిస్తున్న ఆర్భాటం బయట పడవచ్చు అని తెలుసుకున్నవాడిలా. కుముదను తను ప్రేమిస్తున్నదాన్నిగురించి తనకు ఎప్పుడూ సందేహంలేదు. అని పదేపదే చెప్పుకున్నాడు. అలావుంటే వెన్ను తట్టుకున్నది ఎందుకు?

హాఁ - తెలిసింది! కుముదకు తెలియజెప్పగలదిప్పుడు అనుకుని వీపు తట్టుకున్నాడు. అవును, ఆ ఆలోచనతో నాకు ధైర్యం వచ్చింది - అనుకున్నాడు. కుముదతప్ప ఇతరుల్ని తను కలలో - మనసులో కోరలేదు అని చెప్పేస్తే....

___అని చెప్పేస్తే తానేమో తన కర్తవ్యంచేసి కృతకృత్యుడయ్యాదనిపించవచ్చు. అయితే కుముదకు నమ్మకం కలుగుతుందనేదెలా? తను ఏ కొత్తమాటను చెపుతున్నాదని ఆమె నమ్మకం వెలిబుచ్చాలి? కుముదకు తెలియదా తననిగురించి? తను మరేస్త్రీనీ కోరలేదన్నది, తెలుసుకొనికూడా కుముద తనకు విముఖురాలై వుంది. శకుంతలా దుష్యంతుల కథ అవుతుంది ఇదికూడా. భేదమింతే, నాటకంలో శకుంతల అవస్థ ఇక్కడ దుష్యంతునికి - తనకు ఏర్పడింది. పాపం! ఏమైంది ఆమె అవస్థ? తోడుగావచ్చిన పెద్దలు, బంధువులు అందరూ చెప్పారు దుష్యంతుడికి, 'ఈమె నువ్వు వివాహమాడిన భార్య: నీ బిడ్డను గర్భంలో ధరించి వుంది: ఈమెను నీకు అప్పగిస్తున్నాము: ఎంతకాలం ఈమె పుట్టింటిలో వుంటుంది.

అందువల్ల ఈమెను స్వీకరించు' అని. ఈమేమో స్వీకరించడానికి యోగ్యురాలు అన్నాడు దుష్యంతుడు. అయితే ఆమెను తను పెళ్ళి చేసుకున్నదే అతనికి జ్ఞాపకం లేదు. 'నేను ఆమెను వరించినట్లు గుర్తులేదు. అందువల్ల స్వీకరించలేను' అన్నాడు. అప్పుడు 'నువ్వే అతనికి నమ్మకం కలిగేలా చెప్పు' అన్నారు బంధువులు శకుంతలతో. ఆమె ఇలా ప్రారంభించింది - 'ఒకరోజు నవమాలికామంటపంలో నువ్వు తామరాకులో నీరు దీర్ఘాపాంగము అనే లేడిపిల్లకు త్రాగించాలి అన్నావు. నువ్వు ఎంత ప్రయత్నంచేసినా అది త్రాగలేదు. అప్పుడు నేను నీ చేతిలోవుండే నీటి దొన్నెను నా చేతితో పట్టుకున్నాను. లేడిపిల్ల వచ్చి తాగింది. అప్పుడు నువ్వు 'అందరూ వాళ్ళవాళ్ళ మనుషుల్ని విశ్వసిస్తారు' అని నవ్వావు. 'పాపం! ఆ కథ వల్ల దుష్యంతుడికి నమ్మకం కలగవచ్చునే ఆశతో దాన్ని ముగిస్తుంటే శకుంతలకు కూడా నవ్వు వచ్చిందేమో!' 'కథ బాగున్నది. స్త్రీలు అబద్ధాన్ని ఆసక్తికరంగా చెప్పగలరు అనేది విశదమౌతోంది.' అన్నాడు దుష్యంతుడు!

సరే-నా అవస్థకూడా అలాగే కావచ్చు కదా? 'మరోస్త్రీని కోరలేదు అన్నది బ్రహ్మచర్యమో, వయస్సుమీరిన లక్షణమో?' అనేస్తే? చాలా కలవరం కలిగింది రామన్నకు. సత్యంలో విశ్వాసం పుట్టించడం సులభంకాదు అంటే - దానిముందు మరో విషాదాంతం ఏముంది? - అనుకున్నాడు. విషాదాంతం అనే శబ్దం లేదు, మన సంప్రదాయంలో, అందుకే 'దుర్విధి' అనుకుందాం - అని నిట్టూర్చాడు.

కాదు - ఇప్పుడు ఏదో వొక ఆలోచన వచ్చింది కదూ విధినిగురించి. ఏదో-ఏదో-ఆలోచన ఏమైనా అవనీ, 'విధి' అన్నది వున్నదికదా! అసలు ఇందు నా బాధ్యత ఏమిటి? నేను కుముదను ప్రేమిస్తున్నాను. అయితే ఆమెకు నామీద విశ్వాసం లేదు; ఇందులో నా బాధ్యత ఏమిటి? ఆమెకు విశ్వాసం కలిగేలా ఎలా చెప్పాలి? ఏం చెప్పాలి? ఉహూఁ, అది నా బాధ్యత కాదు. కుముదను నేను ప్రేమిస్తున్నాను అనే నా ఆత్మవిశ్వాసాన్ని పదిలపరచుకోవడమే నా బాధ్యత.

భలే! చేతులుకట్టుకొని వూరుకుండడమే నా బాధ్యత అనే 'గొప్పసిద్ధాంతం ప్రతిపాదించానుకదా-' అని తన్ను తానే పొగడుకున్నాడు రామన్న.

ఈవిషయమే అలాంటిది. 'నీమీద నాకు ప్రేమవుంది' అంటే ఎవరు ఆ మాట

నమ్మేవాళ్ళు! 'ప్రేమ వుంది' అనే నమ్మకం స్వంత అనుభవంవల్లనే రావాలిగాని నోటిమాటలవల్ల నమ్మేది కాదు. కథ-నవల-నాటకాలలో వ్రాస్తారు. 'ప్రియా, నిన్ను ప్రేమిస్తున్నాను' అని నాయకుడు, 'ప్రియా, నీ కోసం నా హృదయం అలమటిస్తున్నది' అని నాయిక. నిత్యజీవితంలోనూ ఇంతే సులభమైతే క్షణాని కొక ప్రేమవివాహం, మరోక్షణంలో వేరొకరితో ప్రేమవివాహం జరగవచ్చు. తనూ రచయిత, తనకూ మనిషిస్వభావం అంతమాత్రమే తెలుసు, అనుకున్నాడు రామన్న. తను కోరుకున్న స్త్రీని మొదటినుంచి 'ప్రేమించడం' పురుషుడి సహజ స్వభావం; మాతృత్వప్రాప్తి అయినతర్వాత 'ప్రేమించే' పురుషుణ్ణి పూర్తిగా మరిచేది స్త్రీ నైసర్గికస్వభావం. అయితే కుటుంబజీవి అయిన వ్యక్తి ఎప్పుడూ తనకు ఇష్టమైన జత కావాలి అనే వుంటుంది. ఆ సందర్భంలో ఉదయించేది మరొకరకం 'ప్రేమ' కల్పన. ఆ—

రామన్న గడియారం చూసుకొంటూ లేచాడు. ఎందుకనో, నేడు ఆలోచనల పండగేమో! పండగేం ఖర్మ. వసంతోత్సవం. మనస్సు విచ్చలవిడిగా తిరుగుతున్నది - అనుకున్నాడు వుద్వేగంతో.

ఈ పాడుసభ త్వరగా ప్రారంభం కాకూడదూ?

హుఁ - చూశావా? దేనిమీదికోపం దేనిమీద మళ్ళిస్తున్నావో!

రామన్న ఆయాసం చెందినట్లు మెల్లిగా నవ్వేశాడు. ఇంతయినా మనస్సులో ఏదోవొక అనిరీక్షితమైన వుల్లాసం వుంది, అనే ఆలోచన అతనిని వదలలేదు. ఏది ఆ వుల్లాసం? పదిఏళ్ల తపశ్చర్యవల్ల మోక్షం. కాదు కాదు, తపశ్చర్యవల్ల మోక్షం దొరుకుతుందా? కుముదతప్ప నాకు ప్రియమైనవస్తువు లేదు. ఆమె సుఖంగా వుంటే చాలు, ఆమె 'నాది' కానీ అనే పట్టుదలకూడా నాకు లేదు.

హుఁ-హుఁ-ఆగు! ఇదేం వైరాగ్యసిద్ధతా? వార్ధక్యలక్షణమా?

ఊహుఁ - రెండూ కాదు. ఆమె సుఖసంతోషాలలోవుండి నా ఎదుట తిరుగుతుంటే చాలు, అదే నాకు పరమసంతోషం. ఆమె, మోహన్ - కాదు, ఇద్దరూ కాదు - మోహనుడంటే ఆమెలో ఒకభాగం. ఆమెను ప్రేమించేంత, ప్రేమించేట్లే మోహనుణ్ణి ప్రేమిస్తాను. ఒకరు మరొకరి అంశవాళ్ళు - ఇద్దరు కాదు.

కుముద నన్ను ప్రేమతో చూస్తుంది. తెలుసు నాకు; నా సుఖంలో ఆమె సుఖాన్ని చూసుకొంటుంది, అదీ తెలుసు; అందుకోసమే నేటిసభకు ఆమె రావాలని నేను కోరింది; నాకు చేసే సన్మానాన్నిచూపి ఆమెకు ఆనందం కలుగుతుంది. ఆమె ఆనందాన్నిచూపి నేను సుఖం పొందుతాను. మేమిద్దరమూ ఆనందమయనేత్రాలతో వొకరినొకరు చూచుకొన్నతర్వాత, ఇద్దరిచూపులూ వొక్కచోట మోహనుడివైపు మరలుతాయి.

'మోహనుడూ రానీ సభకు' అని గట్టిగా అన్న రామన్న తనకళ్లలో వుబుకుతున్న నీటిబిందువుల్ని తప్పించడానికి 'మోహనుడూ రానీ సభకు' అన్నాడు కిటికీదగ్గరికివెళ్ళి, 'మోహనుడూ రానీ సభకు' అన్నాడు మెట్లదగ్గరికి వెళ్ళి.

# 15

పనిలో మునిగిన కుముద ఆగింది. ఏదో వినిపించింది కదూ? ఎవరో మాట్లాడారు కదూ? ఒక్కసారిగా బొమ్మలా నిశ్చలంగా వుండిపోయింది. కాదు, బొమ్మ కాదు, బొమ్మకు నిలవడానికి గట్టి కాళ్ళు వుంటాయి. తనకు కాళ్ళే లేదు, కాదు కాదు - తనకాళ్ళలో బలమేలేదు....చేతుల్ని తొడమీదపెట్టుకొని కుముద నిలుచున్న చోటే కూర్చుండిపోయింది.

'మోహనుడూ సభకు రానీ.'

రామన్న కంఠం. మెట్లమీదనుంచి దిగివచ్చింది ధ్వని. ఆ ధ్వని ఆమెకు పరిచితమే! దాని ఆధారంతో మెల్లగా లేచింది. అద్దంముందుకువెళ్ళి నిలుచున్నది. నుదుటపడిన జుట్టును సరిచేసుకొంది. ఇదేమిటి? చెయ్యి ముద్దయింది! నుదుట చెమట!

ఎందుకో-ఎందుకో-ఎందుకో! గుండెలు దబదబ కొట్టుకుంటున్నది. దుఃఖం, ఆనందం - రెండిటిలక్షణాలూ వొకటే. భయం, చెమట, నిస్త్రాణ....అయితే వీటి పరిణామం ఏమిటంటే తనలో బలం వచ్చినట్లయింది. అదొక్కటే భేదమేమో దుఃఖ-ఆనందాలకు? ఇప్పుడు తనకు ఆనందం కలిగింది. మోహన్ సభకు

రావాలని తనూ కోరింది. ఇప్పుడు రామన్న అదేమాట చెపుతున్నాడు. తనకు ఆనందం కలిగింది. ఎప్పుడూ ఇంతే తనకు. తన ఆలోచన, రామన్న ఆలోచన వొకటైనప్పుడు రామన్న తనని స్పృశించినట్లే అనిపిస్తుంది తనకు. స్పర్శ తగిలి నపుడు శరీరం వణుకుతుంది, చెమటపడుతుంది. కాళ్ళలో శక్తి వుడిగిపోతుంది. ఎందుకో-ఎందుకో-ఎందుకో?

సంతోషాతిశయంతో ఆ ప్రశ్నను వేసుకున్నది తనని తానే.

ఎన్నియుగాల అనుభవం! ఎన్ని ఏళ్ళ ఆనందం! ఆనాటి అనుపమ అను భవాన్ని ఆనాటి అలౌకిక ఆనందాన్ని మళ్ళీ మళ్ళీ తనశరీరం తలచుకొంటుందేమో అనిపిస్తుంది ఆమెకు. ఒక్కమారు ప్రత్యక్షమైన అనుభవం నేడు పరోక్షంగా తిరిగివస్తున్నది. తను స్త్రీగా పుట్టింది సార్థకమైంది అనిపించింది మొదటిసారి ఆ అనుభవాన్ని పొందినప్పుడు. తను, తనది, తనవారు అనే జ్ఞానంవుండీ దేనిజ్ఞా నమూ లేనట్టి, దుఃఖం అనిపించినా సుఖాన్ని కలిగించే, క్షణికమైనా చిరంతనమని పించే, మరొకరిస్పర్శవున్నా అంతా ఒక్కరే అనిపించే—

కుముద దేహం వణుకుతుంది తలచుకొన్నప్పుడు. ఇప్పుడు వణికింది. కాళ్ళు స్థిరంగా నిలవలేవని మళ్ళీ కుర్చీలో కూర్చున్నది; తనను తానే మరచిందేమో అనే భయంతో అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకుంది. శరీరం వేడెక్కలేదు. అయినా వూపిరి వేడి అనిపిస్తుందికదా? కళ్ళుమూసుకొని కూర్చున్నది. ఇల్లు, సభ, సన్మానం అన్నీ మరిచిపోయింది. ఇప్పుడు తను మరొక జగత్తులో విహరిస్తున్నది.

ఆ రోజు - ఏ రోజు? - ఏ రోజేమిటి? - తన జీవితంలో, అదొకటేరోజు - చిరంతన ఆనందాన్ని ఇచ్చిన ఆ రోజు రామన్న ఏదో రాస్తున్నాడు. అతని బల్ల కెదురుగా అద్దం వుంది. తను కొంతసేపు దూరంనుంచే చూస్తూ నిలుచున్నది. విశాలమైన వెన్ను, కుడిచేయి రాయడానికి కదులుతున్నది, తలవెంట్రుకలు చెదరి వున్నాయి. ఎడమచేతితో అప్పుడప్పుడు చెవిని గీరుకుంటున్నాడు; మెల్లిగా నడిచి తను కుర్చీదగ్గర వెనక నిలుచున్నది; దగ్గర కూర్చోవాలంటే తను కనిపిస్తున్నా అతనికి తనధ్యాస లేదు; ఒక్కసారి తలఎత్తి చూశాడు. తన నుదుటిని ఎడమ చేతితో రాసుకున్నాడు. అప్పుడూ తనధ్యాస లేదు; ఎంత ఏకాగ్రత! జుత్తును

మెల్లిగా సవరిస్తూ నిలుచుకున్నది, భయపడింది అతనికి ధ్యానభంగం అవుతుం దేమో అని. ఉహుం, బయటిప్రపంచం ధ్యాసే వున్నట్టులేదు. తననూ కొంచెం రెచ్చగొట్టినట్లయింది. ఇదేమి ఏకాగ్రతో. అలక్ష్యమో? ఇలా తనను అలక్ష్యం చేయడమా? కొంచెం మొండిగానైనా మెల్లిగా అతని ఎడమపక్కకు జరిగింది. ఒక్కనిముషం. కుడిచెయ్యి రాస్తున్నది, ఎడమచెయ్యి మెల్లిగా జరిగి తనను చుట్టు కుంది. ధ్యానభంగం అయిందా? లేదు-లేదు-రాయడం జరుగుతూనేవుంది! ఎడమ చెయ్యి తనను చుట్టుకొనివుంది. ఎంతప్రేమ ఆ చేతిలో! ఎంత మృదువుగావుందో ఆ స్పర్శ! చుట్టేసినచెయ్యి తనను కిందికి లాగింది. తనిప్పుడు రామన్న తొడమీద కూర్చొనివున్నది. అయితే రామన్నకు దానిధ్యాసే లేదు. ఇంతెందుకు? తనకూ స్పృహ లేదేమో? కొన్నినిముషాలలోనే తను కూర్చున్నదెక్కడ - అన్నజ్ఞానం తనకు లేదు. కూర్చున్నది యెంతసేపు అనేజ్ఞానమూ లేదు; పరస్పరం మాటలు లేవు; కూర్చున్న రెండు శరీరాల్లోని రెండు హృదయాలు వొకటయ్యాయేమో అనేట్లు నిశ్శబ్దంగా వున్నారు ఇద్దరూ. రాస్తున్నది చూడడంలో తను నిమగ్నమై వుంది; రామన్న రాస్తూనేవున్నాడు. భుజానికి భుజం, గడ్డానికి గడ్డం, తలమీద చెయ్యి; లోపలిహృదయాలు కలుసుకుంటాయో అనేట్లుగా, మాటలేకుండా, కళ్లు మూసుకొని తను ఎంతసేపు కూర్చున్నదో!

ఆ నిశ్శబ్ద తన్మయత్వంతో తనకు కలిగిన ఆనందాన్ని తనెప్పటికీ మరువలేదు, అనుకొన్నది కుముద.

మళ్ళీ కళ్ళు మూసుకున్నది ఆ ఆనందాన్ని తలచుకొని.

కుముద ఇప్పుడు వుత్సాహం పొందింది. రామన్నకోసం మంచిగుడ్డలను తీసి పెట్టింది, మోహనుడికోసమూ అన్నీ సిద్ధంచేసింది. తను-ఊం-తన వాలకం సరిగ్గా వుందా? రామన్న సన్మానసభలో తనకు ఏం వుత్సాహం - సింగారం? రామన్న రచయిత. అయితేనేం? తను రచయిత అర్ధాంగి. ఆనాడు రామన్న తొడమీద కూర్చున్నప్పుడు తనే రాస్తున్నదేమో అనిపించింది.

'మీ ఏకాగ్రతకు భంగం కలిగి ఎక్కడ కోప్పడుతారో అనుకున్నాను' అన్నది ఆ తర్వాత.

'ఏ ఏకాగ్రత?'

'రాయడంలో.'

'భలే! మంచిప్రశ్న అడుగుతావే, కుముదా? రాసేటప్పుడు ప్రేరణేవచ్చి తలుపు తడితే రచయితకు ఏకాగ్రతా భంగం అవుతుందా?'

'ప్రేరణ కలగాలనే తల తడుముకున్నారేమో?'

'లేదు - వచ్చిన ప్రేరణను దక్కించుకొనే బలం ఇవ్వమని కోరుకుంటున్నాను.'

'అదేం ప్రేరణో! మనిద్దరమే వున్నప్పుడు మరొక్కసారి వచ్చిందంటే-'

'రావడమే కాదు, వచ్చి తొడమీద కూర్చొనేది' అని గట్టిగా నవ్వాడు.

తానే ప్రేరణ! తనవల్ల అడ్డంకి లేదు, తద్విరుద్ధంగా రాయడానికి వుత్సాహం! ఎంత గర్వమనిపించిందప్పుడు తనకు! రామన్న రచనకు తను అవసరం! అలా అయితే తను ఎక్కువ దక్షతకలిగి వుండాలి, తల్లి బిడ్డను పాలించి పోషించేలా తను రామన్న రచనను పోషించాలి. ఈ ఆలోచనతో రాత్రి నిద్ర రాలేదు. లేచి హాయిగా పడుకున్న రామన్నను చూసింది. నిజంగా బిడ్డ! ఆటాడి నిద్రపోయాడు. ఎంత వెడల్పయిన నుదురు! రామన్న కళ్లు తెరిచాడు. అయ్యో-మోసం! నిద్ర పోవడంలేదు! ముద్దు పెట్టుకోనుపోయిన తన ముఖాన్ని పైకెత్తనే లేదు! తను ప్రేరణ, తను రామన్నకు సరస్వతి, కాళిదాసుని ముఖంలో ముఖంపెట్టి విద్యా వరాన్ని ఇచ్చిందికదా సరస్వతి! తను ప్రేరణ, రచయిత అయిన రామన్ననుంచి తను వేరువ్యక్తి కాదు; రచయిత అతని ప్రేరణ రెండూ ఒకటే; ఒకదాన్నుంచి మరొకదాన్ని వేరుచేయడానికి వీలులేదు; వాటి రెండిటి తాదాత్మ్యంవల్లనే కళా కృతి పుడుతుంది.

మోహన్ కళాకృతి రూపుగొన్నది ఆ రోజే. దాన్ని తను ఎలా మరువగలదు? రామన్న మోహనుణ్ణి పిలిచినప్పు డొకసారి రామన్ననోటినుంచి 'మోహన' అనే వచ్చిన ఆనాటి అనుభవం దృశ్యం కళ్ళముందు నిలుస్తుంది.

మెల్లిగా లేచింది కుముద. తానింకా రామన్న తొడమీదనే కూర్చునివున్నదనే భ్రాంతి - ఆమెకు. కుర్చీమీదవున్న మెత్తని పీఠాన్ని తీసుకొని, తన తొడమీద వుంచుకొని మళ్ళీ కూర్చున్నది.

నేనెంత సుఖిని! దురదృష్టవంతురాల్ని అనుకున్నది.

దురదృష్టంకాకుంటే మరేమిటి? ఎంత ఏకాగ్రచిత్తంతో రాస్తుందేవాడో అంతే ఏకాగ్రచిత్తంతో తనను ప్రేమిస్తూవుండవచ్చు కదూ? 'వచ్చు'—ఎందుకని? దాన్ని గూర్చి సందేహమే వుండకూడదు. అతను రాసిన పుస్తకాలలోని స్త్రీ పాత్రలుతప్ప అతనికి మరే స్త్రీల ఆలోచనా లేదు. అయినా తను దురదృష్టవంతురాలు.

ఛీ! ఇదెలాంటి ఆలోచన! మనస్సులో ఏదో వొకవిధమైనవుత్సాహం వున్నప్పుడు, ఏదో వొక అనుకోని సంఘటన జరగవచ్చు అనుకొన్నప్పుడు, వెనకటి తప్పుల జ్ఞాపకాలు రావటమెందుకా? రామన్న ప్రేమని నేడు మొదటిసారి గ్రహించివట్లుంది. నేడు మళ్ళీ తను పెళ్ళికుమార్తె అనిపిస్తున్నది! రామన్న గొంతువిని వుత్సాహం, సిగ్గు. రోమాంచం. తను పెళ్ళికూతురు. ఉహూఁ....ఈ వేషం బాగు లేదు. సందర్భానికి తగినట్లు వేషం వేసుకోవాలి. తను సింగారం చేసుకొని సభకు వెళితే రామన్నకు ఆనందం. రామన్నకు ఆనందంకలిగితే తనకు ఆనందం. ఇద్దరూ ఆనందభరితులై కళ్ళనిండుగా కొడుకును చూడాలి.

కుముద ఆగింది. ఆలోచనాభరంలో తనకోసం కొత్తదైన మరోచీర తీసుకొని చేతిలో పట్టుకొని నిలుచున్నది. ఒక్కసారిగా తత్తరపడినట్లయి మెట్లవైపు చూసింది. ఈ చీరను కట్టుకొనేటప్పుడే కదూ రామన్న తనని పీడించింది. ఆనాడు చివరికి తను కోపపడి, 'ఇలాంటి స్వభావం వుంచుకొని మీరు పుస్తకం రాస్తే యోగ్యులు దాన్ని చదవడానికి లేదు. చేతితో తాకడానికీ లేదు' అన్నది; ఏడ్చేంత కోపం వచ్చింది తనకు. రామన్న గట్టిగాపట్టి లాగాడు. తననిమాత్రం వదలలేదు! అతను తనను లాగినందువల్ల చీరా తనచేతిలో నిలిచేట్లుండలేదు.

కుముద చిరునవ్వు నవ్వుతూనే నిట్టూర్పు విడిచింది. మోహన్ ఇంకా రాలేదప్పుడు. అదొకందుకు మంచిదే అనవచ్చు. అనుకొంది. మోహనుడు పుట్టిన తర్వాతా అంతే. రామన్న కుర్రతనపుచేష్టలు పోలేదు. మరో రోజతను మేనత్త యింటికి మొదటిసారి వెళ్ళివచ్చినరోజు మోహనుణ్ణి ఎత్తుకునేనెపంతో అల్లరి చేష్టలు చేశాడుకదూ? అయితే - తను బుద్ధిలేనిది. తను దురదృష్టవంతురాలు.

అయ్యో! ఎందుకు మళ్ళీ దురదృష్టంవిషయం తెస్తావు? ఈ రోజు మోహన్

రాగానే ఇద్దరూ ఒకరు మరొకరి చెయ్యిపట్టుకొని మోహనుణ్ణి సభకు పిలుచుకొని పోతే? వద్దు, మోహనుడిబదులు ఈయన నా చేతిని పట్టుకున్నా పట్టుకోవచ్చు. లేదు, మోహనుడికే చెపుతాను. ఆ పిల్లవాడు కొంచెం తొందరగావస్తే అంతా సరి పోతుంది___

అద్దంలో చూసుకొన్నది, చీర తనకు బాగుంటుందా? మోహనుడు త్వరగా వస్తే బాగుంటుంది. మోహనుడూ సభకురానీ అన్నారు - 'మోహనుడూ సభకు రానీ' అన్నారుకదా ఇప్పుడే, అది నాకే చెప్పారనిపిస్తుంది; నేను పిచ్చిదానిలా నా అంతట నేను ఆలోచిస్తూ కూర్చున్నాను. నేను మాటలాడనే లేదు అని ఏమైనా అనుకునేరు.

క్రింది మెట్టువరకు నడిచింది. ఎంతసేపయింది. వాడికోసం చూస్తున్నాను, వాడైపు లేడు.

'మోహనుడికోసమే చూస్తున్నాను' అన్నది గట్టిగా. ఆ తర్వాత తప్పు చేసిన దానిలా నాలుక కరుచుకొని కుముద మెట్లనుంచి దూరంగా వెళ్ళింది.

# 16

'మోహనుడూ సభకు రానీ' అంటూ పై మెట్టుదగ్గర నిలుచున్న రామన్న తత్తరపాటుతో చుట్టూ చూశాడు.

'మోహనుడికోసమే చూస్తున్నాను.'

కుముద కంఠం! ఆమెని కన్నులారా చూడాలనుకున్నవానిలా కళ్ళు వికసింప ప్రయత్నించితే చీకటి క్రమ్మినట్లయింది. మెట్లదగ్గరవున్న స్తంభాన్ని పట్టుకున్నాడు స్థిరంగా నిలుచుకోవాలని. ఒక్క క్షణమాత్రం. ఆ తర్వాత ఏళ్ల పూళ్ళ నుంచి చుట్టుముట్టిన మసిగూడులోలా దట్టమైన చీకటి వొక్కమారుగా పోయినట్లయింది; దృష్టి ప్రకాశవంతమైంది. కాల-దేశాల మర్యాదనుమీరి చూసేంత తీక్ష్ణమైంది. వొళ్ళు ఝల్లుమనింది.

వ్యక్తి అంతరంగమంటే విలక్షణసృష్టి! - అనుకుంటూ గదిలోపలికి మెల్లిగా అడుగులేస్తూ, పచార్లు చేయసాగాడు. మనుష్యునిజ్ఞానమూ విలక్షణమైందే - అన వచ్చు. ఏదీ తనంతట తాను అర్థం పొందదు. మనిషికి అత్యంత ఇష్టమైన సుఖం అంటే ఏమిటి? ఇలాంటిదే అని చెప్పడం సాధ్యమా? హుం. మన ప్రతిజ్ఞానమూ ఇలాగే. అందుకే మనుష్యునిలో స్మరణ-అనేది ఒక విశిష్టశక్తిగా వుంది. ఒకటి యీనాటిది - అద్యతనం; ఒకటి వెనకటిది - అతీతం; వెనకటి అనుభవాన్ని పోలిన యీనాటి అనుభవాన్ని జ్ఞానం అని అనుకుంటాము. కుముద గొంతువిని తన వొళ్లు ఝల్లుమనింది - ఆనందం కలిగింది; అదేధ్వనిని ఇంతకుముందు విన్నప్పుడు - వుద్విగ్నుడి నయ్యేవాడిని; ఇదే కదూ జ్ఞానానుభవంలోని విలక్షణత? ఆ ధ్వని విన్నప్పు డొకసారి వెనకటి ఆనందపురోజులని తలచుకొనేవాడిని; వాటితో తూచి తూపి వుద్విగ్నుడి నయ్యేవాడిని. అయితే యిప్పుడు? ఈనాడు? అదేగొంతువిని వెనకటి వుద్విగ్నతను తలచుకొన్నాను. ఈనాటి అనుభవాన్ని పోల్చిచూసి ఆనంద పడ్డాను-అవునా?

రామన్నకు దిగులు. కుముద కంఠం వినగానే తనవొళ్ళు ఝల్లుమన్నదేమో నిజం. అయితే అది ఆనందమా? కళ్ళకు చీకటి క్రమ్మినట్లయింది కదా ఒక క్షణం? అది ఆనందం లక్షణమా?

రామన్న దీర్ఘంగా నిట్టూర్చి కుర్చీలోవచ్చి కూర్చున్నాడు. ఈ అంతరంగ స్థితిని తెలుసుకోవడం కష్టం-అనుకున్నాడు. సాక్షాత్తు పరమాత్మునికీ తెలియని రహస్యం మానవమాత్రులమైన మనకు విశదం కావడం ఎలా-అని నవ్వుముఖంతో సమాధానపరచుకున్నాడు. పాపం! పరమాత్మ అవతారమైన సాక్షాత్ శ్రీరామ చంద్రుని అవస్థ ఏమైంది, భవభూతి ఉత్తరరామచరిత నాటకంలో? 'నీ బాహువు నా కంఠాశ్రయాన్ని పొందనీ' అంటాడు రామచంద్రుడు సీతాదేవితో. దేవి సిగ్గువల్ల వూరకుంటుంది. అప్పుడు తనే తనచేతులతో అలా చేస్తాడు రామచంద్రుడు. తక్షణం ఆశ్చర్యపడినట్లుగా 'ప్రియే కిమేతత్-ఇదేమిటి?' అని దిఙ్మూఢునిలా అడుగుతాడు. ఆమె బాహుస్పర్శవల్ల తనకేమైంది? ఏమీ తెలియదు-అని చెపుతాడు.

వినిశ్చేతుం శక్యోన సుఖమితి - వాదుఃఖమితి - వా
ప్రమోహో నిద్రావా కిము విషవిసర్పః కిముమదః।

తవ స్పర్శే స్పర్శే మమహి పరిమూఢేంద్రియగణో

వికారశ్చైతన్యం భ్రమయతి-చ సంమీలయతి-చ ॥

ఎలాంటి ఆలోచన! దాని అర్థమేమిటి? ఎవడో బుద్ధిలేనివాడు అయిన వ్యాఖ్యానకారుడు దానికి ఇలా అర్థం చెపుతున్నాడు: 'సర్వమిదం సీతాయా భోగ్యతా ప్రకర్షే తాత్పర్య మావిష్కరోతి' అని. ఎంత అనాగరిక తాత్పర్యాన్ని కనిపెట్టాడు వ్యాఖ్యాత! స్త్రీ స్పర్శ మైమరపించేట్లయితే ఆ స్త్రీ అతిశయంగా భోగ్యమట! ఎవడో ఆహారం - నిద్రా - భయ - మైథునాలజీవితంలో బలిసిన మానవపశువు అలా అనుకోనీ. అయితే భవభూతి చెప్పడం అది కాదు. స్పర్శ వల్ల అద్వైతానందమవుతుంది అని చెపుతున్నాడు. సుఖ-దుఃఖ, ప్రమోహ - నిద్రా, విష-మదములనే వీటిలో దేన్నీ విడదీయలేనంతభావం కలిగింది ఆ స్పర్శ వల్ల.

భవభూతిమాట నిజం. ఒకక్షణం కళ్లకు చీకటి క్రమ్మినట్లయ్యేసరికి తను అనుభవించింది అలాంటి అద్వైతానందం. అలాంటి అద్వైతానందంలో భోగి ఎవరు, భోగ్యం ఏది?

తనశరీరం శక్తి పుంజుకుందేమో అనిపించింది రామన్నకు. కుముద కంఠం, కుముద స్పర్శ, కుముద జ్ఞాపకం - దీనివల్ల ఎప్పుడూ తనలో విద్యుత్సంచార మైనట్లయి శరీరంలో బలం హెచ్చినట్లవుతుంది. నిజంగా తను భాగ్యవంతుడు; ఇలాంటి ప్రేమజీవితాన్ని అనుభవించిన తను——

రామన్న తన ఆలోచనాస్రవంతి నిలిపాడు. హుఁ. మంచిభాగ్యం - అను కున్నాడు. పది ఏళ్ళనుంచి అనుభవించిన యాతనను తలచుకుంటే——

కాదు-అది యాతన కాదేమో? రామన్నకు ఒక ఆలోచనవచ్చింది. మనిషి సుఖి కావాలంటే అతనికష్టాలు మాయం కావాలి అని మొండికెత్తితే మనిషి ఎప్పటికీ సుఖి కాలేడు అనిపించిం దతనికి. అద్దెయింట్లో నీళ్ళుకారితే ఎవరి బాధ్యత? దాన్ని తప్పించడం అద్దెకున్నవానిచేతిలో వుందా? జీవితంలో మనల్ని మీరిన అనేక శక్తు లున్నాయి. వాటివల్ల దాగల్గిన కష్టాలఎదుట మనం ఎంత బాధపడితేనేం? అన్ని శక్తులను గెలిచినా చావును గెలవలేడు మానవుడు, ఒకవేళ చావునుగెలిస్తే జీవితం

విసుగు పుట్టొచ్చు. కష్టాలు మాయంకానీ అని కోరడం తప్పు, అజ్ఞానం. కష్టాలను అనుభవం అని అనుకుంటే, అదొక అవసరమైన శిక్షణక్రమం అనుకుంటే-కష్టాల బాధ మాయమవుతుందనవచ్చు. రామన్నకు నవ్వు ఆగలేదు. 'కష్టాలబాధ' ఆ ఆలోచనను మరోవిధంగా ఎలా చెప్పాలో?....పోనీ, నా మనస్సులోవున్నది నాకూ తెలియలేదు - అని సమాధానపరచుకొన్నాడు....సమాధానపరచుకోవడం చాలా సులభం అని మరో ఆలోచన వచ్చినందుకు అనుకున్నాడు. శకుంతల - దుష్యంతుడు, యక్షిణి - యక్షుడు, సీతారాములు ఇలాంటివారి ప్రేమను వారి విరహం వల్లనే చూపించారు కవులు.

యక్షుడు తన భార్యను ప్రేమిస్తుండేవాడు, ఒకసంవత్సరం విరహాన్ని అనుభవించాడు.

దుష్యంతుడు శకుంతలను ప్రేమిస్తుండేవాడు, ఎనిమిది పది సంవత్సరాలు ఆమెకు దూరమయ్యాడు.

సీతారాముల ప్రేమ అనుపమం, బిడ్డలు కలగబోయేటప్పుడు చివరివరకూ వియోగమే.

తను పదిఏళ్లు కుముదనుంచి దూరంగా వున్నాడు.

అందువల్ల తనూ కుముదను ప్రేమిస్తున్నాడు!

భలే! సిద్ధాంతం సరిగ్గానే వుందికదూ?

సిద్ధాంతం సరిగ్గావుంది; తర్కబద్ధంగా వుంది; కుముద వొప్పుకోవడ మొక్కటే బాకీ!

లేదు-ఆ బాకీ తీరింది - కుముద వొప్పుకున్నట్లే—'మోహనుడూ సభకు రానీ' అని నేను చెప్పగానే 'మోహనుడికోసమే చూస్తున్నాను' అన్నది కదా?

'ఛీ! ఎంతపిచ్చి! ఒక సామాన్యపదానికి తను ఎంత అర్థాన్ని కల్పిస్తున్నాడు! అంటే? అర్థం పదాలకుందా? తన కల్పనలో వుందా?

'మోహనుడికోసమే చూస్తున్నాను' అన్నదాని అర్థం, 'నేనూ తయారుగా వున్నాను' అనేకదా?....తనకే ఆశ్చర్యం కలిగింది తను అలా చెప్పినందుకు.

నిజం. ఏ పదాలకు ఏ అర్థం కల్పిస్తున్నాను నేను - అనుకున్నాడు. మోహనుడి కోసమే చూస్తున్నాను అనే పదాలెక్కడ? నేను తయారుగావున్నాను - అనే అర్థం ఎక్కడ? తనకు ఆ వూహయినా ఎలా వచ్చింది?

అయినా తాను కల్పించిన అర్థమే నిజం అని రామన్న దృఢంగా నమ్మాడు. ఎందుకని? ఆధారమేమిటి? కారణాలేమిటి?

అదేమీ నాకు తెలీదు. ఆధారం లేదు. కారణం - కారణమే కావాలంటే హృదయభాష అర్థాన్ని హృదయమే తెలుసుకోగలదు. బుద్ధికాదు; వ్యాకరణ నియమాలు కాదు - అని ప్రతివాదిని ఎదిరించేలా చెప్పుకున్నాడు.

కుముద తయారై వున్నది తనకు తెలిపింది అనే ఆనందభరంలో రామన్నకు ఏం చెయ్యాలి, ఏం మాట్లాడాలి అన్నది తెలియకపోయింది. నేను ఎప్పటినుంచో తయారుగావున్నాను అని చెప్పలేదా? చెప్పు, చెప్పు, పిచ్చివాడా, ఏమైనాచెప్పు; ఇంత ఆత్మీయతతో నీతో మాట్లాడాను ఇన్నిసంవత్సరాలతర్వాత మొదటిసారి. తనకు తానే సిద్ధమైవుంది. వెనకడుగేసే తననుతానే ముందుకు తోస్తున్నట్లు అన్నట్లుగా మెట్లదగ్గరికి వెళ్ళాడు.

'స్వాగతసమితివాళ్ళు వచ్చేవేళయింది' అన్నాడు.

ఉన్నట్లుండి కిటికీదగ్గరికి నడిచాడు. కిటికీదగ్గర నిలుచుని మెట్లనేచూస్తూ 'స్వాగతసమితివాళ్ళు వచ్చేవేళయింది' అన్నాడు రెండోసారి.

# 17

కుముద తత్తరపడిపోయింది. 'స్వాగతసమితివాళ్ళు వచ్చేవేళయింది' అన్నాడే రామన్న. ఆమాట అర్థం ఆమెకు తెలిపింది. 'స్వాగతసమితివాళ్ళు వచ్చేవేళయింది' అంటే, 'నేను తయారుగావున్నాను, నువ్వు తయారుగావున్నావా?' అని రామన్న తనను అడిగాడు.

కుముదకు నవ్వు వచ్చింది.

రామన్న తయారుగా వున్నాడు; తనకు తెలియదా రామన్న తయారుగా

వుండేది? కోటు వేసుకునేది మర్చిపోయి టోపీ పెట్టుకొనేస్వభావం రామన్నది. కుముదకు భయమేసింది. నవ్వు ఆపుకోలేకపోతే రామన్నకు వినిపించవచ్చుకదూ? అయినా నవ్వు ఆగలేదామెకు. ఒకరోజు ఏదో మాటకొచ్చి కోప్పడివెళుతూ ఏమీ తొడుక్కోకపోవటమే మరచి తలకు కోటు చుట్టుకుంటూ బయలుదేరేడీ మహానుభావుడు! సరే, రామన్న తయారుగావున్నాడంటే ఎవరైనా వొకరు సరిగ్గా అంతా చూసుకోవాలి. ఈరోజు గొప్ప సభ! ఛీ! రామన్నకోసం తను తీసిపెట్టినగుడ్డలే తగినవి. ఇప్పుడు ఏం వేసుకోనున్నాడో ఏమిటో? తను తయారైవుందో లేదో అనే అనుమానం!

కుముద అద్దంముందు నిలబడి చూసుకుంది. తను తయారుగావుంది. సర్వజనుల సత్కారానికి యోగ్యుడైన రామన్న భార్యకు తగినట్లుగా తను తయారైంది!

'స్వాగతసమితివాళ్ళు వచ్చేవేళయింది.'

రెండోసారి రామన్నమాట వినిపించింది. అదిగో! నేను చెప్పలేదూ మిగిలినవాళ్ళకు తొందర అని! అయినా - తను సిద్ధమయ్యేదాన్ని మరువలేదు రామన్న; అదీ మంచికే అనాలి! అందరు మగవాళ్లు వొకటే. బయటికి వెళ్లాలంటే వెళ్ళడం! కొంచెం మామూలుగా వుండేదాన్నుంచి బయటపడాలి, ఎక్కడికి వెళ్ళాలి అన్నది తెలుసుకొని దానికి తగినట్లుగా వేషం - భూషణాలు వేసుకొని - పగలంతా వంట ఇంట్లో కష్టించేస్త్రీకి తెలుసు బయటికి వెళ్ళేటప్పుడు వేసుకొనేవేషం సొగసు.

కుముద మళ్ళీ అద్దంలో చూసుకొన్నది. ఎందుకు తొందర? నేనేమో తయారైవున్నాను. అయితే___? కుముద దిగులుపడింది. రామన్నకోసం తను సరైన గుడ్డలు తీసిపెట్టింది. సభకు ఆహ్వానం వచ్చేలోపల రామన్న గుడ్డలను మార్చాలి. నేనే వెళ్ళిఇస్తే? కుముద వణికింది. తను వెళ్ళడమా? అందులోనూ 'ఆ' కొత్త చీర కట్టుకొని? ఆమెకు భయంవేసింది. అయితే - రామన్న గుడ్డలు మార్చనే మార్చాలి. లేకుంటే జనం తననిగురించి ఏమనుకుంటారు? ఇంట్లో ఇద్దరు మగవాళ్లుంటే ఇద్దరు పిల్లలున్నట్లే - అనుకున్నది కుముద. ఇక్కడ మోహనుడు వేసుకునే గుడ్డలబాధా తనకే. అక్కడ రామన్న వేసుకొనే గుడ్డలబాధా తనకే. ఇద్దరివీ తీసిపెట్టి సిద్ధంచేసింది.

'అయింది, మోహనుడిబట్టలు తీసిపెట్టాను' అన్నది. అద్దంలోంచి ముఖం తిప్పి - సిగ్గుపడుతూ సిగ్గుపడుతూ మెల్లిగా క్రిందిమెట్టు దగ్గరికివచ్చి, 'అయింది, మోహనుడి బట్టలు తీసిపెట్టాను' అన్నది మరోమారు.

# 18

కిటికీదగ్గర నిలుచున్న రామన్న వుత్సాహంతో వికసించగా కిటికీనుంచి ముఖం తిప్పాడు.

'అయింది, మోహనుడి బట్టలు తీసిపెట్టాను'—కుముద గొంతు.

నవ్వుతో ముఖం మరింత విప్పారింది.

ఆడవాళ్ల స్వభావం! ఇంటికి నిప్పు అంటుకున్నప్పుడు ఇంట్లోనుంచి బయట పడవలసినా, అద్దంముందు నిలుచుని తల సవరింపుకొనే స్వభావం!

నా గుడ్డలు సరిగ్గాలేవు అంటుంచికదా! రామన్నకు వుత్సాహంతో శరీరం ఉప్పొంగింది. నేడు తాను సరిగ్గా దుస్తులు వేసుకోవలసిందే అనే పట్టుదల కలిగింది ఆమెకు. పాపం! అలాంటి ఆశ ఎందుకుండకూడదు? తనకోసం ఇంత అభి మానం చూపించేవాళ్ళు మరెవరున్నారు?

'మోహనుడి బట్టలు తీసిపెట్టాను.'

రెండోసారి కుముద మాటవిని రామన్న మెట్లదగ్గరికి వచ్చాడు; కాదు, ఆమాట పగ్గంలా అతన్ని లాగిపడేసింది. అంతవేగంగా మెట్లదగ్గరికి వచ్చాడు. ఓహో! నేను క్రిందికి దిగిరావాలని ఈమె అపేక్ష! నాకోసం గుడ్డలు తీసిపెట్టివుంది! తనకు పైకి రావడానికి సిగ్గు. ఎందుకని? హుఁ....ఈరోజు ఆమె సింగారం సొగ సుగా వుండివుండాలి. అందుకనే పైకి రావడానికి సిగ్గు. దాన్ని చూడడానికి తానే క్రిందికి వెళ్ళాలి. తనూ దానికి తగినట్లుగా సిద్ధం కావాలి. రామన్న వూపిరి పీల్చాడు నాటకీయంగా. 'యత్ర నార్యస్తు చెప్పంతే ఉం అంతే తత్ర మానుషాః' ఆడవాళ్ళు చెప్పేటప్పుడు భర్త ఉం అని వూరకుండాలి.

ఎంత పిచ్చివాడు తను! తను క్రిందికి రావాలని కుముద తన నోటిగుండానే చెపుతున్నప్పుడు తను ఏమేమో వాగుతూ నిలుచునున్నాడుకదా!

రామన్న చేతిగడియారాన్ని చూసుకొన్నాడు. ఐదునిముషాలే వున్నాయి ఇంకా.

## 19

'ఐదునిముషాలే వున్నాయి.'

రామన్నమాటనువిని కుముద తన చేతిగడియారాన్ని చూసుకొనింది.

అవును. మోహనుడు రానేలేదే? ఐదునిముషాలే వున్నాయి. ఇంకా మోహనుడు రాలేదు. ఎందువల్ల?—అని రామన్న తననే ఆ ప్రశ్న వేశాడని కుముదకు స్పష్టమైనది. త్వరత్వరగా చుట్టూ వొక్కసారిచూసి తలుపుదగ్గరికి బయలుదేరింది. తలుపును సమీపించినప్పుడు ఎడమవైపు మెట్లను చూసింది. మెట్లనుంచి కొంత దూరంలో కిటికీలోంచి బయటికి చూస్తున్న రామన్నవీపు కన్పించింది. రాసే వాళ్ళకు వీపుమీదా కళ్ళుండకపోవడం మంచిదయిందని మెల్లిగా అడుగు ముందుకు వేసింది. రామన్నను చూస్తూనే. అంతలో రామన్నా ముఖంతిప్పి, 'మోహనుడు వచ్చాడు' అన్నాడు. మోహనుణ్ణి చూసిన రామన్న కళ్ళలో తానూ మోహనుణ్ణి చూడాలనుకుంటుందేమో అన్నట్లుగా రామన్ననేచూస్తూ నిలుచుంది. వుత్సాహంతో వికసించిన అతని ముఖంచూసి తనూ చిరునవ్వు నవ్వింది. రామన్న సరసరా క్రిందికి వస్తాడు. అతన్నిచూస్తూనే తనూ కుడిచేత్తో తలుపు తెరవాలని ప్రయత్నించింది. చిలుకు అందదు.

## 20

బయట తొందరగావచ్చే మోటారుకారుశబ్దం.

'మోహనుడు వచ్చాడు' అన్నాడు రామన్న.



'పిలవడానికి వచ్చినట్లుంది' అన్నది కుముద.

మోటారుకారు శబ్దమూ దగ్గరకు వచ్చింది. హారన్ వినిపించింది. ఎవరో పిలిచారు. ఒక్కసారిగా బ్రేకు వేసిన శబ్దంవల్ల రోమాంచమైంది. కారు నిలిచింది. కుముద తలుపు తెరిచింది.

ఎదుట జనం గుమిగూడారు. సద్దు తగ్గింది. ఒక్కసారిగా జనం సమీపించారు. ఎవరో ఒకవ్యక్తి రెండుచేతులతో ఏదో ఎత్తుకొని వస్తున్నాడు. 'మోహన్ వచ్చాడా?' అన్నాడు రామన్న వూపిరి బిగబట్టిన గొంతుతో.

కుముద ఉన్నట్లుండి అరిచింది.

ఇంటివరకు వచ్చిన మోహనుణ్ణి లోపలికి తీసుకురావచ్చా. వద్దా అనే సందేహంతో వచ్చినవ్యక్తి వాకిట్లోనే నిలుచుండిపోయాడు.